శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీమద్రామాయణము

## వచనము

## అయోధ్యాకాండము.

దేశిరాజునన్ ప్రశోధితము.



మద్రాసు:

ఆనందముద్రాయంత్రాలయమునందు

ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అన్డ్ కంపెనీవారిచే ప్రకటితము.

1910.

[All Rights Reserved.]

# All Rights Reserved.

Copyright 1910—By **R. Venkateshwar & Co., Madras.** This book is fully protected by an Indian and Foreign Copyright. No one will be permitted to reproduce this book in whole or in part or translate it into any other language and offer it for sale. A substantial copy of the words, ideas or illustrations contained herein constitutes an infringement of a copyright, and notice is hereby given that suit will be filed in every case of infringement.



కాపిరైటు 1910 వ సం॥ ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనివారు కాపీరైటు దార్లు. ఈపుస్తకము ఇండియా కాపీరైటుచేతను పరదేశీయపు కాపిరైటుచేతను సురక్షితమైనది. ఎవరుగాని యీ పుస్తకమును సంపూర్ణముగాఁగాని లేక యిందొక భాగమునుగాని తీసుకొని వేఱుగా ప్రకటించుటకును, మఱియొక భాషయందు తర్జుమా చేసి క్రయమునకు నిచ్చుటకును, హక్కు ఇయ్యఁబడదు. ఇందుఁగల పదములనుగాని భావములనుగాని పటములనుగాని ఏమాత్రమైనను కాపీచేసినయెడల అది కాపిరైటును ఉల్లంఘించుటయే యగును. కనుక కాపిరైటును ఏవిధమున నుల్లంఘించినవారును దావాకు లోనగుదురని దీనిచే తెలియనగును.




శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

# ఉపోద్ఘాతము.

శ్రీరామచంద్రుని మహాకులప్రసూతత్వము, కల్యాణగుణసంపత్తియు, ధనుర్విద్యాప్రవీణతయు, పరాక్రమవిలసనమును; లక్ష్మణునికి 'బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధః' అన్నట్లు రామునియందుఁ గలభక్త్యతిశయమును; శత్రుఘ్నునికి 'తస్య చాసీత్తథా ప్రియః' అన్నట్లు భరతునియందుఁ గలయత్యంతతాత్పర్యమును; సీతావివాహమును; మొదలైన కథాబీజములు బాలకాండమునం బ్రతిపాదింపఁబడినవి. మఱియు సీతారాముల శృంగారసతరంగితము లైనపరస్పర ప్రేమభోగ క్రీడాసౌభాగ్య పరంపరల మనస్సునకుఁ బాడువులు సేయుచు నాప్రథమకాండము ముగిసినదయ్యె.

ఇట్లందు బీజరూపముగాఁ బ్రతిపాదితము లైనయమ్మహాపురుషుల కల్యాణగుణాదులు అయోధ్యాకాండమునందుఁ బరిపక్వములై అద్వితీయానుష్ఠాన విశేషముల మూలమున స్ఫుటముగాఁ బ్రకాశించుచున్నవి. అవతారప్రయోజనము లైనదుష్టశిక్షణశిష్టరక్షణ ధర్మసంస్థాపనములకు మిక్కిలియు మూలసాధన మైనయరణ్యగమనమే యీకాండమందలిసారము. ఇదియే రామకథాకల్పవల్లికి మూలకందము. భరతుఁడుండినయెడల నరణ్యగమనము కొనసాఁగ దని యీకాండముతోలుతనే 'గచ్ఛతా మాతులకులమ్' అని శత్రుఘ్నసహితముగా మేనమామయింటికి నతనిపోక నిబద్ధమైనది. ఈభరతుని యసన్నిధానమును నిష్పాదించుటకే యుధాజిత్తురాక పూర్వకాండమునఁ బ్రస్తావింపఁబడినది. ఇట్లరణ్యగమనకార్యమునకు ముఖ్యప్రతిబంధక మైన భరతసన్నిధానమును లేకుండునట్లుసేసి, పిదప దాని నుత్పాదించుటకై రామాభిషేక ప్రసక్తియు, దానిమూలమునఁ గలిగినమంథరాదుర్బోధమును, దానిఫల మైనకైకయాక్షేపమును బచరించి, వరదానాదు లైనయవాంతరసాధనములనును నవరించుటచే, ఆకార్యము సాఁగింపఁబడినదయ్యె. ఈఘట్టమున రామునిచేఁ బితృవచనపరిపాలనము సత్యప్రతిజ్ఞత్వము మొదలైన సామాన్యధర్మములు ప్రతిపాదితములయ్యె. మఱియుఁ బూర్వకాండప్రతిపాదిత మైనలక్ష్మణునిభక్త్యతిశయము 'భ్రాతా భర్తాచ బన్ధుశ్చపితాచ మమరాఘవః' అని సర్వవిధముల రామునికే శేషమైయుండుటయందుఁ బర్యవసించుటంబట్టి భగవంతునికిని జీవునికిఁ గలశేషిశేషభావరూప మైనవిశేషధర్మమును బ్రకాశిత మైనది. ఈఘట్టమున నే 'సర్వావస్థాగతా భర్తుః పాదచ్ఛాయా విశిష్యతే' అన్నసీత పాతివ్రత్యము, 'ఉజ్ఝితా యా త్వయా నాథ తద్దైవమరణం వరమ్'

అని పతివియోగమునకుఁ దాళఁ జాలని ప్రేమాతిశయముతోఁ గూడినదై 'బాలేవ రమతే సీతాఽ బాలచన్ద్రనిభాననా। రామా రామే హ్యధీనాత్మా విజనేఽపి వనే సతీ' అన్నట్టి సుఖానుబంధమునందుఁ బర్యవసించుటచే స్త్రీలకుఁ బతివ్రతాత్వము, మంగళసూత్రమును బట్టి తీఱక కలిగినది గాక, మనఃపూర్వకమై ప్రీతియుక్తమై సుఖావహమై యుండవలయు ననుధర్మమును దెల్లమగుచున్నది. భరతుఁడు రాజ్యభరమును రామపాదుకలం దుంచి తత్పరతంత్రముగానే వర్తించుటవలన భగవంతునికే పరతంత్రమై యుండు భాగవతత్వమును దేటపఱుపంబడినది. అట్టి భాగవతశిఖామణికి 'నీతః ప్రీతిపురస్కృతః' అన్నట్లు కేవలపరతంత్రుఁడై శత్రుఘ్నుఁడు వర్తించుటచే భాగవతాభిమాననిష్ఠ యనుధర్మవిశేషమును ఉపదిష్టమైనది.

ఇట్లు వాల్మీకి ధర్మజిజ్ఞాసువులకు సామాన్యవిశేషధర్మబోధకముగాను, ఆస్తికులకు ఐహికాముష్మికఫలప్రదముగాను, సహృదయులకు హృదయానందసంధాయకముగాను, సకలచేతనులకును సంసారసముత్తారకముగాను రసములొలుకు మృదుమధురశైలిని నీకాండమును రచించినవాఁ డయ్యె. ఇందును బాలకాండమునందుంబోలె విశేషార్థములును రహస్యవివరణములును మిక్కిలి విపులముగా నందందు కూర్పంబడియున్నవి. తక్కిన కాండములును శ్రీరామభద్రుని కృపాతిశయమునను జందాదారులయవిరతసాహాయ్యమునను ముద్రించి ప్రకటింపఁ గోరుచున్నారము.

టి. దే.

శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

# విషయసూచిక

# పటముల పట్టిక.



హరిః ఓమ్.

శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్న హనూమత్సమేత
శ్రీరఘునన్దనపరబ్రహ్మణే నమః.

# శ్రీమద్రామాయణము

# *అయోధ్యాకాండము.



రతుఁడు † మేనమామ యింటికిఁ బోవువాఁడై యపుడు తన తోఁగూడఁ బాపరహితుఁడును బగవారి నెపుడు రూపుమాపు

---

*బాలకాండమునందు 'ఈనడుమ విష్ణుని' (ఏతస్మిన్నన్తరే విష్ణుః) ఇత్యాదులచే జగత్తునకు కారణమగుటయు, 'నేను రాముని మహాత్మునిగా నెఱుఁగుదును. (అహం వేద్మి మహాత్మానమ్)' ఇత్యాదులచే పురుషసూక్తమునందు చెప్పఁబడిన మహాపురుషత్వమును, 'నీవు మొదలులేనివాఁడవు; ఇట్టట్టని నిర్దేశింపరానివాఁడవు (త్వమనాది రనిర్దేశ్యః)' ఇత్యాదులచే అచింత్యమైనవైభవము గలిగియుండుట యు, ఇట్లీపరత్వలక్షణములను జెప్పుటచే పరత్వము—అనఁగా సర్వోత్కృష్ట త్వము చెప్పఁబడినది. 'విష్ణువును అధికునిగాఁ దలఁచిరి' (అధికం మేనిరే విష్ణుమ్) ఇత్యాదులచే ఇతర దేవతలకు పరత్వము లేదనియుఁ జెప్పఁబడినది. అయోధ్యాకాండమునందు { అఖిలహేయవిరుద్ధము లగు కల్యాణగుణములసంపత్తి చెప్పఁబడుచున్నది. లేక ఈరామాయణపురుషు లగురామాదులకు ఇఁకమీఁదఁ జేయుధర్మానుష్ఠానములకు ఉపయుక్తములైనవి అగుగొప్పకులమునఁ బుట్టుట, గురువునొద్ద ధనుర్వేదాది రహస్యములు లభించుట, తాటకాదులను నిరసించుట, విలు విఱుచుట, వైష్ణవధనువును గయికొనుట మొదలైనగుణములును ధర్మపత్నీగ్రహణములును బాలకాండమునఁ జెప్పఁబడినవి. అయోధ్యాకాండ మున వారలు అనుష్ఠించినపితృవచనపరిపాలనము మొదలైనసామాన్యధర్మములును, భగవంతునికి శేషమై పరతంత్రమైయుండుట భాగవతులందు అభిమానము గలిగియుండుట యనెడివిశేషధర్మములును, ప్రతి పాదింపఁబడుచున్నవి. లేక పూర్వకాండమున పరత్వము-అందఱికిని ఉత్కృష్టుఁడగుట-చెప్పఁబడినది. ఇందుసౌలభ్యము-అందఱికిని సులభుఁడగుట-చెప్పఁబడుచున్నది అని కొందఱిమతము. పూర్వము సీతా రూపమైనలక్ష్మితోడియోగంబును ఇప్పుడు భూయోగమును చెప్పఁబడుచున్నదనియు కొందఱు చెప్పె దరు. పూర్వము లక్ష్మితోఁ గూడినప్రాప్యుఁడైనవిష్ణుస్వరూపంబును ఇపుడు ఆవిష్ణువును ప్రాపించు జీవునిస్వరూపంబును నిరూపింపఁబడుచున్నది. అందు మొదట అతిరహస్యమై, అవశ్యముగాఁ దెలియఁ దగి, సులువుగా ఉపపాదింపఁబడినదగు, భాగవతాభిమాననిష్ఠను-భాగవతులం దుండవలసినఅభిమానమందు దృఢముగా నిలిచియుండుటను-శత్రుఘ్నుఁ డనుష్ఠించినదానిని వర్ణించువ్యాజమునఁ జెప్పుచున్నాఁడు.

† ఇందులకు శ్లోకము 'గచ్ఛతా మాతులకులం భరతేన తదానఘః। శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః

వాఁడు నగుశత్రుఘ్నునిఁ గొనిపోయెను. అతఁడును అన్నయెడఁ బ్రీతిగలవాఁడుగాన

---

ప్రీతిపురస్కృతః' దీనికి విశేషార్థములు—(గచ్ఛతా) అని వర్తమానకాలము ప్రయోగింపఁబడుటచే శత్రుఘ్ననిగమనమును భరతునిగమనమును ఏకకాలమందే జరిగినవని తెలియుచున్నది గాన భరతుఁడు పోవునపుడు అతని కత్తివస్త్రములు మొదలైనవి అతనికి మిక్కిలి పరతంత్రములై అతఁడు పోవునపుడే వ్యవధానము లేక తామునుగూడ పోవునట్లు, శత్రుఘ్నుఁడును అతనితోఁడనే పోయినాఁడని ఆకత్తి మొదలైనవానివలె శత్రుఘ్నుఁడు భరతునకే పరతంత్రుఁడై యుండుట-ఏకపారతంత్ర్యము - తెలియుచున్నది. (మాతులగృహమ్) ఈద్వితీయచే భరతునికి ఉద్దేశ్యమైనస్థానమే శత్రుఘ్నునికిని ఉద్దేశ్యమైనదని తెలియుటంజేసి శేషికి (తనకుస్వామి అయినవానికి) ఏయుద్దేశ్యమో శేషభూతుఁడగువానికిని (ఆ స్వామికి సొమ్మువలె విధేయుఁడై యుండువానికిని) అదియే యుద్దేశ్యముగా నుండుట యనునది లక్షణముగాఁ గలపారతంత్ర్యము సూచితమగుచున్నది. ఇఁక భగవంతునికి పరతంత్రుఁడై యుండుట లక్షణముగాఁ గలభాగవతత్వమును జెప్పుచున్నాఁడు. (భరతేన) భరతునితోఁడ-రాముఁడు వనమునకుఁబోఁగా లక్ష్మణుఁడు వెంబడింపఁగా దశరథుఁడు మృతుండు కాఁగా రాజ్యమును భరించుటంజేసి భరతుఁడని పేరు. కేవలరామాజ్ఞచేతనే రాజ్యమును భరించినాఁడని భగవత్పరతంత్రత్వరూపమైనభాగవతత్వము ఇటదెలియునది. (తదా) అప్పుడు-భరతుఁడు పోవునపుడే యనుట-దీనిచేత తనకు అనుకూలమైనచంద్రతారాదిబలమునుగూడ అపేక్షింపక పోయినట్లు అతనిపారతంత్ర్యమే విశేషితమైనది. (అనఘః) పాపము లేనివాఁడు—అఘమనఁగా పాపము; శత్రుఘ్నునికి, తనకు శేషియైనభరతునికి రామభక్తి యుద్దేశ్యమగుటచేతనే తనకును రామభక్తి యుద్దేశ్యమైనది గాన స్వశేషియగుభరతునికి అది ఉద్దేశ్యముకాదేని తనకును అది ఉద్దేశ్యముకాక అనిష్టావహమే యగును; అనిష్టావహమైనది పాపమనఁబడునది. సుకృతమైనను మోక్షేచ్ఛగలవానికి అనిష్టావహమయ్యెనని అది పాపమేయగునని శ్రుతియుఁ జెప్పుచున్నది. కాఁబట్టి రామభక్తి సుకృతమైనను భరతునికి ఉద్దేశ్యముకానిచో అతనికి శేషభూతుఁడగుశత్రుఘ్నునికి అనిష్టావహమై పాపమే యగుచున్నది గనుక అట్టిపాపములేనివాఁడనుట-అనఁగా భరతునికి ఉద్దేశ్యమైనపిదపనే రామభక్తి తనకును ఉద్దేశ్యముగాఁ గలవాఁడనుట-దీనిచే శత్రుఘ్నునికి రామునికంటె భరతునియందె ఎక్కువభక్తియని తెలియుటచే అతనిభాగవతపారతంత్ర్యము మఱియు నతిశయించినదయ్యె. (నిత్యశత్రుఘ్నః) నిత్యశత్రువులను జంపువాఁడు-నిత్యశత్రువులు ఇంద్రియములు గనుక ఇంద్రియనిగ్రహముగలవాఁడనుట-రాముఁడు 'పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్' అని మగవారి దృష్టులను మనస్సును గూడ హరించునట్టివాఁడయ్యును అతనియందు తనయింద్రియములు లయింపకుండునట్లు నిగ్రహించినవాఁడనుట-రామునియెడల భక్తి తనయథాకారమునకు విరుద్ధమని దానిని నివర్తించుట శత్రుఘ్ననకుఁ దగునని తెలియునది; (శత్రుఘ్నః) శత్రుఘ్నుఁడు, (ప్రీతిపురస్కృతః) ప్రేమచేఁ బ్రేరితుఁడైనవాఁడై-'నేనేమి సేయుదును; పెద్దవానిని అనుసరించి తిరుగవలసినది చిన్నవానికి విధిగదా' అని విధినిబట్టి పోయినవాఁడు గాఁడు; ప్రేమనుబట్టియే పోయినాఁడనుట. అచిత్తులగుకత్తి మొదలైనవియు చేతనులును తమస్వామియెడ పారతంత్ర్యము సమానముగా గలిగియుందురు. కాని ప్రీతిమాత్రము అచిత్తులకు కలుగదు; చేతనులకే కలుగును గాన ప్రీతియే అచిత్తులకంటె చేతనులకుఁ గలవిశేషము. (నీతః) కొనిపోఁబడెను. కత్తి మొదలైనవానివలె కొనిపోఁబడెనుగాని తానై స్వతంత్రించి పోలేదని అచిత్తునకుఁ గలపారతంత్ర్యము చెప్పఁబడినది. దీనిచే భక్తుఁడైనశత్రుఘ్నునివలె భాగవతులయెడ పారతంత్ర్యము గలిగి యుండఁదగునని ఫలితార్థము.

యాతని వెంటఁ బోయెను. మేనమామ యైనయశ్వపతి భరతుని, మంచిగుఱ్ఱముల నిచ్చుట మొదలైనసత్కారములచేతఁ బూజించుచును, కన్నకొడుకువలె నెయ్యముతో మంజులాంబరాభరణాదుల నొసఁగి లాలించుచును, ఉండఁగా అతఁడు తమ్ముఁడగు శత్రుఘ్నునితోఁ గూడి యక్కడ వసించుచుండెను. ఆసొంపైనచోట అన్నివిధములైనయుపలాలనములు జరుగఁగా తాము వసించియున్నను, అభిమతములైనవస్తువులనెల్ల నిచ్చి యశ్వపతి తమకు మిక్కిలితృప్తి కలిగించుచుండినను, వీరులైనయాయన్నదమ్ములు వృద్ధుఁడైనదశరథభూనాథుని తలంచుకొనుచు 'అయ్యో! తండ్రి ముదిసినవాఁడయ్యె; రాజ్యభారమునకుఁ జాలఁడు. ఇప్పుడు రాముని యువరాజుగాఁ జేసి యుండునా? ముదిసినతండ్రికి శుశ్రూషసేయఁ దగినకాలము మించిపోయెడినే'యని చింతించుచుండిరి. అట్టిదిట్టకొడుకులను గన్న తేజంపుసొంపున పెంపారుదశరథుండును దేశాంతరమునకుఁ బోయి యున్నకొడుకులను, మహేంద్రవరుణులవలె మహిమయు ఎడతెగనిమైత్రియుఁ గలభరతశత్రుఘ్నులను ఇరువురిని, తలంచుకొనుచు 'ఎంతో సంపద యుండిన నేమి! బిడ్డలిద్దఱు దగ్గఱ లేకుండుటయే పెద్దకొఱఁతగానున్నది' అనుకొనుచుండె. 'మేటికొడుకులైనరామలక్ష్మణులు దగ్గఱనుండఁగా తక్కినకొడుకులను స్మరించుట యెట్లనరాదు. ఆనలువురుకొడుకులును పురుషశ్రేష్ఠులు గాన అందఱును ఆరాజునకు తన దేహమునుండి వెడలిననాలుగుబాహువులవలెఁ బ్రియులై యుండిరిగాని యొకరికన్న మఱియొకరు ఎక్కువకాని తక్కువకాని కారైరి. ప్రాణులలోనెల్ల బ్రహ్మ యెట్లో యట్లె ఆకొడుకులలో రాముఁడు మిక్కిలిగుణవంతుఁడును మహాతేజుఁడునై యుండుటవలన తండ్రికి నిరతిశయమైనప్రీతి కలిగించినవాఁడయ్యె. *ఏల యనఁగా గర్వముచే విఱ్ఱవీఁగుచున్నరావణుని వధింపఁ గోరి దేవతలు ప్రార్థింపఁగా మనుష్యలోక

*ఇందులకు - 'సహి దేవై రుదీర్ణస్య రావణస్యవధార్థిభిః । అర్థితో మానుషేలోకే జజ్ఞే విష్ణుః సనాతనః' అని మూలము. 'సహి' యనుట 'అజాయమానో బహుధా విజాయతే' అనుశ్రుతిప్రసిద్ధని తెలుపుచున్నది. (దేవైః) 'దీవ్యతి' అనఁగా కోరుటగనుక 'దేవైః' అనఁగా కోరువారు-అనఁగా అనన్యప్రయోజనులు (భగవంతునితప్ప ఇతరప్రయోజనములనుగోరనివారు) గాక ప్రయోజనాంతరములైనహిరణ్యకశిపురావణాదివధలను గోరువారనుట. మఱియు 'దీవ్యతి' అనఁగా మదించుట అనియు అర్థముగనుక 'నేను ఈశ్వరుఁడను-నేనును భోగిని' అను దురభిమానముగలవారనుట. ఎట్లనఁగా నరకాసురవధకై కృష్ణుని శరణుసొచ్చి ఆకార్యము తీరినపిదప పారిజాతముకొఱకు ఆకృష్ణునితోనే పోరుటకుఁ జూచినవారుగాన మదాంధులనుట. ఇట్టివారిచేత (ఉదీర్ణస్య) ఉత్కృష్టుఁడైన-సహాయసంపన్నుఁడైన వారిసనెల్ల నాశము నేయుచున్నవాఁడైన-ఈ పెద్దపురుషుఁడు వీనినిపోనివ్వరాదు వేఁడరని యొనరినయునను, (రావణస్య) తనకు వరముల నిచ్చినవారినే స్థానములనుండి తొలుగఁగొట్టినవాఁడనుట, అట్టిరావణునియొక్క, (వధార్థిభిః) ఈ ఒకనిని సంహరింపఁగా రాజ్యమంతయు సుఖముగా ఉండునని ప్రపన్నులైనవారిచేత ననుట, (అర్థితః) ప్రార్థింపఁబడినవాఁడై-ఉపాసింపఁబడినవాఁడు కాఁడనుట, (మానుషేలోకే) ఏలోకమందలి

మునందుఁ బుట్టిననిత్యవస్తువైనవిష్ణుదేవుఁడే యీరాముఁడు గదా. కాన తండ్రి క త్యంత ప్రీతి యతనియందుఁ గలుగుట వింత కాదు. తండ్రియే కాదు, తల్లి యగుకౌస ల్యయు, వజ్రపాణియైనయింద్రునిచేత అదితి యెట్లుప్రకాశించెనో యట్లే మహాతేజస్వి యైనయీకుమారునిచేత తాను బ్రకాశించినదయ్యె. ఆరాముఁడు మంచిచక్కఁదనము కలవాఁడు; చక్కఁదనమే కాదు; ఔదార్యము మొదలైనగుణములును గలిగియుండు ను. అతఁడు వీర్యవంతుఁడు. ఒకరిగుణములందు దోషములను వెదకునట్టియసూయ యతనికిఁగలుగదు. దేవలోకమందు అదితి యొకతె అతనికి సాటియైనయింద్రునిగన్న దికాని, భూలోకమందో కౌసల్యతప్ప తక్కినయెవ్వతియు అట్టికొడుకును గన్నది కాదు. మఱియు నతఁడు కోపము లేనితిన్ననిస్వభావము గలవాఁడు; కావుననే యెవరును అత నితో పరుషముగా పలుకరు; ఒకవేళ పరుషముగా పలికినను వారికి బిరుసుగా మాఱు మాటాడఁడు; మఱి మృదువుగానే మాటాడును. ఎవరైన నొకయుపకారమును ఒక మాఱు చేసినయెడల, అది వేడుక కొఱకో, ప్రతిఫలమును గోరియో, మనస్సు లేక యో, అతిస్వల్పముగానో, మఱి యెట్లు చేయఁబడినను గాని, ఆయొక్కయుపకారము నకే అతఁ డెప్పుడును సంతోషించుచుండును. మఱి యపకారములు నూఱులకొలఁ దిని తనకుఁ జేసినను, అతఁడు మనస్సు వశపఱుచుకొన్నమహాజ్ఞానవంతుఁడు గావున, వానిని తలఁపనైనను తలఁపఁడు. అతఁడు ఎప్పుడుగాని, ఇంతేల! అస్త్రములను అల వాటుసేయుచుండు నవకాశములందుసైతము, సజ్జను లెవరు వచ్చినను, ఊరు కులము విచారింపక, అందఱిని సమముగాఁ గయికొని వారిలో సదాచారసంపన్నులైనవారి తోడ మిక్కిలిసూక్ష్మములైనయాచారవిశేషములను బ్రతిపాదించుచును, మోక్ష విషయ మగుజ్ఞానపరిపాకము గలవారితోడ వేదాంతరహస్యములను వెలివుచ్చుచును, వయస్సు చెల్లినపెద్దలతోడ పరంపరాగతములైనసంప్రదాయవిశేషములను దెలుపు చును, ఉండును. కాన సజ్జనసంగతి లేక క్షణకాలమేనియు నుండఁడు; మంచి బుద్ధి గలవాఁడు గాన 'సర్వజనులును ఎట్లు సుఖముగా నుందు' రని యెప్పుడు లోకరక్షణ చింతాపరుఁడై యుండును; మధురముగా మాటలాడువాఁడు గనుక ఏపలుకు చెప్పి నను ఇంపు గులుకుచుండును. నీచునితోనైనను బిగువు చూపక ముందుపడి తానే

మనుష్యగంధమునుగూడ దేవతలు ఓర్వలేక ఏవగించుకొనుచు యోజనమాత్రము మీఁదుగానే ఉండి యాగములందలి హవిస్సులను కొనుదురఁట. అట్టిమనుష్యలోకమందు ఏవనికి దేవతలును మనుష్యులవంటి వారే యగుదురో అట్టి సర్వోత్కృష్టుఁడు, దేవతలుకూడ మిక్కిలి ఏవగించునట్టి ఈమనుష్యలోక మందుఁ బుట్టినవాఁడయ్యె. ఈసౌలభ్యాతిశయ మేమి! యనుట. (ప్రజజ్ఞే) పుట్టెను. నృసింహాదులవలె స్తంభాదులనుండి వెలువడలేదనుట. లోకులు పదిమాసములే గర్భమందుండి పుట్టుదురు; ఇతఁడో (అత శ్చద్వాదశేమాసే) అన్నట్లు అంతకన్న ఎక్కువకాలము గర్భమందుండి పుట్టెననుట. (విష్ణుః) వ్యాపించువాఁడు; అంతట వ్యాపకుఁడైయుండువాఁడు. తాను వ్యాపించినదానిలో కొండొకచోట - అనఁగా దశరథునికి నాకొడుకు అనునట్లు, పుట్టెనని భావము. (సనాతనః) నిత్యవస్తువైనది; ఇట్లు తనకు జనాదులు గావించుకొనెనని అనుట.

మాటాడును; పరులకు హితములే పలుకుచుండును. తనయాశ్రితులకుఁ గలుగువిరోధులను నిరసించునట్టివీర్యమును గలవాఁడు; కాని, తన వీర్యము ఎంతగొప్పదిగా నుండినను అందులకు తా నబ్బురపడి విఱ్ఱవీఁగక యేమి చేసితి ననుకొనును. ఇంతే కాక యతఁడు విద్వాంసుఁడుగాన అసత్కావ్యములను తగవని యెఱింగి పలుకఁడు; అసత్యమును పలుకఁడు; మున్ను చెప్పఁబడిన మూఁడువిధము లైన పెద్దలను ఎదుర్కొనిపోయి పూజించును; పండితుఁడు పామరుఁడు అను తారతమ్యము లేక ప్రజలను అందఱిని రంజింపఁ జేయును. కావున ఆప్రజలందఱికిని అతనియం దనురాగము గలిగియుండును. అతఁడు దయగలిగి బ్రాహ్మణులను బూజించును; దీనులయెడ మిక్కిలియుఁగనికరముతో కోరినవస్తువుల నొసఁగుచు సమస్తధర్మములను దెలిసి *సర్వభూతములకును అభయదానము సేయునియమమును ఎప్పుడును దాల్చి, † శుచియై(పరధనము గోరనివాఁడై) యుండును. అతఁడు ఇక్ష్వాకువంశమునకుఁ దగినట్లు దయాదాక్షిణ్యశరణాగతరక్షణాదిధర్మములందు బుద్ధి గలవాఁడు; కనుక దుష్టుల నిగ్రహించి ప్రజలను బరిపాలించుతనక్షత్రధర్మమునే గొప్పగా నెంచువాఁడు. ‡ ఆధర్మమువలనఁ గలుగు పెనుకీర్తిచేత మహనీయమైన స్వర్గఫలము సిద్ధించునని యాతఁడెఱుంగును. విద్వాంసుఁడు గావున నిష్ఫలమైనకర్మమందుఁగాని నిషిద్ధకార్యమందుఁగాని ఆసక్తుఁడుగాఁడు. ధర్మవిరుద్ధము లైనకథలయందును గ్రామ్యము లైన యాలాపములందును అతనికి రుచి లేదు. లౌకికవైదికవిషయములందు పయిపయిని యుక్తి ప్రసక్తించినపుడు తాను జెప్పినయర్థము నిర్వహించుకొఱకు బృహస్పతివలె అనర్గళమైనవాక్కుతో ప్రమాణముల నతఁ డుపన్యసింపఁ జాలును. § అతనికి రోగములు లేవు; యౌవనమును మంచి ప్రశస్తమైనవాక్కును గలిగి, మంచిశరీరముతో నొప్పుచు, అధ్యయనమునకును ఆయాధర్మము లాచరించుటకును దగిన దేశకాలముల నెఱిఁగియుండును. పురుషులను ఒక్కమాఱు చూచినంతనే వారిహృదయమంతయు నతఁడు దెలిసికొనును. లోకమందితం డొక్కఁడే సాధువుగా నిర్మింపఁ బడెనని యందఱును నిశ్చయింతురు. ఇంతవ

* 'అభయం సర్వభూతేభ్యో దదామ్యే తద్వ్రతం మమ' అనునట్లు సర్వభూతములకు అభయదానమే రామునికి నిత్యవ్రతము.

† (శుచిః) అనఁగా 'యోఽర్థే శుచి స్సహి శుచి ర్నమృద్వారిశుచిః' అను మనుస్మృతి చెప్పిన పరధనవాంఛలేమి యని తెలియునది.

‡ స్వవర్ణమునకును స్వాశ్రమమునకు నుచితమైన ధర్మమును అనుష్ఠించుటచే కీర్తిగలిగి ఆకీర్తిద్వారా స్వర్గము సిద్ధించునని తెలిసి స్వధర్మమైనక్షత్రధర్మమును విశేషించి యనుష్ఠించువాఁ డనుట.

§ ఇందులకు (అరోగ స్తరుణో వాగ్మీ వపుష్మాన్ దేశకాలవిత్) అను శ్లోకము. ఇది అధ్యయనసత్కర్మానుష్ఠానములకు సామర్థ్యము గలుగుటకు వలయులక్షణములు. ఇందు 'యువాస్యాత్సాధుయువాధ్యాయకః ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః' అను శ్రుత్యర్థము ప్రతిపాదితము. 'అరోగః' అనుట ఆశిష్ఠశబ్దమునకును, తరుణః అని యువన్శబ్దమునకును, 'వాగ్మి' అని యుపాధ్యాయక శబ్దమునకును, 'వపుష్మాన్' అని బలిష్ఠశబ్దమునకును, 'దేశకాలవిత్' అని సాధుశబ్దమునకును బదులుగాఁ గూర్చఁబడినవి.

ఆకుఁ జెప్పఁబడినవే కాక యింకను అనేక శ్రేష్ఠగుణములతోఁ గూడి యున్న యారాజకుమారుఁడు తనకల్యాణగుణములంబట్టి ప్రజలకు బహిఃప్రాణమువలె మిక్కిలి ప్రియుఁడై యుండును. కొందఱు విద్యామాత్రమును గొందఱు వ్రతమాత్రమును దీర్చి స్నాతకర్మమును గయికొందురు. రాముఁ డట్లుకాక చక్కఁగా వేదముల నధిగమించి వ్రతములను ఆచరించి సమావర్తనము జరపుకొన్నవాఁడు. సాంగవేదమునర్థము చక్కఁగా నెఱిఁగినవాఁడు. *ఇషువులందును అస్త్రములందును భరతునియన్న యగు రాముఁడు తండ్రి యగుదశరథునికిని మేలుచేయి యై యుండెను. అతనిమాతృపితృవంశములు రెండును శోభనము లైనవిగావున నతఁడు నిర్దోషుఁ డై యుండును. మఱియు నెట్టికలఁతలయందును అతనిమనస్సు కలంగదు. ఏసంకటములందును అతఁడు సత్యము తప్పఁడు; త్రికరణముల నొక్కరీతిని వర్తించును; ధర్మార్థములను దెలుపుపెద్దలైనబ్రాహ్మణులచేత చక్కఁగా శిక్షితుఁడై యొప్పుచుండును. అతఁడు †రేపు మాపు మొదలైన ఆయాకాలములందుఁ జేయఁదగిన ఆయాధర్మార్థకామములను దెలిసినవాఁడును; మఱపు లేనివాఁడును; స్మృతి గలవాఁడును; పయింబయి క్రొత్తక్రొత్తగా వికసించుచుండుబుద్ధి గలవాఁడును; లోకమునందు సంకేతితము లైనయాచారములయందు న్యాయము దెలిసినవాఁడును; పండితుండునై యుండును. అతఁడు వినయము గలవాఁడు; తనమనస్సునందలి యభిప్రాయములను వెలిపుచ్చునట్టిబొమముడి మొదలైనవికారముల నొందనిగంభీరుఁడు. అతనికార్యాలోచనము ఫలము సిద్ధించువఱకు నెవ్వరికిని దెలియ రాదు. ప్రశస్తు లైనమంత్రులును అతనికిఁ గలరు. అతనికి కోపముగాని సంతోషముగాని కలిగెనా అది ఫలపర్యంతమును గొనసాఁగియే తీఱును. ఒకవస్తువు నెప్పుడు విడువ వలయునో యెపుడు గ్రహింపవలయునో యతఁ డెఱుఁగును. దేవతలందును గురువులందును అతనిభక్తి నిశ్చలమైనది. అట్టిభక్తిచేఁ గలిగినయతని జ్ఞానమును దృఢ మైనది. కావున నే యతఁడు చెడ్డవానినిగాని చెడ్డవారినిగాని గయికొనఁడు; ఒకరినిని పరుసుగా మాటాడఁడు. అతఁడు అలసత్వము లేక సదా శాస్త్రపరిశీలనము చేయుచుండునుగాన శాస్త్రార్థములందు పరాకు లేకుండును. లోకంబులోనందఱును పరులదోషములను పాటింతురు; తమదోషములను బాటింపరు. ఇతఁ డట్లు కాక తనదోషమును బాటించి యెఱుంగును. మఱియును సాంగవేదమే కాక తక్కిన శాస్త్రములను విద్యాస్థానములను ఎఱిఁగి సిద్ధాంతములను దెలిసి పరులు చేసినగోరంత యుపకారము నేని కొండంతిగాఁ దలఁచును. పురుషులను జూచినమాత్రమున వారి తారతమ్యములను వారిహృదయమందలి గూఢాభిప్రాయములను కనుఁగొనుటయందుఁ బండితుండై, శాస్త్రంబునఁ జెప్పినచొప్పున మిత్రులు మొదలైనవారిని గయి

* అమంత్రికము లైనబాణములు ఇషువులు; సమంత్రికము లైనవి అస్త్రములు.

† 'నపూర్వాహ్ణమధ్యాహ్నాపరాహ్ణేనపరాన్ కుర్యాత్' అనునట్లు శ్రుతిచెప్పిన పూర్వాహ్ణాదికాలములందు ఆయాధర్మార్థకామములు సేయవలయును. వానిస్వరూపములను దెలియుననుట.

కొనుటయందును, అట్లు గయికొని పరిపాలించుటయందును, పరమనిపుణుఁడు నై, రాణించుచుండును. సత్పురుషులను పరిగ్రహించుటయందును, పరిగ్రహించి పరిపాలించుటయందును, సదాచారములను అనుష్ఠించుటయందును, మిక్కిలియుఁ జతురుఁడు.దుష్టుల నిగ్రహించుసమయములును శిష్టులను పాలించునవకాశములును అతనికిఁ దెలియు. పూవులనుండి తేనెను గొనుతుమ్మెదవలె ప్రజాదులనుండి వారికిసుఖముగాను న్యాయ్యముగాను ద్రవ్యంబును సంపాదించునుపాయములను అతం డెఱుంగును; *శాస్త్రవిహితప్రకారమున వ్యయము చేయుకార్యములును దెలియును; వేదవేదాంగన్యాయవైశేషికాదిశాస్త్రసమూహములయు సంస్కృతప్రాకృతాదిభాషామయము లైనకావ్యనాటకాలంకారాదులయు తాత్పర్యము లెఱిఁగినవారిలో నెల్లనతఁడు తలమిన్న. అతఁడు కేవలకామపరతంత్రుఁడుగాఁడు;అర్థమును ధర్మమునుగూడ సంగ్రహించియే సుఖము ననుభవించును. ఆయర్థధర్మములను సంపాదించుటయందు సోమరియుఁ గాఁడు;విహారార్థము లైనసంగీతచిత్రకర్మాదిశిల్పములందలివిశేషముల నతఁడు చక్కఁగాఁ దెలిసినవాఁడు.†ధనమును ఆయాకార్యములకువిభజించుప్రకారములును అతనికిఁ దెలియును. అతఁడు, గజాశ్వములను ఎక్కుటయందును ఎక్కి ఆయావిధముల మెలపుటయందును సమర్థుఁడు; ధనుర్వేదములను సమర్థముగా నెఱుంగునుగాన ధనుర్వేదవిదులలో నెల్ల కన్నెకెక్కినవాఁడు; లోకమునం దతిరథులైనవారిచేతనుఁ బూజితుఁడైనవాఁడు;పగవారు వచ్చి తన్ను మాఱుకొన్నపిమ్మటనే తానుగొట్టువాఁడు గాఁడు; తానే వారున్న చోటికిఁ బోయి, అందును,దుర్గములనుమాటుచేసికొని పొంచియుండక యెదురుగాఁ బోయి, మార్కొని కొట్టును. ఇట్లుతానై కొట్టుచుఁ దనసేన భిన్నము గాకుండ రక్షించుటకై పగవారికి చొరరానిచక్రవ్యూహాదుల దానికిఁ బన్నుటయందు మిక్కిలి నేర్పరియైనవాఁడు. కావుననే యెవ్వరికిని అతఁ డెదిరింప రానివాఁడై యెప్పుడును జయశీలుఁడై యుండును. కేవలము మనుష్యులేకాదు; దేవతలును రాక్షసులును పరస్పరవిరోధములు విడిచి యొకటిగాఁ గూడి కడుంగోప మేపారవచ్చినను అతని నెదిరింపఁ జాలరు. అతనికి నసూయ గలుగదు;కోప మతనికి వశమైయుండు; గర్వమునుజూపట్టదు;ఇతరులమేలునకు మత్సరించుటయుఁగానరాదు.అతఁడే ప్రాణులను అవమానింపఁడు. ఆయాకాలములఁగల్గు రాజసతామసాదిగుణములకు లోను గాక యెపుడును కేవలసత్త్వమూర్తియైయుండును. ఇట్లారాజకుమారుఁడు ప్రజలలో నెల్ల

*'కశ్చిదాయస్య చార్ధేన చతుర్భాగేన వా పునః। పాదభాగైస్త్రిభిర్వాపి వ్యయస్సంశోధ్యతే బుధైః॥ వచ్చుబడిలో సగముపాలుగాని నాలవపాలుగాని మూఁడుపాళ్లుగాని వ్యయము సేయఁ దగు నని పెద్దలచే నియమింపఁబడియున్నది' అని శాస్త్రము.

† 'ధర్మాయ యశసేఽర్థాయ ఆత్మనే స్వజనాయ చ। పఞ్చధా విభజన్ విత్తమిహాముత్ర చ శోభతే॥ ధర్మమునకొఱకును కీర్తికొఱకును ధనాభివృద్ధికొఱకును తనకొఱకును తనవారికొఱకును ఇట్లు అయిదుభాగములుగా ధనమును విభజించువాఁడు ఈలోకమునను పరలోకమునను ప్రకాశించును' అని అర్థవిభాగశాస్త్రము.

లోకోత్తరగుణయుక్తుఁడై ముల్లోకములందును బూజితుఁడై రాజిలుచుండెను. అతండు క్షమాగుణములచే భూమికి సమానుండు; బుద్ధియందు బృహస్పతికి తుల్యుండు; పరాక్రమంబున నింద్రునకుఁ బురుఁడైనవాఁడు. ఇట్లు స్త్రీలు బాలురు యువవృద్ధులు మొదలైన ప్రజలకందఱికిని తండ్రికిని తక్కినవారిని సంతోషకరములైన యొప్పుగుణముల చేత తనంత సుందరుండైన రాముఁడు, తనంతటఁ బ్రకాశమానుండైన సూర్యుఁడు కిరణములచేతం బ్రకాశించునట్లు, ప్రకాశించుచుండెను. *ఇట్టిగుణసంపత్తి గలిగియున్నట్లే ఆశ్రితులను సంరక్షించు వ్రతసంపత్తియుఁ గలిగి, యెదిరింప రానిపరాక్రమముచే వెలుఁగుచు, లోకపాలురకు సాటియైయున్న రాముని భూమియు (భూజనులు) తనకు నాథునిగాఁ గోరినదయ్యె. లోకమునందు సాటిలేనియిట్టికల్యాణగుణములు పెక్కింటితోఁ గూడియున్న కొడుకునుజూచి దశరథమహారాజు, తాను పగవారి నడంచుచు రాజ్యపాలనము చేసి యలసి యుండుటనుజింతించి, బహుకాలము బ్రదికి ముదిసినవాఁ డగుటచే 'నేను బ్రతికియుండఁగా రాముఁడెట్లు రాజు కాఁగలఁ'డనియింపారుచింత నొందెను. మఱియు నా రాజు హృదయమునం దాగొనబుచింత గుదురుకొనఁగా, 'నా ప్రియకుమారుం డగు రాముఁడు రాజ్యాభిషిక్తుఁడు కాఁగా నెపుడు చూతునో కదా! వాఁడు లోకులయభివృద్ధిని గోరువాఁడు; సమస్తప్రాణులయందును దయగలవాఁడు; నర్షము గురియుపర్జన్యుని వలె జనులకు దాతయు సంతాపహరుఁడునైనవాఁడు; లోకులకు నాకన్నను మిక్కిలి ప్రియుఁడైనవాఁడు; పరాక్రమంబునయందు దేవేంద్రునిం బోలినవాఁడు; బుద్ధియందు బృహస్పతివంటివాఁడు; పర్వతమువలె మహాధీరుఁడు; నాకంటెను మిక్కిలి గుణవంతుఁడు; ఇట్లు రాజత్వమునకుఁ దగినసకలలక్షణములు గలిగి వెలుఁగుచున్న యీకొడుకు నాకీనయసున నే యీభూమండలము నంతయుఁ దాల్పఁగా చూచి నేనుస్వర్గము నొందునట్లు గలుగునా' అని ఆచింతయే యెడతెగక గలిగియుండెను. ఇట్లు నానావిధములై యితరరాజదుర్లభములైన ఆయాప్రసిద్ధ గుణములును, మఱియును లోకోత్తరములై స్వాభావికములై లెక్కింప రానితక్కినకల్యాణగుణములును, గలిగి వెలుఁగుచున్న యారామునిం జూచి యామహారాజు మంత్రులతో నాలోచించి రాముని యువరాజుగా నిశ్చయించెను. మఱియు నాధీమంతుఁడు స్వర్గమందును ఆకాశమునను భూమియందును భయంకరములుగాఁ దోఁచుచున్న యుత్పాతము

* ఇందులకు మూలము. 'తమేవం వ్రతసంపన్నమప్రధృష్యపరాక్రమం। లోకపాలోపమం నాథమకామయత మేదినీ' దీనికి విశేషార్థము:—(ఏవం) ఇట్లు-బాలకాండమున చెప్పఁబడినట్లుగా, (వ్రతసంపన్నం) 'రామస్తు సీతయా సార్థమ్' అన్నట్లు సతీవ్రతియును - సీతతోడక్రీడారసమును గలిగియున్నవాఁడును, (అప్రధృష్యపరాక్రమం) విరోధివర్గమును సహింపని పనితోడిభోగమును ఒసఁగువాఁడును, (లోకపాలోపమమ్) ఇది విశేషణోభయపదసమాసము (లోకపాల) లోకములను పాలించువాఁడును, (ఉపమం—ఉప=సమీపే, మా=లక్ష్మీ యస్య స ఉపమః) సమీపమందు సీతారూపమైనలక్ష్మి గలవాఁడును - లక్ష్మితో భోగమును అనుభవించుచున్నవాఁడును అనుట, ఇట్టివాఁ డగురామునిని, (మేదినీ) భూదేవియు, (నాథం అకామయత) స్వయంవరముచే కంఠమునందు మాల వైచుటకుఁ గోరెను.

లను జూచి తనశరీరమందలివార్ధకమును పాటించి మంత్రులతో 'ఈయుత్పాతములు నాకుఁ గీడు దెలుపుచున్నవి. మఱియు నాకు దేహము మిక్కిలి ముదిసినది. ఈరెండు కారణములంబట్టి యికఁ వేగముగా రామునకుఁ బట్టముఁ గట్టఁదగు' ననియె. అంతనా భూకాంతుఁడు 'పున్నమచందురునివలె సర్వసంతాపములను హరించుమొగము గలిగి మహామతి యైయొప్పు రాముఁడు లోకులకు మిక్కిలియుఁ బ్రియుఁడై యున్నాఁడు. దానిచే ఉత్పాతాదులవలన నాకుఁగల భయము నివర్తించుచున్నది;అది పట్టము గట్టుటకు మఱియొకకారణముగాను నున్నది' అని యెంచెను. ధర్మశీలుఁ డగునాభూపాలుఁడు తనకును ప్రజలకును మేలుకొలుపుటకును, ప్రీతి కలుగుటకును, యుక్తకాలంబునఁ బ్రీతియుక్తుండై రామునిఁ బట్టము గట్టుటకు వేగిరపడెను. దశరథుఁడు ఆపట్టణవాసులగు జనులను, గ్రామవాసు లగుజనులను, ప్రధాను లైనరాజులను, సామాన్యరాజులను వేఱువేఱ పిలిపించెను. కేకయరాజును జనకరాజును దూరస్థు లగుటచే, వారిని పిలిపించుటకుఁ దగినయవకాశము లేమింజేసి, రాజు 'ఈకార్యమైనపిదప వారు ప్రియమైనయీంవార్త వినఁ గల'రని తలంచి వేగ వారిని పిలిపించినవాఁడుగాఁ డయ్యె. దశరథుఁడుతాను పిలిపింపఁగా వచ్చినవారికి తగినట్లు విడుదులుచూపి, వివిధాభరణములనొసంగి పూజించినపిదప,తా నలంకృతుఁ డై, ప్రజలను జూచు ప్రజాపతివలె, వారిం గాంచెను.పరబలముల నడంచువీరుం డగునాభూవరుఁడు గూర్చుండియుండఁగా నంత జనకుఁడును కేకయుఁడును తప్ప తక్కినలోకపూజితు లగురాజులు కొలువుకూటము ప్రవేశించి రాజదత్తము లైన ఆయాయాసనములందు రాజునకు ఎదురుగానే నియతితోఁ గూర్చుండిరి. రాజుచేత బహుమానము లంది వినయముతో రాజుపలుకులు వినుటకు మెల్లమెల్లగా సమీపమునకువచ్చి కూర్చున్న నానానగరవాసులగు రాజులును జానపదు లగుజనులును చుట్టును బలసి కొలువ, నాదశరథుండు, దేవతలచేత పరివృతుండై నమహాత్ముఁ డగు దేవేంద్రునివలె, ప్రకాశించెను. ఇది ప్రథమసర్గము.

—●●◆దశరథుఁడు రామాభిషేకమునుగూర్చి ప్రజలతో ముచ్చటించుట.◆●●—

అంత నాదశరథభూనాథుఁడు తనకంఠస్వరము భేరివలె మ్రోగుచు గంభీరార్థ మై దిక్కులఁ బ్రతిధ్వనించుచును, దనప్రభావమున కనురూప మై మృదు వై అనుపమ మై మాధుర్యవంత మై వెనుపొందిశబ్దింపఁగా, తాను మేఘమువలె నొప్పుచు, సభలోనివారికందఱికి సభిముఖుఁ డై మిక్కిలియుహర్షము గలిగించుహితవాక్యమున స్పష్టముగా నందలిరాజులం జూచి యిట్లనియె. "విపుల మైనయీనారాజ్యమును నాకు పూర్వు లై నరఘువు మొద లగురాజవరులు కన్నపుత్త్రునివలె అతిప్రేమతో రక్షించి రనుట మీకుం దెలియునేకదా. వారివంశమునఁ బుట్టిననేనును, ఆయిక్ష్వాకువంశ్యు లగురాజు లందఱును సుఖముగా రక్షించుటవలన సుఖార్హ మై యున్నయీరాజ్యమున కంతయు, ఇపుడును సుఖమును గూర్పఁ గోరుచున్నాను. పూర్వరాజులు చరించినమార్గమునే యనుసరించుచు,నేను జాగరూకుఁడ నై ,యెప్పుడు నేమఱక నాశ

ర్తికొలఁదిని ప్రజలను రక్షించినాఁడను. ఎదురు లేనిపరాక్రమముచేత శ్వేతచ్ఛత్రముఁ దాల్చి ముదిమివఱకును ఏకాధిపత్యముగా రాజ్యముచేసి జగమునకంతయు నియమముతో హితమాచరించుచు వచ్చితిని గాన ఆ తెలిగొడుగునీడయందే కాలము పుచ్చి నా దేహము ముదిసిన దయ్యె. నేను పెక్కువేలసంవత్సరములు ఆయుస్సు గలిగి జీవించుటచే నాయీదేహము జీర్ణించినది; ముదుకుఁడనైతిని. కాన యిఁక శ్రమపడఁజాలను; విశ్రాంతి గోరుచున్నాఁడను. లోకమునందు ధర్మమును పరిపాలన చేయుభారము కేవల మైనదికాదు. రాజులకు ప్రభావము లైనశౌర్యాదులను గలిగియే దానికిఁ బూనవలయును. ఇంద్రియనిగ్రహము లేమిచే అట్టిప్రభావములు మాలినవారికి అది భరింప నలవికాదు అనేకసాధనములచే నిర్వహింప వలసినదిగావున అది మిక్కిలియు గొప్పది. అట్టిభారమును వహించుచు మిక్కిలియలసియున్నాఁడను. ఇట్లు అలసి ముదిసి యున్న నేను ప్రజారక్షణమునందు కుమారుని నియమించి, అంతరంగు లగునీయఖిలబ్రాహ్మణోత్తములను అనుమతించునట్లు చేసి, విశ్రాంతి నొందఁ గోరుచున్నాను. నాపెద్దకుమారుఁ డగురాముఁడు పరాక్రమమున ఇంద్రునకు సాటియైనవాఁడు; పగవారిపట్టణముల గెలుచునట్టి మేటి; అన్నిగుణములను నన్నుఁ బోలి పుట్టినవాఁడు. ధార్మికశిరోమణియు పురుషులలాముఁడు నై పుష్యనక్షత్రముతోఁ గూడినచంద్రునివలె మిక్కిలి ప్రకాశించుచున్నయీరామచంద్రుని సంతోషముతో యౌవరాజ్యమునకు నియమింపఁ గోరెద. *ముల్లోకములును పెక్కునాథులను గలిగియుండియు,ఎవ్వనిని ప్రభువుగాఁ బడసి యధికముగా సనాథములగునో అట్టిమహా

* ఇందులకు మూలము 'అనురూపస్సవై నాథో లక్ష్మీవాన్ లక్ష్మణాగ్రజః। త్రైలోక్యమపి నాథేన యేన స్యాన్నాథవత్తరమ్' దీనికి విశేషార్థములు:-(సః) ఆరాముఁడు (అనురూపః నాథః) సహజస్వామి; ఇతరులు కర్మానుగుణముగా స్వాములగుచున్నారు; కనుక ఔపాధికులు-అనఁగా ఒకనిమిత్తమునుబట్టి స్వామిత్వము నొందినవారు; రాముఁడు స్వతస్సిద్ధముగా స్వామియైనవాఁడు. లేక (అనుకూలం రూపం యస్య సో అనురూపః) అనురూపమైనరూపముగలవాఁడు-సుందరదివ్యమంగళవిగ్రహుఁడనుట. లేక (అనురూపః) అనుకూలమైనస్వరూపముగలవాఁడు-ఆనందరూపుఁడనుట. లేక (అనురూపః) అనుగతమైన.. అంతటను అనుసరించు-రూపముగలవాఁడు- అన్నిటనువ్యాపించినవాఁడనుట. లేక (అనురూపః) అనుప్రవిష్టమైన-తనకు శరీరభూతములైన-చరాచరములందు అనుప్రవిష్టుఁడైనవాఁడు-సర్వశరీరియనుట. లేక (అనురూపః) అనుస్యూతమైన నానారూపములు గలవాఁడు-పరవ్యూహవిభవాదినానారూపముల నవతరించినవాఁడనుట. లేక (అనురూపః-అ+నురూపః) నుః అనఁగా శివుఁడు; నురూపుఁడు అనఁగా శివునివంటిరూపము గలవాఁడు; అ+నురూపుఁడు అనఁగా శివునిరూపమువంటిరూపము లేనివాఁడు, శివునివలె విరూపాక్షుఁడు కాఁడు; పుండరీకాక్షుఁడనుట. వినాథః-వి=పక్షులకు, నాథ=నాథుఁ డగునదిహంసము; వినాథునిసంబంధించినవాఁడు వైనాథుఁడు,హంసము నెక్కు బ్రహ్మ;సవైనాథః=ఆబ్రహ్మతోడఁ గూడినవాఁడు-నాభికమలమున బ్రహ్మనుభరించువాఁడనుట. లేక, వినాథః-విః=పక్షులకు, నాథః=నాథుఁ డగుగరుడుఁడు-వినాథుని సంబంధించినవాఁడు వైనాథుఁడు; గరుడవాహనుండనుట. నాథుఁడగుటకు హేతువును చెప్పుచున్నాఁడు.(లక్ష్మీవాన్)లక్ష్మీదేవిగలవాఁడు. లక్ష్మీదేవి పత్నిగాఁ గలవాఁడనుట.శ్రియఃపతిత్వమును వేదాంతములు పరత్వసూచకముగా ప్రతిపాదించుచున్నవి.అట్టిపరుఁ

తేజస్వియు, లక్ష్మీవర్ధనుఁడైనలక్ష్మణునకు అన్నయు, అగురాముఁడు మీకుం దగిననాథుఁడు. చిరకాలము నేను ధరించి యున్న యీభూమిభారమును నా జ్యేష్ఠకుమారుఁడైనరామునియందుంచి, యిట్టిమేలు ఈభూమికి ఒడఁగూర్చి, నేను విశ్రాంతుఁడ నయ్యెదను. రాజ్యభారమున అలసి ముదిసియున్న నాకు ఈరాముని అభిషిక్తునిఁ జేయఁ దలఁచినకార్యము ఉచితమైన ప్రయోజనము గలిగించునదేని, నే నిది చక్కఁగా ఆలోచించి పూనితి నని మీకుఁ దోఁచెనేని, ఇందులకు మీరు నా కనుమతి యిండు. ఇది నాకు అనుకూలమైనదేని మఱియొకటి యెట్లు చేయుదును? మీయనుమతి లేక నేనుమాత్ర మేమి చేయ నేర్తును. 'నీకు ఏది ప్రియమో అది చేయు' మందురేని, రాముని అభిషిక్తునిఁ జేయువిషయమున నాకుఁ బ్రీతి యుండినను, హితమైనది మఱొకటి యుండెనేని, దానిని చింతింపుఁడు. పక్షపాతి యగుతాను జేయునాలోచనముకంటె నిష్పక్షపాతులైనమధ్యస్థులయాలోచనము వేఱైయుండును గదా.

---

డు కావుననే నాథుఁడు కాఁదగుననుట. (లక్ష్మణాగ్రజః) ఇట లక్ష్మణశబ్దముచే కైంకర్యపరులనుమాత్రమే గ్రహించునది- అగ్రజుఁడనుటచే కైంకర్యపరులైన ఆశ్రితులకు, తమ్మునకి అన్నవలె, పరతంత్రుఁడై యుండునని ఆశ్రితపారతంత్ర్యమును తెలియునది. వేదాంతులు ప్రతిపాదించుపత్నీవిశిష్టత్వము (లక్ష్మీవాన్) అని చెప్పఁబడియె. (లక్ష్మణాగ్రజః) అనుటచే, పరిజనవిశిష్టత్వమును ఇట ప్రతిపాదింపఁ బడియె. బ్రహ్మరుద్రాదులును నాథులై ప్రసిద్ధిఁ బొందియుండఁగా ఇతఁడు అనురూపుఁడైననాథుఁడెట్లు అనఁగా చెప్పుచున్నాఁడు:-(త్రైలోక్యమపి) ముల్లోకములును, లేక నిత్యము అనిత్యము నిత్యానిత్యము అని త్రివిధమగుసమస్తజగత్తును (యేన నాథేన) ఏనాథునిచేత-ఇతని నాథత్వము నిత్యమని తెలియునది. (నాథవత్) నాథుఁడు గలది-ఇట్లనుటచేత నే యింద్రాదులనాథత్వము అనిత్యమగుటవలన వారు నాథులు కారని సూచితమగుచున్నది. (నాథవత్తరమ్) అధికముగా నాథుఁడు గలది ఇట్లనుటచే బ్రహ్మరుద్రాదులు సామాన్యముగా నాథులే కాని అధికముగా నాథులు గారని తెలియుచున్నది. ఏలన 'యుగకోటిసహస్రాణి విష్ణుమారాధ్యపద్మభూః। పునస్త్రైలోక్యధాతృత్వం ప్రాప్తవా నితిశుశ్రుమ.' 'బ్రహ్మ పెక్కువేలకోట్లయుగములు విష్ణువు నారాధించి ముల్లోకములకు అధిపతియగుటను బొందెను' అనియు, 'మహాదేవ స్సర్వమేధే మహాత్మా హుత్వా౽౽త్మానం దేవదేవో బభూవ—మహాత్ముఁడగుశివుఁడు సర్వమేధమున పరమాత్ముఁ డగువిష్ణు నారాధించి దేవదేవుఁడయ్యెను' అని విష్ణునను గ్రహమున బ్రహ్మరుద్రులు నాథులైరి. కాన త్రిలోకమును వారిచేత నాథవంతము చేయగును; విష్ణువుచేత నే నాథవత్తరము లగు ననుటరస్యబద్ధసారస్యము తెలియునది.

[illegible]విమతార్థము—(సః) ఆరాముఁడు, అ+ఈ గూపః = శివుసరూపముగుంటిరూపము లేనివాఁడు- శివునకుమాత్రము తక్కువ యైనవాఁడనుట-శివుఁడు సర్వేశ్వరుఁడగుటచేత విష్ణువును తదాశ్రితుఁడుగావున శివుఁడుతప్ప తక్కినవారికి విష్ణువు నవతారభూతుఁడైనరాముఁడు అధికుఁడనిభావము. (త్రైలోక్యమపి) ముల్లోకములును అని అభావద్యోతకమైనఅపిశబ్దమును చేర్చుటచే 'శివుఁడు తప్ప నియముగా తక్కినవాఁడెవ్వఁడును, త్రైలోక్యనాథుఁడు కాఁడు. విష్ణుఁడుమాత్రము శివునియనుగ్రహముచేత త్రైలోక్యనాథుఁడయ్యెను కావున 'పరమేశ్వరపరిపూర్ణానుగ్రహమునను ఇతఁడు పాత్రుఁడు' అని సూచితమైనది, (నాథవత్తరమ్) అనుటచే త్రైలోక్యము ఇంద్రాదులచే నాథవంతమును, ఇతనిచే నాథవత్తరమును, శివునిచే నాథవత్తమమును అగుననుట వ్యంజితము.

అతిశయించినది గా నుండును; అది, యుక్తిప్రతియుక్తులచేత రపిడిచే జక్కఁగా విచారము చేసి, మఱియు మేలు గూర్చును'' ఇట్లు దశరథుఁడు చెప్పుచుండఁగా రాజులందఱు విని వర్షించుచున్న మేఘమును జూచి నెమిళ్లు ముదంబున కేక లిడునట్లు ఆదశరథుని బ్రశంసించిరి. ఆసభలోనిజనసమూహము ఆరాజువచనమునకు సంతోషమునఁ జెలరేఁగి 'మేలు మేలు' అని ఘోషింపఁగా ఆధ్వని వారలస్నేహమును సూచించుచును, ప్రతిధ్వనులు కలిగించుచును, ఆయాస్థానమంటపవిమానమును గదల్చునో యనునట్లు చెలరేఁగెను. తనవార్ధకమున యువరాజును స్థాపింపవలయు ననుధర్మమును, ప్రజలకు అర్థమును సాధించుతెఱఁగును, దెలిసి పలికినయాదశరథునియభిప్రాయమును ఎఱిఁగి, వసిష్ఠాదిబ్రాహ్మణులును రాజులును పౌరజానపదులైనప్రజలతోఁ గూడి యుక్తాయుక్త మాలోచించి యైకమత్యము నొంది తమతమమనస్సులలో వేఱువేఱ చక్కఁగా నిశ్చయించి యాదశరథునితో 'రాజా! నీవు పెక్కువేలసంవత్సరములు జీవించి వృద్ధుండ వైతివి. కావున నీవు రాముని యువరాజుగా నభిషేకింపుము. * మేము మహాభుజుండును మహాబలుండును రఘు

* ఇందులకు మూలము 'ఇచ్ఛామో హి మహాబాహుం రఘువీరం మహాబలమ్ । గజేన మహతా యాన్తం రామం ఛత్త్రావృతాననమ్' దీనికి విశేషార్థములు:—'సౌక్షిరండై నేనుండఁగా రాముని అభిషేకింపనేల కోరెద'రని రాజు గుఱ్ఱును 'మేము రక్షణార్థము రామాభిషేకమును గోరలేదు. రాముఁడు కుమారుఁడై యున్నప్పటి సౌందర్యము జూచితిమి. ఇంక పట్టాభిషిక్తుఁడగునప్పటి సౌందర్యవిశేషమును అనుభవింపఁగోరి ఈయభిషేకము గోరెదము' అని జనులు చెప్పుచున్నారు:-(ఇచ్ఛామః) కోరుచున్నాము - బహువచనముచే అందఱును ఒక్కరీతినే కోరుచున్నామని సూచితము. (ఇచ్ఛామః) అభిషేకపట్టబంధము మొదలైనవానితోఁ గూడి యుండఁగాఁ జూడఁ గోరుచున్నాము, (ఇచ్ఛామః) ఇచ్ఛామాత్రమే మాకున్నది; కార్యము నిర్వహించుట నీయది గదా. (ఇచ్ఛామః) మాకు ఇచ్ఛయున్నది, అయినను 'శ్రేయాంసి బహువిఘ్నాని' అన్నట్లు మంచివానికే చాలవిఘ్నములగును గాన మేము ఇచ్ఛించుశ్రేయస్సు నిర్విఘ్నముగా కలుగునో లేదో. (ఇచ్ఛామః) అభిషేకమునకు ప్రతిబంధకము కలుగనీ కలుగకపోనీ; మాయిచ్ఛకు ప్రతిబంధకము గలుగదు గదా. మఱియు సుందరవస్తువును జూచుటకు ఇచ్ఛ గలుగుట లోకసిద్ధమే కదా. (ఇచ్ఛామః) నీవు సర్వవిధముల కొఱఁతలేక రక్షించుచుండుటవలన నోటఁ జెప్పరానిది యింత కాలము మనసులో ఇచ్ఛించుచుంటిమి. ఇపుడు నీయభిప్రాయము దెలియుటచే స్పష్టముగా 'ఇచ్ఛించుచున్నాము' అని చెప్పెదము. (ఇచ్ఛామః) బహువచనమైనందున 'కొందఱికి ఇచ్ఛయున్నది. కొందఱికి లేదు' అనరాదు; అందఱికిని ఇచ్ఛగలదు. (హి) ఈకోరిక లోకులందఱియందును ప్రసిద్ధము ఇప్పుడే నీవు రామాభిషేకమును జెప్పఁగా సభ్యులప్రశంసాధ్వనిచే ఈవిమానమునుఁగూడ అదిరెనుగదా. మేము గోరుటయే కాదు; నీవు నిర్వాహకుఁడవై యుండఁగానే రాముని ఈభూమియు నాథునిగాఁ గోరలేదా. (మహాబాహుమ్) నిడుపైనచేతులు గలవాఁడు- అతనిబాహుబలమునకు ఈభూమిని పాలించుట యెంత! మహాపురుషలక్షణము గదా మహాబాహువులు. (రఘువీరం) 'దీనాన్ దానేన రాఘవః-రాఘవుఁడు దరిద్రులను దానముచే మన్నించును' అని ప్రసిద్ధుఁడగు రాఘవుఁడు, (రఘువీరం) రఘువంశమునఁ బుట్టినవారిలో శూరుఁడు, (మహాబలం) మహాబలము గలవాఁడు-దృఢమైనప్రతిజ్ఞ గలవాఁడు (గజేన) పెనుఁగుచేత-శత్రుంజయమను నెడిపట్టపేనుఁగు నెక్కి

కులతిలకుండు నగురాముఁడు, గొప్పయేనుఁగు నెక్కి తెల్లగొడుగునీడను మొగము బెడఁగు నూప వచ్చుచుండఁగా చూడఁ గోరుచున్నారము సుమా' అనిరి. ఇట్లు సభ్యులు చెప్పినమాట విని రాజు వారలమనస్సునందలిసంతోషమును దెలిసినవాఁడయ్యుఁ దెలియనట్లు నటించి, వారిముఖముననే యది తెలియఁ గోరి 'రాజులారా! †నేను రామునికి అభిషేకము సేసెదనని మాట చెప్పఁగా మీరు విన్నంతనే ముందు వెనుక నాలోచింపక రాముఁడు ప్రభువు గానలయునని కోరుచున్నవారు. కావున దీనిచే నాకు సంశయము కలుగుచున్నది. మీ రెందులకు రామాభిషేకమును ప్రార్థించితిరో యథార్థముగాఁ జెప్పుడు. నేను ధర్మము తప్పక భూమిని పరిపాలించుచుండఁగా మీరు ముగ్ధుఁడైననాకుమారుని యువరాజుగాఁ జూడఁ గోరెదరు. ఇదియెట్లు? నాయం దపరాధ మేమి' అనియె. అంత సందలిరాజులును బట్టణగ్రామవాసు లగు జనులును అమ్మహాత్మునిం జూచి ‡'నృపాలా! నీకొడుకునకు కల్యాణగుణంబులు పెక్కు

---

యనుట. నీవు అభిషేకకాలమున నొసంగుకిరీటపట్టబంధాదులు ఏనుఁగునెక్కి వచ్చిననే మాకగపడును; రథాదులను ఎక్కినయెడల అగపడవనుట. (మహాగజేన) రాముఁడు మహాగజమువంటినడక గలవాఁడుగాన అతనినడవంటినడక గలగొప్పయేనుఁగైనశత్రుంజయము నెక్కి, (ఆగచ్ఛన్తం) మహాకీర్తి నమమ ప్రతియింటివాకిటను వచ్చుచుండఁగా, (ఆగచ్ఛన్తమ్) 'ఏకస్స్వాదు నభుఞ్జీత' ఒకఁడే తీయని పదార్థమును భుజింపరాదు' అన్నట్లు అతఁడు వీథిలో వచ్చునపుడు మేమే కాక నాపుత్రమిత్రకళత్రాదులతోఁ జూచెద మనుట. (రామం) సౌందర్యముచే జనులమనస్సును రంజిల్లఁ జేయురామునిని, (ఛత్రావృతాననం) దృష్టిదోషము లేకుండునట్లు గొడుగుచేత కప్పఁబడినముఖము గలవానిని-గొడుగుచే ముఖము కొంతకనఁబడుచు కొంతకనఁబడక యుండుటచే ముఖమునంతయు చూడవలెనను అభిలాష పుట్టించుచున్నరామునిని-లేక, గాలియెండలకు వాడకుండునట్లు అంతరంగులయినవారిచే ఘనచ్ఛత్రపుగొడుగున కప్పఁబడినమొగము గలవానిని-లేక 'ఏకచ్ఛత్రాం మహీం భుక్త్వా' అనుసాముద్రికోక్తిలక్షణము చొప్పున సకలరాజులవిజయమును సూచించుశ్వేతచ్ఛత్రము చేత మిక్కిలియు ప్రకాశితమైనముఖము గలవానిని, (రఘువీరం) అనుటచే ఏనుఁగుమీఁద సూర్యాంశునప్పటివీర్యవిశేషము సూచితము, (మహాబలమ్) అనుటచే మదపుటేనుఁగునైన తృణీకరించి యెక్కిపోవఁ జాలినవాఁ డనుట. సూచితము. (రామం) తన సౌందర్యముచేత గజమును అలంకరించునట్లున్నవాఁడు, (ఛత్రావృతాననమ్) తనముఖకాంతిమండలముచేత నెట్లో అట్లే ఛత్రాగ్రముచేతను జనించినసౌందర్యము గలవాఁ డనుట. ఇట్లు అభిషేకానంతరము గలుగు సౌందర్యశోభాది విశేషణములను వర్ణించుటచే అభిషేకము చేయవలయునను జనుల యభిప్రాయము వ్యంజితము.

† "నేను చెప్పినంతనే మీరు రాముని పతిగాఁ గోరుటను జూడఁగా 'హింసకుఁడైన యీదశరథుని దారితప్పి రాముని పాల ఎప్పుడుపడుదుమా' అని మీరు ఆక్రోశించునట్లు తోఁచుచున్నది. మీరిట్లు కోరుట నాపాలనము మంచిది కాదనియో, రాముఁడు నాకంటె గుణాధికుఁడనియో, యని తెలియక సందేహపడుచున్నాను" అని దశరథుని యాశయము.

‡ ఇందులకు మూలము 'బహవో నృప కల్యాణగుణాః పుత్రస్య సన్తి తే' దీనికి విశేషార్థము-(నృప) మనుష్యులను పాలించువాఁడా. ఈసంబోధనముచేతనే దశరథునికిని రామునికిని గలతారతమ్యము సూచితమైనది. నీకు నరులను పాలించుట యనుగుణ మొకటే మాత్రము కాన్నది. రామునియందు కల్యాణ

లు గలవు.*దేవా! ప్రశస్తము లగు పెక్కుగుణములు గలిగి దేవతలతో సమానుడై బుద్ధిచే రాజిలుచున్న రాముని గుణములు ప్రియములై సంతోషజనకములుగానున్నవి. ప్రసిద్ధములైనయాగుణములను, నీ వడుగుటచే ఇపుడు చెప్ప వలసినతఱి వచ్చినది గాన అన్నిటిని చెప్పెదము వినుము. అతండు అమానుషము లైనశౌర్యవీర్యాదిగుణములందు ఇంద్రునికి సాటియైనవాఁడు; బీఱువోనిపరాక్రమముగలవాఁడు; ఇక్ష్వాకువంశీయు లందఱికన్నను మిక్కిలియధికుఁడు; లోకమున రాముఁడే సత్పురుషుఁ డనవచ్చును; సత్యమందును ధర్మమునందును మిక్కిలియాసక్తుఁడైనవాఁడు; ధర్మమును తత్ఫలమైనసంపత్తియు రామునియొక్కనివలననే చక్క నిష్పన్నములైనవి. మఱియొక్కరితోడు లేక రాముఁడొక్కఁడే వానిని నిగ్రహింపనేర్చును. అతఁడు ప్రజలకుసుఖము గూర్చుటయందు చంద్రునివంటివాఁడు; క్షమాగుణములందు భూమికిసాటియైనవాఁడు; బుద్ధియందు బృహస్పతికి సమానుఁడు; పరాక్రమమునను దేవేంద్రుఁడు;సకల

గుణములు పెక్కులున్నవి (తేపుత్రస్య) నీకొడుకునకు అని చెప్పఁబడెను రామునికి అట్టిగుణబాహుళ్యము నీకడుపున బుట్టుటచేత నే కలిగినదనుట.(గుణాః)అని బహువచనముచేత నే గుణములు పెక్కులు అనుట సిద్ధింపఁగా మరల (బహవః) అనుట, అవి లెక్కపెట్టరావని సూచించుటకొఱకని తెలియునది. (పుత్రస్యగుణాః)కొడుకునకు గుణములు అని గుణములు జన్మసిద్ధములుగాఁ జెప్పుటచే అవి స్వాభావికములైనవని తెలుపఁబడినవి, (కల్యాణాః) సకలహేయములకును విరోధులైనవి. తాము శుభములైనవిగా నుండుటయేకాక దుష్టములైనవానిని చేరనీక పరిహరించునవియు అగు ననుట. ఇట్లు రామునకు 'స్వాభావికానవధికాతిశయాసంఖ్యేయకల్యాణగుణగణత్వము' చెప్పఁబడినది. 'రాముని గుణములకు పరవశులమై యభిషేకమును జేయుఁ జెప్పితిమి. కాని చేయవలసినపనితలఁచి చెప్పినవారము గాము' అని జనులఆశయము.

*ఇందుల సమూలము 'గుణాన్ గుణవతో దేవ దేవకల్పస్య ధీమతః। ప్రియానానన్దనాన్ కృత్స్నాన్ ప్రవక్ష్యామోద్యతాన్ శృణు' అనికి విశేషార్థము:- (గుణవతః గుణాన్) గుణములు గలవాఁడైన రామునియొక్క గుణములు-అనుటచే, గుణములు అతనియందు ఆరోపితములైనవి కావనియు స్వాభావికములేయైనవనియు సూచితము.(దేవకల్పస్య) దేవతాసమానుఁడైన రామునియొక్క-అనుటచేత ఇట్టిగుణములు రామునియందు సంభావితములే-ఉండఁగూడినవే-యనిసూచితము. (ధీమతః) బుద్ధిమంతుఁ డగురామునియొక్క-అనుటచే బుద్ధియనిత మైన జ్ఞానముచెప్పఁబడినది.(గుణవతః)అనిగుణములుగలవాఁడుగా చెప్పినప్పుడే గుణమైనజ్ఞానమును చెప్పఁబడియుండఁగా, తిరుగ 'ధీ' అని దానిని చెప్ప నేలయనఁగా 'బ్రాహ్మణులువచ్చిరి; వసిష్ఠుఁడును వచ్చెను' అనుచో బ్రాహ్మణులయందు వసిష్ఠుఁడు అంతర్భూతుఁడై యుండఁగా మరలనతనిని చెప్పుట యెట్లు అతనికి ప్రాధాన్యము చూపునో అట్లే జ్ఞానమును మరల వేఱుగాఁ జెప్పుట దానిప్రాధాన్యము చూపుటకేకాని పునరుక్తిగాదు. గుణములు,(ప్రియాన్)అనుటచే కల్యాణములైనవనియు,(కృత్స్నాన్)అనుటచే లెక్కింప రానివనియు, చెప్పఁబడినవి. (అద్య)ఇప్పుడు-అనుటచే ఇంతవఱకు నీవు అడుగనందున మేము చెప్పలేదు. ఇప్పుడు అడిగితివి కావున చెప్పెదమనుట (ప్రవక్ష్యామః)అని ప్రవచనమును చెప్పుటచే భగవద్గుణములను ఉపదేశించుటయందు అందఱును అధికారులే; తెలిసినవానికెుద్ద తెలియనివాఁడును వినవలసినదేయని తెలియనైనది. (శృణు) వినుము. రాముని గుణములను వింటివేని నిరతిశయానందపరవశుఁడవై మైమఱచిపోదువు కావున మనస్సు చిక్కఁబట్టి హెచ్చరికతో వినవలయును అని సూచితము.

ధర్మములను దెలిసినవాఁడు; సత్యసంధుఁడు; తక్కువవారితోనైనను మిక్కిలియు కలసి మెలసి యుండుశీలము గలవాఁడు; అసూయ లేఁడు; ఆశ్రితులయపరాధముల క్షమించువాఁడు.ఇంతేకాదు.అతఁడు కుపితులను దుఃఖితులను చల్లనిమాటలచేత నూఱట పొందించువాఁడు;ఇంపుగాను మాటలాడువాఁడు;ఇతరులు గోరంతయుపకారము చేసినను కొండంతగాఁ దలఁచుకొనువాఁడు; జితేంద్రియుఁడు; ఆశ్రితజనులను ఎడఁబాయుటకు వెనుదీయుమెత్తఁదనము గలవాఁడు; సులువుగా గొలువఁదగినవాఁడు; ఎన్ని సంకటములు వచ్చినను పట్టినపట్టు విడువని గట్టిమనస్సు గలవాఁడు;ఎప్పుడును కుశలుఁడు; అనసూయకుఁడు.*సకలప్రాణులకును అతఁడు ప్రియమును సత్యమును నైనమాటలే చెప్పును.మిక్కిలిశాస్త్రపరిశ్రమను గలిగి పెద్దలై యుండుబ్రాహ్మణులను సేవించును. అట్లు పెద్దలను ఉపాసించుటచేత అతనికి ఔదార్యాదిగుణములచే రాణించుకీర్తియు, పరాక్రమాదులచేఁ గలుగుఖ్యాతియు,శత్రువుల నడఁచుసామర్థ్యమును, సాటిలేక పైపయి వెలుఁగుచున్నవి. రామునకు, దేవతలును రాక్షసులును మనుష్యులును ఉపయోగించునస్త్రము లన్నియుఁ జక్కఁగా దెలియును. అతఁడు చక్కఁగా వేదాధ్య

* ఇందులకు'ప్రియవాదీచభూతానాం సత్యవాదీచరాఘవః। బహుశ్రుతానాం వృద్ధానాంబ్రాహ్మణానాముపాసితా' అనిమూలము దీనికివిశేషార్థము-(సత్యవాదీచ ప్రియవాదీచ)సత్యమును చెప్పువాఁడైనను 'సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియమ్' అన్నట్లు కేవలసత్యము నేకాని కేవలప్రియము నేకాని చెప్పక సత్యమును ప్రియమును రెండు నైనదానినే చెప్పుననుట. చకారముచేతప్రియమునైనను అసత్యము గానుండినచో చెప్పఁడనుట సూచితము. (ప్రియవాదీ)మంచువేసవిని ద్రాఁగినచోట మిక్కిలివర్షముకురియుమేఘమువలె మిక్కిలి చల్లనిమాటలు మాటాడువాఁడనుట. ఇట్టిమాటలు అంతఃపురస్త్రీలతోను తలిదండ్రులతోను వయస్సున నైన పెద్దలతోడను మాత్రమే కాదు, (భూతానాం) సామాన్యముగా అన్నిప్రాణులతోను అట్లు మాటలాడుననుట. (సత్యవాదీచ) అంతటను ప్రియమును మాత్రమే కాక సత్యమునైనదానిని-భూతములకుహితమును ప్రియమును అయినదానినే-చెప్పుననుట. (రాఘవః) రఘువంశమునఁ బుట్టినవాఁడు-రఘుదిలీపసంవాదాదులందు ప్రియమును సత్యమునైనదానినేమాటాడుట రఘువంశ్యులందు ప్రసిద్ధముగానున్నది. కావున ఇట్లు మాటలాడుట వారి కులాగతమైనధర్మమే యని తెలియుచున్నది.ఇట్లు మాటాడవలయుననెడిజ్ఞానము కేవలపుస్తకములను చదువుటచేతఁగాని తన్నుపండితుఁడుగా తలఁచుకొనుటచేతఁగాని కలిగినదిగాదు, (బహుశ్రుతానాం) పెక్కుఆచార్యులయొద్ద పెక్కుశాస్త్రములను పెక్కువిధములను గఱచినవారైన, (వృద్ధానామ్)శీలముచే వృద్ధులైనవారైన,(బ్రాహ్మణానాంఉపాసితా) బ్రాహ్మణులను సేవించుటచేతఁ గలిగినది ఇట్లు మాటలాడుగుణము గలిగియున్నాఁడని గర్వమునొంది యున్నాఁడా యనఁగాలేదు. తనకుఁ గలిగినగుణసంపత్తికి తృప్తిచెందక మీఁదుమిక్కిలి జ్ఞానము సంపాదించుటకై (బహుశ్రుతానాం వృద్ధానామ్) జ్ఞానవంతులపండితులకుఁబోయి, పెక్కుపువ్వులనుండి సారము దీయుతుమ్మెదవలె పెక్కండ్రవలన సారమును గ్రహించినవాఁడనుట. (బ్రాహ్మణానాం)'సావిద్యా యావిముక్తయే-మోక్షముకొఱకైన విద్యయేవిద్య' అన్నట్లు బ్రహ్మవిద్యానిష్ఠులైనవారినే కాని, 'విద్యాన్యాశిల్పనైపుణమ్' అన్నట్లుఇతరశిల్పాదివిద్యానిష్ఠులైనవారిని కాదనుట. (ఉపాసితా) వారిగృహములకు పోయి అనువర్తించునేకాని తనగృహమునకు రప్పించి వినువాఁడు గాఁ డనుట.

యనముసేసి వ్రతములాచరించి సమావర్తనము చేసికొన్నవాఁడు. సంప్రదాయపద్ధతిని వేదములను వానియంగములతోడ నెఱుఁగును. అతఁడు సంగీతమునందు భూమిలో నెల్లవారికి తలమిన్న; అతనిమాతృపితృవంశములు రెండును పరిశుద్ధములైనవి. వంశమునుబట్టియే కాదు; అతఁడు తనంతటను పరిశుద్ధుఁడు; ఎట్టికలఁతలయందును మనస్సుకలఁకనొందఁడు; మిక్కిలియు బుద్ధిమంతుఁడు; ధర్మార్థములను ప్రతిపాదించుటయందు సమర్థులును ఉత్తములు నైన బ్రాహ్మణులవలన చక్కఁగా శిక్షితుఁడైనవాఁడు. మఱియును గ్రామము మేలుకొఱకుఁగాని, పట్టణపు ప్రయోజనమునకై కాని, యుద్ధము సంభవించినపుడు లక్ష్మణునిం గూడిపోయి గెలుపు నొందక మఱలిరాఁడు. అట్లతఁడు యుద్ధమునుండి గెలుపునొంది మఱలి యేనుఁగునుగాని రథమునుగాని యెక్కి పట్టణమునకు వచ్చి యెప్పుడును పట్టణజనులను తనజనులవలెఁ జూచుచు, తండ్రి తనధర్మపత్నికిఁ బుట్టినకొడుకుల నడుగునట్లు 'మీకొడుకులు క్షేమమా? అగ్నిహోత్రములు జరుగుచున్నవా? మీభార్యలు ప్రేమతో వర్తింతురా? భృత్యులును శిష్యులును ఆజ్ఞ దప్పక నడచుకొందురా?' అని యాతఁడు పురపురుషులను అడిగి క్షేమము లరయును. మఱియు నాపురుషులలో యువకుఁడు తమ్ముఁ జూచి 'మీశిష్యులు మీరు పంపిన కార్యములను తడవులేక తోడనే పూని చేయుచు మిమ్ముఁ గొలుచుచున్నారా? అధ్యయనము చేయుచున్నారా?' అని యెప్పుడు నడుగుచుండును. మఱియు నతఁడు ధనికుఁడనియు దరిద్రుఁడనియు బ్రాహ్మణుఁడనియు శూద్రుఁడనియు భేదమును పాటింపక మనుష్యులందెవరికేనియుఁ గష్టములు గలిగెనేని 'కష్టా! నాపరిపాలనము సరిగాకుండుటచేఁగదా వీరి కిట్టివి సంభవించె'నని వారికంటెను మిక్కిలియు దుఃఖితుఁ డగును. మఱి వారికి పుత్త్రజననాదికము లైనయుత్సవములు గలిగినను, తండ్రి తనకొడుకుల కుత్సవములు గలిగినపుడు సంతోషించునట్లు, తాను వారికంటెను మిక్కిలియు సంతసపడును. అతఁడెట్టి సంకటములు వచ్చినను సత్యమే పలుకువాఁడు; మంచివిలుకాఁడు; పెద్దలను సేవించువాఁడు; ఇంద్రియనిగ్రహము గలవాఁడు. అతఁడు ముందు చిఱునవ్వు నవ్వుచునే మాటాడును; సర్వవిధముల ధర్మమునే యాశ్రయించి యెన్నికష్టములు వచ్చినను దానిని విడువఁడు. ఆశ్రితులకు శ్రేయమును చక్కఁగా నొడఁగూర్చువాఁడు. ప్రేలుట గాని కలహపుమాటలుగాని యతనికి నింపుగావు. వాదము సేయఁగెనా అతఁడు పయిపయి యుక్తులను బృహస్పతివలె నుపన్యసించును. సాగి సైనకనుబాహువులును యెఱ్ఱనైన వాలుంగన్నుఁగవయుఁ గలిగి ఆరాముఁడు లోకాభిరాముఁడై, మరణమునకు వెనుదీయనిశౌర్యమునను, తాను విస్మృతిపడకయే యెదుటిని గెలుచువీర్యమునను, మంచియుత్సాహముతో పరుల నాక్రమించుపరాక్రమమునను, విష్ణుదేవుఁడే యిట్లు మనుష్యత్వము నొంది తానయ్యెనో యనఁదగియున్నాఁడు. ప్రజలను పాలించురీతి యతఁడు చక్కఁగా నెఱుఁగును. ఇంద్రియచాపల మతనికి కలుగదు ఒక్కఁడేమూఁడులోకములనైనను పాలింప శక్తుఁడు. ఇఁక నీభూమాత్రమును పాలించుట అతని కెంతపని? అతఁడు

కోపించెనా కోపముగలిగించినవానిని దూలింపకమానఁడు; దయకలిగెనా దయకుఁ బాత్రుఁడైనవానిని ధన్యునిఁజేయకవిడువఁడు. కాఁబట్టి యతనికోపముగాని, యనుగ్రహముగాని యెప్పుడును నిరర్థకముగాదు. న్యాయముచొప్పున చంపఁదగినవారిని తప్పక చంపును; చంపరానివారియెడల కోపముగూడచూపఁడు.ఎవనిదెస సంతోషమునొందునో,వాఁడు కోరినవానినంతయు నొసఁగును. రామునిగుణములు శాంతిప్రధానములైనవి; సర్వప్రజలకును అభిలషింపఁదగినవి; కావుననే యందఱికిని ప్రీతికరములైనవి. మంచువేసవిని సూర్యుఁడు కిరణములచేతంబోలె, ఇట్టిగుణములచేత నతఁడు ప్రకాశించుచుండును. ఇట్టిగుణసంపత్తిగలిగి పరాక్రమంపుపనచే అతిశయిల్లి, దిక్పాలురకు సాటియైనరాముని భూమి (భూప్రజ) ప్రభువుగాఁ గోరినది. నీవు చేసికొన్నభాగ్యమున జనులకు శ్రేయస్సొసఁగుటకు ఈగారాబుకొమరుఁడు నీకుఁ బుట్టినాఁడు. నీయదృష్టముననే యితఁడు,మరీచికొడుకైనకాశ్యపునివలె, పుత్రున కుండవలసినగుణములుగలిగియున్నాఁడు. దేవతలును, రాక్షసులును, ఋషులును, గంధర్వులును, ఉరగులును, ఇతరదేశజనులును, ఇతరపట్టణవాసులును,అంతఃపురములోనివారును, వెలుపలివారును, మనదేశములను పట్టణములను గలుగుజనులును, అందఱును ప్రసిద్ధశీలుఁడగురామునకు బలమును ఆరోగ్యమును ఆయువును గలుగవలయునని ప్రార్థింతురు.*నయనుచెల్లిన స్త్రీ

---

*ఇందులకు 'స్త్రియో వృద్ధాస్తరుణ్యశ్చ సాయంప్రాతః సమాహితాః। సర్వాన్ దేవాన్నమస్యన్తి రామస్యార్థే యశస్వినః' అనిమూలము. దీనికి విశేషార్థము—(స్త్రియః) మిక్కిలి గాంభీర్యము గలవారగుటవలని మనస్సునందలి యభిప్రాయమును స్పష్టముగా బయలుపుచ్చని స్త్రీలును—ఇట్టివారైనను రామునియందు తమకుఁ గలప్రేమను బట్టఁజాలక దేవతానమస్కారములచేత దానిని వెలిపుచ్చిరని తెలియునది.(వృద్ధాః) ముసలివారు - అనఁగా మాటపాటలను జేసినవారగుటచే అలసత్వముగలిగి ఏకార్యమునందును ఆసక్తిని చేయకుండువారనుట-ఇట్టివారయ్యును రామునియందలి ప్రేమాతిశయముచే ఓపిక నొందయతని కొఱకు దేవతానమస్కారములు చేసిరనుట. (తరుణ్యః) వయసుకత్తెలు-యౌవనమదాంధలగుటచే తగినవివేకము లేనివారు-ఇట్టివారయ్యును రామవిషయమైన అధికప్రేమచేత అట్టిపురుషుని అభ్యుదయముఁగోరి దేవతానమస్కారములు చేయుటయుక్తమని తెలిసి యట్లుచేసిరనుట,(సాయంప్రాతః)ఇది మధ్యాహ్నమునకును ఉపలక్షణము-మూఁడుసంధ్యలయందును అనుట,(సమాహితాః)ఎచ్చరిక గలవారు-రామగుణములకు వశులై మనఃపూర్వకముగా అట్లు చేసిరని ప్రేమాతిశయము సూచితము,(రామస్యార్థే) రామునిప్రయోజనమందు—రామునకు అభ్యుదయము కలుగుటకు అనుట-స్వప్రయోజనముకొఱకుఁ గాదనుట, (సర్వాన్ దేవాన్)సమస్తదేవతలను-ప్రేమాతిశయమువలన పొరపడుటచేత, ఈదేవత యెక్కువ ఇది తక్కువ ఇది వేదోక్తమైనది ఇది సామాన్యమైనది అను తారతమ్యములను జూడక,అన్నిదైవములకును మ్రొక్కినారు. ప్రేమాతిశయముచేత నైనను తెలియుచున్నది. రాముని చేరక్షింపఁబడు దేవతలను రామునిని రక్షించుటకై మ్రొక్కుట ప్రేమాంధత్వము మొక్కి యుల్ల. (యశస్వినః) ఇది దేవవిశేషణము-కోరినవరములు ఇచ్చుటచే కీర్తిగాంచిన దేవతలనుట; స్త్రీవిశేషణమేని—దేవతాంతరములకు మ్రొక్కుట స్వరూపవిరుద్ధమైనను రాముని యభివృద్ధియందు పర్యవసించుటచేతను రామునియందలి ప్రేమపారవశ్యముచే చేయఁబడుటచేతను స్వరూపవిరుద్ధము కానేరదు - కావున స్వరూపవిరుద్ధమైనదానిని చేసినారనెడి అపయశస్సు ఆస్త్రీలకు లేదు, యశస్సేకలదనుట.

లును యౌవనము గలిగిన పండితులును, ఇష్టార్థములను నొసంగుటచేఁ బొగడ్తగన్న దైవములను అన్నిటిని, రేపును మాపును రాముని యభ్యుదయమునకై యెచ్చరిక గలిగి నిచ్చలు మ్రొక్కుదుము. వారు యాచించు రామాభిషేకమును, దేవా! నీయనుగ్రహమున సఫలమగుఁగాక. కలువపూవులవలె నల్లనై, ఎల్లపగవారి నడఁగింపఁజాలిన రాజరాజకుమారుఁడగు నీరాముని యువరాజుగా నుండఁ జూతుము. దేవా! నీవు కోరినవరమునిచ్చువాఁడవు. దేవదేవుఁడగు విష్ణునకు సాటియై, జగత్తునకెల్ల హితము సేయుటకై పూని, యుదారగుణములు గొలువ, ఔదార్యము చెలువుచూప, ఏపారుచున్న రాముని, నీగారాబుకుమారుని, మాహితముకొఱకు సంతోషముతో శీఘ్రముగా రాజ్యమునం దభిషేకించుట నీకుఁ దగును. ఇది రెండవసర్గము.

---

## పట్టాభిషేకసంభారములు సమకట్టుట.

ఆసభ్యులు తామరమొగ్గలవలె చేమోడ్పులఁ గీలించి చేయునమస్కారములను రాజు ప్రతిగ్రహించి, ప్రియముగాను పథ్యముగాను వారలతో 'మీరు ప్రియుండైన నాపెద్దకుమారుని రాముని యువరాజుగా నుండఁ గోరుచున్నారు. నాకుఁ జాల సంతోషమైనది. ఆహా! నాభాగ్యమునకు సాటిగలదా? లేదు' అని చెప్పి, సభ్యులైన యాబ్రాహ్మణులను మధురవచనముల గౌరవించి వారలు వినుచుండఁగానే వసిష్ఠునిని వామదేవునినిజూచి *'ఇప్పుడు వచ్చియుండు చైత్రమాసము మిక్కిలియు రమణీయంపు సొంపు గులుకుచున్నది; ఇట్టిమంగళకార్యములకు తగినట్లు పవిత్రమైనది; అడవులును పుష్పించియున్నవి. రామునికి యౌవరాజ్యము గట్టుటకు కావలసినవానిని అన్నింటిని సమకట్టుఁడు' అని చెప్పెను. రాజుమాట చెప్పిముగింపఁగానే 'చిరకాలముగా రామాభిషేకమును జూడవలయు నన్నకోరిక యొనఁగూడెను గదా' యనిసంతోషాతిశయమున జనులు మిక్కిలియు ధ్వని గావించిరి. ఆజనఘోషము మెల్లమెల్లగా నిమ్మళింపఁగానే దశరథుఁడు వసిష్ఠమునినాథుని వామదేవునినిజూచి 'మహాత్ములారా! రామునియభిషేకమునకు ఏయేకర్మములు సేయవలయునో వానికి ఏయేయుపకరణములు కావలయునో అవియంతయు నిపు డానతీయవలయును' అనియె. రాజుమాట విని విప్ర

*ఇందులకు 'చైత్రః శ్రీమానయం మాసః పుణ్యః పుష్పితకాననః' అని మూలము—దీనికి విశేషార్థము—(చైత్రః) చైత్రము-ఇతరులకంటె రాముఁడట్లో అట్లు ఇతరమాసములకంటె చైత్రము ప్రధానమైనది. (అయం మాసః) ఈమాసము-మనము రామాభిషేకమును గోరిన సమయమునందే సన్నిహితమైనది. (అయం మాసః) దీనిరాకయే అభిషేకమునకు హేతువు. (శ్రీమాన్) అందఱికిని సుఖావహుఁడగుటచేత రాముఁడు అందఱికిని ఎట్లు రాజగునో యట్లే అందఱికిని సుఖకరమగుటచే ఈమాసము అన్నిమాసములకు రాజైనది. (పుణ్యః) రమణీయమైనది, లేక - పుణ్యమును వర్ధిల్లఁజేయునది, (పుష్పితకాననః) పుష్పించిన అడవులుగలది-నగరము మనప్రయత్నముచేతనే అలంకృతమైనది. ఇది అట్లుకాక తన్నుఁదానే యలంకరించుకొన్నది. లేక రాముఁడు కనకకిరీటమును ధరించుసమయమున తానుపువ్వుకిరీటమును ధరించినది.

వరుఁ డగువసిష్ఠుఁడు వామదేవునింగూడి, రాజుముందట చేతులు మొగిచి నిలుచుకొని యున్న రాజకార్యనియుక్తులై నయధికారులను సుమంత్రాదులను జూచి 'మీరు బంగారము మొదలగువానిని, రత్నములను, తెల్లని పుష్పమాలికలను, పేలాలను, మఱియు వేలువేలుగిన్నెలయందు తేనియను, నేయిని, ఒకింతి యుదికిన క్రొత్తమడుఁగువస్త్రములను, రథమును, సర్వాయుధములను, చతురంగసైన్యమును, సులక్షణలక్షితమైన గజమును, వీవనవలె నుపయోగించు రెండు తెల్లనిచామరములను, ధ్వజమును, తెల్లనిఛత్రమును, నిప్పువలె మెఱుఁగుల గుప్పించునూఱుబంగారుకుంభములను, బంగారుకప్పు వేసినకొమ్ములు గలవృషభమును, అవయవము లన్నియు పూర్ణముగాఁ గలపులితోలును, తెలతెలవాఱునప్పటికి దశరథునియగ్నిహోత్రగృహమునం జేర్పుఁడు. ఇవి గాక తక్కినగంధపుష్పాదిమంగళద్రవ్యములు కొన్ని యేవేవి కావలసి యుండునో వానిని అన్నిటినిగూడ సమకట్టుఁడు. రాజగృహద్వారములందును నగరద్వారము లన్నిటను, మంచిగంధము చల్లి పూలమాలికలు గట్టి గుమగుమవాసనలు బుగులుకొన ధూపపుపొగలు వేయుఁడు. నూఱువేలకొలఁదిని లెక్కింపరాక బ్రాహ్మణులెందఱు వచ్చినను అందఱికిని యథేష్టముగా మిక్కిలి చాలునట్లు మేలైనయన్నమును పాలు పెరుఁగులతో సంస్కరించి వ్యంజనములు గూర్చి సమకట్టించి రేపువెందలకడ ఆబ్రాహ్మణోత్తములను సత్కరించి ఆయన్నమును ఒసఁగుఁడు. మఱియు వారికి నేయును, పెరుఁగును, పేలాలును, పుష్కలముగా దక్షిణయు, నొసఁగుఁడు. రేపు సూర్యుఁ డుదయించినతోడనే స్వస్తివాచనము జరుగును. కావున బ్రాహ్మణులను బిలిపింపుఁడు. వారికి ఆసనములను కల్పింపుఁడు. అందందు టెక్కెములను గట్టింపుఁడు. రాజమార్గమును నీరు చల్లి తడుపునట్లు చేయుఁడు. రాజనగరునందు లోపలితోట్టికట్టున అభిషేకమునందు ప్రసిద్ధిలు బ్రాహ్మణు లుందురు గాన, రెండవతొట్టికట్టునందు నటులును గాయకులును భోగమువాండ్రును చక్కఁగా నలంకృతులై వచ్చి యుండవలయును. అన్నమును పిండివంటలును పెట్టుమనుష్యులను, దక్షిణ లిచ్చువారిని, పుష్పమాలికల నొసఁగువారిని, వేలువేల పంపి దేవాలయములందును చతుష్పథములందును (నాలుగుత్రోవలు కలియుస్థలములందును) రాజమార్గమందలి వృక్షముల కడను నిలిపి బ్రాహ్మణాదులకు దక్షిణలను భక్షణాదులను నిచ్చునట్లు చేయవలయును. భటు లందఱు నిడుదకత్తులను నడుమునఁ గట్టి, కవచంబులు దొడిగి, మడుఁగువస్త్రములు దాల్చి, రామాభిషేక మనెడిమహాభ్యుదయము జరుగు రాజగృహము ముందటఁ జొచ్చి యుండవలయును' అనిరి. ఇట్లు కార్యమునందు దృఢనిష్ఠ గలయీబ్రాహ్మణశ్రేష్ఠు లిరువురును అచటఁ దాము చేయవలయుకార్యములను మంత్రుల కానతిచ్చి, దాసీపరిజనాదులను రప్పించుట మొదలైనమిగిలిన కార్యములను గూడ రాజునకుం దెలిపి నెఱవేర్చి, పిదప 'కార్యము లన్నియుఁ జేసితి' మని మనస్సున సంతసము మీఱ, మేనును ఆసాంపున గరుపాఱ, రాజును దగ్గఱి 'నీవు చెప్పిన

మాటచొప్పున అంతయును జేసి యైన'దనిరి. అంత రాజు రామాభిషేకంపుసొంపున కాంతి పెంపారుచు సుమంత్రునిం జూచి 'నీవు పోయి సుశిక్షితమతియగు రాముని వేగ దోడ్కొనిరా'మ్మనియె. ఆసుమంత్రుండును 'వల్లె' యని రాజాజ్ఞచొప్పున చని, రథికజనలలాముని రాముని రథము నెక్కించుకొని యచ్చటికిఁ దోడ్కొని వచ్చెను. సుమంత్రుండు రామునికొఱకుఁ బోయినపిదప ఆకొలువుకూటమునఁ గూర్చుండినపూర్వదేశపు రాజులును, ఉత్తరదేశపురాజులును, పడమటిదేశపుభూమీశులును, దక్షిణదేశపురాజులును, మ్లేచ్ఛప్రభువులును, మఱియు వనములందు పర్వతప్రదేశములందును వసించు నాటవికులును, అందఱు నపుడు దేవతలు దేవేంద్రుం గొలుచునట్లు, దశరథమహారాజును గొలిచిరి. దేవతలనడుమ వెలుగుచున్నయింద్రునివలె, ఆరాజులనడుమ విలసిల్లుచున్న దశరథుండు, మేడపైనుండి రాజమార్గమున రథమునెక్కి వచ్చుచున్న రామునిఁ జూచెను. ఆరాముఁ డెట్టివాఁడు! భోగపరాయణము లగురూపవేషములందు గంధర్వరాజునంటివాఁడు; భోగపరంపరలయందు రసికుఁడేకాని వీరరసముఁ దెలిసినవాఁడు గాఁ డనరాదు. అతఁడు లోకమునఁ బ్రసిద్ధి గాంచి మించుపరాక్రమము గలవాఁడు. అట్టిపౌరుషమునకు అనురూపములైన నిడుదబుజములు గలనెమ్మేనును అతనికిఁ గలదు. తిరిసెనపుఁబువ్వువలె సుకుమారమైనమేను గలిగియుండుటచే లోపల సారము గలవాఁడు కాఁడనరాదు; మహాబలము గలవాఁడు. అట్టిబలిమికలిమి పొంగారునట్లు మదపుటేనుఁగునవలె గరువంపుఁగులుకుతోడి మెల్లనినడక గలవాఁడు. రాముఁడు చందురునికంటెను మిగులసుందరమైనమొగము గలిగి, ఎంతచూచినను మఱిమఱి వింతవింతగ నింపుసొంపులు గులుకుచు నగవడుచుండును. మఱియు నతఁడు సౌందర్యమునను ఔదార్యమునను సౌశీల్యమునను, స్త్రీలనే కాదు, పురుషులను గూడ, వారిచూడ్కులను మనస్సును హరించి మోహింపఁజేయువాఁడు. వేసవియెండవేఁడిమిని గ్రాఁగిన జనులకు చలువ గూర్చుమేఘమువలె ప్రజలకు చల్లఁదనము దొరయించువాఁడు. ఇట్టి యారాముఁడు వచ్చుచుండఁగా రాజు, మేడనుండి యెడతెగక యెంత చూచుచున్నను, ప్రతిక్షణమును అనుభవమువలన ప్రేమరసము క్రొత్తక్రొత్తగా నిగుడుచుండుటచే, చూచి తృప్తినొందఁడయ్యె. సుమంత్రుఁడు ఆరాముని రథమునుండి కైదండ యొసఁగి దించి ఆకుమారుఁడు తండ్రియొద్దకుఁ బోవుచుండఁగాఁ జేతులు మొగిడ్చికొని యతని వెన్నంటి పోయెను. పురుషలలాముఁ డారాముఁడును సుమంత్రునితోడ రాజును జూచుటకై కైలాసశిఖరమువలె పొడవై తెల్లగా మెఱయుచున్న రాజగృహముపైకెక్కిపోయి చేతులు మొగిడ్చికొని తండ్రిసమీపమునకుం బోయి వినమ్రుఁడై 'నేను రామవర్మను' అని తనపేరు వినిపించుచు తండ్రిచరణములకుఁ బ్రణామము చేసెను. దశరథుఁడు తనకుఁ బ్రణమిల్లి ప్రాంజలియై ప్రక్క నున్నప్రియకుమారునిం జూచి యతని యంజలిం బట్టి దగ్గఱకుఁ జేరఁదీసికొని కౌఁగిలించి యతనికి, ఉన్నతమును దివ్యమునై మణిసువర్ణభాసమానమగుచు సొగసు గులుకు మేలైనయొకయాసనము నొసఁగెను.

రాముఁడును ఆయాసనమునఁ గూర్చుండి, సూర్యుం డుదయకాలమున* మేరుపర్వతమును బొంది యాపర్వతంబును తనప్రభచే ప్రకాశింపఁజేయునట్లు, ఆయాసనమును తనకాంతిచే ప్రకాశితముగావించెను. శరత్కాలమందు స్వచ్ఛములైన గ్రహములతోను నక్షత్రములతోను గూడియున్న యాకాశమును జంద్రుఁడు మఱియును ప్రకాశింపఁజేయునట్లు, ఆప్రాసాదమునందు దశరథాదులతోఁ గూడియున్న యాసభను, తేజస్కుఁడైన రాముఁడు మిక్కిలియుఁ బ్రకాశింపఁజేసెను. దశరథుఁడు చక్కఁగా నలంకరించుకొని తన ప్రతిబింబమును అద్దమునందుఁ జూచి సంతోషించునట్లు,తనకంటె మిక్కిలియుఁ దేజరిల్లుచు సర్వావయవములందును తనకు ప్రతిబింబమువలె వెలుఁగుచున్న ప్రియకుమారుని రామునిఁ జూచి సంతోషించెను. అట్టికొడుకుఁ గన్నయతఁడే పుత్రవంతులలో మేలుబంతి గదా! అతఁడు చిఱునగవుతో 'రామా' అని పిలిచి, కాశ్యపుఁడు తనపుత్రుఁడైన దేవేంద్రునితో చెప్పినట్లు తనకుమారునితో 'నాకు మిక్కిలియుం దగిన నా జ్యేష్ఠపత్నియందు నాకుఁ దగినట్లు పుట్టినపుత్రుఁడవు; గుణంబులందును శ్రేష్ఠుండవు; మఱియు నాకుఁ బ్రియకుమారుఁడవు. ఇంతే కాక నీవు నిజగుణములచేత మమ్మును మఱి యీప్రజలను రంజిల్లఁజేసితివి. ఈకారణములఁబట్టి నీవు యువరాజత్వమునకుఁ దగుదువు. కనుక పుష్యనక్షత్రమునాఁడు యౌవరాజ్యము నొందుము. నీవు స్వభావముచేతనే యెంతయు వినయము గలవాఁడవు; గుణవంతుఁడవు; గుణములన్నియుఁ గలవాఁడగుటచే నీకు నుపదేశింపవలసిన దేమియుఁ గలుగదు. అయినను స్నేహమునుబట్టి నీకు ఒకహితము సెప్పెద వినుము. నీవు మఱియును వినయమే గలిగి యెప్పుడును ఇంద్రియనిగ్రహము దాల్చి వర్తింపుము. వెలఁది జూదము పానము మొదలైన కామమువలనఁ బుట్టువ్యసనములను, పరుసుగా మాటాడుట, క్రూరముగా దండించుట మున్నగు కోపమువలనఁ గలుగు వ్యసనములను విడువుము. నీవు సామాన్యులైన సేవకులకు దర్శన మీయక వారికి పరోక్షముగానుండి అధికారులమూలముగా ఆజ్ఞలనొసఁగి, వారిచే కార్యములు సేయింపుము; మంత్రులు మొదలైన ముఖ్యులతో ప్రత్యక్షముగా నేచక్కఁగలిసియుండి వలయుకార్యముల మెలపుచు ప్రవర్తింపుము. పరోక్షముగా నుండి చారులమూలమున అన్యదేశవృత్తాంతములఁ దెలియుచు, ప్రత్యక్షముగానుండి స్వదేశవృత్తాంతముల నెఱుఁగుచు,వర్తింపుము. మఱియును మంత్రులు మొదలయిన ప్రజలనందఱిని సంతోషింపఁజేయుము. కొట్టులందు నానావిధధాన్యరాసులను, ఆయుధశాలలందును

* సూర్యుఁడు ప్రధానమైన మేరుపర్వతమును చక్కచుట్టి వచ్చుటయే కాని చేరుటలేదు గాన ఇచట మేరువనఁగా అస్తాద్రిసమీపమునసుండు సావర్ణి మేరుగిరిగా తెలియునది. ఉదయకాలము చెప్పఁబడి యుండఁగా అస్తాద్రిదగ్గఱ మేరువు పొసఁగు టెట్లనఁగా ఉత్తరసర్గ మందున్న సిద్ధపురవాసులకు అస్తాద్రికడనే సూర్యుఁడు ఉదయము నొందుచున్నాఁడుగాన, వారిబట్టి అస్తగిరియొద్ద నున్న సావర్ణి మేరువుకడ సూర్యునికి ఉదయము చెల్లుచున్నది.

వివిధాయుధసమూహములను మెండుగా నోడఁగూర్చి దానిచేఁ బ్రజలకెల్ల నుల్లా సముగూర్చి తనకు అనురక్తులనుగాఁ జేసికొని భూమిని ఎవఁడు ఏలునో వానింజూచి వానిసామంతులు, అమృతమును గన్న దేవతలవలె, అభినందింతురు. కాఁబట్టి నీవును మనస్సును నిగ్రహించి యట్లు సేయుము' అనియె. రామునికి, ప్రియము గూర్చుచుండు చెలికాండ్రు, దశరథుఁ డతనికి యౌవరాజ్యమును గట్టుట విని త్వరితముగాఁ గౌసల్య యొద్దకుఁ బోయి యావృత్తాంతమును దెలిపిరి. ఆ స్త్రీరత్నము అట్లు తనకు 'రామా భిషేకము జరుగు'నను ప్రియవార్తను జెప్పినవారికి బంగారమును గోవులను వివిధము లైనరత్నములను నొసఁగెను. అంత రాముఁడు దశరథునకు నమస్కారముచేసి రథ మెక్కి, జనులు గుంపుగొని వచ్చి సేయుపూజలను గైకొనుచు, మిక్కిలి కాంతిచే వెలుఁగుచున్న నిజగృహమునకుఁ బోయెను. మఱియు నాపురజనులు 'రామునికి యౌవరాజ్యము గట్టెద'నని రాజు చెప్పినమాట విని తమకోరిక లొనఁగూడినట్లు అలరి దశరథునియొద్ద సెలవుపుచ్చుకొని వేగమ తమగృహములుచేరి రామాభిషేకము నిర్విఘ్నముగా నెఱవేఱవలయునని తమ యిష్టదైవముల సంతోషమునఁ బూజించిరి. ఇది మూఁడవసర్గము.



దశరథుఁడు రామునితో వేగ యభిషేకము సేసికొను మనుట.

అంతపురజను లందఱును బోయిరి. పిదప దశరథుఁడు కార్యంబుల నిశ్చయిం చువిధములందు కుశలుఁడు గాన మరల మంత్రులతోఁగూడి యాలోచించి 'రేపే పుష్యనక్షత్రము వచ్చును. కనుక ఎఱ్ఱదామరపూవులవలె నెఱ్ఱనికడగన్నులచేఁ జె న్నారు నాచిన్నికుమారుని రాముని రేపటికి యౌవరాజ్యంబునందు అభిషేకించు నది' యని నిశ్చయించెను. అంత నారాజు అంతఃపురమునకుఁబోయి సుమంత్రునిఁ జూచి 'రాముని మఱల నిక్కడికిఁ దోడ్కొనిరమ్ము' అని యాజ్ఞాపించెను. సుమం త్రుఁడు రాజుమాట శిరసావహించి రాముని మరలఁ దోడుకొనివచ్చుటకై వేగముగా నతనిగృహమునకుఁ బోయెను. ద్వారపాలకులు సుమంత్రుఁడు వాకిట వచ్చియున్నాఁ డని రామునికిఁ దెలిపిరి. అతఁడును సుమంత్రుఁడు మరలవచ్చుటను వినఁగానే 'ఇతఁడు వచ్చుటకుఁ గారణమేమొకో' యని శంకించి, సుమంత్రుని లోపలికి రప్పించి యాతనితో 'మరలి యేమిపనిగా నీవిచ్చటికి వచ్చితివి? అంతయును దాఁపక చెప్పుము' అనియె. సూతుఁ డతనింజూచి రాజు నిన్నుఁ జూడఁగోరుచున్నాఁడు. ఇంతే నాకుఁ దెలియును. రాజుచెప్పినమాట వింటివి. ఆవిషయమునందు పోవుటకుఁగాని మఱి దేనికిఁగాని నీవే నిర్ణయించుకర్తవు' అనియె. సూతుం డిట్లు చెప్పఁగా విని రాముఁడు మఱల రాజును జూచుటకు వేగముగా నగరికిఁబోయెను. దశరథుఁడును రాముఁడు వాకిట వచ్చి యుండుటను ద్వారపాలకులచే విని మిక్కిలి మేలైన ప్రియ వార్తను చెప్పఁగోరి గృహములోనికి రప్పించె. శ్రీమంతుఁ డైనయారఘుకుల

లలాముఁడు రాముఁడు తండ్రినగరును ప్రవేశించుచునే దవ్వులనుండి నమస్కరించి వినయముతో చేతులు మొగిచికొని తండ్రిని దర్శించెను. రాజు, సమీపమున వచ్చి మరల ప్రణమిల్లుచున్నరాము నెత్తి కౌఁగిలించి మనోజ్ఞమైన యాసనము నొసంగి తిరుగ నాతనితో 'రామా! నేను బహుకాలము బ్రదికి ముదిసినవాఁడనైతిని. కోరిన భోగము లన్నిటిని అనుభవించితిని. అల్లే మేలైన యజ్ఞదానములుసేయుచు అపారములైన దక్షిణ లొసఁగుచును నూఱులకొలఁదిని యాగములు చేసితిని. భూమియందు సాటి లేనిప్రియకుమారుఁడవైన నీవును నాకుఁ గలిగితివి. పెక్కుదానములు చేసితిని; యాగములు చేసితిని; అధ్యయనము చేసితిని; శాస్త్రవిరుద్ధములు కానిసుఖములను యథేష్టముగా అనుభవించితిని. *యాగములు సేయుటచే దేవతలఋణమునుండి విడివడితిని. అధ్యయనము చేయుటవలన ఋషులఋణమును, నిన్నుఁ గనుటవలన పితరుల ఋణమును, నానావిధదానములచే బ్రాహ్మణులఋణమును దీర్చితిని. సమస్తసుఖములను అనుభవించితిని గాన శరీరఋణమును దీర్చుకొన్నవాఁడనైతిని. అన్నియునైనవి. నీకు రాజ్యాభిషేకము గావించుటతప్ప మఱేమియు నాకుఁ జేయవలసినది లేదు. కావుననే నేనేమి నీకు చెప్పెదనో దానిని నాకొఱకు నీవు చేయవలయును. నాయనా! ఇప్పుడు ప్రజలందఱును నీవు రాజు కావలయునని కోరుచున్నారు. కావున నిన్ను యువరాజుగా నభిషేకింప నున్నాఁడను. ఇంతేకాక నిన్ను యువరాజుగాఁ జేయుటకు ఇంకొక కారణమును గలదు. నా కిపుడు స్వప్నమునందు భయంకరములైనయమంగళములును నుత్పాతను లగపడుచున్నవి. ఆకాశమునుండి మబ్బు లేనిపిడుగుల తోఁగూడ మాట పేనినిప్పులును పెనుచప్పుడుతో పడుచున్నవి. నాజన్మనక్షత్రమును భయంకరములైన సూర్యాంగారకరాహుగ్రహములు ఆక్రమించి యున్నవని జ్యోతిషకులు చెప్పెదరు. ఇట్టిదుర్నిమిత్తములు పుట్టునేని ప్రాయికముగా రాజునకు మరణమైనను కలుగును; కాదేని, గొప్పయాపదయైనను సంభవించును. కాఁబట్టి నీకుయౌవరాజ్యము గట్టవలయునని నాకుఁగలిగి యున్నతలంపు మాఱిపోవుటకుమునుపే నీవు అభిషిక్తుఁడవు గమ్ము. ప్రాణులబుద్ధి చంచలము కదా! కావున జాగు చేసినయెడల ఏదైన మాఱుపాటు కలుగఁ గూడును. నేఁడు చంద్రుఁడు పుష్యపూర్వనక్షత్రమైనపునర్వసును బొందియున్నాఁడు మనమభిషేకముకొఱకు నిశ్చయించుకొన్న పుష్యయోగము రేపు వచ్చునని జ్యోతిషకులు చెప్పుచున్నారు. కావున నీవు పుష్యనక్షత్రమునం దభిషి

*దేవ, ఋషి, పితృ, బ్రాహ్మ, ఆత్మ, లనఁబడుయీయైదింటికి పంచఋణములు. ఈయేవురకును ఋణపడుటయెట్లనిన:- దేవతలు ఇంద్రియములకు అధిష్ఠాతలు కావున ఇంద్రియజాతమును కలిగించి ఉపకరించుట చేతను; ఋషులువాక్కునకు ఉపకరించుటచేతను; పితరులు దేహము నిచ్చియుపకరించుటచేతను; బ్రాహ్మణులు కర్మాధీనములైన సకలసంస్కారములు సాధించి పాపమునుపోఁగొట్టుటచేతను; ఆత్మ, శరీరేంద్రియసంఘాతరూపమై జ్ఞానప్రకాశము గలిగించుటకు హేతువగుటచేతను; ఈయైదింటికిఁ జేయవలసిన ప్రత్యుపకారమే పురుషునికి ఋణము అగుచున్నదని తెలియవలయును.

క్తుఁడ వగుము.నామనసే నను వేగిరపఱుచు చున్నట్లున్నది.నీవుశత్రువులను గ్రాఁచు నట్టిదిట్టవు. ఇట్టినీకు రేపు యౌవరాజ్యాభిషేకము చేసెదను.కాఁబట్టి నీవీపగటిపూఁట మొదలుకొని మనస్సును దిటపఱిచి, దర్భపఱుపుపైఁ బరుండియుండి,భార్యతోఁగూడ ఈరాత్రియంతయు ఉపవాసముండవలయును. మహాశ్రేయస్కరములైనయిట్టిగొప్ప కార్యములకు విఘ్నములు అనేకములు గలుగును. కనుక నీచెలికాండ్రు పరాకులేక యెచ్చరిక గలిగి నిన్ను నేఁడు చుట్టునుండి సర్వవిధముల రక్షించుతురుగాక.భరతుఁడు దేశాంతరమునకుఁ బోయి యున్నాఁడు. *వాఁడు ఈపట్టణమునకు రాకుండునంతవఱకే నీయభిషేకమునకుఁ దగినకాలమని నాకుఁ దోఁచుచున్నది. నీతమ్ముఁడు భరతుఁడు మిక్కిలియు సజ్జనులయాచారములందు వర్తించుచున్నవాఁడే; అన్నయగునిన్ను అనుసరించువాఁడే; ధర్మాత్ముఁడును, దయావంతుఁడును, జితేంద్రియుఁడును, అగువాఁడే. ఇందేమియు సందియము లేదు.అయిననుసామాన్యముగా మనుష్యులచిత్తము చంచలమైన దని నానిశ్చయము.†ధర్మమునందే యెప్పుడు వర్తించుచుండుసత్పురుషులచిత్తమొ పరస్పరము చేసినయుపకారమునే తలంచి యొప్పుచుండునుగాని భేదమెంతమాత్రమును బొందదు. రఘువంశమునఁ బుట్టినసీకు ఇది తెలియనిది కాదు'అనియె. దశరథుఁ డిట్లు రేపటియభిషేకమునుగుఱించి చెప్పి పొమ్మని యనుజ్ఞ యియ్యఁగా రాముఁడు తండ్రికి నమస్కరించి నిజగృహమునకు బోయి దానిని ప్రవేశించి రాజుతనకుఁ జేయ నుద్దేశించి యున్నయభిషేకమును తల్లికిఁ దెలుపుటకై శీఘ్రమే వెడలి యామెయంతఃపురమునకుఁ బోయెను. అచ్చం డచ్చట తనతల్లి, పట్టువస్త్రము గట్టుకొని దేవతాగృహమునందు మౌనవ్రతసునొంది తనయభీష్టదైవమును ధ్యానించుచు, పుత్రునికొఱకు రాజ్యసంపదను ప్రార్థించుచుండఁగాఁ జూచెను. రాముఁడు వచ్చుటకు పూర్వమే ప్రియమైనరామాభిషేకము జరుగువార్తను విని సుమిత్ర యక్కడ వచ్చియుండె. అప్పుడే లక్ష్మణుఁడును వచ్చెను. అంత దాసీజనులచేత రప్పింపఁగా సీతయు

* దశరథుండు కేకయరాజునకు రాజ్యము నే ఓలిగానిచ్చి కైకేయిని పెండ్లాడెను. ఇది యయోధ్యాకాండమందే నూటయేడవసర్గమందు విశదమగును. ఈవృత్తాంతమును మనస్సునం దుంచుకొనియే భరతుఁడు వచ్చినయెడ రాజ్యము వానికే ఇయ్యవలసియుండునోయని శంకించి రా జీవాక్యమును చెప్పినాఁడు.

† ఇందులకు'సతాంతు ధర్మనిత్యానాం కృతశోభిన రాఘవ' అనిమూలము. దీనికి కొందఱు మఱికొన్నివిధముల నర్థముచేయుచున్నారు. (ధర్మనిత్యానాం సతాం) ధర్మనిత్యులైన సజ్జనులయొక్క, (చిత్తం) చిత్తము, (కృతశోభి) కృత=ఇతరులచే చేయఁబడిన మిత్రభేదాదులచే, శోభి=ప్రకాశించునది-ధర్మమునందు ఎడతెగక వర్తించుచుండు సత్పురుషులమనసుకూడ ఇతరులుసేయు మిత్రభేదాదులకు లోఁబడి వికారపడుననియర్థము; లేక-ధర్మనిత్యులైన సజ్జనులచిత్తము, (కృతశోభి) కృత=చేయఁబడినదానిచేత, శోభి=శోభిల్లునది- మంచిచేయఁబడినట్టి కార్యమునే అనుమోదించును. ఇఁక చేయఁబడుదానికి అనుమోదింపదు కాఁబట్టి, భరతుఁడు ఎంతధర్మనిత్యుఁడైన సత్పురుషుఁడైనను తానురాకమునుపే నీయభిషేకము జరిగియుండినయెడల సంతోషించునుగాని తానువచ్చినవెనుక అది జరగనున్నయెడల ఒకవేళ అనుమోదింపక అడ్డిచెప్పఁగూడు నని తాత్పర్యము.

వచ్చియుండెను. అపుడు కౌసల్య పుష్యనక్షత్రమందు తనపుత్రునియౌవరాజ్యాభిషేకము జరుగుట విని, సుమిత్రయు సీతయు లక్ష్మణుఁడును గొలువఁ గొడుకునకు మంగళాభివృద్ధికై ప్రాణాయామపూర్వకముగా పురుషసూక్తప్రతిపాదితుఁడగు నారాయణుని ధ్యానించుచు కన్నులు మూసికొని యుండెను. అట్లు మంచినియమము పూని యున్నతల్లియొద్దకు రాముఁడు పోయి నమస్కరించి యపు డామెకు సంతసముగూర్చుచు, 'తల్లీ! ప్రజలను పాలించుకృత్యమునకు తండ్రి నన్ను నియోగించెను. అతనియాజ్ఞచొప్పున రేపు నాకు యౌవనరాజ్యాభిషేకము జరుగఁగలదు. సీతయు నాతోఁ గూడ నేఁటిరాత్రి యుపవాసముండవలయును. ఇది నాయంతట చెప్పునది కాదు. ఇది తండ్రియు ఋత్విజులును ఉపాధ్యాయులును నాకుఁ జెప్పిరి. రేపు అభిషేకముజరుగునపుడు చేయఁదగినమంగళకార్యములను అన్నింటిని నాకును సీతకును ఇపుడు చేయింపు'మనియె. కౌసల్య చిరకాలముగాఁ గోరుచుండినయీయభిషేకవార్తను వినఁగానే సంతోషబాష్పము లుప్పతిల్లఁగా దానిచే తొట్రుపడుచుతీరుపలుకుల రామునితో 'నాయనా! రామా! చిరకాలము జీవింపుము. నీపగవారు హతులగుదురుగాక. నీవు రాజ్యలక్ష్మిఁగూడి నాబంధువులను సుమిత్రబంధువులను ఆనందింపఁజేయుము. నాచిన్నారిపట్టీ! నాసంతోషమేమందు నేఁ! శుభనక్షత్రమున నాయందు ఉదయించితివి. కావుననే నీవు వినయాదికల్యాణగుణములు గలిగి, ఆగుణములచే తండ్రిని సంతోషపఱిచితివి. బిడ్డా! ఇక్ష్వాకువంశపురాజులయీరాజ్యలక్ష్మి నిన్నిపుడు పొందఁగలదు. కావున నేను పుండరీకాక్షుఁడగు నారాయణునిగుఱించి వ్రతోపవాసాదులుండి యొనర్చినశ్రమమంతయు, ఆహా! యిప్పుడు సఫలమైనది' అనియె. తల్లి యిట్లు చెప్పఁగా రాముఁడు తన ప్రక్కచేతులు మొగిడ్చికొని మిక్కిలి యడఁకువతోఁ గూర్చుండియున్నతమ్ముని లక్ష్మణుని జూచి చిఱునగవుతోడ 'లక్ష్మణా! నీవు నాతోఁగూడి యీభూమిని పాలింపుము. నీవు నాకు రెండవప్రాణము. కావున నిన్ను ఈరాజ్యలక్ష్మి పొందినదయ్యె. నీవు, కోరినట్టిభోగమును, మఱియు రాజ్యప్రాప్తికి ఫలములైన యమూల్యరత్నాభరణాదులను అనుభవింపుము. నాప్రాణమును ఈరాజ్యమును నీకొఱకే నేను గోరుచున్నాను. ఇంక విశేషించి చెప్పనేల' యని చెప్పి, తల్లులగు కౌసల్యాసుమిత్రలకు మ్రొక్కి, సీతనుఁ బంపునట్లు వారియనుజ్ఞ నేఁడి, కూడఁ బిలుచుకొని తనయింటికిఁ బోయెను. ఇది నాలుగవసర్గము.



వసిష్ఠుఁడు రామునిచే నుపవాస ముండునట్లు చేయుట.

దశరథుఁడు మఱునాఁడు జరుగునభిషేకమునకుఁగాను ఉపవాసాదులు సేయునట్లు రామున కానతిచ్చి పురోహితుఁడైన వసిష్ఠునిఁ బిలిచి 'తపోధనా! నీవుచని యిప్పుడు నియతవ్రతుఁడైన రాముఁడు భార్యతోఁగూడ, సంపదను కీర్తిని రాజ్యమును బడయుటకై యుపవాస ముండునట్లు చేయు'మనఁగా ఆవేదవిత్తముఁడును 'వల్లె' యని

ను. ఆమహాత్ముఁడు మంత్రములం బాటించి తెలిసినదిట్ట! గట్టివ్రతముల నాచరించువాఁడు; కావున రామునిచే, సమంత్రకముగా ఉపవాసము చేయింపఁబూని, బ్రాహ్మణులారోహించుటకుఁ దగినదై గుఱ్ఱములు పూన్చియున్న రథము నెక్కి మఱియొకరిని పంపక తానే రామునియింటికిఁ బోయెను. ఆమునితిలకుఁడు తెల్లనిమబ్బువలె మొల్లంపుతెల్లని కాంతులచే విలసిల్లుచున్న రామునిగృహమును చేరం జని రథమునుండి దే మూఁడుగోట్టికట్లు దాఁటిపోయె. ఆరాముఁడును, మాననీయుఁ డగునామునివరుఁడు వచ్చుటఁ జూచి యతనిని పూజించుటకు త్వరితుఁడై తొట్రుపడుచు గృహమునుండి బయలు వెడలి వేగ నాధీమంతునిరథమునొద్దకుఁ బోయి యంత తానే చేయూఁత యిచ్చి యతనిని రథమునుండి దించెను. ఆపురోహితుఁడును, తనయెడ నట్లు వినయంబుచూపుచు కావున ప్రియమునకే తగియున్న రామునిం జూచి కుశల మడిగి ప్రసన్నునిఁ జేసి యతనికి సంతోషము దోఁచునట్లుగా 'రామా! నీతండ్రికి నీయెడ ననుగ్రహము కలిగెను. కావున నీవు యౌవరాజ్యమును బొందెదవు. నీ విపుడు సీతతోఁగూడ నుపవాసముండుము. నీతండ్రి దశరథమహారాజు ప్రాతఃకాలమున, నహుషుఁడు యయాతికిం బోలె, తాను నీకు ప్రేమమున యౌవరాజ్యమునం దభిషేకింపనున్నాఁడు' అనిచెప్పి యమ్ముని నియతవ్రతుఁడైన రామునిని సీతను సమంత్రకముగా ఉపవాస ముండునట్లు చేసెను. అంత నారాజగురుఁడు రామునిచేత యథావిధి పూజితుఁడై, యతఁడు వెంబడిరాఁగా, నిలుచునట్లు సమ్మతిపఱచి యతనిగృహము వెడలెను. అచ్చటరాముఁడు, తనయెడ మక్కువగలిగి యింపుగులుకు మాటలాడుచెలికాండ్రతోడఁ గూర్చుండియుండి సంతసిల్లుచు, వారలను అన్నివిధముల సమ్మతిపఱచి సెలవుపుచ్చుకొని, యంతఃపురము ప్రవేశించెను. అపుడు రామునిగృహమునందలి స్త్రీలును పురుషులును ఉల్లాసమున కలకల నవ్వుచు మొగములు విలసిల్లనుల్లసించుచుండఁగా, ఆగృహము కొలకొలమని యింపారఁగూయుపక్షులును విరిసినతామరలును గలయొకకొలనువలె ప్రకాశించెను. అమ్ముని, విశాలమును సుందరమునైన రామునిమందిరము వెడలి మార్గమంతయు జనులు మూఁగియుండఁ జూచెను. రామాభిషేకము చూచుకుతూహలముసొంపుతో బడిబడి గుంపులుగుంపులుగా జనులు అయోధ్యకు వచ్చుచుండుటంజేసి అందలిరాజమార్గములు మిక్కిలి క్రిక్కిఱిసియుండెను అపుడు జనసమూహములు పెద్దతరంగములవలె పైపయివచ్చి యొండొంటితో ఒరసికొనుటచేతను, అభిషేకమును చూచెడియుబ్బుచేతను, రాజమార్గమునందుఁ బుట్టినధ్వని, అలలు మోఁదఁగా పెల్లురేఁగినసముద్రపుధ్వనిం బోలియుండెను. అయోధ్యయందలి రాజమార్గములను జనులు ఊడ్చి జలము చల్లి యలంకరించిరి. అలంకారార్థము అందంద యరఁటిపోఁకలవనములు వరుసగా రచించిరి. ప్రతియింటను ధ్వజములెత్తిగట్టిరి. అపు డయోధ్యయందుండు స్త్రీలును బాలురు వృద్ధులు మొదలగుజనులు అందఱును రామాభిషేకమును జూడఁగోరి యితరవ్యాపారములు మాని సూర్యోదయ మెప్పుడగునో యని కోరుచుండిరి. అయోధ్యయందలి

రామాభిషేకమహోత్సవమునకొఱకు ప్రజలందఱును అలంకరించుకొని ఆనందము పైపయి పెరుఁగుచుండఁగా ఆమహోత్సవమును జూచుటకు ఆతురపడుచుండిరి. వసిష్ఠుఁడిట్లు జనులు క్రిక్కిఱిసియున్న రాజమార్గమును గనుఁగొనుచు ఆ జనసమూహములను అందంద వ్యూహములుగాఁ బన్నినానిపలె మెల్లఁగాఁ జని రాజగృహంబు దఱిసి తెల్లనిమేఘమువలెను తెల్లనిపర్వతశిఖరమురీతిని రాజిలుచున్న యాగృహము పైకి నెక్కి, దేవగురుఁడైన బృహస్పతి దేవేంద్రునికడకుఁ బోవునట్లు, తాను దశరథభూనాథునికడకుఁ బోయెను. ఆరాజును వసిష్ఠురాకఁ జూచి సింహాసనమునుండి లేచి 'రాముఁడు ఉపవాస ముండునట్లు చేసితిరా' యనియడుగఁగా 'చేసితి' నని యతఁడు బదులు చెప్పెను. అప్పుడు రాజుతోఁ గూడఁ గూర్చుండి యుండినసభ్యులును ఆతనితోడనే తామును పురోహితుని పూజించుటకై యాసనములనుండి లేచిరి. రాజును గురువునొద్ద సెలవుపుచ్చుకొని సభ్యులందఱిని వీడుకొని సింగము కొండగృహముఁ బ్రవేశించునట్లు అంతఃపురము ప్రవేశించె. చెలువుగా నలంకరించుకొని యున్నలలనాజనులు నెఱసి బెరసియుండఁగా దేవేంద్రునిగృహమునకు సాటియై నీటుగులుకుచున్న నిజగృహమును, చంద్రుఁడు నక్షత్రసమూహములచే నెఱసియున్నయాకాశమును జొచ్చునట్లు, తనతేజస్సుచే రాజిల్లఁజేయుచు, దశరథుఁడు ప్రవేశించెను. ఇది యైదవసర్గము.

---

## రామాభిషేకమునకు సన్నాహము.

*పురోహితుఁడగువసిష్ఠుఁడు పోఁగానే రాముఁడు స్నానముసేసి మనస్సును నిశ్చలము గావించుకొని నిడువాలుఁగన్నులఁ జెన్నారు తనచిన్నారిసీతతోఁ గూడ నారాయణుని ఉపాసించెను. అతఁడప్పుడు యథావిధిగా హవిఃపాత్రము

---

*ఇందులకు 'గతే పురోహితే రామః స్నాతో నియతమానసః। సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణముపాగమత్' అని మూలము. (స్నాతః) అనుటచే కాయశుద్ధియు, (నియతమానసః) అనుటచే మనశ్శుద్ధియు తెలియుచున్నది. (సహపత్న్యా) పతితోడ - 'పత్న్యా సహ యజ్ఞసంయోగః' అని యుక్తనియమమునకు పత్నియొక్క సాహాయ్యము కావలయును గాన పత్నితోడ అన్నాఁడు. (పత్న్యా) అనుతృతీయచేత ఆరాధనకాలమందు సీత ఉపకరణము సమర్పించుచుండెనని వ్యంజితమగుచున్నది. (విశాలాక్ష్యా) వెడలుపైన కన్నులుగలదనుట - ఇచట 'బుతేమాగాం విశాలాక్షీం ఏష పూర్వసరిగ్రహామ్ - నీకు పూర్వము భార్యయును విశాలాక్షియునైన మాయను విడచి' అని విశాలాక్షీశబ్దము లక్ష్మియందు రూఢముగా నున్నదిగాన, సీత యని విశేషించి చెప్పక సామాన్యముగా 'విశాలాక్షి' యని చెప్పినాఁడు. దీనిచే సీత లక్ష్మి యనుట తెలుపఁబడినది. (నారాయణమ్) ఇట నారాయణుఁడనఁగా శ్రీరంగనాయకులు. శ్రీరంగనాయకులనే మీఁద విభీషణునికి రాముఁడు దానము చేసెనని చెప్పఁబడియున్నది. (సహపత్న్యా) శ్రీరంగవిగ్రహానుభవమునకు సీత తనకు సహాయభూతురాలైనదని యర్థము. (విశాలాక్ష్యా) రామవిగ్రహమును అనుభవించుటకంటె శ్రీరంగవిగ్రహమును అనుభవించుట సీతకతిశయప్రియముగానుండుటచే కన్నులు మఱింతవిచ్చి ఱెప్పవేయక యనుభవించినదనుట, (విశాలాక్ష్యా) సీత

*శిరస్సునగ్రహించి,మండినయగ్నిహోత్రమునందు † దేవోత్తముఁడగునారాయణుని కొఱకు నేయితో హోమము చేసెను. అట్లు హోమము చేయఁగా మిగిలిన హవిస్సును తన కత్యంతప్రియముగాఁ గొని భుజించి యిష్టమైనది గోరికొని, దేవుని నారాయణుని ధ్యానించుచు, తాను పఱచుకొన్న దర్భపఱుపుమీఁద ‡ మౌనముతో మనసు నిశ్చలము గావించుకొని,సీతతోఁగూడ శ్రీమంతమగువిష్ణుదేవాలయమున ఆరాజకుమారుఁడు పవళించెను.అతఁడు,రాత్రియొకజాముండఁగా మేలుకొని,గృహమునకంతయు నలంకారవిధానము సేయించి యచట సూతవందిమాగధులసుఖారావముల వినుచు పూర్వసంధ్యాధిదైవమగు సూర్యునుపాసించి, పరాయుత్తము గానిచిత్తమున గాయత్రీజపము సేసి, నారాయణుని ప్రస్తుతించి దండప్రణామము చేసెను. అంత మఱల స్నానము సేసి తెలిపట్టువలువ గట్టుకొని బ్రాహ్మణులచే పుణ్యాహవాచనము సేయించెను. అంతనపుడు ఆబ్రాహ్మణులు పుణ్యాహము చెప్పఁగా ఆ ఘోషము మధురమును గంభీరమునై వాద్యధ్వనులతోఁగలిసివిజృంభించి అయోధ్యయంతయునిండెను.అయోధ్యయందలిజను లపుడు రాముఁడు సీతతోఁడ ఉపవాసము సలిపెనని విని యందఱును మిగుల ముదమును బొందిరి. అంత పురజనులందఱును రామాభిషేకముజరుగుట విన్నవారు గావున రాత్రి తెల్లవాఱుటఁజూచి పట్టణంబు లందందు ఊళ్ళు యలికి మేలుకట్లు అరఁటిచెట్లు మొదలైనవి గట్టి యలంకరించిరి. అపుడు తెల్లనిమబ్బులవలెను కొండలవలెను వెలయుచున్న దేవాలయములందును,చదుకములను,రాజమార్గములను,బౌద్ధా

విశాల నేత్రసౌందర్యముగలవయ్యు అందుఁ గనులకు నారాయణుని సేవ ఉపాసించవని రాముని జితేంద్రియత్వము తెలియునది. రామునకు నారాయణుఁడు మిక్కిలి యభీష్టుఁడగుటచేత సీతకంటె నారాయణునియందే మిక్కిలి ప్రాధాన్యమునకలవాఁడనుటయు తెలియునది. (ఉపాగమత్)అగమత్ అనుటచేత సభగవన్మందిరమునకుఁ బోవుట తెలియుచున్నది. ఉపశబ్దమునచే, నివేదనపర్యంతము భగవదారాధనము సేయుట సూచితమగుచున్నది.

* ఇందులకు † (ప్రగృహ్యశిరసాపాత్రం) అని మూలము. ఇందుల 'ఉపరిసేవేథ్యధారయతి' -సేవతలకొఱకు మీఁదుగా ధరించుచున్నాఁడు' అని శ్రుతిప్రమాణము (‡) ఇందులకు 'మహాతేదైవతాయ' అనిమూలము. దీనికి 'సం సేవతానాం పరమంచ దైవతమ్' అని శ్రుతి.

‡ ఇందులకు(వాగ్యతః సహ వైదేహ్యా భూత్వా నియతమానసః।శ్రీమత్యాయతనే విష్ణోః శిశ్యే నరవరాత్మజః) అని మూలము. (వేదేహ్యా సహ శిశ్యే) సీతతోఁడ పవ్వళించె ననుటచే, (నియతమానసః) అని రాముని జితేంద్రియత్వము సూచితమైనది. (శ్రీమతి విష్ణోరాయతనే) 'బ్రహ్మస్వామాసయజూంషి సామశ్రీరమృతాసతామ్' అనుశ్రుతిచే శ్రీ యనఁగా వేదత్రయమును అర్థమగుచున్నది గాన వేదత్రయసారభూతమైన ప్రణవముగాఁ దెలియునది. కనుక (శ్రీమతి) యనఁగా 'విమానం ప్రణవాకారం' అన్నట్లు ప్రణవాకారమైన దనుట. (విష్ణోరాయతనే) విష్ణువునాలయమందు - ప్రణవాకారమైన శ్రీరంగని యాలయమందనుట,(నరవరాత్మజః) రాజకుమారుఁడు-తానునారాయణావతారమే యైనను క్షత్రియుఁడుగా నుండుటచే నారాయణుని పూజించినాఁడని క్షత్రియధర్మానుసారి యగుట సూచితమైనది.

లయనములందును,అట్టళ్లను,మంటపములందును,పలు దెఱంగులసరకులు నిండియున్నవర్తకులయంగడులందును, సకలసమృద్ధి గలిగి సంపన్నములై యున్నగృహస్థులగృహములందును, సమస్తసభాస్థలములను, పొడవులై నలుగడల కనఁబడుచుండు వృక్షములందును, రాజచిహ్నములు గలధ్వజములను పలురంగులు గలరిత్తెక్కెములును ఎత్తిరి. నట్టువులు అభినయము సూపియాడించుచును,నర్తకులాడుచును, పాడిరి. గాయకులును పాడిరి. వారు పాటపాడుపలుకులు వినినంతనే వీనులకు విందులు గొలుపుచు డెందమున కానందము గూర్చుచును జనులకు వినవచ్చెను. రాముని యభిషేకోత్సవము సమీపింపఁగానే జనులు వెలుపల ముంగిళ్లయందును, వారిలో స్త్రీలు ఇండ్లలోపలను, రామాభిషేకమును గుఱించినముచ్చటలే యాడుకొనుచుండిరి. ఇండ్లవాకిళ్లయం దాడుకొనుచుండు బాలురుగూడ ఒకరికొకరు రామాభిషేకమును గుఱించిన మాటలే చెప్పుకొనుచుండిరి. రామాభిషేకసమయమున పురజనులు రాజమార్గము లంతటను పుష్పములు చల్లి గమగమధూపపుఁబొగలు బుగులుకొనఁ జేసి పెంపుసొంపార నలంకరించిరి. మఱియు నాపౌరులు అభిషేకమైనపిదప రాముఁడు పొడవైనగజము నెక్కి రాఁగా, అతనియభిషేకాలంకారము ఆమెత్తునను తమకు అగపడుటకును,అతఁడు బయులు వెడలకమును పేరాత్రియగునేని అతనియితరాలంకారము చీఁకటియందును చక్కఁగాఁ జూచుటకును, గోరి, ప్రతిరాజమార్గమందు వృక్షములవలె పొడవులైననానావిధదీపస్తంభములను రచించిరి. వార లిట్లు పురమును అలంకారముగావించి రామునియౌవరాజ్యాభిషేకముహూర్తమును ఎదురుసూచుచు ముంగిళ్లయందును రచ్చపట్టులందును గుంపులుగట్టి గూడి యక్కడ ఒకరితోనొకరు గుజగుజలాడుచు రాజగుదశరథునింగూర్చి 'ఇక్ష్వాకువంశమునకు సొంపుగూర్చుచున్న యీమనరాజు ఔరా! మిక్కిలిమహాత్ముఁడు. కావుననే తాను వృద్ధుఁడగుట తెలిసి రాజ్యమునందు రాముని అభిషేకింప నున్నాఁడు. రాముఁడు లోకమునందలి వస్తువుల తారతమ్యములను గనుఁగొన్నవాఁడు. అట్టినిపుణుఁడు రాజు గా వలయునని కోరుచు చిరకాలము వుచ్చితిమి. ఇంక మన కతఁడు రాజును రక్షకుఁడునులగును. కావున మనకందఱికిని దైవానుగ్రహముకలిగినది.రామునిగుణము లేమనిచెప్ప!అతనికి మనమున గర్వంబు గలుగదు. అతఁడు విద్వాంసుఁడు, ధర్మాత్ముఁడు, తోఁబుట్టువులందు మిక్కిలివాత్సల్యముగలవాఁడు. ఇదియంతయు నొకవింతకాదు. అతఁడు తమ్ములయందెట్లో అట్లేమనయందునుగూడ నెయ్యము చూపువాఁడు. దశరథునియనుగ్రహమువలన రాముఁడు పట్టాభిషిక్తుఁడు కాఁగా మనము సూతుము. ఇట్టిసొంపు మనకుఁగూర్చినధార్మికుఁడును పాపదూరుఁడు నైనయాదశరథమహారాజు దీర్ఘాయువై యుండుఁ గాత'మని ప్రశంసించిరి. అప్పుడు రామాభిషేకవృత్తాంతము విని నలుగడల నానాదేశములనుండి వచ్చినజనులు, పురజనులిట్లు మాటలాడుకొను చుండఁగా వినిరి. ఆజనులురామాభిషేకమును జూచుటకై పలుదిక్కులనుండి అయోధ్యకు వచ్చి

*రామునిపట్టణమంతయు నిండి యుండిరి. అందు నానాదేశములనుండి వచ్చుచున్న జనసమూహములకలకలము పర్వములందు వెల్లురేఁగుసముద్రపుధ్వనివలె మ్రోఁగుచుండెను. అంత దేవేంద్రునిభవనమువలె అతిరమణీయమైనయాపురము రామాభిషేకము చూడఁ గోరి వచ్చియున్నజానపదులు నెఱసి బెరసి తిరుగుచుండుటచే కలఁత నొంది, నలుగడల వారికలకలములతోఁ గూడినదై, తిమితిమింగిలాదిజలజంతువులచే రొద గలిగి శబ్దించుచున్నసముద్రజలముఁ బోలి ప్రకాశించిన దయ్యె. ఇది ఆఱవసర్గము.

---

## మంథర కైకేయికి దుర్బోధము సేయుట.

కైకేయికి మంథర యనెడియొక దాసి గలదు. కైకేయిబంధువులు దానిని ఆమెకు అరణముగా నిచ్చిరి. కావున నది కైకేయితోఁగూడ,వసించియుండెను.†అది యెచట పుట్టినదో తెలియదు. అది, తెలిగచ్చు పూసియుండుటచే చందురునివలె తెల్లనై మెచ్చులు గులుకుచుండుమేడమీఁద నిచ్చలు నెక్కి యచ్చటనుండి అయోధ్యాపురమును చూచెను. అపు డాపట్టణమునందలిరాజమార్గము లన్నియు తడుపంబడి పూవు లంతటను జల్లంబడి యుండెను. అందు రాజచిహ్నము గల టెక్కియములను సామాన్యములైనధ్వజములును అలంకారముగా నెత్తంబడి యుండెను. జనులు క్రిక్కిఱియుటచే వారు తలఁచినచోట్లకు యథేచ్ఛముగాఁ బోవుటకు అనువుగా నుండునట్లు అడ్డత్రోవలు క్రొత్తగా నేర్పఱుపఁబడి యుండెను. జనులందఱు శిరస్స్నానము సేసి పరిశుద్ధులై యంతట అలఘుకొనియుండిరి. రామునకుఁ గానుకలు సమర్పించుటకై బ్రాహ్మణులు హస్తములందుఁ బుష్పమాలికలను గుడుములను బట్టుకొని తిరుగుచు సంతోషధ్వనులు సేయుచుండిరి. దేవాలయద్వారము సున్నపుగచ్చుచే తెల్లనై మెచ్చులు గులుకుచుండెను. సకలవాద్యధ్వనులును నలుగడల మ్రోఁగుచుండెను. అంతటను జనులు మిక్కిలియు హర్షముసెలఁగ నెఱసి బెరసి

*ముందుదినమే సకలజనులసమక్షమందు రామాభిషేకము చాటఁబడి యుండుటచే రాముఁడు అధిపతి యని విదితమయ్యెను. కాన అయోధ్యను రామునిపట్టణముగా కవిచెప్పినాఁడని తెలియునది.

† ఇందులకు 'జ్ఞాతిదాసీయతోజాతా' అనిమూలము, (యతోజాతా) ఎచ్చటనో పుట్టినది-దాని తలిదండ్రులుగాని పుట్టినచోటుగాని తెలియకుండెననుట. దీనికి విశేషార్థము-(యతోజాతా) ఎచటనో పుట్టినది - రామునియభిషేకమును జెఱుచునట్టి దుష్టురాలు అయోధ్యయందు పుట్టనేరదు గనుక మఱియెచటనో పుట్టినదనుట. లేక(యతోజాతా) ఇట్టిపాపాత్మురాలిపేరును జాతియు చెప్పుటకుఁ గూడ తగదని యెచటనో పుట్టినది అనఁబడియె. కావున నే 'మంథర' అనుదానిపేరును ఇచట చెప్పఁబడినదికాదు. లేక (యతోజాతా) రామునిచే రావణుని చంపించుటకై కైకేయికిని అతనికిని భేదము కల్గించునట్లు దేవతలే దానిని పంపిరిగాన దాని కులాదులు చెప్పుటచే ఈదేవరహస్యము వెలిపడునని అవి చెప్పఁబడవయ్యె.

యుండిరి. వేదపారాయణధ్వనులు అందంద వినంబడుచుండెను. రామునియభిషేకమును గుఱించి మనుష్యులకే కాదు. మృగాదులకును సంతోషము దొంతరలు గొనుటచే మేటియేనుఁగులును గుఱ్ఱములును ఉబ్బుప్రబ్బికొన పులకించి తిలకించుచుండెను. ఆఁబోతులు ఱంకెలువైచుచుండెను. జనులు పెనుసంతోషమున పులకలు గ్రమ్ముకొనఁగా పట్టణమునందంతయు వరుసవరుసల ధ్వజములనెత్తికట్టిరి. ఇట్లు ప్రకాశించుచున్న యాపురమును ఆమేడపైనుండి మంథర చూచెను. అప్పుడు రామునిదాది తెల్లనిచీర గట్టుకొని యుబ్బుపెల్లుచే మిక్కిలి వికసిల్లినకన్నులతో ఆదాపున నుండెను. ఆమంథర యాదాదిని జూచి '*రామునితల్లి సహజముగా ధనమును సంగ్రహించుకొనునదియే కాని యెవ్వరికిని ఇచ్చునది కాదు. అట్టిదయ్యును ఇప్పుడు పట్టరానిసంతోషము నొంది జనులకు ధనము అవ్వారిగా నిచ్చుచున్నదా యేమి? అట్లుగా కున్న జనులకు అతిమాత్రమయినయీసంతోషము ఎందుకు కలిగినది. లేక, రాజు మిక్కిలిసంతోషమునొంది మఱియే కార్యమును గావింపనున్నాఁడు?' అనియడిగెను. ఆదాదియు లోపలసంతోషము మిక్కుటమైపట్టరాక పిక్కటిల్లఁగా దేహము పెటులునో యన్నట్లు ఉబ్బి ప్రతికూలయగు దానికి చెప్పరానిదైనను, హర్షమున మఱచి రామునికిఁ గలుగునిరతిశయమైనరాజ్యలక్ష్మీవిభవమును జెప్పఁబూని 'దశరథమహారాజు, రేపు పుష్యనక్షత్రమున కోపరహితుఁడై పాపదూరుఁడై యున్న రాముని యౌవరాజ్యమునందు అభిషేకింపనున్నాఁడు' అనిచెప్పెను. ఆగూనిది దాది చెప్పిన మాటవిని తోడనే మిక్కిలికోపము నొందినదై, కైలాసపర్వతశిఖరమువలె పొడవైతెలుపెక్కి పొడసూపుచున్నయామేడనుండి వేగముగా దిగెను. మంథర పాపమునందే కన్నులు గలది; కనుక రామాభిషేకమును విని కోపముచే మండుచు పరుండియున్న కైకేయికడకుఁ బోయి యామెతో "తెలివిమాలినదానా! పరుండియున్నావేమి? లే లెమ్ము. నీకిపుడు ఒక భయము రాఁబోవుచున్నది. ఒకటియా! ఇంక పెక్కుదుఃఖములు నిన్ను చుట్టుముట్టుకొనియుండుటను దెలియవా? నిజముగా నీవు రాజునకు ప్రియురాలవుగావే. రాజు ప్రేమించుసౌభాగ్యము గలదానివలె పైకి కనఁబడుచున్నావు గాని 'రాజునకు నాయందు మిక్కిలిమక్కువ; కాఁబట్టి నేనే భాగ్యవతిని' అని విఱ్ఱవీగుచున్నావు ఎక్కడి సౌభాగ్యమే! వేసవికాలమందు ఏటివెల్లువవలె, ఇపుడు నీసౌభాగ్యమంతయు అడుగంటినది" అనియె. ఆగూనిది పాపమందే కన్నులుగలదై రోషముచే నిట్టుబిరుసుగా చెప్పినమాట విని కైకేయి మిక్కిలి విషాదము చెంది దానిఁ జూచి 'మంథరా! ఏమిది! నాకు సేమమే కదా. నీమొగము చిన్నఁబోయియుండుట చూడఁ

---

*ఇందులకు 'ఉత్తమేనాభిసంయుక్తా హర్షేణార్థపరా సతీ । రామమాతా ధనం కిన్ను జనేభ్యః సంప్రయచ్ఛతి' అనిమూలము. మంథర కౌసల్య యందలి ద్వేషముచేత ఆమెను (అర్థపరా) అర్థమునందు ఆసగలది-అనిచెప్పినది. మఱియు 'కౌసల్యా' అని పేరుచెప్పక 'రామమాతా' 'రాముని తల్లి' యనుటచే కౌసల్య పేరినిగూడ చెప్పనంతటి ద్వేషముగలదని తెలియునది.

గా నీకు మిక్కిలి యేదో దుఃఖము గలిగినదని యూహించుచున్నాను' అనియె. కైకేయి చెప్పినతీపారుపలుకులు విని మంథరకు, 'ఆ! రామాభిషేకమును పాటింపక మాటలముద్దులు సూపుచున్నదిది యేమి' అని కోపము గలిగెను. అది కైకేయి మేలే కోరుచుండునది గావున కౌసల్యకన్న కైక తక్కువయగుచున్నదే యని మునుపటికంటె దుఃఖము మఱింత హెచ్చఁగా, రాజ్యలక్ష్మి దాయాదులపాలగుటను జెప్పి యామెకు దుఃఖము గలిగించుటకును, రామునియందు ఆమెకుఁగల పుత్రస్నేహమును వేఱుపఱిచి విరోధము కలిగించుటకును, పూని, మాటలయందు నెఱజాణ గావున నిపుణముగా నామెతో 'దేవీ! నిన్ను నాశము చేయుటకు ప్రయత్నము, ప్రతీకారము చేయుటకును అలవి కానట్లు, ఎంతో జరుగుచున్నదే! నాశ మేమనెదవా? దశరథమహారాజు రామునిని రేపు యౌవరాజ్యమునం దభిషేకింపఁ బోవుచున్నాఁడు. నీ దానను గదా. ఇట్లు జరుగఁబోవుట విని భయమున మునిఁగి 'రామునికి రాజ్యమా' యని దుఃఖమును 'భరతునికి రాజ్యము తప్పెనే' యని యేడ్పును పైకొనఁగా, నిప్పులం బొరలిన ట్లవయవములు మండ ఊరకుండ రాక నీమేలుగోరి యిదె యిచ్చటికి వచ్చితిని. ఎట్లు రాకుందునే!' నాకు దుఃఖము కలిగిన నీకేమి యుండువా?' నీకు గోరంత దుఃఖము కలిగెనా నాకు కొండంత దుఃఖమగును. నీకు పెంపు గలిగెనా నాకును పెంపు కలుగును. ఇందులకు సందేహము లేదు. ఇట్టి వేళయు నుండునా? నీవు రాజకులమునఁ బుట్టితివి. మనరాజునకు ఉత్తమభార్యవయితివి. అయినను రాజుల పోకడలు క్రూరములని తెలియవదేమి? ఇదే మిచిత్రమే! నీమగఁడు పైకి ధర్మము లేపలుకువాఁడు; కాని స్వభావముచే రహస్యముగా, చెఱుపు సేయువాఁడుసుమీ! అతనికి అంగిట బెల్లము; పైకి తేనెలొలుక మాటలాడును; పనులలో క్రూరుఁడు. నీస్వభావము నిర్మలమైనది కావున మగనినిగూడ నిర్మలచిత్తునిగా తలఁచెదవు. కాని, కట్టా! అతఁడు నిన్ను మిక్కిలి వంచింపనే వంచించినాఁడు. నీమగఁడు అప్పటప్పటికిఁ దగినట్లు దగ్గఱకు వచ్చి యిచ్చకములు పలుకుచు ఏమియు పస చూపకయే నిన్ను బుజ్జగించుచు వచ్చి యిప్పుడు కౌసల్యకు గొప్పప్రయోజనము సమకూర్పనున్నాఁడు. నిన్ను వంచించినవిధము తెలియునా? దుష్టాత్ముఁడగు నీమగఁడు భరతుని నీపుట్టింటిబంధులకడకు పాఱఁదోలినాఁడు. భరతుఁ డేకదా అతనికి కంటకము వానిని పాఱఁదోలి విగతకంటకమైన రాజ్యమునందు రేపు తెల్లవాఱునప్పటికి రాముని పట్టము గట్టనున్నాఁడు. నీవు పసిదానవు. రాగల యనర్థము నీకేమి తెలియునే! మగఁడని పేరు పెట్టుకొని యున్న పగవాఁడు నీమగఁడు. ఒక పసిది పామునకు లోపల విషముండుట తెలియక దానికి మేలు సేయఁగోరి తల్లివలె పెంచుచు తొడయందిడుకొని లాలించునట్లు నీమగనిని, లోనికి పగవాఁడని తెలియక తొడలయందుపలాలించుచున్నదానవు. ఒడినుండి విడిచి పుచ్చవా? పామును గాని పగవానినిగాని చంపక యూరక విడిచినయెడల ఎట్లు సేయునో యట్లే దశరథుఁ డిపుడు నిన్నును నీకొడుకును చేసినాఁడు. నీవెల్లపుడును సుఖము ననుభవింపఁదగినదానవు గదే. ఏమియుం దెలియని పసిదానవు. ఈ దశరథుఁ డెంత పాపాత్ముఁడే! నిన్నింత కాలము మొగ

మిచ్ఛకములతో బుజ్జగించుచుండి యిపుడు రామునికి రాజ్యముగట్టి నిన్ను తుదముట్ట చెఱిపినాఁడే. నిన్నొక్కతెనా! కాదు. నీకొడుకును నను బోఁటి నీపరిజనమును జెఱిపినాఁడు. అయ్యో! చెడితివి. ఇట్టిదుఃఖమున చిక్కుపడియున్న దానవు గనుక తోడనే,యిప్పటికిఁ దగినట్లు, నీకు మే లేదియో చూచుకొనుము. ఎట్లు నేర్తువనకు. నీయొక్క మిక్కిలి యాశ్చర్యమైనది. నీకన్నులచెన్ను, చూచువారి కాశ్చర్యము పుట్టించునట్టిది. ఇఁక నీ మగఁడెంత. కనుక నీతెలివిని, నీచెలువును, ఉపయోగించి నిన్నును నీకన్నకొడుకును నన్నును గాపాడుకొనుమీ' అనియె. చెలువంపుమొగము గలయాలలన పరుండియుండి, మంథరచెప్పినమాట విన్నదై, మఱింతసంతోషంపుసొంపు పెంపార శరత్కాలపు చంద్రరేఖవలె వెలుంగుచు శయ్యనుండి లేచినది. అట్లు లేచి, రామాభిషేకవార్తను వినుటకు సంతసము పయిపయి నుప్పొంగ, అట్టిసంతోషము తనకు దైవికముగాఁ గలిగినందుల కాశ్చర్యపడుచు, అట్టిశుభవార్తను వినిపించినందుల కాకూనిదానికి పారితోషికముగా మేలైనయొక యాభరణము నొసంగె. ఆ కాంతారత్నము, అట్లు ఆభరణము దానికొసఁగి, మరల దానిని జూచి "ఓమంథరా! నీవు నా కత్యంతప్రియమైన యీరామాభిషేకవార్తను జెప్పుచున్నదానవు. ఇట్టిప్రియవార్తను జెప్పునీకు మఱియు నేమిచేయుదును. 'సపతికొడుకునందు ప్రీతియేమి' యని యందువా? రామునియందుఁ గాని భరతునియందుఁగాని నాకుభేదము కనుపట్టదు. నాకిద్దఱు నొకటియే. కాఁబట్టి, రాజు రామునికి రాజ్యాభిషేకముచేయఁ గలఁ డని వినఁగా నాకు ఎంతయు సంతోషమే కలిగినది. ఓసీ! నీవు ప్రియమునకుఁ దగినదానవు. ఈరామాభిషేకవార్తకన్న ప్రియమైనది మఱొకటి నీవు నాకు చెప్పఁజాలవు. ఏలనఁగా ప్రియములైనవానిలో నెల్ల రామాభిషేకమే మిక్కిలి అతిశయమైనది. అట్టిప్రియమును జెప్పితివి. కావుననే అంతకంటె ప్రియమును జెప్పఁజాలవంటిని. ఇట్టియత్యంతప్రియమును నాకుఁ జెప్పితివి గావున కోరఁదగినది మఱియు నేదియేని వేఁడుము. నీకిచ్చెదను" అనిచెప్పెను.
ఇది యేడవసర్గము



### మంథర కైకేయికి మఱియు దుర్బోధము సేయుట.

ఇట్లు చెప్పినకైకేయిని జూచి మంథర యసూయ నొంది, యామె యిచ్చిన యాభరణమును దిగవైచి, హితము చెప్పఁగా వినదయ్యెనే యని కోపమును, అనర్థము వచ్చునే యని దుఃఖమును, పురికొనఁగా కైకేయితో "ఓ తెలివిమాలినదానా! దుఃఖింపవలసినకాల మిది. ఇట్టితగనిసమయమున నీకు సంతోషమయ్యెనా! ఇందులకు కారణము ఇంచుక దుఃఖమా! దుఃఖమహాసముద్రమునడుమ నున్నావే! ఇది నీకు తెలియకున్నది, రామునియభిషేకమునకంటె మించినదుఃఖము మఱేది? నేను దుఃఖమునుబొందియు కంది కుందవలసియుండఁగా, నీవు సొంపుతో నున్నావు. కావున

నీసొంపు చూడఁగా నన్ను దుఃఖము పీడించుచున్నది. నీయున్మాదమునకు నాకు మనస్సున నవ్వువచ్చుచున్నది. నీదుర్బుద్ధికి నాకు దుఃఖమగుచున్నది. నీసవతికొడుకన్న పగవాఁడే. వానికి వృద్ధి వచ్చుట మనకు మృత్యువువచ్చినట్లే. మృత్యువువలె అది రాఁగా, తెలివిగలది యెవ్వతిగాని దానిని సంతోషముగాఁ గొనునా? రాజ్యమును, రామునితో సమానముగా పొందుటకు భరతునికిమాత్రమే అధికారముకలదు. కాఁబట్టి భరతునివలన మాత్రమే రామునికి భయము కలుగును. అయితే రామునికే భయముగాని భరతునికి లేదందువా? అట్లుకాదు. మనలను జూచి భయపడిన పులి పాము మొదలగు వానివలననే మనకు భయము కలుగును. భయపడినవానివలననే భయముకలుగును. కనుక భయపడు రామునివలననే భరతునికి భయము పుట్టును. ఇది తలఁచి తలఁచియే చింతలవంతలపాలగుచున్నాను. 'లక్ష్మణునికిని శత్రుఘ్నునికిని రాజ్యమునం దధికారము కలదు కాఁబట్టి వారికి రానిభయము భరతునకుమాత్రము కలుగునా?' యని తలఁపకుము. గొప్పవిలుకాఁడగులక్ష్మణుఁడు మనోవాక్కాయకర్మములందు సర్వవిధముల రామునే ఆశ్రయించినవాఁడు. లక్ష్మణుఁడు రాముని నాశ్రయించినట్లే, శత్రుఘ్నుఁడును భరతుని ఆశ్రయించినవాఁడు. అట్లు వారిరువురు వరుసగా రామునకును భరతునకును పరతంత్రులై వర్తించువారు గావున రామునికి లక్ష్మణునివలన భయము లేదు. భరతునికి శత్రుఘ్నునివలన భయము కలుగదు. భరతునివలననే రామునికి భయము కలుగు ననుటకు మఱియొక కారణము కలదు. వినుము. జన్మించిన క్రమమునుబట్టి చూడఁగా భరతునిజననమే రామునిపుట్టుకకు మిక్కిలి దాపుగా నున్నది. కనుక రాజ్యము ప్రాప్తించుక్రమము రామునివెనుక భరతునికే మిక్కిలి సమీపముగానున్నది. లక్ష్మణశత్రుఘ్నులకో, భరతునకంటె పిన్నవారు గావున వారికి రాజ్యప్రాప్తి దవ్వుగానున్నది. లక్ష్మణశత్రుఘ్నులు పరతంత్రులై యుండినను భరతునివలెనే వారికి రాజ్యమునం దభిలాష యుండవచ్చునుగాని రామునివెనుక భరతుఁడే వయస్సునుబట్టి రాజ్యార్హుఁడు గాన రాముఁడు మొదట భరతునే చంపఁజూచును. కనుక రామునివలన భరతునకే భయము కలుగును. 'వయస్సు వరుసను బట్టి రాజ్యప్రాప్తికి రాముఁడే అర్హుఁడై యుండఁగా భరతున కది వచ్చునా?' యందువేని, ఆక్రమ మటుండనిమ్ము. మఱియొకటి వినుము. రాముఁడు స్వభావముచేతనే బుద్ధిశాలి; రాజనీతియందు విశేషించి బుద్ధిమంతుఁడు; ఎప్పుడు చేయఁదగినపనిని అప్పుడే తప్పక చేయువాఁడు. నీకొడుకో అట్టిసమర్థుఁడు గాఁడు. కనుక నీకొడుకును తలంచుకొనునపుడెల్ల అట్టిరామునివలన ఏమిభయము కలుగునో యని వడవడ వడఁకుదును. కనుక వయస్సుపాటి యటుండనీ. ఇట్టివిపత్తు రాకుండ ముందు ముందుగా చేసికొనవలదా! కొడుకులమాట యటుండనిచ్చి మీసవతులసుద్దులు విను. కౌసల్య కొడుకు పుష్యనక్షత్రమున పూజ్యం బగుయౌవరాజ్యమునందు బ్రాహ్మణోత్తములచే పట్టాభిషిక్తుఁడు కాఁగా, ఆ కౌసల్యభాగ్యమేమి! అదియే భాగ్యవతి. కొడుకుయువ

రాజు కాఁగా, కౌసల్య యింతింతనరానిసంతోషమును బొంది జగమునఁ బొగడ్తకెక్కి సవతులు మొదలైన పగవారిని అడంచి మించును. అపుడా కౌసల్యకు నీవు దాసియట్లు చేతులుమోడ్చి సేవసేయుదువు. రామునివలన నీకొడుకుదుస్థితి యటుండనిత్తము. కౌసల్యవలన ఇంతికంటె దుర్గతి నీకేమికావలయును. అట్లగునేని నీవును నీతోడిమేమును కౌసల్యకు పనికత్తియల మగుదుము. ఈగతి మనయంతవఱకే కాదు. నీకొడుకును రామునకు భృత్యుఁడగును. * రాముఁడు అభిషిక్తుఁడు కాఁగా తదీయలైనయుత్తమస్త్రీలందఱును ఆనందమున నుప్పొంగుదురుగదా. భరతుఁడు దారిద్ర్యమునొంది

*ఇందులకు 'హృష్టాః ఖలు భవిష్యన్తి రామస్య పరమాః స్త్రియః। అప్రహృష్టా భవిష్యన్తి స్నుషాస్తే భరతక్షయే' అని మూలము. ఇందు (రామస్య పరమాః స్త్రియః) రామునియొక్క ఉత్తములైన స్త్రీలు-అని యర్థము. ఈ 'స్త్రియః' అనుటకు సాటిగా రెండవపాదమున (స్నుషాః) కోడండ్రు - కైకకోడండ్రు- భరతునిభార్యలు, అనియున్నది దానిసాహచర్యమునుబట్టి ఈ స్త్రీలు కేవలపరివారకాంతస్త్రీలుకాక రామునికి భార్యలే యగుదురని యేర్పడుచున్నది. ఇట్లు రామునకు బహుభార్య లుండుటట్లు తెలియుచున్నది. కాఁబట్టియే సుందరకాండమున, 'పితుర్నిదేశం సమయేన కృత్వా వనాన్నివృత్తశ్చరితవ్రతశ్చ। స్త్రీభిశ్చమన్యే విపులేక్షణాభి స్త్వం రంస్యసే వీతభయః కృతార్థః-నీవు తండ్రిపనుపున, ఏర్పఱుపఁబడినపదునాలుగేండ్లకాలముచేసి, వ్రతముతీర్చుకొని వనమునుండి వెడలి భయముమాని కృతార్థుఁడవై విశాలములగు కన్నులుగల స్త్రీలతోఁ గ్రీడింపఁగలవు' అని సీత రామునిగూర్చి చెప్పినది. యుద్ధకాండమున దర్భశయనమును వర్ణించునప్పుడు 'భుజైః పరమనారీణా మభిమృష్టమనేకధా - ఉత్తమస్త్రీలభుజములచేత బహువిధములచే నొరసికొనఁబడినది-అనఁగా ఆలింగితమైనది' అని రామునికుడిచేతికి విశేషణము చెప్పఁబడినది. భార్యలు కానివారలు తమభుజములచే నొకపురుషునిభుజమును నొరసికొనరు గదా. మఱియు ఉత్తరకాండమున అశ్వమేధము ఆరంభించునపుడు 'మాతరశ్చైవ సర్వా మే కుమారాః స్త్రీగణానిచ। అగ్రతో భరతం కృత్వా గచ్ఛన్త్వగ్రేసమాహితాః - నా తల్లులందఱును కొడుకులును, స్త్రీసమూహములును భరతుని ముందిడుకొని ఎచ్చరికతో ముందు పోదురుగాక' అని రాముఁడు చెప్పియున్నాఁడు. ఇచట సీతకన్న నితరభార్యలు లేనియెడల (మే సుతాః స్త్రీగణాశ్చ) నా కొడుకులనుటయు నా స్త్రీసమూహములనుటయు ఒప్పదు. మఱియు ధర్మపత్ని లేనివానికి యజ్ఞముసేయుట కధికారములేదు. రాముఁడు సీతను అరణ్యమునకు పంపియుండఁగా వేఱు ధర్మపత్నులు లేనపుడు, అశ్వమేధము సేసినట్లు తెలియుటచే అతనికి ఇతరభార్య లుండిరని అర్థాపత్తిచేత-(అనుమానముచేత) తెలియుచున్నది. అప్పుడు రామునికి ఏకపత్నీవ్రతి మెట్లు చెల్లు నన్నయెడల కేవలభోగమునకు మాత్రముపయోగించు భార్యలు లేక సహధర్మిణులైన భార్యలే కలిగియుండుటవలన, ఏకపత్నీవ్రతము చెల్లుచున్నది. సీత నెడఁబాసినను ఇతరభార్యలుండుటచే భార్యావియోగము కలుగవలయు నన్న భృగుశాప మెట్లు చెల్లుననఁగా సీతయందలి ప్రేమాతిశయమునుబట్టి సీతావియోగదుఃఖము ముఖ్యముగ ననుభవించుటనుబట్టి శాపమును పరిపాలిత మగుచున్నది. యజ్ఞమందు సీతాప్రతిమను కల్పించుకొనుట సీతయందలి స్నేహబహుమానముల కొఱకేకాని ఇతరభార్యలు లేమిచేతఁగాదు—అని పూర్వపక్షము. ఇందులకు సిద్ధాంతము:—రాముఁడేకపత్నీవ్రతుఁడనుట సర్వప్రసిద్ధము. ఇతరభార్య లుండిరేని యతఁడు ఏకపత్నీవ్రతుఁడు కానేరఁడు. సీతాప్రతిమను గొనియే యాగము సేయుట సిద్ధకారము చెల్లుచున్నదిగాన 'సీతావియోగమున ఇతరభార్యలుండనిచో యజ్ఞము సేయుట యొప్ప' దనరాదు. ఈ విషయమునుబట్టియే ఉత్తరకాండమందు

డిందుపడఁగా నీకోదండ్రదు సంతోషము దూలి కుందుదుగు" అని మిక్కిలియు

---

'కాఞ్చనీం మమపత్నీంచ దీక్షార్హాంయజ్ఞకర్మణి|అగ్రతో భరతఃకృత్వా గచ్ఛత్వగ్రే మహామతిః॥యజ్ఞకార్యమున దీక్షకు తగినదియు బంగారమైనదియునగు నాభార్యను-బంగారుమయమైన సీతాప్రతిమనుట-మహాబుద్ధిమంతుఁడగు భరతుఁడు ముందిడుకొని ముందుపోవుగాక' అని సీతాప్రతిమ యాగదీక్షకు అర్హమైనదనియు పత్నితోసాటిదే యగుననియు చెప్పఁబడినది: మఱియును 'నసీతాయాః పరం భార్యాం వవ్రే సరఘునన్దనః| యజ్ఞేయజ్ఞేచ పత్న్యర్థం కాఞ్చనీజానకీ భవత్-రాముఁడు సీతకంటెనువేఱుభార్యను పెండ్లాడలేదు. ప్రతియాగమందును అతనికి భార్యకొఱకై బంగారుమయమైన సీత-సీతాప్రతిమ-యుండెను' అనియు బంగారుసీతాప్రతిమచేతనే యాగదీక్షలు నడపుచుండినట్లు తెలియుచున్నది.కనుక భార్య లేక యాగము సేయుట చెల్లదు;భార్యాప్రతిమను గొని యాగము సేయుటయు చెల్లదు;రాముఁడు యాగము చేసెను గనుక రామునికి సీతకన్న నితరభార్యలుండిరి' అనుననుమానము,రాముఁడుసీతకన్న నితరభార్యను పెండ్లాడలేదు;ప్రతి యాగమునందును బంగారుసీతాప్రతిమనే పత్నిగానుంచుకొనుచుండెను' అను విరుద్ధవచనముండునపుడు ప్రవర్తింపదు. ప్రత్యక్షశ్రుతివిరుద్ధము కానియీవచనముచేత'భార్య సమీపమునలేనపుడుగాని యాగమునకు అనుకూల గాకుండునపుడుగాని భార్యాప్రతిమను పత్నీస్థానమున నుంచుకొని శ్రౌతస్మార్తములను జేయునది' అనువిధి ఉత్థాపితమగుచున్నది. అట్లే 'దూరభార్యోఽననుకూలభార్యశ్చ దర్భపుంజైర్భార్యాప్రతినిధిం విధాయ పార్వణం కుర్యాత్' 'భార్య దూరమునఁ గలవాఁడుగాని అనుకూల గానిభార్య గలవాఁడుగాని దర్భలచేత భార్యాప్రతిమచేసి పార్వణము సేయునది'అను స్మృతియు హేమాద్రియందున్నది. అప్పుడు, భార్యసమర్థురాలు గానియెడలఁ జేయునట్లు, పత్ని చేయవలసిన కార్యములను యజమానుఁడుగాని అధ్వర్యుఁడుగాని చేయునది. పత్నిమృతిఁ బొందలేదు గావున అగ్ని నశింపలేదు. దోషముగలదియని విడిచినభార్యయెడ స్నేహబహుమానములు చూపుట నింద్యముగావున స్నేహబహుమానార్థముగా సీతాప్రతిమ కల్పింపఁబడినదనుటయు న్యాయ్యముకాదు. (మాతరశ్చైవ సర్వా మే కుమారాః స్త్రీగణానిచ) అనుచోట'మే' అనునది (మాతరః)అనుదానితో మాత్రమే అన్వయించుచున్నది. (మేమాతరః) నాతల్లులను,(కుమారాః) భరతునికుమారులను, (స్త్రీగణాశ్చ)భరతుని స్త్రీసమూహములను, అనియర్థము. రామునకు భార్యాంతరము ఉండెననుకొన్నను వారుధర్మార్థమే కాని ప్రజార్థముకాదు గావున రామునకపుడు కుమారులును లేరు గనుక (కుమారాః)అనుట భరతునికుమారులే యగుదురు.అపుడు కుమారశబ్దముతోఁగూడ పఠితమైన స్త్రీగణములును భరతుని స్త్రీగణములే యగుదురు. ఇట్లు అర్థముచేసికొన్నయెడల రామునికితరభార్యలుండుట సిద్ధింపదు- ఇట్లే (రంస్యసే, భుజైరభిమృష్టః) ఇత్యాదులచే, భోగప్రసక్తిమాత్రము చేయుటచే ధర్మార్థమైనభార్యలు లేరని తెలియుటవలనను, కేవలభోగార్థముగా స్త్రీలను పరిగ్రహించినట్లు శంకించుటకు ఎక్కడను అవకాశము లేమివలనను, రామునికి సీతతప్ప మఱియేధర్మపత్నిగాని భోగకాంతగాని లేదని సిద్ధించుచున్నది కాన (రామస్య పరమాః స్త్రియః) (పరమనారీణాం) (స్త్రీభిశ్చమన్యే)ఇత్యాదులందు అర్థాంతరము నేసికొనవలయును. ఎట్లన, (పరమాః స్త్రియః)అనఁగా పరిచారకులు మొదలైనవారని యర్థము. (పరమనారీణామ్) అనుట కవివచనము గావున లక్ష్మియు భూదేవియు సీతయు భుజములచే నొరసికొనుటగా గ్రహించునది. (స్త్రీభిశ్చమన్యే)అనుట సుందరకాండమున సీత రామునిఁ బాసినదుఃఖమున తాను నశించిపోయినపిదప రాముఁడితరస్త్రీలను పెండ్లాడి సుఖింపఁగూడుననుతలంపుచే చెప్పఁబడినదిగా నూహించుకొనునది. కాఁబట్టి సంప్రదాయసిద్ధాంతానుసారముగా విమర్శింపఁగా రామునికి సీతతప్ప భార్యాంతరము లేదనుట సిద్ధము.

సొంపుమాని బుద్ధులు సెప్పుచున్న మంథరను జూచి యారాణి దానిమాటలను పాటింపక రామునిగుణములనే ఇట్లు కొనియాడఁ జొచ్చెను. "మంథరా! రాముఁడు ధర్మజ్ఞుఁడు; గురువులచే చక్కఁగా శిక్షితుఁడైనవాఁడు; కృతజ్ఞుఁడు; కల్లలాడఁడు; నిర్మలుఁడు; మఱియు రాజునకు జ్యేష్ఠకుమారుఁడు. కాబట్టి అతఁడే యావరాజ్యమున కర్హుఁడుగాన, రాజ్యము భరతాదులకును సాధారణముగా సొంతమన్నమాట పాటిగాదు. 'రామునివలన భరతునకు అనర్థము కలుగు' నందువా? కలుగదే. రాముఁడు తమ్ములను భృత్యులను తండ్రివలెనక్కఱతోను అతిప్రేమతోను కాపాడువాఁడే. అతఁడు నీరాయువై యుండవలయును. అట్టిరాముని యభిషేకమునకు సంతోషించుటకు మాఱుగా ఓసీ! గూనిదానా! ఆఱటపడెద వేల? 'భరతునకు రాజ్యప్రాప్తి' యందువా? రాముఁడు నూఱేండ్లు పాలించినపిదప పురుషతిలకుఁడగు భరతుఁడును, పితృపైతామహమైనరాజ్యమును బొందఁగలఁడు అది నిజము. ఇప్పుడు రామాభిషేకము జరుగుట యుచితము. అట్టియుచితమైనశోభనమును సమీపించియున్నది. ఇఁక భరతాభిషేకము జరుగుకల్యాణమును రాఁగలదు. మంగళము లిట్లు ఒకటివెనుక నొకటిగా కలుగుట కుండఁగా నీవు పరితపించుటకు కారణమేమి? 'నాకనర్థము వచ్చు' ననెదవా? రాదు. రాముఁడు కౌసల్యకంటె నాకు ఎక్కువగా శుశ్రూష సేయుచున్నాఁడు. కావున నాకు భరతునికంటె, రామునినే ఎక్కువగా మన్నింపవలసియున్నది. రాముఁడు తమ్ములను తనవలెనే చూచుకొనువాఁడు గనుక రామునకు రాజ్యమువచ్చునేని యపుడు భరతునికిని రాజ్యమువచ్చినట్టేసుమా. కాన యిఁక దానికొకనూఱేండ్లు కావలయునా" అనియె. మంథర కైకేయి చెప్పినది విని మిక్కిలిదుఃఖితయై వేఁడినిట్టూర్పులు పుచ్చి యామెను జూచి "అయ్యో! నీకు వివేకము చాలదు. కనుక మేలిది యని తెలిసికొనక చెఱుపునే మంచిదిగా కనుఁగొనుచున్నావే భరతుఁడు రాజ్యము దూలి యడవిపాలయ్యెడివగపును, నీవు సుఖముల పగనాడువిపత్తును, గూని, సవతికి నూడిగము సేయుమహాదుఃఖమును మీఁదుమిక్కిలి సముద్రమువలె అపారముగా కలిగింపఁగా, అందు మునిఁగి తెప్పలఁదేలుచు, ఇట్టిదురవస్థ గలనిన్ను నీవే తెలిసికొనకున్నావు. 'నూఱేండ్లకు వెనుకనైన భరతునకు రాజ్యముగలుగు' నందువా? కైకేయీ! రాముఁడిపుడు రాజగును. రామునివెనుక అతనికొడుకగువాఁడే రాజగును. కాని భరతుఁడును అతనికొడుకులును ఎప్పటికి రాజుగా నేరరు. కనుక రాజవంశమున భరతునిపేరే యుండదు. కాఁబట్టి దానినుండి యతఁడు తొలఁగింపఁబడినవాఁడే యనవచ్చును. ఒక రాజునకుఁ గలుగుకుమారు లందఱును రాజ్యమునకు రాజుగాఁ బ్రతిష్ఠింపఁబడిరేని, నీతి, మిక్కిలియు చెడి రాజ్యమునకు హాని గలుగును. కాఁబట్టి, రాజులు తమకు గుణవంతులైనకొడుకులు వేఱ యుండినను, జ్యేష్ఠునికే రాచఱికపుకార్యముల నప్పగించుచున్నారు. కనుక నీకొడుకునకు ఇఁక నెన్నఁటికిని రాజ్యము రాదు. కందు లేనినీయవయవములకు ఇట్టికుందు గలుగునా! రాజ్యము రాకున్నను వచ్చినట్టేయంటివిగా!

ఔను, నీకు ఏకొడుకు మీఁదను గాదలి ; కాన నీకొడుకునకు రానున్నయనర్థము దెలియవు. నీకొడుకు అనాథునివలె సుఖములను మిక్కిలి దిగనాడి రాజవంశమునందు గణనయు మిక్కిలి లేక తూలనున్నాఁడు. 'రాముఁడు పెద్దవాఁడై యుండఁగా భరతునకు రాజ్యము వచ్చుమార్గము లేదే' యని తలంతువు గాని ఇది తెలిసిననేను భరతునకు రాజ్యము దూరలకుండునట్టిహితము నీకుఁ గలిగించుటకై యిట వచ్చితిని. ఇది నీకుఁ దెలియునా? సవతికి అభివృద్ధిగలుగుచుండఁగా నాకు పారితోషిక మొకటి యిచ్చుటే కాక మఱొకటియు సేయఁగోరుచున్నదానవుగా! ఇంత తెలివి లేనినీవు నన్ను నీమేలుకొఱకై వచ్చినదిగా తెలిసికొందువా? తెలిసికొనవు. రాముఁడు శత్రువు లుండువఱకు ఊరకుండి పగవారందఱును తీఱఁగానే అకంటకమైన రాజ్యమునొంది భరతుని దేశాంతరమునకైన వెడలఁగొట్టును; లోకాంతరమునకైనను బంపును. ఇదిమాత్రము నిజము. రాముఁడు భరతుని కింతయనర్థము మిఁకమీఁదఁ జేయును. నీవో యిపుడే చేసియైనది. కాకేమి? భరతుఁడు బాలుఁడుగా నుండునపుడే వానిని నీవే మేనమామయింటికిఁ బంపితివి. 'పంపినంతనే యేమి మునిఁగెనో' యనకు. చెప్పెద వినుము. వృక్షములు మొదలైన స్థావరములందుఁగూడ, ఒకటికొకటి మిక్కిలి దగ్గఱగా నుండుటవలన, ఒండొంటికి పరస్పరము కూడికొను చెలిమి గలుగుచున్నది. ఇఁక అట్లుండుటవలన చేతనులందు కలుగు చెలిమి చెప్పవలయునా? కనుక భరతుఁడు దాపుననే యుండెనేని దశరథునికిని రామునికిని మిక్కిలి నెయ్యము గలిగియుండును. అట్టిదాపును నీవే చెఱిచితివి. శత్రుఘ్నుఁడు భరతునకు వశుఁడై వర్తించువాఁడు; కనుక భరతుని వెంటనే పోయినాఁడు. లక్ష్మణుఁడు రాము నాశ్రయించినట్లు, వాఁడు భరతుని ఆశ్రయించినవాఁడు. ఆశత్రుఘ్నుఁడేని దగ్గఱనుండినను, దశరథునికిఁగాని రామునికిఁ గాని వానియందలి చెలిమినిబట్టి భరతునియందును నెయ్యము గలుగవచ్చును. అదియును లేదయ్యె. అడవిఁ గొట్టలేఱుకొని బ్రదుకువారు, ఒకచెట్టును, నఱుకఁదగిన కాలమగుటచే, నఱుకుటకు రాఁగా ముండ్లపొదలు దానిచుట్టును దాపుగా అలమికొనియుండుటచే వానిదాపువలన ఆచెట్టు తనకుఁగలిగిన పెనుభయమునుండి తప్పించుకొనెనని, అంతఃపురమందలి మనకు, జను లాడుకొనఁగా వినికిగలదుగదా. అట్లే భరతుఁడిచటనే యుండెనేని ఆదాపున మనదశరథునకును ప్రేమగలిగి, వానిని, రామునివలనఁ గలుగుభయమునుండి రక్షించును. లక్ష్మణుఁడు రామునిరక్షించును. అట్లె రాముఁడు లక్ష్మణుని రక్షించును. అశ్వీదేవతల కిరువురకుఁబోలె వారలిరువురకును, తోఁబుట్టువులగుటచేఁ గలిగినయొద్దిక తెద్దయుఁ గలిగియుండుట లోకములందంతటను ప్రసిద్ధమైయున్నది. కాఁబట్టి రాముఁడు లక్ష్మణున కేకీడుఁగానిచేయఁడు. రాముఁడు భరతునకు మాత్రమే కీడు సేయును. ఇందులకు సందేహము లేదు. కాఁబట్టి భరతుఁ డిచ్చటికి వచ్చినయెడల రాముఁడు చంపును గనుక భరతుని కేకయరాజగృహమునుండియే యడవికిఁ బోనిమ్ము. అప్పటికి ప్రాణహాని కలుగదు గావున అట్లు సేయుటయే నాకిష్టముగానున్నది. నీకొడుకునకుఁ బ్రాణములైనను దక్కును గాన

నీకును ఇది మిక్కిలిహితమేయగును. భరతుని అడవికిఁ బంపవేని రాజ్యమున్నైనను గలి గింపవలయును. భరతుఁడు తండ్రియనుమతినొంది, ధర్మమున తండ్రిరాజ్యమును బడ యునేని నీకుఁ గలిగినట్లే నీబంధువర్గమునకు తప్పక మేలగును. నీకొడుకు రాజ్యము లేక రామునివశమునం దుండరాదు. ఏలన నతఁడు సుఖమే యనుభవింపఁదగినవాఁడుగాని కష్టమునకుఁ దగఁడు. ఒకరిక్రిందనుండెనేని సుఖమే కలుగునా? మఱియు రామునకు సవతితల్లికొడుకు; కావున సహజశత్రువు. రాజ్యము లేమిచే అన్నియును లేక అస హాయుఁడై యున్నభరతుఁడు, రాజ్యాభిషిక్తుఁ డగుటచే సర్వసంపదలు గలిగి సహా యయుక్తుఁడైనరామునివశమునఁ జిక్కి యెట్లు జీవింపఁగలఁడు? ఎట్లాలోచించినను రాముఁడు భరతుని చంపక విడువఁ డనుట సిద్ధము. అడవియందు సింగము వెంట తఱుమఁగా చావ నున్న యేనుఁగుమిన్నవలె రామునికి చిక్కి క్రిందుపడి చావను న్న నీకొడుకును నీవు రక్షింపవలయును. పూర్వము నీవు పెనిమిటికి మిక్కిలి ప్రియు రాలుగా నుండు సొంపువెంపుచే గర్వించి, నీసవతిని రామునితల్లిని నిరాకరించియు న్నావు. ఇప్పుడది తనకొడుకు రాజు కాఁగానే నీమీఁద పగ తీర్చుకొనకుండునా? అవశ్యము నిన్ను పనికత్తెగాఁ జేసికొని పీడించును. విస్తారములైనమణులు గలగనుల తోఁ గూడినపర్వతవనములును పట్టణములును గలభూమికి రాముఁ డెపుడు రాజగునో అపుడే నీకొడుకును నీవును దారిద్ర్యమునొంది యమంగళకరమగుటచేఁ జెప్పరాని యవమానమును బొందుదురు. రాముఁ డెప్పుడు భూమికి రాజగునో అపుడే భరతుఁ డు మిక్కియు నశించుట నిజము. కాఁబట్టి నీకొడుకునకు రాజ్యము వచ్చుటకును మఱి యొకనిని (రామునిని) పట్టణమునుండి వెడలఁగొట్టుటకును, తగినయుపాయము నిప్పుడే యాలోచించుకొను' మని చెప్పెను. ఇది ఎనిమిదవసర్గము.

——◆ కైకేయి మంథరదుర్బోధమునకు లోఁబడుట. ◆——

మంథర యిట్లు చెప్పఁగా విని కైకేయి 'నేను నాసినా' యగుదునని కోప ముచే మండుచున్నట్లు మొగం బెఱ్ఱవాఱఁగా వెచ్చనినిట్టూర్పుపుచ్చి మంథరతోనే నిపుడే రాముని వేగముగా నడవికిఁ బంపెదను. భరతుని శీఘ్రముగా యౌవరాజ్యం బునకుఁ బట్టము గట్టించెదను. మంథరా! ఏయుపాయముచే భరతునికి రాజ్యమువచ్చు ను? రాముని కేవిధమునను రాజ్యము లేకుండును? నీవినిమాత్ర మిపుడు చక్కఁగా ఆ లోచింపు' మనియె. మంథర సహజముగా పాపమందే కన్నులు కలది. కావున నది ఆరాజపత్ని యట్లు సెప్పఁగా విని, రామునిప్రయోజన మగుపట్టాభిషేకమును చెఱు పఁబూని, కైకతో 'సెబాసు ! కైకేయి! నీ కొడుకగు భరతునికే యెట్లు రాజ్యమం తయు కలుగునో చెప్పెద వినుము. కైకేయీ! నీ సొంతప్రయోజనమును నీవే పలు మాఱు చెప్పుచుందువు. అట్టిదానిని నావలననే వినవలయు నని కోరుచున్నావు. ఏల? నీవాయుపాయమును మఱచితివా? లేక, అది నీతలంపునకు వచ్చియుండియు నేనై చెప్పఁగా వినవలయునని దాఁచుచున్నావా? విలాసినీ! నేనే చెప్పఁగా వినవలయు

నని నీ కభిలాష గలదేని చెప్పెదవినుము. విని, యుక్తమా కాదో చక్కఁగా విచారింపు'మనియె.ఇట్లు అది చెప్పినమాటవిని కైక తనకు హాయిగా పఱచియున్న పానుపునుండి ఆదరాతిశయమున కొంచెము లేచి దానినిఁ జూచి 'మంథరా! ఏయుపాయమును పన్నినచో భరతునికి రాజ్యమువచ్చునో; రామునికెట్లును రాకుండునో, అదిచెప్పుము' అనఁగా పాపమునే చేయఁ జూచునాగూనిది రాముని యభిషేకప్రయోజనమును చెఱుపఁబూనినదై "దేవీ! తొల్లి దేవాసురయుద్ధమందు నీపతి యగుదశరథుఁడు దేవేంద్రునకు సాహాయ్యము సేయువాఁడై తనప్రాపుగలరాజులతోఁగూడ నిన్నుఁదోడుకొని దక్షిణపుదిక్కుగా దండకారణ్యమునుచేరి యచట తిమిధ్వజుఁడున్న వైజయంత మనుపట్టణమునకుఁ బోయెను. ఆతిమిధ్వజుఁడు శంబరుఁ డనుపేరు గల గొప్పరాక్షసుఁడు. వానికి నూఱువిధము లైనమాయలు తెలియును. వాఁడు దేవతల నోటుపడక క్రిందుపఱచినవాఁడై దేవేంద్రునితో యుద్ధము సేసెను. ఆమహాయుద్ధమున మధ్యాహ్నము దేహమంతయు బాణశూలాదులపోటులను, పరిఘగదాదుల వాటులను,పడి పలువిధములైనగాయములుదగిలి పరుండి నిదురించుచున్న పురుషులను రాత్రికాలంబున అదాటునఁ బోయి రాక్షసులు చంపిరి. అందు ఆరాత్రికాలమున మహాభుజుం డగుదశరథభూనాథుఁడు, ఆయసురులతో మహాయుద్ధముచేసెను. తుదకు ఆయసురులచే దేహమంతయు తూము లగునట్లు పలువిధము లైనయాయుధములచే కొట్టుపడినవాఁడయ్యె. అప్పుడు నీ వతనికి సారథ్యము సేయుచుంటివిగాన మూర్ఛిల్లిన నీపురుషుని యుద్ధభూమినుండి యవ్వలికిఁ గొనిపోయి శీతోపచారములు సేసికాచితివి. నీవు తొలఁగఁ గొనిపోయినచోటికిని ఆయసురులువచ్చి నీమగనిపై నానాయుధముల వైనఁగా కొట్టువడినయతనిని, నీవప్పుడును అచటనుండి మఱొక్కచోటికిఁగొనిపోయి మరలఁ గాపాడితివి. సొగసులాఁడీ! నీవు రెండుమాఱులు రక్షించినందులకు ముదము నొంది యతఁడు నీకు రెండువరములిచ్చెను. దేవీ! నీవు పతితో 'నేనప్పుడు గోరుదునో యపుడావరము లిమ్ము;తీసికొనెదను' అని చెప్పితివి. ఆమహాత్ముఁడును 'వల్లె' యనియె. ఈవృత్తాంతము ; జరుగఁగా నేనుజూడలేదుగావున నాకుఁ దెలియదు.ముందొకప్పుడు నీవే నాకిది చెప్పఁగా తెలిసినది. ఈవృత్తాంతము నీయందలినెయ్యమునుబట్టి నీకెప్పుడైన నుపయోగించునను తలంపుతో మఱవక నామనస్సునందుంచుకొని యున్నాను. దశరథుఁడురామాభిషేకమునకై సంభారములుగూర్చుచున్నాఁడు. నీవు, అతఁడాప్రయత్నముచేయకుండునట్లు బలాత్కారమున నిలుపుము. ఆరెండువరములకు భరతునికి పట్టాభిషేకము సేయుటయు రామునిఁ బదునాలుగేండ్లు అడవియందుండునట్లు గావించుటయుఁ గావలయునని మగని నడుగుము. రామునిఁ బదునాలుగుసంవత్సరములు అడవియందుండునట్లు గావింతువేని,అంతకాలమునకు నీకుమారుఁ డగు భరతునిమీఁద ప్రజలకు మనంబున మిక్కిలియనుగ్రహముగలుగును. పిదప రాముఁడువచ్చి రాజ్యమునకై యెన్నిపాట్లుపడినను విఫలుం డగునుగాన భరతునకు రాజ్యము స్థిర

మగును. ఈయుపాయమును జెప్పితిని. వీనిని జరుపువిధమును చెప్పెద. నీవిపుడు కోపమువచ్చినట్లు కోపగృహమును జొచ్చి మాసినచీరగట్టుకొని పఱుపు లేనిరిత్తనేలపైఁ బరుండియుండుము. దశరథుఁడు నీయొద్దకు రాఁగాఁ జూచి దుఃఖము పూని యేడ్చుచు అతనిని తలయెత్తియుఁజూడకుము. అతనితో మాటలును ఆడకుము. నీభర్తకు నీయందెపుడును మిక్కిలియుప్రీతి. ఈవిషయమునందు నాకు సందేహము లేదు. నీకొఱకు అతఁడు నిప్పులోఁగూడ నుఱుకును. ఇట్టి ప్రియురాల వగునీకు అతఁడు కోపము గలిగింపఁజాలఁడు. నీవు కోపించితివేని నిన్నుఁ దల యెత్తియు చూడంజాలఁడు. నీప్రీతికొఱకు ప్రాణములనైనను విడుచును జుమా. ఆభూపతి నీమాటను జవదాఁటనుం జాలఁడు. నీవు మందబుద్ధివిగాన ఇంతటిదానవని నిన్నెఱుఁగవు. ఇపుడు నీసౌందర్యమెంతటిదో తెలిసికొనుమా! దశరథుఁడు మణులను ముత్తియములను బంగారు నాణెములను మఱియు పలువిధములగు మేలైనపదార్థములను నీకొసఁగును. నీవు వానియందు కొంచెమేనియు మనసునుంపకుము. భాగ్యవంతురాలా! దేవాసురయుద్ధమున దశరథుఁడు నీకిచ్చినవరములనే తలంపుము. నీవు పట్టినప్రయోజనము నిన్ను మించిపోనీయకు; సర్వవిధముల సిద్ధించునట్లు చూడుము. ఎపుడు దశరథుఁడు తానే నిన్ను లేవనెత్తి కూర్చుండఁబెట్టి వరమిచ్చునో యపుడు అతనిని సత్యంబున స్థిరముగా నిలిపి 'రాముని పదునాలుగుసంవత్సరములు అడవియందుండునట్లు సేయుము. భరతుఁడు భూమికి రాజుగాను, కేవలరాజే కాదు, రాజులకు రాజుగాను, గావింపుము' అని యీ వరమడుగుము. రామునిని పదునాలుగేండ్లు అడవియందు వసించునట్లు గావించితివేని యింతలో నీకొడుకు ప్రజలయనురాగముచే రాజ్యమునందు వర్ధిల్లి స్థిరముగా కుదురుకొని వేరూని మూలబలమును వశముచేసికొనియుండును. కాన, రాముఁడు మగలి వచ్చినను అతనికి రాజ్యముదక్కదు గనక మిగతకాలముకూడ నీకొడుకే రాజై యుండగలఁడు. కాఁబట్టి నీవు భరతునికి రాజ్యముగోరునపుడు, అంతటితో విడువక రాము నడవికిఁ బంపుటయు అవసరముగా వేఁడుము. ఇట్లు చేయుదువేని నీకొడుకునకు సకలప్రయోజనములును సమకూఱును. ఇట్లు రాముని అడవియందుండునట్లు చేసితివేని రాముఁడు బహుదూరమునందుండుటవలన ప్రజలకతనియం దనురాగము మానిపోవును. †అప్పుడు రాముఁడు రాముఁడేయగును. భరతుఁడు ప్రజలను పాలించుచు వారిస్నేహమునకు పాత్రుఁడై యుండుటచే మరల రాముఁడు అడవినుండి వచ్చి పగ చూపినను కొనసాఁగదు మఱి తక్కినపగవారును గలుగరు. కనుక పగవారినందఱిని గెలిచి నిరాటంక

† 'రామో రామో భవిష్యతి' అనిమూలము. రాముఁడు రాముఁడే యగునని యర్థము. రాముఁడు సహాయసంపత్తి లేక తాను కేవలమొంటివాఁడే యగుననుట. లేక 'రమయతీతి రామః' అనువ్యుత్పత్తిచే అడవియందు మునులను రమింపఁజేయుచు; అక్కడనే యుండునని యర్థము. 'రామః అరామో భవిష్యతి' అనిఛేదము సేసినయెడల, రాముఁడు అరాముఁడు-అనఁగా ప్రజలను రంజింపఁజేయనివాఁడు-బహుకాలము అడవియందుండుటచే ప్రజలస్నేహమునకు పాత్రముకానివాఁడు అగునని యర్థము.

ముగా నీకొడుకు రాజగును. రాముఁ డడవినుండి యిటవచ్చునంత కాలమునకు, నీకొడుకు బుద్ధిమంతుఁడుగావున ప్రజలను రంజించి వశముగావించుకొని స్నేహితులను సంపాదించి రాజ్యమునుండి చలింపనట్లు వేరూని స్థిరముగా నెలకొన్న వాఁడగును. నీవు కోరినది యడుగుటకు ఇదియే తగిన కాలమని నాకుఁ దోఁచుచున్నది. కాఁబట్టి దశరథుని నిర్బంధించి రామాభిషేకమును సమకట్టు ప్రయత్నమునుండి మరల్పుము. మరల్చుటకును ఇదియే తగిన కాలమని తలఁచెద' ననియె. మంథర, యిట్లు ప్రతికూలమైనరామవివాసనభరతాభిషేకములును తనకు అనుకూలమైనవిగా బోధింపఁగా కైకయు నట్లే గ్రహించినదయ్యె. ఆపడఁతి పూర్వము మిక్కిలిగొప్పవిషయములందే కన్నుగలిగినదికాని అనుచితములైనయర్థములను పాటింపదు. అయినను అది యాగూనిదానిమాటలకు మిక్కిలియుబ్బురపాటు నొంది బెదరినగోడిగవలె తప్పుదారి త్రొక్కినదయ్యె. విరుద్ధార్థమును మంచిప్రయోజనముగా గ్రహించి, అట్లు తెలిసికొన్నందులకై యుబ్బునొంది, మంథరతో 'కుబ్జా! ఇంతకాలము నీవింత మేలైనదానవనియు మేలు బోధించుదానవనియు నేను తెలియకుంటిని. గూనివారలు తక్కినజనులకన్న చుఱుకైనబుద్ధి గలవారు; నీవో, బుద్ధిచేత నిశ్చయింప వలసినవిషయమందు భూమి నున్న యాగూనివారలందఱికన్నను కన్నాకైనదానవు. నీవొక్కతియే నాకార్యములందు మిగుల నక్కఱగలదానవు; నామేలుగోరుచుండుదానవు. నీవు లేనియెడల రాజు రామాభిషేకముచేసి నన్నుఁ జెఱుపం గోరియుండును. నేను అది తెలిసికొనను సుమా. లోకమున అవయవములు వికృతముగాఁ గూడుకొని, వంకరలై, చూపునకు మిక్కిలియు వెఱపుపుట్టించునట్టి గూనివారలు పెక్కండ్రున్నారు. నీవట్లు కాదు. వాతముచే వంగినకమలమువలె వాతదోషముచే నీదేహము వంగినదయ్యును, చూడ్కికి సుందరముగానే యగపడుచున్నావు. నీఱొమ్ము, మూఁపులనిక్కును చూచి మచ్చరించునట్లు, ప్రక్కల సమముగా బలిసి మూఁపులవఱకుఁ బొడువైనది. దానిక్రింద సుందరం బగుబొడ్డుగలకడుపును, తనతోడిదైనఱొమ్ము పొడవుగానుండుటను జూచి, తన కంతపొడవు లేమికి సిగ్గుపడి చిక్కినట్లు సన్నముగానున్నది. నీమడికట్టు విఱివిగానున్నవి. నీగుబ్బలు యుబ్బులైనవి. నీనెమ్మొగము కలంక లేని యచ్ఛపుఁజందురునివలె ముద్దుగులుకుచున్నది. ఔరా! నీయొప్పిదమేమే! మొలనూలిదండ గలగల మ్రోఁగుచు నీజఘనమునకు మురువుగూర్చుచున్నది. నీపిక్కలు ఒడ్డొంటికి పొందికగా తీరి మిక్కిలి పిక్కటిలుచున్నవి. నీపాదములు రెండును నిడుదలై బెడఁగారుచున్నవి. మంథరా! నీవు తెలిపట్టుచీర గట్టుకొని, నిడుగలైన తొడలు రంగార, నాముంగల తిరుగునపుడు ఆఁడురాయంచవలె తులకించుచున్నావు. అసురవరుఁ డైనశంబరునియందుఁ గలవేయుమాయ లన్నియును, మఱియు లోకంబునఁ గలయితరమాయలును, వేనవేలుగా నీయందున్నవి. రథచక్రపుదాపున ముక్కువలె నిక్కుగలిగి యున్నయవయవవిశేషమునువలె. నిడువై యుండునీగూనులో నీకుఁ గలబుద్ధులును నీవు నేర్చినరాజనీతులు

ను మాయలును వాసము చేయుచున్నవి కుబ్జా! భరతుఁడు పట్టాభిషిక్తుఁడై రాముఁ డడవికిఁ బోవఁగానే, నేనీగూనుపైని బంగారుదండ వైచెదను. మంథరా! నాకు కార్యముసిద్ధించినపిదప సంతోషించి నేను పదాఱువన్నె మేలియపరంజితో కంచెలచేసి నీగూనుపైఁ బఱచి యలంకరించెద; లేక చందనముతో మెదిపిన మేలియ పరంజిని నీగూనునకుఁ బూసెద. నీమొగమునకు, పలువగలరత్నములచే వింతరంగులు గలిగి సింగారముగులుకు బంగారుతిలకమును చేయించెదను. మఱియు నితరములైన మంచిసొమ్ములను గావించియిచ్చెద. నీవు మంచివిలువ గలవలువ గట్టుకొని దేవతలవలె యిటునటు తిరుగుచుండఁగలవు. చందురునితో పోటిగొనుచు సాటిలేని యొప్పు గులుకునీనెమ్మొగముతో నీవు నాసవతులను జూచి గర్వించి లెక్క గొనక యెల్ల వారిని తృణీకరించువిన్నాణంపు మేటినడతో తిరుగాడఁ గలవు. కుబ్జలందఱును సకలాభరణములను అలంకరించుకొని, నీవు నాపాదములను గొలుచుచుండునట్లు, నీపాదములను ఎప్పుడు గొలుచుచుండుదురు' అనియె. ఇట్లు తన్నుమిగులఁ గొనియాడుచున్నదై వేదియందున్నయగ్నిజ్వాలవలె తెల్లనిపాన్పునం బరుండియున్న యాకైకను జూచి మంథర 'కల్యాణీ! నీళ్లుపోయిన వెనుక అనకట్ట కట్టుట యెప్పుడుగదా. రామాభిషేకము అయినపిదప నీవు వరమడిగియు ప్రయోజనము లేదు. కావున ఊరక యుబుసు పుచ్చక లెమ్ము. కోపగృహమునకుఁ బోయి రాజురాక నెదురుచూచుచుండుము' అని పురికొలుపఁగా, వాలుంగన్నులవన్నె చూపుచు, మగనికి తాను ప్రియురాలై యుండు పెంపునను, చక్కఁదనంపుసొంపునను, మదమునను, గర్వించియున్న యానాయికాశిరోమణి, ఆగూనిదాని మాటలకు లోనై దానితోఁగూడ నాకోపగృహమునకుఁ బోయి లక్షలకొలఁది వెలగల ముత్తెపుసరులను మఱియు నుత్తమములైన సొమ్ములును తీసివైచి, ఆభరణములు లేమిచే అచ్చపుబంగారువలె మేను వెలుంగ, అందు పుడమిపయిఁ బరుండి మంథరనుజూచి 'కుబ్జా! భర్తవచ్చి నాకోరిన వరము లీయఁడేని నేనిచ్చటనే ప్రాణములు విడుచుట నిజముగాన అపుడు నీవు రాజునకు (దశరథునకు లేక కేకయరాజునకు) నేనిచ్చటఁ జచ్చితినని చెప్పఁగలవు. అట్లుగాదేని రాముఁ డడవికిఁ బోవఁగా భరతుఁడు భూమికి రాజు గావలయు. ఈ రెంటిలో నొకటి జరుగుట నిజము. మెచ్చుబంగారముతో నాకుఁ బనిలేదు. మణులిచ్చిన నాకు ప్రయోజనము లేదు. సొమ్ములిచ్చినను నాకు కొఱగావు. రాముఁడు పట్టాభిషిక్తుఁడయ్యెనా ఇదియే నాప్రాణములకు తుద సుమా!' అనియె. అంత ఎంతయు క్రూరంపుఁబలుకులుపలుకు నాకుబ్జ, కైకకు మేలును, రామునికిఁ గీడును, గావింపఁబూనినదై యా రాజమహిషిని జూచి 'కల్యాణీ! రాముఁ డీరాజ్యమును బట్టముకట్టుకొనెనా నీవును నీ కొడుకును చింతలపాలయి తపించుట నిజము. కాఁబట్టి రామునకుఁగాక నీకొడుకునకె పట్టాభిషేకమగునట్లు ప్రయత్నింపుము' అని ములుకులవంటిపలుకులచే మాటిమాటికి మర్మముల నాటునట్లు దీటుకొలుపఁగా, కైకయు మిక్కిలియు దుఃఖించి 'అంత

నెయ్యము తియ్యము గలభర్త యింతలు సేయునా' యని అొమ్మున చేయిపెట్టుకొని అబ్బురపడుచు రామునిఁ బట్టముగట్టుటకు కినిసి కినిసిపడుచు గూనిదానింజూచి'కుబ్జా! నే నిచటనే యుండి యమలోకమునకుఁ బోవుట విని నీవు రాజునకు దెలుపనైనఁ దెలుపుము; లేదా,రాముఁడు చిరకాలమడవికిఁబోయి యుండఁగా భరతుఁడు చిరకాల రాజ్యసుఖమును బొంది కోర్కి నిండారినవాఁడై నను గావలయు. ఈ రెంటిలో ఏదేని యొకటి సిద్ధము. రాముఁ డిచటనుండి కదలి యడవికి బోవఁడేని నేను పఱపులపయిని పరుండను; పూవుల ముడువను; గంధ మలందను; అభ్యంజనమును అన్నపానములను గయికొనను. ఏదియు నొల్లను.ఇచట ప్రాణములుకూడ పెట్టుకొనను' అని యిట్లు బెట్టిదముగా పలికి యంత సొమ్ములన్నియు దీసి నేలపైనైచి పఱపు పఱవనిభూమిపై, పుణ్యము క్షీణింపఁగా ఆకాశంబుననుండి భూమిపైఁ బడినకిన్నరివలెఁ,బరుండెను.అప్పుడు మిక్కిలికోపము చీఁకటివలె మొగమునఁ గ్రమ్ముకొనఁగా, చుక్కలజంతులవలె ప్రకాశించు మేలి తెలిపూదండలు పాఱవైచి,మనస్సున నదరు చున్న యారాజపత్ని,చుక్కలన్నియు మాటుపడఁగా పెనుఁజీఁకటి యలముకొని యున్నయాకాశమువలెఁ జూపట్టుచుండెను. ఇది తొమ్మిదవసర్గము.

---

దశరథుఁడు కైకను జూడవచ్చి యనునయించుట.

కైకేయి, పాపాత్మురాలగుకుబ్జ విపరీతముగాఁ జేసినయుపదేశమునకు లోఁబడి విషము పూసినబాణము గ్రుచ్చఁగా క్రిందఁబడినకిన్నరివలె భూమిని బరుండెను. మఱియు నాతరుణి తనపట్టినకార్య మొనఁగూడునో యని విన్నఁబోయి మంథరవాక్యమునకు బేలుపడి, సర్పకన్యకవలె వేఁడినిట్టూర్పులు విడుచుచు, ఒకగడియసేపు తనకు సుఖముఁ గూర్చునుపాయమును చింతించి, చేయవలసిన దిది యని మనస్సున నిశ్చయించి, మంథరనుజూచి 'ఓసీ!నీవుచెప్పినదంతయుఁ జక్కఁగా నున్నదే'యనియె. మంథర కైకేయియందు మిక్కిలినెయ్యము గలది; మఱియును కైకకార్యములందు మిక్కిలి యక్కఱ గలది. కనుక ఆమె చక్కఁగా నిశ్చయము చేసికొన్నవిషయమును విని పెనుసిద్దిని ప్రాపించినదానివలె పరమసంతోషమును బొందెను. అంత నారాజపత్ని కోపముమీఱ తానాలోచించినమార్గమునుండి చలింపకుండునట్లు మనస్సున నిశ్చయించి బొమలు ముడివఱచి భూమిపైఁ బరుండెను. అంతనా కైక కినుకచే ఎట్లయినను గానిమ్మని పలువన్నియలు గలపూదండలును మేలైనభూషణములును పాఱవైవఁగా, అవి యూరక భూమిపయిఁ బడియుండెను. ఆతరుణి పాఱవైచినయా పూలసరులును సొమ్ములును భూమిపై నెఱయ చెదరి, నక్షత్రము లాకాశమును బ్రకాశింపఁ జేయునట్లు, అచటి భూమిని ప్రకాశింపఁజేసినవి. తలను దువ్వుకొనక, కురులన్నియు నొక్కజడగా గట్టిగా ముడివేసికొని, మాసినచీరగట్టి, కోపగృహమునఁ బడియున్న యావన్నెలాఁడి ఉసురు వీడి పడినకిన్నరివలె విలసిల్లుచుండెను. అంత దశరథ

మహారాజు రామునిపట్టాభిషేకమును సమకట్టునట్టు లాజ్ఞాపించి సదస్సులోనివారి యనుజ్ఞనొంది యంత తనమనసులో 'రామునకు పట్టాభిషేకమగుట ఇప్పుడే కదా వెల్లడియైనది. కనుక ఇంతలో ఇది కైకకు తెలియుట కవకాశము లేదు' అని యోచించినవాఁడై అట్టిప్రియవార్తను వినిపించుటకు కైకేయి దగినది గావున, అన్నిట స్వాతంత్ర్యుఁ డగుటచేత తానై ఆప్రియవృత్తాంతమును చెప్పుటకు అంతఃపురము ప్రవేశించెను. చంద్రుఁడు, తన్ను మ్రింగురాహువుతోఁ గూడినదై తెల్లనిమబ్బులు వ్యాపించియున్న యాకాశమును జొచ్చునట్లు, అమ్మహాయశుఁడు తనకు మరణపీడఁ గలిగింప నున్నకైకేయి యుండెడుతెల్లనిగృహమును ప్రవేశించెను. ఆగృహంబున శృంగారరసోద్దీపకముగా చిలుకలు నెమిళ్లు కొంచలు అంచలు కోలకోల కూయుచుండెను. చతుర్విధవాద్యములు నలుగడల శబ్దించుచుండెను. ప్రియానుకూలములగు పలుకుపొందికల మరులు గూర్చుగుజ్జులును పొట్టివాండ్రను అందుఁగలరు. సంపెంగలును అశోకములును విలసిల్లుచున్నతీఁగపొదరిండ్లును పలునగలగృహములును చుట్టును నీటుగులుకుచుండును. దంతములతోను వెండిబంగారములతోను జేయఁబడినయరుంగులు దుఱంగలించుచుండును. దోహదక్రియలచే అందలివృక్షములు సర్వఋతువులందును బుష్పించుచును ఫలించుచుండును. నడబావులు అందంద బెడఁగుచూపుచుండును. దంతపుఁబీఁటలును, వెండిగద్దియలును, బంగారుపుటాసనములును, అందంద భాసిలుచుండు. పలువగలయన్న పానీయములును, పలు దెఱఁగులయి చవులుగులుకుతినుబండములును, అందు నింపారుచుండె. మంజులాభరణభూషితలైనయుత్తమస్త్రీలతోఁగూడి, యది యప్సరసలచే వెలుఁగుస్వర్గలోకముపలె విలసిల్లుచుండెను ఇట్లు సకలసంపదల పెంపున సొంపారుచు, మన్మథోద్దీపనసామగ్రిచే ఇంపుగులుకుచున్న యంతఃపురమును ఆభూవరుఁడు ప్రవేశించి యందు మేలిపాన్పున తనప్రియురాలైనకైకేయిని గానఁడయ్యె. ఆమనుజనాథుఁడు అచట శృంగారరసమును జిప్పిలఁ జేయుచుండుపదార్థములవలనను, ఉచితకాల మగుటచేతను, మిక్కిలికామవికారము ముమ్మరింపఁగా పాన్పునందు తనసుందరి లేకుండుటఁజూచి రతికొఱకు 'కైకేయీ'యనిపిలిచి మాఱుపలుకు లేకుండుటం జేసి మిక్కిలి విషాదమునొందె. విషాదముకలుగకుండునా! ఇంతవఱ కెపుడుగాని దశరథుఁడారతివేళయందు వచ్చునేని కైకేయి ఆవేళను తప్పకఅలంకరించుకొని యుండి చిఱునవ్వుతో ఎదురుకొనుచు ఇంపుగూర్చుచుండనే కాని ఒకప్పుడును తప్పినదికాదు. రాజు ఎప్పుడుగాని అంతఃపురమునుఁ బ్రవేశించునేని కైకేయి లేక యది శూన్యముగా నుండినదియు లేదు. ఇప్పుడు విపరీతముగా నుండుటచేత అతనికి దుఃఖము కలిగెను. దశరథుఁడు కైకేయిని స్వప్రయోజనపరురాలనియు రాఁగలకార్యము తెలిసికొన నేరనిదనియు ఇంతకును ఎఱుఁగఁడు. కనుక ఇంటిలోపలికిఁబోయి మునుపు కైకేయి కనఁబడనప్పుడు అడుగునట్లే అక్కడనున్న ప్రతీహారినిజూచి 'కైక యెక్కడ' నని యడిగె. అంత ద్వారపాలకురాలు మిక్కిలిభయము గొని చేతులు మొగిడ్చి

రాజుతో 'దేవరా! దేవిగారు మిగుల కోపమునొంది కోపగృహమునకు వేగమునఁ బోయినా''రనియె. రాజు కైకేయి అగపడకుండుటకే దుఃఖము నొందియున్నవాఁడు; ఇప్పుడు కోపగృహంబున నున్నదని ప్రతిహారి చెప్పుట వినఁగా మఱియు డెందము కొందలపడఁగా, ఇంద్రియములు కలంగి నలంగి సూటిదప్పి యొప్పుచెడఁగా, మిక్కిలియు దుఃఖము నొందెను. అతఁడు కోపగృహమునకు పోయి యచట నేలమీఁద పరుండఁ దగనిసుకుమారమైనమేనును నేలమీఁద వైచి పడియున్న కైకేయిని, దుఃఖంబునఁ బొగులుచుఁ జూచె. ఆదశరథుఁడు ఏపాపమెఱుఁగనినిర్మలాత్ముఁడు. కనుక రాముని అడవికిఁ బంపవలయు నను పాపపుతలఁపు ఆసవతితల్లికి కలిగియున్నదని తెలియఁడు. మఱియు తాను వృద్ధుఁడు. కైకయో యౌవనవతి. కావున అది యతనికి ప్రాణముకంటె యెక్కుడైనమక్కువయిల్లాలుగా నుండుటచే ఆవ్యామోహమునను, దానితలఁపు తెలియఁడయ్యె. ఆకైక *త్రెంపఁబడినతీఁగవలెను పుణ్యమనుభవించి తీఱఁగా భూమికిఁ ద్రోయఁబడిన దేవతవలెను, కలంగినకిన్నరి చెన్నునను, దివంబుననుండి నేలకు జాఱినయప్సరసవలెను, పరుల మోహింపఁజేయుటకు ప్రయుక్తమై (తనవర్ణములు చెడి) పస గుందినమాయవిధమునను, నేలంబడి యున్న యేఁడుగుట్టమువలెను, వలను జిక్కినలేడికైవడిని, అడవియందు వేఁటకాఁడు విషము పూసినబాణమును నాటఁగా నేలం గూలినయేఁడుయేనుఁగు తెఱఁగునను భూమిని బడియుండఁగాఁ జూచి, అడవిని వేఁటకానితూపున పడియున్న ఆయేఁడుగజమును, గొప్పదైనయొకమగయేనుఁగు వచ్చితడవునట్లు, నెయ్యము దళుకొత్త, తానుభార్యను తడవెను. దశరథుఁడు సహజముగానే కామియైనవాఁడు. మఱియు తామరరేకులవంటి కన్నులు గల యాచిన్నారిని జూడఁగా అతనికామవికారము చెప్పవలయునా! కాన యతఁడు ఆకాంత యేమనునో, యేమిసేయునో, కోపమో, మఱి తెవులో, యని యుల్లము వెఱపుచే మిక్కిలి తల్లడిల్ల, రెండుచేతులతోను దడవి యావగలాఁడిం జూచి 'నాపయినీకుఁగోపమువచ్చుటకుఁ గారణ మేమో తోఁపకున్నది. దేవీ! నిన్నెవరు తిట్టిరే? లేక యెవరైన నిన్నవమానించిరా? జరిగినదంతయు నాకుఁజెప్పుము. కల్యాణీ! నీవు దుమ్మునఁ బరుండి యుండుటకు నాకు దుఃఖము కలుగుచున్నది. నీవు నాకు మంగళములు గోరుచుండుదానవు. ఇది అమంగళకార్యము గదే. నీయెడ మంచిమనస్సు గలిగి ఏయపకారమును జేయక నీకు శుభములే చింతించుచుండువాఁడను. ఇట్టివాఁడనై నే నుండఁగా నీవు

---

*(త్రెంపఁబడినఁ)తీఁగయనుటచే, భూమిన నక్కఁగా అలముకొనిపడియుండుటయు; (భూమిని బొందిన) దేవతయనుటచే, ఆశ్చర్యకరమైనరూపవిశేషముగలిగియుండుటయు; (ద్రోయఁబడిన) కిన్నరియనుటచే, జాలిపడందగియుండుటయు; (నేలజాఱిన) యప్సరసయనుటచే, మిక్కిలి చూడందగియుండుటయు; (పాడయిన) మాయయనుటచే, వర్ణము చెదరియుండుటయు; (వలఁజిక్కిన) లేడియనుటచే, నిశ్చేష్టత్వము కలిగియుండుటయు; (విషబాణము తగిలికూలిన) ఆఁడుయేనుఁగు అనుటచే, మిక్కిలి సంతాపము కలిగియుండుటయు నూహించునది.

దయ్యము పట్టినదానివలె నామనస్సును మిక్కిలి కలంచుచు భూమియందు పరుండి యున్నావేల? లలనా! నీ కేమైనవ్యాధి యున్నట్టయినఁ జెప్పుము. నాయొద్ద సర్వవ్యాధులను నివర్తింపఁజేయ నేర్పరు లగువైద్యులున్నారు. వారు నావలన సర్వవిధములైనసత్కారములను బొంది తృప్తి నొంది యున్నారు; కావున నాయందు మిక్కిలి నెనరుగలవారు. కనుక వారు నీవ్యాధిని పోఁగొట్టి సుఖము గలిగింతురు. నీకు ప్రియము చేసినవాఁడెవఁడు? అప్రియమొవఁడు చేసెను? లేక ఎవనికి అప్రియముఁ జేయవలయునని కోరెదవు? నాకుఁ జెప్పుము. అట్లు ప్రియము చేసినవానికి ఎవనికి బదులు ప్రియము చేయవలయును? అప్రియము చేసినవాని కెవనికి మిక్కిలి అప్రియము చేయవలయును? వారలం జెప్పుము; నేను తప్పక యట్లు చేసెదను. ఇంతేకాని యిందులకై యేడ్వవలదు. దేహమును అలయింపవలదు. ఎవనినిచంపవలయును? వానిం జెప్పుము; చంపరానివాఁడైనను జంపించెదను. ఎవనిని ఆపదనుండి విడిచిపుచ్చవలయును? వానిం జెప్పుమా; చంపవలసినవాఁడైనను విడిచిపుచ్చెదను. దరిద్రుని ఎవనిని ధనసంపన్నునిగాఁ జేయువలయు? చెప్పుము. వాని నట్లేచేసెదను. ఇంతేల! నేనును నావారును అందఱమును నీకే వశవర్తులము; నీవు చెప్పినట్లు చేయువారము. కనుక నాప్రాణములు పోఁగొట్టుకొనవలసియున్నను నీయభీష్టమును చెఱుపుటకు కొంచెమైనను నేను సాహసింపను. నీకు ప్రియము సేయుకొఱకు నాప్రాణములైనను విడుతునే. నీవు మనస్సున ఏది గోరినను, అది నాప్రాణములమీఁద వచ్చునట్టిదైనను, చెప్పుము. తప్పక చేసి తీర్చెద. నాకు నీయందు ప్రేమ మిక్కిలిబలీయము. అట్టిబలము నీకుఁ గలిగియుండుట తెలిసియు నీవు నన్నుఁగూర్చి సందేహపడుటసరి కాదు. నీకోరిన దానిని తీర్చి నీకు సంతోషము గలిగించెదను. సందేహము వలదు. అది నాపుణ్యముమీఁద ఒట్టువెట్టి చెప్పుచున్నాను. సూర్యునిరథచక్ర మెంతదూరము పోవునో అంత మేరకుఁ గలఅపారభూవిస్తారమంతయు నాయధీనము, అంతవిఱకిని నాయాజ్ఞాచక్రము సాగును. కనుక అందు తూర్పునఁగలదేశములు, సింధుదేశమును, సౌవీరము, సౌరాష్ట్రము, దక్షిణాపథము, అంగవంగమగధమత్స్యదేశములు, కాశీ, కోసలము మొదలగు దేశము లందు, ధనధాన్యములు కంబళ్లు మొదలైనయనేకద్రవ్యములు గలుగుచున్నవి. అందు నీవు ఏదేది కావలయునని మనస్సునఁ గోరుదువో యడుగుము; ఇచ్చెదను. ఎంతపిఱికిదానవే! ఇంతకు ఇట్లు భూమిపైఁబడి ఆయాసపడుటవలన పన యేమి? నీవు శుభాత్మురాలవు; ఇట్టివట్టినేలను పరుండఁదగదు. లేలెమ్మా. కైకేయీ! దేనివలన నీకు భయము గలిగెనో దానిని నాకుఁ జెప్పుము. సూర్యుఁడు మంచును విరియించునట్లు ఆభయమును నేను బోఁగొట్టెదను' అనియె. దశరథుఁ డట్లు ఊఱడింపఁగా ఆమెఱుఁగుబోఁడి తాను భూమిమీఁదపరుండుట మొదలయినవానికే వీకితుఁడైయున్న పురుషుని, మఱియు చెప్పిన ప్రతిజ్ఞలు చేయునట్లు నిర్బంధించి, మీఁదుమిక్కిలి పీడించుట కారంభించినదయ్యె. ఇది పదియవసర్గము.

## కైకేయి భరతునికి రాజ్యము గట్టి రాముని నడవికిఁ బంపునట్లు దశరథునితోఁ జెప్పుట.

మన్మథునివాఁడితూపులు మనస్సునఁ గాఁడఁగా మరులు కొని దానియురవడికి లోనయి అది త్రిప్పినదారిని తిరుగుచున్న యాదశరథభూనాథునిఁ జూచి కైక రాముని నడవికిఁ బంపు క్రూరంపుమాటలను చెప్పఁబూని 'నాథా! రోగము నాకేమియు లేదు. ధనమును గోరలేదు; నన్నెవ్వఁడు నవమానింపఁడు. మఱియు నాకు కోర్కె యొకటి యున్నది. దానిని నీవు తీర్తువని కోరుచున్నాను. నీవు దానిని ఒడఁబూర్తువేని యట్లు చేసెదనని గట్టిగా ప్రతిజ్ఞ సేయుము. ఆపల నేనుకోరినదానిని చెప్పెద'ననియె. ఆమ్మహాతేజుఁడు తనలో 'నన్నింత ప్రేమగలవానినిగాఁ దెలిసియు నమ్మక యిది ప్రతిజ్ఞ కూడ చేయుమనుచున్నది, ఎంతబేల! యని ఒకింత నవ్వుకొని తెలినవ్వుమొలకలచే సహజముగా తులకించుచుండు నా కైక మొగమును తన కభిముఖముగాఁ జేసికొనుటకై దాని నెఱికురులను చేతఁ బట్టుకొని తలను ఒడిసియుంచుకొని 'మూఢురాలా! పడఁతులందు నీకన్న ప్రియురాలు నాకు లేదు పురుషులలో పురుషలలాముఁడగు రాముని కన్న ప్రియుఁడు నాకుఁ గలుగఁడు. ఇది తెలియవేమి! నీసౌభాగ్యంపునిక్కు, దీనిని నీకు తెలుపను. నారాముఁడు ఎవరికిని గెలువరానివాఁడు ఎందును సాటి లేనిబలుమేటి, మహాత్ముఁడు, ప్రాణములకన్న పూజ్యుఁడు. నాబ్రతుకుఁదెరువు. అట్టి రామునితోడు, బాస చేసెద. నీవు మనసునఁ గోరుదానిని చెప్పుము. ఎవనిని ఒకగడియ చూడకుంటినా నాకు ప్రాణములే నిజముగా నిలువవో, యట్టినారామునిమీఁద నీవు చెప్పినట్లు చేసెదనని యొట్టుపెట్టెద. నా దేహమునైనను విడిచి, తక్కినకొడుకులనైనను దిగనాడి, ఎవనిని విడువక కొలుచుచుందునో అట్టిరాముఁడు సాక్షిగా నీవు చెప్పినట్లు చేయుదునని ప్రతిజ్ఞ చేసెద. కల్యాణీ! ప్రాణములకన్న మిన్నయైనరాముని మీఁదఁగూడ ప్రమాణము సేయునంత ప్రేమాతిరేకమును మోహాతిశయమును గలనాయీహృదయమును చూచియైనను నీకుఁ జెప్పినమాట, నేను తప్పననినిశ్చయించి నీతలఁపు తెలిపి, దుఃఖమునుండి నన్నుఁ గాపుము. నను బ్రతికింపుము. నీదుఃఖమును జూచి యెట్లు బ్రతుకుదునే! నామనస్సును మాటయు ఒక్కరీతిగానే యుండెడి యునికిని చూచియైనను నీవేది మంచిదని తలఁచెదవో దానిని చెప్పుము. నీయందు నాకుఁ గల ప్రేమాతిశయబలమును దెలిసినదానవు. తెలిసియు నాయందు సందేహపడుట తగునా? తగదుగదే! నీకోరిక యొడఁగూర్చి సంతోషము గూర్చెద. ఇందులకై నాపుణ్యముమీఁదను బ్రతిజ్ఞ సేయుచున్నాను'అనియె. కైక, రామునినడవికి పంపి భరతునికి రాజ్యము గట్టింపుమని మంథర చెప్పినవిషయమందే మనస్సు గలది గావున, తాను తలఁచిన ప్రతిజ్ఞను అతఁడు సేయుటఁ జూచి మిక్కిలియు సంతసించి భరతునియందలి పక్షపాతమువలన మొగమోటము లేనిదై పగవారికైనను నోటఁ బలుకరానిమాటను జెప్పుట కాలోచించెను. ఇట్లు రాజు దనకోర్కె తీర్చునట్లు చె

ప్పినవాక్యమునకు మిక్కిలి సంతోషించి యట్లు తనయభిప్రాయముచొప్పున నడచుకొన్న పెనిమిటితో, మరణాంతంబైనభయము గలిగించునది గావున ఎదురుపడిన మృత్యువువంటిమాట చెప్పఁబూని 'నాథా! నీవు, ప్రియపుత్త్రుఁడు పుణ్యము మొదలైనవానిమీఁద క్రమముగా ఒట్టు పెట్టినతీరును, నాకు వరమిచ్చుటయును, అగ్నిహోత్త్రుఁడు మున్నుగాఁ గలముప్పదిమూఁడుకోట్ల దేవతలును విందురుగాక. చంద్రసూర్యులును తక్కిన గ్రహములును ఆకాశమును రేయుంబవలును దిశలును స్వర్గలోకమును భూమియును గంధర్వులును రాక్షసులును రాత్త్రులం ద్రిమ్మరుభూతములును గృహములందలియిలువేల్పులును మఱియు నితరభూతములును నీ విప్పుడు చెప్పినదానిని సాక్షులై యెఱుంగుదురు గాక. సత్యసంధుండును మహాపరాక్రమశాలియు ధర్మజ్ఞుఁడును ప్రమాదరహితుఁడు నయినయితఁడు నాకు వరమిచ్చుచున్నాఁడు. దీనిని దేవతలందఱును విందురుగాక' యని తానొకయబలయయ్యును, ఆబలువిలుకానిని తననైపుణిచే ధర్మపాశమునఁ గట్టి,తనమతమునందు నెలకొలిపి, సత్యసంధుఁడు మొదలైన పలుకులచే నుబ్బించి, సర్వదేవతలను సాక్షులుగా నుండునట్లును చాటి, అంతమీఁద కామవశమున మోహితుఁడై కోరినవర మొసఁగ నున్నమగనితో 'రాజా! పూర్వము దేవాసుర యుద్ధమందు జరిగినవృత్తాంతమును మనస్సునకుఁ దెచ్చుకొనుమా. ఆయుద్ధము జరుగుచుండఁగా నడుమ పగవాఁడగుశంబరుఁడు, నీప్రాణములుగొనకపోయినను, వానిని మిక్కిలి కలఁచి నలఁచి నిన్ను మూర్ఛిలఁజేసినాఁడు.అప్పుడు నేను సారథ్యము సేయుచు ఆరాత్త్రియంతయు ఎచ్చరిక గలిగి నిన్ను చావకుండునట్లు మిక్కిలి యత్నపడి కాపాడితిని. అందులకుఁగాను నీవు నాకు రెండువరము లొసఁగితివి. అప్పుడు నీ విచ్చినయీవరములు రెంటిని రాజ నగునీయొద్ద ఇల్లడగా నుంచియుంటిని. రాజునొద్ద పెట్టినయిల్లడను రాజు కాపాడి యిచ్చుట ధర్మముగదా. నీవు రాజవు; మఱియు సత్యసంధుండవు; అటమీఁద భర్తవు; కనుక ఆవరములను నీవు జాగ్రత్తతో నా కిత్తు వని యడుగుచున్నాను. నాకిచ్చినవరములనే యడుగుచున్నాను జుమీ! కావున వరముల నిచ్చెదనని ప్రతిజ్ఞ సేసి ధర్మమున వానిని నాకీయవేని యట్లవమానపడి యొకక్షణము ప్రాణములు పెట్టుకొందునా! లేదు. ఇప్పుడే,నీకన్నుల యెదుటనే, ప్రాణముల విడుతును చుమా' అనియె. కైక,పూర్వ మిచ్చినవరమును తెలఁపించుచుకైకఁ జెప్పినయీవాక్యముననే రాజు బేలుపడి, వేఁటకానికపటపుఱూఁతకులోనై వలత్రాటం జిక్కుజింకవలె, చెడుటకై, తా నిచ్చెదనని యొప్పుకొని ధర్మపాశమునఁ జిక్కువడెను. పిమ్మట కైకేయి, కామవికారమున మతి చెడి తనకువరము లీయనున్న దశరథునిఁజూచి,'ప్రాణేశ్వరా! నీవు నాకప్పు డిచ్చినవరము లివి యని వేఱువేఱ విభజించి నా కియ్యవలసినవిధమును ఇపుడే చెప్పెదను. దానినివినుము. రామునిపట్టాభిషేకమునకై ఏయేసామగ్రులు గూర్పఁబడియున్నవో వానితోనే, నాకుఁగా, నీవు భరతునకు అభిషేకము సేయవలయును. ఇది యొకవరము.దైవాసురయుద్ధమునపుడు నీవు

నాయందు ప్రీతినొంది నాకిచ్చిన రెండవవరమునకును ఇదిగో సమయము వచ్చినది. రాముఁడు పదునాలుగుసంవత్సరములు దండకారణ్యమున నారచీరలు గట్టి కృష్ణాజినమును జడలను దాల్చి తాపసుఁడుగా నుండవలయును. కనుక నిపుడే జాగుసేయక రాముని నడవికిఁ బంపి,వాఁడు లేనందువలన అకంటక మైనయీరాజ్యమున భరతుని గట్టునది. విళంబము వలదు. నేను మిక్కిలి కోరుచున్న దిదియె;మఱేదియుఁగాదు. నాకిచ్చియున్నవరములనే యడుగుచున్నానుగాని క్రొత్తగా నేదేని అడిగి అన్యాయముగా నిన్నునిర్బంధింపలేదు.ఇప్పుడె రాముఁ డడవికిఁబోవుచుండఁగా నేనుజూడవలయును. నీవు రాజాధిరాజవు; సత్యసంధుండని పేరు గన్నవాఁడవు. నీప్రతిజ్ఞను సత్యముగా చేసికొనుము. అట్లు ప్రతిజ్ఞను గాపాడికొని నీకులమును శీలమును జన్మమును రక్షించుకొనుము. తపోధనులైనవారు, పరలోకవాసమునకు సత్యవచనమునకంటె మిక్కిలి హితమైనయుత్తమసాధనము మనుష్యులకు లేదని చెప్పుట తెలిసినదే కదా' అని చెప్పెను. ఇది పదునొకండవసర్గము.

—·◆·—

## దశరథునిశోకము.

దశరథమహారాజు పిడుగుపాటువలె భయంకరముగా నున్నకైకేయిమాట విని యంత చింతాక్రాంతుఁడై గడియసేపు మూర్ఛనొందెను. అట్లు మూర్ఛిల్లి తనలో 'ఆ! కైకేయివంటిది యిట్టిపలుకులు నిజముగాపలుకునా? పలుకదే! ఇదికలయో! అందుల కిపుడు నిదురపోలేదుగదా. మఱి చిత్తభ్రమమో! దానికిని కారణము లేదు. లేక జన్మాంతరమున అనుభవించినది ఇపుడు తలంపునకు వచ్చుచున్నదా? ఇట్టియనుభవము జన్మాంతరమునను కలుగనేరదే. నామనస్సునకు రోగముచే నిట్టివికారము పుట్టెనా! ఇం దేదిగా నుండునని' అని చింతించి అపుడేమియు తోఁపకుండుటవలన సుఖంబు గానఁడయ్యె. కైకేయిమాటలచే కొట్టుపడి మూర్ఛిలినరాజు చాలసేపటికి మూర్ఛదేఱి తెలివిఁబొంది యెదుట ఆఁడుబెబ్బులిని గన్నజింకవలె దుఃఖితుఁడై విరవిరఁబోవుచు పఱపు లేనిరిత్తనేలఁ గూర్చుండి, పాములవాఁడు మంత్రములచే యంత్రమండలమునఁ గట్టువెట్టిన పెనువిషము గలపామువలె ఇట్టట్టు అసియాడక వేఁడి నిట్టూర్పులు పుచ్చుచు కోపంబు దీపింప 'ఇసీ! ఇట్లు గూడునా' యని పలికి మరల దుఃఖము పెల్లున మనస్సు తల్లడిల్లఁగా మూర్ఛనొందెను. రాజు చాలసేపటికి తెలివినొంది మిక్కిలి దుఃఖించుచు కోపావేశమున కన్నెఱ్ఱనై నిప్పువలె నున్నకంటం గాల్చువానివలె వాఁడి యగువేఁడిచూపు నిగుడ్చుచు కైకేయినిఁ జూచి "ఓసీ! క్రూరురాలా! చెడునడతలదానా! ఈవంశమునకు నాశము చేయఁ బూనినఘాతుకీ! పాపిష్ఠీ! నీకు రాముఁ డేమియపరాధము సేసెనే? మఱి నేనేమిపాపము సేసితినే? రాముఁడు నీకు తల్లికింబోలె శుశ్రూషలు సేయుచున్నాఁడుగదే. అట్లు సేయుచున్నపుడే వానికి అనర్థము కలిగించుటకై యొడిగట్టితివే! ఎందుకే యిది? నిన్ను, తెలివిమాలి, రాచకూఁతురని

తలఁచి, వేండ్ర మైనవిషము గలచెడుసర్పము నింటికిం దెచ్చుకొనునట్లు, నాశముకొఱకే నాయింటిలోనికిఁ జొప్పించితినే. పశువులు పక్షులు మొదలగుసకలజంతుజాలమును రాముని గుణములను గొనియాడుచుండఁగా వాఁ డేమితప్పు చేసినాఁడని నెపము పెట్టి నాగారాబుపట్టిని దిగనాడుదునే? కౌసల్యనైనను, సుమిత్రనైనను,మఱి రాజ్యలక్ష్మినైనను, ఇంతేల నాప్రాణమునైనను, విడుతునుగాని తండ్రి నగునాయందు మిక్కిలియు ప్రీతి గూర్చునాముద్దురాముని విడువనే విడువను. నా పెద్దకొడుకును కన్నారఁ జూచితేని నాదేహమంతయు మిక్కిలియు నుప్పొంగుచుండును. వానిని జూడకుంటినా నాప్రాణమె నిలువదు. ఒకవేళ లోకమైనను సూర్యుని విడిచియుండునుగాక; పయిరైననునీళ్లను బాసియుండునుగాక;రాముని విడిచియో నా దేహమునందు ఒకక్షణమైనను ప్రాణములుండవు. ఎంతపాపమునకు ఒడిగట్టితివే! పాపాత్మురాలా! నీవు నిశ్చయించినతలంపు నాకు ప్రాణహాని కలిగించుచున్నది. కావున నింతవఱకుఁ జాలు. ఇఁక విడువుము. నీకు భర్తనని కొంకుచున్నాను. నీయడుగులకు నాశిరస్సుసోఁక మ్రొక్కుదునా? చెప్పు. అప్పటికైనను కలఁకమాని దయసూపుము. పాపాత్మురాలా! అతిభయంకర మైనయిట్టితలంపు తలఁచితివే. ఇదియేమి! లేక,భరతునియందు నాకుఁ బ్రీతిగలదో లేదో యని తెలిసికొనఁ గోరెదవా? చెప్పుము. అట్లయిన నిది సరి యగుఁగాక. అప్పటికిని రామునియందు ప్రేమ తగ్గుటకుఁ గారణము లేదు. పరీక్షార్థమేని, నీవు భరతునికి యౌవరాజ్యము గట్టుమని చెప్పుదువు గాని రాముని అడవిపాలు సేయుమని యడుగఁజాలవు. కనుక ముందు రామునిఁగూర్చి నాతో 'ఆరాముఁడు నాకు జ్యేష్ఠపుత్త్రుఁడు, శ్రీమంతుఁడు, ధర్మంబునను జ్యేష్ఠుఁడు' అని చెప్పియున్నావు గదా. ఆమాట లన్నియు నీవు మొగమిచ్చకములు పలుకుదానవు గాన నాకుఁ బ్రీతిగలుగుటకుఁగాని, నీయందు నా కెప్పుడును ప్రీతి గలిగించుటకుఁగాని, రాముఁడు శుశ్రూషలు సేయుటనుబట్టి కాని, చెప్పియుందువే కాని నిజమైన ప్రీతినిబట్టి కాదు. 'రాము నడవికిఁ బంపుమనుటయు నన్నుఁ బరీక్షించుటకే' యందువేని, యిప్పుడు రామాభిషేకము జరుగుటకు దుఃఖంబునఁ బొరలుచు, నన్నును మిక్కిలి కాఱియపెట్టి యుడికించుచున్నావే. ఇదేమి! నీ విట్టిదానవు గావుననే పరుల బోధనకు లోనై పాడుపడినకోపగృహంబును జొచ్చితివి.నిన్నే వ్రో పిశాచములు కంటికి తెలియక యావేశించియున్నవి. కావున తెలివిమాలి యి ట్లుట్టిపడితివి కాఁబోలు. నీ వింతకాలము మిక్కిలి నీతిగలిగి యుంటివి. ఇట్టినీకు, ఇక్ష్వాకువంశమును ద్రొక్కియు ఈ విపరీతబుద్ధి పుట్టినది కావున, ఈ యిక్ష్వాకువంశమునకే మిక్కిలి గొప్పయనర్థము సంభవించినది. విశాలాక్షీ! నీ వింతకుమున్ను నాకుఁ గొంచెమైనను అయుక్తమైన దానినిగాని అప్రియమునుగాని చేసినదానవు గావు. కావున నాకిట్లు అప్రియమును అహితమును జేయుచున్నావని నమ్మఁ జాలను. నీకు రాముఁడు మహాత్ముఁడైన భరతునితో సమానుఁడే కదా. నీవు 'మిక్కిలి రాముఁడును భరతుఁడును నాకు సమా

నులే'యని చెప్పుచుంటివే. నీవు, పసిదానవు. కుటిలబుద్ధితోఁ జెప్పితివనుటకు అయితి లేదు. పలుమాఱును చెప్పితివిగావున మనఃపూర్వకముగాఁ జెప్పలేదనియు తలఁపరాదు. అట్టి నీప్రీతికి ఇప్పటిమాట పొసఁగకున్నదే! ఇదేమి? దేవీ! నీవు ధర్మమును అతిక్రమించుటకు భయపడుదానవు. ఆభయ మిప్పుడెక్కడఁబోయెని? లేకున్న, లోకమున మహాకీర్తి వహించి నీప్రీతికి పాత్రుఁడై యున్న యాధర్మాత్ముని పదునాలుగేండ్లు అడవికిఁ బంపుటధర్మాత్మురాలికి నీ కెట్లు రుచించినది? వాఁడు మిక్కిలి సుకుమారుఁడైనవాఁడు. ధర్మమునందే మనస్సును దృఢముగా నెలకొలిపి యుండువాఁడు. అట్టివాఁడు, అతిదారుణమైనయరణ్యమున వాసము చేయుట నినుఁబోటికి ఎట్లు ఇంపయ్యెని? వానిధర్మమునుబట్టిగాని సుకుమారత్వమునుబట్టిగాని నీమనస్సు కరఁగకుండినను ఉండుఁగాక. వాఁడెప్పుడు నీకు శుశ్రూష సేయుచుండువాఁడు గదే! ఆశుశ్రూషను జూచియైనను అట్టిసుందరాకారుని రాముని దేశమునుండి వెడల నడుచుటకు నీవు గోరుటకుఁ గారణమేమి? రాముఁడు భరతునకంటె నెక్కువగా నీకు శుశ్రూష యెప్పుడును జేయుచున్నవాఁడే కదా! కావున రామునికన్న భరతుఁడు నీయెడఁ జూపువిశేషమేమియు నాకుఁ దోఁపలేదు. రాముఁడు చేయునది ఒకశుశ్రూషమాత్రము కాదు. వాఁడు నీకు శుశ్రూషయును జేయును; నిన్ను మిక్కిలి గొప్పగాను భావించును; నిన్నుఁ బూజించును; నీవు చెప్పిన పనులను తలఁదాల్చి చేయును. ఇవియన్నియును ఆ పురుషలలామునికన్న నధికముగా నీకుఁ జేయువాఁడు మఱియెవ్వఁడు గలఁడు? స్త్రీలు పెక్కువేలమందియున్నారు. భృత్యులును అనేకులున్నారు. వీరలయందొక్క స్త్రీకైనను ఒకభృత్యునికైనను రామునిపై ఉన్నతప్పును చెప్పుటగాని లేనితప్పును మోపుటగాని పొసంగినదికాదు. కనుక ఏతప్పునుబట్టి యడవిపాలు సేయుదమే? ఆపురుషసింహుఁడు నిర్మలచిత్తుఁడై సకలప్రాణులను మెత్తనిమాటల లాలించుచు, దేశమునం దున్నజనులకందఱికిని అభీష్టదానాదికములైన ప్రియకార్యములు సేయుచు చేపట్టి మన్నించును. కాఁబట్టి జనులకందఱికిని రామునియందు మిక్కిలి ప్రీతి గలిగియున్నది. ఆరఘుకులతిలకుఁడు దయావీరుఁడు, దానవీరుఁడు, ధర్మవీరుఁడు, పరాక్రమవీరుఁడు; కావున భూతహితరూపమైన సత్యముచే స్వర్గాదిలోకములను చూఱగొనుచు నున్నాఁడు. దానములు సేసి దరిద్రులను వశము చేసికొనుచున్నాఁడు. శుశ్రూష సేసి గురువులను దనకు రహస్యార్థములుపదేశించునట్లు చేసికొనుచున్నాఁడు. మాఱుగొనక యుద్ధమున చక్కనిలిచి ధనువు చూపినమాత్రనే శత్రువులను జయించుచున్నాఁడు. సత్యము, పరలోకార్థము సేయు గోదానము మొదలైనదానములు, తపమును, ఇహలోకార్థమందలి వారిప్రీతికొఱకుఁ జేయుత్యాగమును, అందఱియందును మంచిమనస్సు గలిగియుండు చెలిమి, బాహ్యాభ్యంతరశుద్ధి, నిష్కాపట్యము, పరులమనస్సు ననువర్తించుటయు, తత్త్వజ్ఞానమును, విద్యయు, గురువులకు పరిచర్య సేయుటయు, ననెడియీగుణములు రామునియందొకప్పుడును దప్పక దృఢముగా నెలకొనియున్నవి. కపటము లేమి యనునది ఎట్టివారికిని

గలుగుట యరిది. అట్టియుత్తమగుణమును గలిగి, తక్కిన దానాదిగుణసంపత్తియుఁ బడసి, దేవతలతో సాటియై, మహర్షివలె దేజరిల్లు చున్న చిన్నారి రాముని అడవికిఁ బంపు పాతకమున కెట్లు మనస్సు గలిగెనే? వాఁడు సామాన్యజనులకుఁ గూడ ప్రియము లేయాడును. ఇఁక మన కోఁటికిఁ జెప్పవలయునా? అట్టిరామునికి నేను అప్రియమును మనసునందుఁగూడ స్మరింపను. ఇఁక నీ కొఱకు, నీ కోఁటియోఁడుది యిట్టిపరుషోక్తు లాడినందులకు, అందఱిని రమింపఁ జేయునా రాముని, కడుపార నేను గన్న గారాముని, అప్రియమును మనస్సునఁగూడ స్మరింపఁ జాలని నేను, నోరెత్తి యడవికిఁ బొమ్మని యెట్లు చెప్పుదునే? క్షమయు దమమును ఈవియును సత్యమును ధర్మమును కృతజ్ఞతయు, ఏప్రాణికిని హింస సేయమియు, నెవ్వనియందుఁ గలవో యట్టిరాముఁడు దక్క నాకు మఱిదిక్కు ఏది? అట్టిరక్షకుని ఎట్లు దిగనాడుదును? కైకేయీ! నేనో ముదిసి ముదుకఁడైతిని. ఆయువు తుద సమీపించి నేఁడో రేపో చావఁ బోవువాఁడను. కాఁబట్టి నా స్థితికి జాలిపడవలసియున్నది. దిక్కుమాలి మాటికి వేఁడివేఁడి పలవించుచున్నాఁడను. ఇట్టినన్నుఁ దయఁజూడఁ దగును. సముద్రము పొలిమేరగాఁగల సకలభూమండలంబునను నాకేది వచ్చునో యది యంతయు నీ కిచ్చెద. రాముని యెడ మాత్రము గోపము దెచ్చుకొనకువే. కైకేయీ! నీ కంజలిసేసెదను. వలయునేని నీపాదములనుగూడఁ బట్టుకొనెదను. రాముని రక్షింపుము. నన్ను ప్రతిజ్ఞ దప్పి అధర్మము పాలగునట్లు సేయకుము'' అనియె. ఇట్లు దుఃఖమునఁ బరితపించుచును, పలవించుచును, మూర్ఛిలి నేలఁ బొరలుచు 'రాముని ఎడఁబాయఁగలిగెనా' యను వగలవెల్లువ మునిఁగి దురపిల్లుచు, 'దుఃఖసముద్రమునుండి దరిఁ జేర్పవిూ' యని మాటికి పలవించి బతిమాలుకొనుచు, నున్న యామహారాజును జూచి కైకేయి భయంకరాకారయై అతిక్రూరముగా ''రాజా! నీవు నాకు వరములిచ్చి, పిదప ఇచ్చినందులకు అనుతాపపడెదవేని యిఁక విరుఁడవై 'ఈభూమండలమున నేను ధార్మికుఁడ'నని యెట్లు చెప్పుకొనఁగలవు? రాజర్షులనేకులు గలరు. వా రెప్పుడేని నీతో నొకటిగాఁగలసి ధర్మప్రసంగము సేయునపుడు 'నీ కుపకారము చేసిన కైకేయికి రెండువరము లిచ్చితివే. ఆవరములకు ఆబిడ ఏమియడిగినది? నీవేమియిచ్చితి' వని యడుగుదు రేని అపుడు, నీవు ధర్మజ్ఞుఁడవుగా! బదు లేమని చెప్పుదువు. 'ఎవ్వతె నేను యుద్ధమునందుమూర్ఛిల్లగా ప్రయత్నపడి నన్నవ్వలికిఁ దొలఁగించి శిశిరోపచారములు సేసి కాపాడెనో, కాఁబట్టి యెవ్వతె యనుగ్రహము సూపఁగా నేనిపుడు బ్రతికియున్నానో, ఆకైకేయి కిచ్చినవరములను నేను పొల్లు గావించితి' నని వారలకుఁ జెప్పుదువా యేమి? కనుక ప్రతిజ్ఞ తప్పకుమా. నీ విపుడే వరములిచ్చి, యింతలోనే దాని నిచ్చుతలంపు మాఱి, మఱి వేఱుమాటలాడుచున్నావు. రాజవు; నినుబోఁటిరాజే యిట్లు సేయునేని యిఁక 'రాజులెల్ల నితనివలె నేకల్లలాడువా' రని రాజులకందఱికి కలంకము గలి

గింతువు సుమీ. 'చేయరాని ప్రతిజ్ఞ నెట్లు సేయుదు' ననకు.* శైబ్యుఁ డనురాజు ఒక డేగకును పావురాయికిని విరోధము గలిగి, పావురము దన్ను శరణు సొరఁగా తన మేని మాంసము గోసి డేగ కిచ్చి పావురమును రక్షించెను. † అలర్కుఁ డను బ్రాహ్మణుఁడు తనకన్ను లొక బ్రాహ్మణున కిచ్చి యుత్తమగతి నొందెను. ‡ సముద్రుఁడును మున్ను తాను ప్రతిజ్ఞ సేసినచొప్పున చెలియలికట్టను దాఁటకున్నాఁడు. శైబ్యుఁడు మొదల యినయిట్టిపూర్వులవృత్తాంతమును స్మరించియైనను చేసిన ప్రతిజ్ఞను పొల్లు సేయక నిర్వహింపుము. నీవా చేయువాఁడవు? దుర్బుద్ధివిగా! నీవు ధర్మము దిగవిడచి రాముని రాజ్యమునం దభిషేకించి యెల్లప్పుడును కౌసల్యం గూడి సుఖముగాఁ గ్రీడింపఁ గోరుచున్నావు. నీతలంపు తెలిసినది; సాఁగనిత్తునా? నేను అడుగునది ధర్మమయినను అధర్మమైనను అగుఁగాక. లేక మంచిదైనను చెడ్డదైనను గానిమ్ము. నీవు నాకు, అడిగినది యిచ్చునట్లు చేసిన ప్రతిజ్ఞనుమాత్రము చేసియే తీఱవలయును. దానికి తిరుగఁబాటు లేదు సుమా. ప్రతిజ్ఞ తప్పి రామునికి అభిషేకము సేయించితివా, ఇప్పుడే; నీయెదుట, నీవుచూచుచుండఁగానే, విషము మిక్కిలి త్రాగి ప్రాణములు విడుతును. రాముఁడు రాజగుటవలన వానితల్లి యగు కౌసల్యకు జను లందఱును జేతులు మోడ్చుచుండఁగా ఒకదిన మైనను జూతునేని బ్రతికియుండుటకన్న నాకు చచ్చుటయే మంచిది. రాజా! రాముని అడవికిఁ బంపుటదక్క మఱేమిచేసినను నాకు తుష్టిగలుగదని, భరతునితోడు, నా ప్రాణము సాక్షిగా, ప్రమాణము సేయుచున్నాను" అనియింతవఱకు చెప్పి యంత నూరకుండెను. కాని, రాజెంత విలపించుచుండినను బదులు సెప్పినదిగాదు. దశరథుండును, రాముని అడవికిఁ బంపుటయు భరతునికి ప్రభుత్వము గట్టుటయుఁ గావలయునని కైకేయి మిక్కిలి యమంగళకర మగువర మడుగఁగా విని ఇంద్రియంబులు కలంగి గుఱిదప్పఁగా గడియసేపు దానితో నేమియుఁ బలుకక యప్రియము లాడినయామస్కవయిల్లాలిని గోపంబునఁ గనుఱెప్పవేయక చూచుచుండెను.

---

* పూర్వము శైబ్యునిదాతృత్వమును పరీక్షింపఁ గోరి ఇంద్రుఁడు డేగగాను అగ్నిదేవుఁడు పావురముగాను రూపులు గైకొని ఒక్కటొకటిని భక్షించుటకై మఱియొకటి తఱుముకొనివచ్చునట్లు నటించుచు ఇద్దఱును శైబ్యునియొద్దకు వచ్చిరి. పావురము శైబ్యునియొడిఁ జేరి శరణు సొరఁగా అతఁడు దానికి అభయ మొసఁగెను. అంత డేగ వచ్చి తనకు పావురము దైవము విధించిన యాహారము గనుక దాని నిమ్మనఁగా అతఁడు 'దాని నియ్యను. బదులు వేఱుమాంసము ఇచ్చెద' ననఁగా డేగ 'నీదేహమాంసమే యి' మ్మనుటయు శైబ్యుఁడు తనదేహమాంసమును గోసి డేగ కిచ్చి పావురమును గాపాడె ననుపురాణకథ యిట అనుసంధించుకొనునది.

† అలర్కుఁ డనురాజర్షి కడకు ఒక గ్రుడ్డిబ్రాహ్మణుఁడు వచ్చి 'నీకన్నులు నా కి' మ్మని యడిగెను. దాని కతఁడు తనకన్నులఁ బెఱికి యా బ్రాహ్మణున కిచ్చె ననుకథ యిట తెలియునది.

‡ తొల్లి దేవతలు సముద్రునితో 'నీవు చెలియలికట్టను దాఁటరాకుము' అని ప్రార్థింపఁగా అట్లు చేయుదునని అతఁడు ప్రతిజ్ఞ చేసినాఁ డనుట తెలియునది.

తగనిభరతుని పట్టము గట్టు మనుటచే దుఃఖమును, రాము నడవికిఁ బంపుమనుటచే శోకమును, గూర్చుచు నవజ్రమువలె కఠినమై, మనస్సునకు మిక్కిలి యప్రియముగా నున్నయా కైకమాటవిని రాజెంతమాత్రమును సుఖము నొందఁ డయ్యె. అతఁడు భయంకర మగుకైకేయినిశ్చయమును, తనప్రతిజ్ఞను, దలంచుకొని ప్రతికారమేమి యుఁ దోఁపమివలన 'రామా!' యని నిట్టూర్పు విడిచి నఱుకఁబడినవృక్షమువలె నేలం బడి, పిచ్చి పట్టి బుద్ధి నశించినవానివలెను, సన్నిపాతముచే ప్రకృతి తప్పినరోగి వలెను, మంత్రముచే వీర్యము దూలినసర్పమువలెను,జూపట్టుచుండెను. రాజు దీనా లాపములఁ గైకేయింజూచి "ఈయనర్థమును నీకు మంచిది గాఁ దోఁచునట్లు ఎవఁడే బోధించినాఁడు? పిశాచముపట్టినయట్లు, తగును తగదని యెన్నక, నాయెదుట మాటా డుచున్నావు. నీకుఁ గొంచెమైనను సిగ్గులేదు. ముందు నీవు పసిదానవుగా నుండిన పుడు నీశీల మిట్లు చెడఁగా నేను చూడలేదు. ఇప్పుడు ప్రౌఢ కాఁగానే అది యేమో విపరీతమైనట్లు గనఁబడుచున్నది. 'భరతుని రాజ్యమున నిలుపుము. రాముని అడ విని బెట్టుము' అని యిట్టిక్రూరంపువర మడుగుచున్నావు దేనివలన నీకింతిభయము పుట్టినది. భర్త నగునాకును లోకమునకు భరతునకును ప్రియము సేయఁగోరుదు వేని, భరతునకు రాజ్యము గట్టునభిప్రాయము గాని రాముని అడవికిఁ బంపుమను పాపా త్మక మైనతలంపును గాని రెంటిని వదలుము.దయ మాలినదానా! రాముని అడవికిఁ బంపు పాపంపుతలంపును కలిగెనా. ఇట్టినీకు దయ యెక్కడిదే! నీవు అల్పబుద్ధివి; కాఁ బట్టి యిట్టిపాపపుతలంపు కలిగినది. పూర్వజన్మమందు పాపము చేసితివి. కావుననే నీకీయల్పబుద్ధి. రాముఁడుగాని నేనుగాని నీ కేమియప్రియము చేసి దుఃఖపెట్టితిమే? మాయందు అపరాధ మేమి నీకుఁ గనఁబడుచున్నదే? నీవు తలఁచినట్లే భరతుఁడు రా జ్యముపూనునా? వాఁడు ధర్మమునందు రామునికంటె నధికుఁడని నేనుతలఁచెద; అట్టి పరమధార్మికుఁ డగుభరతుఁడు, నీ వేమి చేసినను, రాముని విడిచి రాజ్యమును గైకొ నఁడు. అయ్యో!అడవికిఁబొమ్మని నేను జెప్పఁగా వెలువెలఁబోవు నన్నమాటి రాహువు పట్టినచందురుని బోలి యుండు రామునిమొగమును నే నెట్లుచూతును! మంత్రుల తోఁగూడి చక్కఁగా నాలోచించియేర్పఱచి,స్నేహితులతోను గలసి తిరముగా నిశ్చ యించి, రామాభిషేకము సేయవలయు నని యభిప్రాయము గొంటిని. ఇప్పుడు, చక్కఁగాఁ బన్నినదనసేనను పగవారు కొట్టుచుండఁగా చూచునట్లు, చక్కఁగా నిశ్చయించినయాయభిప్రాయమును ఇపుడు తలక్రిందగుచుండఁగా నెట్లు చూతును? రామాభిషేకమునకై పలుదిక్కులనుండి రప్పింపఁగా వచ్చినరాజులు నన్నుఁ జూచి యేమందురు? వారు 'ఇక్ష్వాకువంశజుండైన యీబాలుఁడు రాముఁడు బహుకాలము రాజ్యమును బాలించెనా? ఇప్పు డడవికిఁ బోవుచున్నాఁడే! ఇక్ష్వాకులుఁ డైన యీదశరథుఁడు మతి మాలినవాఁడు. ఏమో దైవవశమున బహుకాలము రాజ్యము చేసినాఁడు గాని తెలివియున్నచో రాముని నిట్లుచేయునా' యని, కట్టా! నన్నుఁబరి

హాసింతు రేక దా. రాజులమాట యటుండనీ. ఇఁకవృద్ధులును గుణవంతులును విద్యావంతులునగువారు అనేకులువచ్చి రాముఁ డెక్కడ యని నన్నడుగఁగా అపుడు వారికి నేనేమి చెప్పఁగలను? 'కైకేయికి ముందు రెండువరము లిచ్చియుంటిని. ఆరెంటికిఁగాను కైకేయి రామునడవికిఁ బంపుమనియు భరతునికిఁ బట్టము గట్టుమనియు నన్నుఁ బీడింపఁగా రామునడవికిఁ బంపినాను' అని సత్యముగా జరిగినవిషయమును జెప్పుదు నేని యింతకుమునుపు వసిష్ఠవామదేవాదిమహర్షులయెదుట సభలో 'రామునకు రేపు పట్టాభిషేకముసేసెదను' అని నేను చెప్పినమాట యసత్యమగును. అది యటుండ రాముని యడవికిఁ బంపఁగా కౌసల్య నన్నుఁజూచి యేమిచెప్పను! ఇట్టియపకారము సేసి దానికేమని బదులు సెప్పుదును. కౌసల్య యెప్పుడును నాకుఁ బ్రియము నే కోరుచున్నది! రామునియందును చాల ప్రీతి గలది. అది నాకు దాసివలె పరిచర్యలు సేయును; చెలికత్తెవలె జూదము మొదలైనవినోదములు నెఱపును ; భార్యవలె ధర్మానుష్ఠానములందు తోడ్పడును; అప్పసెల్లెలివలె మఱియొకభార్యను బెండ్లాడునపుడు ఉపలాలించును; తల్లివలె పోషణాదులు చేయును. ఇట్లుండునుగాని పట్టపుదేవియని బిగిసికొని యూరకుండదు. అది ఆయావిధముల నన్నుఁ గొలుచునపుడు దానిదానికిఁ దగిన సత్కారములు నేను చేయవలసియుండియు నీకుఁ గోపము వచ్చునని దానిని ఎంతయును సత్కరింపనైతిని. వ్యాధిగ్రస్తుఁడు అపథ్యము లైనకూరలతో అన్నము దినఁగా, అది వెనుక బాధించునట్లు, నేను మునుపు తెలియక నీకు చేసిన చక్కనియుపకారమంతయు, ఇపుడు నీదుర్జనత్వము కనఁబడగా 'ఇట్టిపాపికి చేసితి మే' యని నన్ను బాధించుచున్నవి. అట్లు ఉపకరింపకుంటి నేని యిట్టి ప్రీతియు నాకుండదు. ఈ తాపమును నాకు కలుగదు. సుమిత్ర, నేను రామునిఁ బట్టముగట్టెద నన్ననిర్ణయమును, త్రిప్పిన తిరుగఁబాటును, మఱి రాముని నడవికిఁబంపుటయుఁ జూచి 'ప్రియపుత్త్రుఁ డగురామునే యిట్లు సేసినాఁడు. అతనికి బుద్ధినిలుకడ లేదు; అతిక్రూరము. ఇఁక నాకొడుకును ఏమిచేయునో' యని భయపడినదై నన్ను ఎట్లు నమ్మఁగలదు. అయ్యో! సీతయు, నేను మరణమునొందుట, రాముఁ డడవికిఁ బోవుట యనెడియీ రెండప్రియములును దీనురాలై ఏకకాలముననే వినఁగలదు. అకటా! హిమవత్పార్శ్వమున కిన్నరునిం బాసినకిన్నరివలె, నేను రామునిం బాపఁగా, సీత దుఃఖించుచు ప్రాణములను విడుచును. రాముఁడు పురి వెడలి యడవికిఁ బోవుచుండఁగా, అందులకై సీత ఏడ్చుచుండఁగా, చూచుచు నేను చిరకాలము జీవింతునా? జీవింప నొల్లను. నేను జచ్చిన వెనుక ముండ మోసినదానవై నీవు నీకొడుకుంగూడి రాజ్యము సేయుదువు. రాముఁ డడవికిఁ బోవఁగా నాకుఁ బ్రాణము లెందుకు? నిమిషమేని బ్రతుక నొల్లను. నీమేని చక్కఁదనమును మాత్రమే చూచి, నేనింతవఱకు నిన్ను మంచిదాన వనితలఁచియుంటిని. ఇప్పుడు నీగుణములు బయలుపడఁగా మిక్కిలియుఁ జెడ్డదాన వని నాకు నిశ్చయమగుచున్నది. కంటికినింపుగానున్న దని చూచి విషము గలిసినసారాయిఁ ద్రాగి పిదప

దానిదుర్గుణము తెలిసి యనుభవించువారి గతి వాకు పట్టినది. నీవింతవఱకు బూటకము లయిన మొగమిచ్చకపుమాటలు వెక్కిలాడుచు నన్ను బుజ్జగించుచుంటివి. తుదకు, బోయవాఁ డింపయినస్వరము చూపి యాశబ్దముచే జింకను లాఁగి వశము చేసికొని చంపునట్లు నన్ను చంపితివి. కొడుకును అమ్మికొని పెండ్లామునుగొన్నవన్ను, గ్రామ్యసుఖమున కై కొడుకును దిగవిడిచిననన్నుఁ, జూచి, రాజవీథులందు పెద్దలందఱును మద్యపానము చేసినబ్రాహ్మణుని దూషించునట్లు నిజముగా దూషింపక మానరు. హా! ఏమిదుఃఖము వచ్చినది! ఇట్టిది యెప్పుడును కలుగలేదే! ఎట్టికష్టమిది! కష్టమిట్లుండునా! ఇట్టివి ఎప్పుడును నేను అనుభవింపలేదు. నీకు వర మిచ్చువిషయమున రాముని అడవికిఁ బంపు మని నీ వాడినక్రూరంపుమాటలనుగూడ సహించుకొన్నాను. ఇట్టిదుఃఖము పూర్వజన్మమందుఁ జేసినపాపములఫలమువలె ప్రతీకారము లేక నాకు సంభవించినది. పాపాత్మురాలా! నేను ఇట్టిదానవని తెలియక నిన్ను మెడకుఁ దగుల్చుకొని యురిత్రాటినిం గాపాడునట్లు, పాపాత్ముఁడనై, బహుకాలము కాపాడితిని గదా! తుదకు ఆత్రాటివలె నన్నుఁ జంపఁ జూచితివి. పాపాత్ముఁ డగు నాకిదితగునే. ఇన్నిదినములు నీతోఁ గూడి క్రీడించుచుంటిని గాని నిన్ను నాకు మృత్యువని తెలిసికొనకపోయితిని. బాలుఁడు, వలదని చెప్పువారు లేక యొంటిగానున్నపుడు, తెలియక కృష్ణసర్పమును చేతులఁ బట్టినట్లు, నేనును నిన్ను చెట్టపట్టితిని. ఆసర్పమువలెనే నీవు నా మరణమునకు మూలమైతివి గదే. మహాత్ముఁ డగునాకుమారునికి రామునికి, దురాత్ముఁ డగునేను దండ్రిగానుండియు, తండ్రియుండుటవలనిసుఖము లేక పోయినది; కాన వాఁడు తండ్రి లేనిబిడ్డ యైనాఁడు. ఇట్టిదురాత్ముఁ డై ననన్నుఁ జూచి యీజనులందఱును 'మనరాజు దశరథుఁడు ఒకస్త్రీకిఁ గా ప్రియకుమారుఁ డగురాముని అడవికిఁ బంపుచున్నాఁడే. అకటా! ఇతఁడు మిగులమూర్ఖుఁడు; కేవలకాముకుఁడు' అని తప్పక యాక్రోశింతురు. రాముఁడు, ఇంతవఱకును వ్రతములను బ్రహ్మచర్యమును గురుశిక్షలను మిగుల శ్రమపడి కాలము పుచ్చెనే కాని యెంతమాత్రము సుఖము గన్నవాఁడు గాఁడు. ఇప్పుడు సుఖ మనుభవించుకాలమందు, వానికి అంతకన్న వెనుకష్టము మగులఁ గలిగెను. ఆకొమరుఁడు నే 'నడవికిఁ బొ'మ్మని చెప్పఁగానే బదులు రెండవమాట యొకటియుఁ బలుకనేరఁడు; 'మంచి'దని యే చెప్పును. ఇదినిజము. నేను వనమునకుఁ బొమ్మని యానతిచ్చఁగా వాఁడు పోక ప్రతికూలముగా నడచుకొనునేని యది నాకుఁ బ్రియముగా నుండును. కాని, కొడుకట్లు ఎప్పుడును జేయఁడు. రాముఁడు కపటమెఱుఁగఁడు; నిర్మలాంతరంగుఁడు; కనుక నన్నును తనవలెనే నిర్మలాత్మునిఁగాఁ దలఁచును గాన నేనుజెప్పినమాటకు భావము మఱివేఱొకటియుండు నని తెలియఁజాలఁడు. కనుక నేను 'అడవికి బొ'మ్మనఁగానే 'పోయెద' ననునే కాని పోకుండుట నాలోపలిభావ మనియు నాకిష్టమనియు నెఱుఁగఁడు. రాముఁ డడవికిఁబోఁగానే లోకమువారెల్ల నన్ను ధిక్కరింతురు. ఆధిక్కారము నోర్వఁదరమా! కాని, తుదకు మృత్యువు నన్ను యమ

లోకమునకుఁ గొనిపోవును. నేను మృతుఁడయి రాముఁ డడవికిఁ బోయినపిమ్మట మిగిలి యుండుకౌసల్య మొద లైననాయిష్టజనులకు మఱేమికష్టమును జేయఁదలఁతువో! రాముఁ డడవికిఁ బోవఁగాఁ జూచి కౌసల్యయు మరణము నొందక తప్పదు. లక్ష్మణుఁడు రాము నెడఁబాయఁడు గనుక వానితోఁ గూడ నేపోవును. శత్రుఘ్నుఁడును దైవికముగా ఈసమయమున భరతునితోఁగూడఁ బోయియున్నాఁడుగాన దగ్గఱ లేఁడు. ఇట్లునీవు కౌసల్యను నన్నును రామునిని,లక్ష్మణశత్రుఘ్నులను విడుతువేని సుమిత్రయు ఈదుఃఖములనుసహింపలేక నన్ను అనుగమించి ప్రాణములు విడువఁగలదు. కైకేయీ! కౌసల్యను సుమిత్రను నన్నును,నాకొడుకులగు రామలక్ష్మణశత్రుఘ్నులను ముప్పరిని, నరకమువంటి యీ ఘోర దుఃఖమునందుఁ బడఁ ద్రోసి నీవు మాత్రము సుఖముగా నుండుమీ. ఇక్ష్వాకువంశము (రాజ్యము) శాశ్వతముగా జరుగుచున్నట్టిది; సుగుణంబులచే మిక్కిలిపూజ్య మై యుండునది. కాన యిట్టిదానిని కలంపఁ దగదు. ఇఁక నేనును రాముఁడును దీనిని దిగనాడి పోవఁగా, నీవు ఏలికసాని వై దీనిని చెల్ల చెద రగునట్లు పాలించెదవు. రాముని అడవికిఁ బంపుట, భరతునికిని ప్రియముగా నుండునేని, నేను మృతుం డగునప్పుడు నా కాభరతుఁడు చరమక్రియలు సేయరాదు. అయ్యో! ఓసీ దుష్టురాలా! నాపగతురాలా! కైకేయీ! ఇంతలు సేసి యిఁక నీకోరికి కొనసాఁగించుకొనవే. రామునియందు ప్రీతి యుంపుమా! నేను మృతుఁడై పురుషలలాముఁ డగురాముఁ డడవిపా లయినపిదప, ఇప్పు డందఱితో పొత్తున అతికల్యాణివై యొప్పు చున్ననీవు, అపుడు ముండమోపి వై నీకొడుకును గూడి రాజ్యమును జేయుదువు లే. నాకు లోకమున సాటిలేనియపకీర్తియే నీవు. నీవే మహాజనుల సమక్షమున నాకుఁ గలిగినతిరస్కారమవు. ప్రాణము లన్నిటికిని తక్కువగాఁ దోఁచెడి యవమానమే నాకు నీవు; ఇట్లు రాజపుత్రియనుపేర నాయింటనసించియుంటివి కాని, నిజముగా రాజపుత్రి వెట్లగుదువే? దుష్టురాలైన నీవు నాయింట నుండుటఁబట్టియే యిట్టియపకీర్తియు పరిభవమును అవమానమును గలిగినది. పాపాత్మునకు అవి కలుగనవేకదా.అట్లే పాపినైన నాకుఁగలిగినవి.నాగారాముఁపట్టి,నాచిన్నిరాముఁడు,వలసినప్పుడెల్ల రథములు గజములు తురగములు మొద లయినవాని నెక్కి పలుమాఱుతిరుగుచుండి యిపుడు మహారణ్యమునందు అడుగులిడి యెట్లు తిరుగఁ గలఁ డే! వాఁడుభుజించు సమయమున కుండలములు దాల్చిన వంటలవాండ్రు 'నేను నేను' అని ఒకరి కొకరు ముందు పడి మే లైనయన్నపానములను నడ్డింతురు. అట్టిసుకుమారంపుఁగొమరుఁడు అడవియందు ఒగరును చేదును కారము నయినకందమూలాదు లాహారముగాఁ దినుచు నెట్లు జీవించునే? వాఁడు మిక్కిలి పొగడందగిన మేలివస్త్రములను దాల్చి చిరకాలము హాయిగానుండుపఱపులను బరుండియుండి, యిఁక వనమున కాషాయవస్త్రములు గట్టి కటికి నేలనుబరుండి యెట్లుండఁగలఁడు? 'రాముని అడవికిఁ బంపి భరతునికి పట్టాభిషేకము సేయింపు' మని ముందు వెనుక నాలోచింపనియిట్టిదారుణంపుమాట

యెవ్వరియుపదేశమో? ఇసీ! స్త్రీలు కపటవృత్తులు. వారి కెప్పుడును రహస్యముగ కీడు సేయుచుండుటయే గుణము. వారి కెప్పుడును తమకార్యములయందే కన్ను; ఇతరులగతి పాటింపరు. ఇసీ! వారు పాడై పోదురుగాక. అయినను వారిలో పుణ్యాత్మురాండ్రు నున్నారు గనుక స్త్రీల నందఱిని ఇట్లు చెప్పను. భరతునితల్లి నిమాత్రమే చెప్పెదను. నీ యభిప్రాయము, నీకును పరులకును అనర్థము గలిగించుచున్నదే. నీ కార్యమే నీవు చూచుకొనెదవేమి?దయలేక నన్ను దుఃఖపెట్టి తపింపఁజేయుటకై యిట్టి దుష్టభావముఁ బూనితివిగదే. నావలన నీ కేమికీడు పుట్టె. లేక, లోకమునకంతయు హితము సేయునట్టిరాముఁడుగాని నీకుమాత్ర మేమికీడు గావించినాఁడు? తండ్రులు తాము ప్రేమించు చుండుకొడుకులను విడిచినను విడువవచ్చును. పురుషులును తాము ప్రేమించునట్టిభార్యలను విడిచిన విడువవచ్చును. అట్లే భార్యలును తాము ప్రేమించు పెనిమిటులను విడువవచ్చును. లోకు లీజోలికి అంతగా రారు. కాఁబట్టి దీనిచే నాకును నీకును ఏమియుఁ గలుగదు. అయితే నేను అడవికిఁ బంపఁగా,దుఃఖమున రాముఁడు కునిఁగియుండుటను జూచెనా, వానిని ఇట్లెల్లఁ జేయుటకు మూలమైననిన్ను, జగమునందలిజంగమములును స్థావరములును గూడ కోపించును జుమీ. లోకంబున తండ్రులకుఁ బుత్రులయందు ప్రీతి సాధారణముగా నుండుట గలదు. నాకో, పుత్రుని యందలిప్రీతి అట్టిదికాదు; అతిమాత్రమయినది. కనుక నాకు దేవకుమారుఁడుంబోలె సహజసుందరుఁడై సొమ్ముల నలంకరించుకొని మఱింతయొప్పులకుప్పయై మదించిన యేనుఁగునడతో వచ్చుచున్న నాకుమారుని పున్నమచందురునివంటిమొగముగల యారాముని, మనస్సునఁ జూచినఁగాని, దవ్వులనే చూచినఁగాని, ఎంతోసంతోషము కలుగుచున్నది. ఇఁక కన్నులారఁ జక్కఁగా సమీపమున వచ్చునపుడు చూచితినేని నాయంగము లుప్పొంగి బలము దళముకొని యప్పుడే నాకు ఎలప్రాయము వచ్చినట్లుండును. సూర్యుఁడు లేకున్నను,ఇంద్రుఁడు వానగురియకున్నను,లోకులకు రాకపోకలును బ్రతుకును గలుగునుగాని, రాముండిచటనుండి అడవికిఁ బోవుట చూచెనేని,యొక్కజంతువైనను జీవింపదని బుద్ధికిఁ దోఁచుచున్నది. నాచేటున కొడిగట్టి, నాకీడునకుఁ బూని, పగతురాలవై యున్ననిన్ను మృత్యువుంబోలె నే నింతకాలము నాయింట నుంచుకొంటిని. వేండ్రమయినవిషము గలసర్పంబవగునిన్ను తెలియక చిరకాలము ఒడియందిడుకొని యుంటిని. కావున నీవిపుడు కఱచి చంపితివి. నన్నును రాముని లక్ష్మణుని మాలి,భరతుఁడు నిన్నుఁగూడి పట్టణమును రాజ్యమును బంధువులను అందఱిని జంపి.సొంపుగా పరిపాలనము సేయుఁగాక. ఇట్లు చేసి, నాపగవారికి నీవును సొంపు పెంపు గూర్చుచుండుము. ఓసీ! క్రూరవృత్తీ! నోటిచుట్టిపై రోఁకటిపెట్టుగా, రాముని ఎడఁబాయనివ్యసనము కారించుచుండఁగా వానిని 'బంపు పంపు'మని మఱిమఱి కారించుచున్నావుగా! నీవు ఆపదయందే కొట్టుదానవు. నీవిపుడు నాయెదుట, భార్యయుండఁదగినకొలఁది తప్పి, స్వాతంత్ర్యముమించి,యిచట నిట్టికౄరవాక్యము లాడు

చున్నావు గదా; ఇట్టినీనోటనుండి పండ్లన్నియు వేయిపఱియలుగాఁ బగిలి క్రింద ఏల పడదో కదా. రాముఁడు నీకు అహితముగాఁ గాని అప్రియముగాఁగాని ఏయొక్క మాటయును పలుకఁడు. పరుసము లాడుటయే వానికిఁ దెలియదు. అట్లు సర్వజనులకు నింపు సొంపు గులుకుపలుకులచే పలుకువాఁడై, గుణవంతుఁడని యందఱిచేతను ఎప్పుడును కొనియాడంబడుచున్న రామునియందు దోషము లున్నవని యెట్లు చెప్పఁగలవు? కేకయరాజకులమును చెఱుపుటకై పుట్టినయోపాపాత్మురాలా! నీవు కంది కుందుము; కోపమున నుండిపొమ్ము; నశించిపొమ్ము; పర్వతముననుండి వేయిదునుకలుగా విరిసి నేలం బడుము; మఱియేమైనను చేసికొనుము. నీవేమి చేసినను నాకు మిక్కిలి దారుణమును అహితమునైనమాటను నేను గావింపనుచుమా! ఓసీ! నీవుమంగలకత్తి వలె మిక్కిలి వాఁడిగలదానవే. మొగమిచ్చకమునకై మెఱమెచ్చులు పలుకుదానవు. నీస్వభావము నిలువెల్లదుష్టము. నాకులమును గూల్చుటకై వచ్చితివి. నా కెట్లు మనస్సున కింపగుదువే? ఓసీ! నాహృదయమును దానిమూలమైనప్రాణముతోఁగూడఁ దహింపఁగోరుచున్న నీవు, ఉసుఱుపోనుండుట నేను జూడనోపను. నేను బ్రతికియేయుండనోపను; ఇఁక నాకు సుఖ మెక్కడిది? జీవించి యున్నను, కొడుకు లేక సుఖ మేమిగలుగును? మఱి నీతోడఁగాని సుఖమెక్కడిది? కావునను, నీవు నాకు భార్యవుగావునను, నాకుఁ గీడు సేయఁదగదు. నీపాదము లనేని పట్టుకొనెదను. నాదెస ననుగ్రహింపుము'' అనియె. ఆదశరథుఁడు, ఆఁడుదానికొలఁదిని మీఱి నడచుచున్నయాకైకేయికి తన హృదయము చిక్కఁగా, తాను భూమినంతయును ఏలువాఁడయ్యును తనమనస్సును ఏలి మరల్చుకొన నేరక దిక్కుమాలినవానివలె పలవించుచు నాబిడపాదములందు, వ్యాధిగ్రస్తుఁడు దటతప్పి దొబ్బుసఁబడునట్లు బెడిదముగాఁ బడెను. అయినను అతఁడు పడుటఁ జూచి కైక తనపాదములను మఱియొకవంకకుఁ జాఁచుటచే అతఁడు నట్టినేలపయిఁ బడెను గాని ఆయమయడుగుల రెంటిని స్పృశించినవాఁడు గాఁడయ్యె. ఇది పండ్రెండవసర్గము.

## దశరథుఁడు కైకేయిని మఱియుఁ బ్రార్థించుట.

దశరథుఁ డట్టిదుఃఖము ననుభవింప నర్హుఁడు గాఁడు. అట్లు నేలఁబడియుండుటకుఁగాని యాఁడుదానిపాదములం బడుటకుఁగాని పాత్రుఁడుగాఁడు. అట్టివాఁడయ్యును అట్లు నేలఁ బడి మిక్కిలి పలవించుచు, పుణ్యమంతయు తెఱఁగినపిమ్మట భూమికివచ్చిన యయాతివలెఁ జూపట్టుచున్నయామహారాజుం జూచి యనర్థమే రూపముగాఁ గల యాకైకేయి తనకార్య మొడఁగూడనిదై, దానిని సాధించువిషయమున లోకనింద కలుగునని యు భయపడక, దశరథునకుఁ గలిగి యున్నభయమును సరకుసేయక, అతనికి మఱియు వెఱపు చూపుచు పూర్వ మిచ్చినవరమే కావలయు నని మరలఁ దెలుపుటకై తనవరునిం జూచి ''మహారాజా! నీవు 'నేను కల్లలాడను; పట్టిన వ్రతమును విడువను' అని పొగడికొనెదవు. అట్లేని నా కిచ్చెద నన్న యావరమును ఇయ్యక గట్టిగాఁ బట్టుకొని ఇంకను అప్పుగానే పెట్టుకొని యుండఁ గోరుచున్నావే!

ఇది యేల?" అనియె. ఆమాట కపుడు దశరథుఁడు మిక్కిలికోపము నొంది కైకేయిపై పు మూర్ఛిల్లినట్లుండి యంత తెలివొంది "ఔరా ! ఇంత క్రూరమా ! ఓసీ ! అపూజ్యురాలా! నాపగతురాలా! నేను మృతుఁడయి, పురుషలలాముఁడై న రాముఁడడవికిఁ బోయినపిమ్మట, నీవు కోర్కులు దీరి సుఖముగానుండువే. నేను జచ్చియు సుఖముండుదునా? అదియును లేదే. ఇచట రామునికుశలమును దిగఁద్రావి నేను స్వర్గమునకుఁ బోయినను అచ్చట దేవతలు రామునికుశలమునుగూర్చి 'ఓయీ ! తెలివి లేనియాఁడుదానికొఱకు గుణవంతుఁడగుకొడుకును దిగనాడుదువా?' యని ధిక్కరించుచు నడుగుమాటను, అయ్యో! నేనెట్లు సహింపఁగలనే. అచ్చటను సుఖము సున్నయయ్యె. 'సత్యపాశమునకు లోనై వానిని బంపితి' నని చెప్పుదుమందువా? నా రట్లడుగఁగా నేను 'కైకేయికి మున్ను నేనిచ్చినవరమునకుఁగాను, దానికిఁ బ్రియము సేయఁగోరి, రాముఁ నడవికిఁబంపితిని' అని యీసత్యమును జెప్పుదునేని, ఇంతకుఁ బూర్వము నేను రామునికి 'నీకు రేపు పట్టము గట్టెద' నన్నమాట యసత్యమగును. నేను మున్ను కొడుకులు లేకుండి బహుశ్రమముపడి పూజ్యుఁడును మహాబాహుఁడు నగురాముని కొడుకుగాఁ బడసితిని. అట్టికొడుకును నే నెట్లు దిగవిడుతును? మఱియు వాఁడు శూరుఁడు; సకలవిద్యలు నేర్చినవాఁడు; కోపమును గెలిచి యోర్పు గలిగి వెలుఁగువాఁడు. తామరపూరేకులవంటి కన్నులు గలచిన్నారిరాముని నే నెట్లు అడవికిఁ బంపుదును? నల్లగలువలవలె నీలవర్ణము గలిగి, నిడుదబుజములు దాల్చి, మంచిబలవంతుఁడై, అత్యంతసుందరుఁడై, యుండు రాముని నే నెట్లు దండకారణ్యమున కంపుదును? వాఁడు సుఖము లనుభవించుటకే తగినవాఁడు; దుఃఖమున కెంతమాత్రమును దగఁడు; మఱియు బుద్ధిమంతుఁడు; అట్టిరామునికి దుఃఖము రాఁగా నే నెట్లు చూతును? దుఃఖమున కెంతమాత్రమును దగనిరామునకు ఇపుడు దుఃఖము కలిగింపకయే నే నీదేహమును దాఁటుకొందునేని యప్పటికి నాకు సుఖము గలుగును. క్రూరాత్మురాలా! ఓసీ! పాపబుద్ధీ! పగవారియెడ వ్యర్థము కాని పరాక్రమమున మెఱయుచు, మనబోఁటి కందఱియెడ ప్రియము నెఱపుచు, నుండురామునికి అడవికిఁ బంపునట్టియప్రియము నేల గూర్చుచున్నావే? ఇందువలన నాకు లోకమున ఎచ్చటను సాటిలేని యపకీర్తియును ఎన్నఁటికిని విడువనియవమానమును గలుగును" అనియె. అట్లు దశరథుఁడు, మనస్సు గొట్టునఁ దిరుగుడుపడ, విలపించుచుండఁగా సూర్యుఁ డస్తమించెను. రాత్రియునయ్యెను. ఆరాత్రి చంద్రమండలముచే నిండారు వెంపు గులుకుచుండియు దాని మూఁడుజాములును పలవించుచున్న యారాజునకు ఇంపుగాఁ జూపట్టినవి గావు; దుఃఖమున నే కడచినవయ్యె. వృద్ధుఁడై నయాదశరథభూనాథుఁడు వెచ్చనినిట్టూర్పు విడిచి కన్నెత్తి ఆకాశమునందుఁ జూడ్కి నిలిపి మహాశోకపీడితునివలె వినువారికని దుఃఖము గలుగునట్లు 'చుక్కలచే వెలుగుచున్నయోరాత్రీ ! నీవు తెల్లవాఱకుము. అది నాకు వలదు. నన్ను దయఁజూడుము. ఇదిగో నీకు చేతులు మొగిడ్చి వేఁడుచున్నాను. అటు గాదేని రాత్రు లేకదా స్త్రీతోడి

పోత్తు. తెల్లవాఱినఁ దక్కినపనులేక దా. కనుక త్వరగా తెల్లవాఱుము. దేనినిబట్టి నాకిట్టిమహావ్యసనము గలిగినదో ఆకూ్రరాత్మురాలిని, ఆనిర్దయురాలిని,ఆకైకను,జూడ 'నాకిష్టము లేదు' అనివిలపించెను. ఇట్లు విలపించి, యంత, ఆరాజు అంజలిపట్టి మరలకైకను అనునయించుచు దానిం జూచి'దేవీ! నీవు శుభాత్మురాలవు, నాకు ఇల్లాలవు ; మఱి నేనో యిన్ని దినములు మంచియాచారములే కలిగియున్నవాఁడను. ఇప్పుడు దుఃఖము పాలై నిన్నే శరణుఁ జొచ్చినాఁడను.నావయస్సును జూడఁగా నేడో రేపోచావఁబోవు వాఁడను; విశేషించి ప్రభుండను. అట్టినేను ప్రతిజ్ఞ తప్పి ఆచారముచెడి దుఃఖముతో తీఱిపోకుండునట్లు అనుగ్రహింపుము. సుశ్రోణీ!ఎవ్వరును లేనిచోట నేను రాముని పట్టముగట్టెడిమాటను జెప్పలేదుగదా. సకలజనులసమక్షమునఁ జెప్పితిని. పనికిమాలి చెప్పితిని. నీమనస్సు మంచిదే కదా. కనుక నన్నుఁ గారింపక మిక్కిలి యనుగ్రహింపుము. నల్లనికడకన్నులవన్నెలాఁడీ! ప్రసన్నురాల వగుము. నీ వరమువలన నీవు రాజ్యము దీసికొని నీవే ప్రాజ్యం బగునారాజ్యమును రామునకిచ్చి మిక్కిలియుఁ గీర్తినొందుమా! పృథుశ్రోణీ! చారుముఖీ! సుందరలోచనా! నీ విట్లుచేయుదువేని నాకును, రామునకును, ప్రపంచమునకును, గురువులకును, భరతునకును, ఇవి ప్రియమగును.కనుక నిట్లు చేయు'మనియె. ఆకూ్రరురాలు మిగుల దుష్టస్వభావము గలదిగావున, రోదనముచే కన్నులెఱ్ఱఁబాఱి కన్నీళ్లు గ్రమ్ముచున్న యానిర్మలహృదయుఁడు ఆరాజు, కసరియు, కొసరియు, బతిమాలియు, పలువిధములుగా జాలిపుట్టునట్లు ఎంతవిలపించియు మగనిమాట చొప్పున నడచుకొన్నదిగాదు. అంత నారాజు,ఆరాత్రి రాకున్నంతవఱకును, తనకు నెపుడు ననుకూలయై పతివ్రతయై యుండినయాకైకేయి, యపుడు దైవికముగా'రాము నడవికిఁ బంపు' మని యంతటి ప్రతికూలపుమాట చెప్పుటం జూచి, చిరపరిచయబలమున దానిమాట ధిక్కరించుటకును నేరక, కన్నకొడుకును దిగవిడుచుటకునుజాలక, చేయునది తోఁపక, దుఃఖమున మఱల నెఱుక తప్పి భూమిం బడెను. ఇట్లు మంచిమనస్సు గలయామహారాజు మిగుల దుఃఖితుఁడై చూపఱకు మిగులభయము గలుగునట్లు నిట్టూర్పులు పుచ్చుచుండఁగా నారాత్రిగడచినది.అంత వేకువను వైతాళికులు మొదలైనవారు దశరథుని మేలుకొలుపఁబూనఁగా, అతఁడట్లు మేలుకొలుప వలదని యాజ్ఞాపించెను. ఇది పదుమూఁడవసర్గము.

---

{ దశరథుఁడు రాముని నడవికిఁ బంప నిశ్చయించుట. సుమంత్రుఁడు దశరథుని కడకు వచ్చుట. రామునిఁ బిలిపించుట. }

పుత్రశోకమునఁ బీడితుఁడై యెఱుక తప్పి యవయవములు చుట్టగా ముడుఁచుకొనుచు నేలంబడియున్న యిక్ష్వాకుకులునిఁ జూచి యాపాపాత్మురాలు'నాకు వరమిచ్చెదనని ప్రతిజ్ఞ సేసి యది తప్పి పాపమునకు ఒడిగట్టుటయే యైనది. మఱి యిట్లు బ్రుంగి నేలం బడియున్నావు. ఇది యేమి? నీవు ఆడి తప్పకుండుమర్యాదయందు నిలుచుటయే న్యాయము. ధర్మజ్ఞులైనపెద్దలు సత్యమే పరమధర్మమని చెప్పుదురుగదా; నేను సత్య

ము అనెడిధర్మమును ఆశ్రయించియే వరమిమ్మని పురికొలిపితిని గాని అధర్మమేమియుఁ జేయను. రాజా! తొల్లి శైబ్యుఁడనురాజు ప్రతిజ్ఞ సేసి పక్షియైనడేగకుఁ దన దేహాము గోసి యిచ్చి యుత్తమగతిని బొందెను. అట్లె మహాతేజస్కుఁడైన యలర్కుఁడును, వేదపారంగతుఁడైనయొకబ్రాహ్మణుఁడు తనకన్నుల నిమ్మని యాచింపఁగా కొంచెమైనను మనస్సునఁ గుందక వానిని బెఱికి యిచ్చెను. సముద్రుఁడును తనచెలియలికట్ట, సులువున దాఁటగూడినంతస్వల్పముగా నుండినను, దానిని మీఱ కుండుదునని సత్యముచేసి యాసత్యము నే యనుసరించుటఁబట్టి తాను సంకల్పించుకొన్నంతకాలము, పొంగి పొరలునపుడును, ఆ మేరను దాఁటకున్నాఁడు. సత్యమేపరమప్రాప్యమును ప్రణవరూపమును అగుబ్రహ్మము. సత్యమునందే ధర్మమంతయుఁ బ్రతిష్ఠితమైయున్నది. కాన సత్యమే ధర్మమునకు తుదియెల్ల. అక్షయములైన వేదములును సత్యము నే ప్రధానముగా ప్రతిపాదించుచున్నవి. సత్యముచేత నే పరమపురుషార్థమైన మోక్షమును సిద్ధించుచున్నది. కాఁబట్టి నీకు ధర్మమునందు బుద్ధి స్థిరముగా నుండు నేని సత్యముకన్న నతిశయించిన ధర్మము లేదుగావున సత్యమును అనుసరింపుము. నేను గోరినవరమును సఫలముగావింతువు గాక. నీవు అడిగినవారికి తప్పక వరములిచ్చువాఁడవు; మఱియును ఉత్తముఁడవు గదా. కనుక ధర్మమును పాలించుటకొఱకును దానియభివృద్ధికొఱకును, ప్రియురాలైననేను ప్రేరించుటవలనను, నీకొడుకును రాముని అడవికిఁ బంపుము. ఇది ముమ్మాఱు నీకుఁ జెప్పుచున్నాను జుమీ. నీవు పూజ్యుఁడవు గనుక ప్రతిజ్ఞ తప్పరాదు. నాకుఁ జేసినప్రతిజ్ఞను జేయవేని, రాము నడవికిఁ బంపవేని, నీ విట్లు నన్ను పాటింపక త్రోసిపుచ్చఁగా బ్రతుకుదునా? నీయెదుటనే ప్రాణముల విడుతు' ననియె. ఇట్లు కైకేయి జంకును గొంకును లేక తఱిమి యడుగఁగా ముందు *బలి తన్ను ఇంద్రునితోఁబుట్టువైనవామనుఁడు గట్టినపాశమును వదల్చుకొనఁ జాలనట్లు, రాజును కైకేయికి సత్యముచేసి యుండుటచే సత్యపాశమును విడిపించుకొనుటకు శక్తుఁడు గాఁ డయ్యె. అతఁడు, కైకేయికిచ్చినమాట తప్పుటకును, తప్పక రాముని నడవికిఁ బంపుటకును, జాలక బండికాఁడికిని చక్రమునకును నడుమఁ జొచ్చినయెద్దువలె, మనసు తిరుగుడు వడఁగా, ముఖము వెలువెలఁ బాఱఁగా, మిన్నకుండి, దుఃఖాతిశయమున కలఁగి కన్నుంగవసూటి దప్పఁగా, గ్రుడ్డివానివలె నేమియుఁ గానకుండి, ఎట్టకేలకు కష్టమున దిటవు తెచ్చుకొని, తనమనస్సును చిక్కఁబట్టి, కైకేయిం జూచి 'పాపాత్మురాలా! నేను అగ్నిసన్నిధియందు మంత్రపూర్వకముగా గ్రహించిన నీపాణిని, నిన్నుఁ జేసికొన్న పాణిగ్రహణమును, విడిచితిని. ఇఁక నీవు నాకు భార్యవుగావు. నేను నీకు

---

* బలి యసురరాక్షసుఁడు ఇంద్రుని జయించి తఱిమి స్వర్గలోకమును ఆక్రమించుకొనఁగా, ఇంద్రునితల్లియైన అదితిప్రార్థనమున విష్ణువు వామనుఁడుగా అవతరించి బలిని మూఁడడుగులభూమిని యాచించి రెండడుగులకు జగమంతయుఁగొలిచి యాక్రమించి మూఁడవయడుగును ఇయ్యఁజాలని బలిని బంధించెననుకథ యిట అనుసంధించునది.

భర్తనుగాను. అట్లు నాకుఁ బుట్టిననీకొడుకును సైతము నీతోఁ గూడ విడిచెదను. కైకా! రాత్రి యయినది. ఇఁక సూర్యుఁ డుదయింపఁగా అంత గురుజనులు రామాభిషేకమునకు సమకట్టిన ద్రవ్యములతో వచ్చి రాముని అభిషేకింపుమని నన్ను తొందరపెట్టుదురు. ఇది నిజము. రామాభిషేకము విఘ్నము నొందునేని నేను బ్రతుకను గాన యపుడు యభిషేకమునకై కూర్చినసంభారములను గొని నాకు రాముని చేతనే యుత్తరక్రియలు చేయింపవలయును. ఓసీ! రాముఁడే చేయ నేలయంటివా! నీయాచారములు మంగళము లైనవిగావు. నీవు విఘ్నము సేయక మానవు. కనుక రామాభిషేకమునకు విఘాతము సేయుదువేని నీవును నీకొడుకును నాకు సలిలక్రియలు ఎంతమాత్రమును జేయరాదు. నేను మునుపు రామాభిషేకము చేయునట్లు చెప్పినపుడు జనులందఱు సంతోషపుసొంపు పెంపారుచుండఁగాఁ జూచినకన్నులతో, ఇపుడు రాముఁ డడవికిఁ బోవుట విని యుబ్బుదక్కి ఆనంద ముడిగి దుఃఖమునఁ దల వంచియుండఁగా వారిని జూడఁజాలను' అనియె. మహాత్ముఁ డగునామహారాజు అట్లు కైకతో పలుకుచుండఁగానే చంద్రుఁడు వెలుఁగ చుక్కలు మెఱయ చెలంగుచుండిన యారాత్రియుఁ గడచి తెల్లవాఱినది. ఆరాత్రి యంతయు ఎడతెగక రామచింతనమే జరుగుచుండినది గాన యది పవిత్రమై యొప్పె. అంత పాపపునడవడిగలయాకైక తనకార్యము సిద్ధింపలే దని పెనుఁగోపమున మైమఱచి మండిపడుచు మాటలు నేర్చినది గావున మరల రాజుం జూచి పరుషముగా 'రాజా! విషవ్యాధివలె దేహమంతయు వ్యాపించి యొరియించుచున్న యిట్టిమాట నేల చెప్పెదవు? దుఃఖముమాలిన నీకొడుకును రాముని నిచ్చటికి రావింపవలయును; నాకొడుకును రాజ్యమున పట్టముగట్టి రాముని అడవియందు దిరుగఁ బంపి నాకు ఎదిరి యెవ్వరును లేకుండునట్లు చేసి నీ వాడిన ప్రతిజ్ఞను పరిపాలింతువేని కృతకృత్యుఁడ వగుదువు. కానిచో నీవు గడతేఱుట గలుగదు' అనియె. చుఱుకైన మునికోలదెబ్బలకు నొచ్చిన మేటిగుఱ్ఱమువలె యారాజును పలునూఱు ఆకఱకుమాటలకు మిక్కిలియు గాసిలి యాకైకం జూచి *'నేను ధర్మపాశమున బద్ధుఁడనైతిని. నా తెలివియు నశించినది. ధర్మాత్ముఁడును ప్రియుండు నైన నాపెద్దకుమారుని రామునిఁ జూడఁగోరుచున్నా'ననియె. అంత తెలతెలవాఱి సూర్యుఁ డుదయింపఁగా పట్టాభిషేకమునకై నియతమైన పవిత్రమగు పుష్యయోగముహూర్తమును సమీపించెను. అప్పుడు గుణవంతుఁ డగువసిష్ఠుఁడు శిష్యులు చుట్టును బలసిరా, ఊరి వెలుపల నున్న సరయూనదికిఁ బోయి స్నానముచేసి త్వరితముగా పట్టాభిషేకసామగ్రులను గొని అయోధ్యాపురములోనికిఁ జొచ్చెను. అట్లతఁడు చొచ్చునపుడు జను లాపురమున మార్గముల నీరు చల్లి చక్కఁగానూడ్చి శుభ్రముగానించిరి. మే లయినటెక్కియము లందందు వెలయుచు నాపురికి పొలుపు గూర్చుచుండెను. అందు నలుగడల పలువిధములయిన పుష్పములు చల్లఁబడియుండెను.

* ఈవాక్యముచే రాముని అడవికి పంపుటకు కొంచెము అనుజ్ఞ రాజు సూచించినాఁడు.

నానావిధములైన పుష్పమాలికలును అందంద మురువు గులుకుచుండెను. జనులందఱును ఉబ్బి చెలరేఁగుచుండిరి. అంగడులయందు సరకులు నెఱసి మెఱసి యుండెను. ఎందుఁ జూచినను వెనువేడుకలును, ఎందుఁ జొచ్చినను రాముని యభిషేకముకొఱకైనయుత్సాహమును, చూపట్టుచుండెను అంతటను చందనాగరుధూపములవాసనలు ఘుగులుకొనుచుండెను. ఇట్లతఁడు దేవేంద్రునియమరావతివలె వెలుఁగుచున్నయాపురమును గడచి మిక్కిలియొప్పిదమునయంతఃపురమును బ్రవేశించెను. పలుదెఱఁగులైనపక్షిగణము లచటచట కొలకొల గూయుచుండెను. పురజనులును పల్లెపట్టులందలి ప్రజలును బ్రాహ్మణులును అందు నెఱసియుండఁగా నగినన్నె గులుకుచుండెను. యాగవేత్తలును సదస్యులయిన బ్రాహ్మణోత్తములును, అందు మిగుల నిండియుండిరి. వసిష్ఠుఁడా యంతఃపురమునొద్దకుఁ బోయి యచట మూఁగి యుండినపౌరులు మొదలైన యా జనులను గడచి ద్వారములోనికిం బోయెను. పురుషసింహుఁడగుదశరథునికి మంత్రియు సారథియు నైనసుమంత్రుఁ డభిషేకమహోత్సవముకొఱకు నలంకరించుకొని యొప్పిదముగా చూపఱకుఁ గనఁబడుచు నంతఃపురములోపలఁ బోయియుండి యపుడే వెలువడి ద్వారమునొద్ద నుండఁగా, ప్రభాగరిష్ఠుఁ డగువసిష్ఠుఁడు చూచి, విన్నాణి యగునాసూతపుత్రునితో 'నేనిచ్చటికి వచ్చియున్నానని రాజునకు వేగ చెప్పుము. రామాభిషేకముకొఱకు నిదిగో, గంగాజలములు నిండిన బంగారుఘటములును సముద్రజలపూరితములైనబంగారుకలశములును తెచ్చియున్నారము మేడి మ్రానుతోఁ జేయఁబడినరాజపీఠమును అభిషేకార్థము తేఁబడినది. సర్వధాన్యములును నానావిధగంధములును వివిధరత్నములును దెచ్చియున్నాము. తేనెయు పెరుఁగును నేయును పేలాలును పువ్వులును పాలును మఱియు వన్నెగులుకు కన్నెలు ఎనమండ్రును మేలైన మదగజమును దెప్పించియున్నాము. * మఱియు నాలుగు గుఱ్ఱములఁ బూన్చి కాంతి గులుకుచున్న రథమును, ఖడ్గమును ఉత్తమ మైన విల్లును మోచు జనులతోడి పల్లకియు, చంద్రునివలెఁ దెల్లనగు ఛత్రమును, వెల్లని చామరములు రెండును బంగారుగిండిపాత్రయు, బంగారుపగ్గములతోఁ గట్టఁబడి పెను మూఁపురము గలిగి యున్న తెల్లని వృషభములును, మేలైన జూలుగలిగి నాలుగు పండ్లు మొలచినవై మంచిసత్తువ చెలంగు చున్నయుత్తమాశ్వములును తేఁబడినవి. సింహాసనమును, పెద్దపులిచర్మమును, అగ్నిహోత్రమును ఆయితములుగా నున్నవి. సమస్తవాద్యములును దెప్పించియున్నాము. వారస్త్రీలును మఱియు నలంకృతలైన యితరస్త్రీలును రప్పింపఁ బడియున్నారు. ఆచార్యులును బ్రాహ్మణులునువచ్చి యున్నారు. గోవులును మఱియు పుణ్యము లైనయితరమృగములును పక్షులును

* ఇందులకు 'చతురశ్వోరథశ్శ్రీమాన్' అని మూలము. ఇందు రెండవయక్షరము (తు) అను దానిచేత గాయత్రినాలవయక్షరము గ్రహింపఁబడెను. దీనిచేత నాలవగ్రంథసహస్రము ఆరంభింపఁబడె నని తెలియునది.

ఆయితములై యున్నవి. మేటిపురజనులును కన్యాకులైనజానపదులును వర్తకులును అధ్యాపకులును తమతమవీథులందలిజనులతోఁగూడ వచ్చియున్నారు. వీరే కాక నుతియును మేము దోడ్కొని వచ్చినప్రియుండవదులైనవా రనేకులును, రాజులును, రాముని యభిషేకము నిరీక్షించు చున్నవారు. చక్కఁగా పనులు కాఁగా, శ్రేయస్కరమైన యీదినమున పుష్యనక్షత్రమున రాముఁడు రాజ్యాభిషిక్తుఁ డగునట్లు మహారాజును త్వరపెట్టుము' అనియె. ఆమహాత్ముఁడు చెప్పినమాటవిని సుమంత్రుఁడు రాజసింహునిఁ బొగడుచు నంతఃపురముఁ బ్రవేశించెను. రాజు ద్వారపాలకులకు 'ఈసుమంత్రుఁడు అంతఃపురములోపలికి వచ్చునేని యథేచ్ఛముగా విడుచునది' అని చెప్పియున్నాఁడుగాన, లోనికిఁ బోవుటకు రాజుసమ్మతి గలిగియున్న యావృద్ధుఁడు సుమంత్రుఁడు లోపలఁ జొచ్చునపుడు, వారు వాని నడ్డగింపఁ జాలరైరి. వారు రాజునకుఁ బ్రియమే సేయువారలు గాన, సుమంత్రుఁడు లోనికిఁబోవుట రాజునకు ప్రియమని తెలిసి యేల యడ్డగింతురు? ఆసుమంత్రుఁడు రాజుదగ్గఱ నిలిచి యతఁ డున్నట్టి యా దురవస్థను తెలియఁడు కావున మిక్కిలి సంతసము దెలుపువాక్యముల దశరథుని పొగడుటకుం బూని యప్పటివేళకుఁ దగినట్లు ఆరాజగృహమున చేతులు మొగిడ్చుకొని మహీపతి నిట్లని స్తుతించెను. 'తేజస్వియగు సముద్రుఁడు పరిపూర్ణచంద్రోదయమున కిరణంబులు తనయందు ప్రతిఫలింపఁగా మనంబునఁ బ్రీతినొంది యానందపూర్ణుఁడై యెట్లు ఉత్సహించునో యట్లె గొప్పవాఁడగు నీవును నీ యంతటనానందింపుము. ఈవేళయందే మాతలి యింద్రునిఁ బొగిడెను; ఆయింద్రుఁడును సకలదానవులను జయించెను. అట్టియీకాలమున అట్లే నేనును బొగడి మేలుకొలిపెద. నీవును ఇంద్రునట్లు సమస్తశత్రువులను జయింతువు. అంగభూతము లైనశిక్ష మొదలైనవిద్యలతోఁ గూడిన* వేదములు సర్వవిభుఁ డగుబ్రహ్మదేవునికి, సృష్టికి వలయునర్థములను బోధించునట్లు, నేనును, నిన్ను వలయుకార్యములను జేయుటకై మేలుకొలుపుచున్నాను. సూర్యుఁడును చంద్రుఁడును, సమస్తప్రాణులను ధరించుచున్న శుభాత్మురాలగుభూమిని ఉదయాస్తమయముల మేలుకొలుపునట్లు, నే నిప్పుడు నిన్ను మేలుకొలుపుచున్నాను. మహారాజా! నీవు అభిషేకమహోత్సవార్థము అంకిలికిస నేత్రోత్సవముగా మంగళాలంకారములు గైకొని సహజముగా వెలుఁగుచుండు నీమూర్తి

* 'నామ రూపంచ భూతానాం కృత్యానాంచ ప్రపఞ్చనమ్। వేదశబ్దేభ్య ఏవాదౌ దేవాదీనాం చకార సః' 'దేవతలు మొదలైన ప్రాణులకు నామమును రూపమును, జేయవలసిన కార్యములను సవిస్తరముగా నిరూపించుటయు, నతఁడు (బ్రహ్మ) వేదశబ్దములవలననే తెలిసి చేసెను' అని సృష్టికి వలసిన ఆయాయర్థములను వేదములు తెలుపఁగా బ్రహ్మచేయునను విషయము ఇట గ్రాహ్యము. లేక 'వేదేభ్య ఏవభూరాదీన్ పదార్థాన్ జ్ఞాత్వా వేధాస్తాన్ సృజతి-బ్రహ్మ, వేదములవలననే భూమి మొదలైన పదార్థములను ఎఱిఁగి వానిని సృజించుచున్నాఁడు' అను శ్రుతినిబట్టి భూమ్యాదులసృష్టికొఱకు వేదములు బోధించుచున్న వనుట నిట గ్రాహ్యము.

మఱియును బ్రకాశింపఁగా * మేరుపర్వతమునుండి సూర్యుఁడుదయించునట్లు లెమ్ము. కాకుత్థ్సా ! నీకు చంద్రసూర్యులును మహావిష్ణువును పార్వతీరమణుఁడును చతుర్ముఖుఁడును కుబేరుఁడును వరుణుఁడును అగ్నిదేవుఁడును దేవేంద్రుఁడును విజయము నొసంగుదురు గాక. రామాభిషేకమునకు ఉపయుక్త మగుటచే మహనీయ మైనట్టి యీరాత్రియు గడచినది. నీవు చేయవలసియున్న కార్యము లన్నియు మేము చేసి యున్నారము. రాజసింహామా ! మేలుకని యవ్వలికార్యములను గావింపుము. రాముని యభిషేకమునకుఁ గావలసిన ద్రవ్యములన్నియు సమకట్టి యైనది. భగవంతుఁ డగువసిష్ఠుఁడు, పురజనులును పల్లెపట్టులప్రజలును వర్తకులును చేతులు మొగిచి తన్నుఁగొలువ, బ్రాహ్మణులతోఁగూడఁ గాచుకొనియున్నాఁడు. కావున రామునికి అభిషేకముసేయునట్లు శీఘ్రముగా నాజ్ఞాపింపుము. కాపరిలేనిపశువులవలెను, నాయకుఁడు లేనిసైన్యమువలెను, చంద్రుఁడులేని రాత్రివలెను, ఆఁబోతు లేని యావువలెను, రాజు కనఁబడనిరాజ్యము సొంపుమాలి చెడిపోవును. కావున వేగ ప్రజలకు దర్శనమిమ్ము'ఇట్లు సుమంత్రుఁడుమనస్సునకుసమాధానమగునట్టు చల్లగాను, ప్రాతఃకాలమున మేలుకొలుపుట జయకరముగాన అట్టిప్రయోజనముగలుగునట్లుగాను, చెప్పినమాట వినఁగా రాజునకు శోకము మీఁదుమిక్కిలియలముకొన్నదయ్యె. అంత పుత్రునకుఁ గలుగుదుర్దశకు సంతోషము దక్కి, ధార్మికుఁడుగాన సత్యముదప్పఁజాలక, స్రుక్కుచున్నయా శ్రీమంతుఁడు శోకమున నెఱ్ఱఁబాఱినకన్నులతో ఆసారథిని తలయెత్తిచూచి'ఓయీ!ఇంతకే నామర్మములు తెగియున్నవి. ఇట్టిస్తుతివాక్యములచే ఇంకను నానిని త్రెంచుచున్నావుసుమీ'యనియె. సుమంత్రుఁడు, వినుటకు జాలిపుట్టించు నాదీనవాక్యమునువిని, దీనుఁడై యున్నరాజునుం జూచి వెఱచి చేతులు మొగిడ్చి యచటికిఁ గొంతదూరముగా తొలఁగియుండెను. రాజు దుఃఖమున తానై మాటాడుటకు శక్తుఁడు గాకుండఁగా, అపుడు మంత్రము నేర్చినకైక సుమంత్రునిఁజూచి 'సుమంత్రా ! రాజు రామునియభిషేకమును గుఱించినయుబ్బుచే నుత్సహించి రాత్రియంతయు మేలుకొనియుండి యలసి యిప్పుడు నిదురకు పాలై యున్నాఁడు. కావున నీవు త్వరితముగాఁ బోయి మంచికీర్తి నొందిన యారాజకుమారుని తోడ్కొనిరమ్ము. నీకు శుభంబగుఁగాక. ఈవిషయమునం దాలోచింపవలదు'అనియె. రాజుమాటచే, ఏమాయనర్థము పుట్టియున్నదని శంకించుచున్న యాసుమంత్రుఁడు, కైకేయిమాటవిని 'మఱేమియు లేదు; ఇఁక మంగళమే'యని మనంబునఁ దలఁచుకొనుచు సంతసించి రాజుననుజ్ఞవలననే కైకేయి యట్లు సెప్పినదని యుబ్బుచు వెడలి పోయెను. వాఁడు కైకేయి తన్ను 'రామునితేఁబొమ్మని త్వరితముగా పురికొలిపినందులకు మనసులో 'సరి! తెలిసినది. ధర్మజ్ఞుఁ డగురాముఁడు పట్టాభిషేకముకొఱకే యిటరాఁబోవుచున్నాఁ'

* సూర్యుఁడు మేరుపర్వతమును చుట్టుటయేకాని దానినుండి ఉదయించుటలేదు. కనుక మేరుపర్వతమునుండి. అనఁగా మేరువుతో సంబంధించినతనరథచక్రముద్వారాఅందుండి, లేచుటయని తెలియునది.

డని మనస్సునఁ జింతించి సంతోషము పెచ్చుపెరుఁగఁగా మహాబాహుని రామునిఁ జూడఁగోరి, మహాపట్టణమైనఅయోధ్యనడుమ నుండుటవలన సముద్రమునడుమ నుండుమడుఁగువలె నొప్పుచున్నయాయంతఃపురమునుండి వెడలి చని, జనులు క్రిక్కిఱిసియున్నదాని ద్వారమును ముందటఁజూచి, పిదప నచటనుండి వేగముగా వెడలి ద్వారముసేరి ముందఱనున్నయారాజులను జూచి,వెనుకఁ బెక్కు ధనములను కానుకలఁగొని గుంపులుగూడి ద్వారమందున్న నానావిధపురజనులను జూచెను. ఇది పదునాలుగవసర్గము.

---

## రామాభిషేకసంభారవర్ణనము.

వేదవిదులైనయాబ్రాహ్మణోత్తములందఱును రాత్రియెల్ల నచటనుండి,అంత రాజపురోహితుఁ డగువసిష్ఠునితోఁగూడ సభచేరిరి. మఱియు మంత్రులును సేనలోని ముఖ్యాధికారులును బట్టణమునందలి ప్రముఖులును రామునియభిషేకమును జూచుట్కై సంతోషము పురికొనుచుండఁగా నచ్చటికివచ్చి కలసిరి.నిర్మలుఁ డగుసూర్యుఁడు ఉదయించినపిదప, పుష్యనక్షత్రమున రామునిజన్మలగ్న మయినకటకలగ్నము రాఁగానే రాముని యభిషేకముకొఱకు వలయుద్రవ్యములన్నియు బ్రాహ్మణోత్తములు ఆయత్తము సేసిరి. బంగారు జలకుంభములును,బాగుగా నలంకృతమైరాజుకూర్చుండునట్టి పీఠమును, బ్రకాశించునట్టిపులితోలును చక్కఁగాఁ బఱచినరథమును, గంగాయమునానదుల పుణ్యసంగమస్థానమునుండియు పవిత్రము లైనయితరనదులయఱదుండియు మడుఁగులనుండియు కూపములనుండియు కొలఁకులనుండియు జలమును, దేఁబడినవి. తూర్పుదెసగా పాఱునట్టిగంగ గోదావరి మొదలయిన నదులనుండియు ఊర్ధ్వము గాఁ బాఱు బ్రహ్మావర్తము రుద్రావర్తము మున్నగువానినుండియు,దక్షిణోత్తరముఖముల నడ్డముగా బ్రవహించుగండకి శోణభద్రము మొదలయిననదులనుండియు, పాఱకనిలిచియుండు పుణ్యసరస్సులనుండియు, సమస్తసముద్రములనుండియు, జలము తేఁబడియుండెను. పేలాలతోఁగూడి, పాలుగల యశ్వత్థాది పత్రములతోఁగప్పఁబడి, తామరలును గలువలనుగలిగి, పావనజలములునిండియున్న బంగారుకలశములును వెండికలశములును ప్రకాశించుచుండెను. తేనెయును పెరుఁగును పేలాలును దర్భలును పువ్వులును పాలును ఆయత్తములై యుండెను.మఱియు పువ్వులు దుఱిమి,చందన మలంది,తక్కుఁగలమంగళాచారములును గావించి,సకలాభరణములనుదాల్చి,భోగమువారును రాజిలుచుండిరి. చంద్రకిరణములవలె వికసిల్లుతెల్లనికాంతి గలిగి, రత్నములు పొదిఁగినబంగారుపిడితోఁగూడి, మిక్కిలి మేలయి గ్రాలు రామునిచామరమును సిద్ధమయియుండినది. చంద్రమండలమువలె గుండ్రనై తెల్లనై మెఱుఁగులు దుఱఁగలించుచు,పట్టాభిషేకార్థము నిర్మితమై, యొప్పుమేటిశ్వేతచ్ఛత్రమును సిద్ధమైయుండె. తెల్లనియాఁబోతును,మఱియు మిక్కిలిచక్కనై తెల్లగానుండు గుఱ్ఱమును,సిద్ధములుగా నుండెను.ఎడతెగక మదజలమును కార్చుచు,మిక్కిలి కాంతిదళుకొత్తుచు,రాజులెక్క

టకు యోగ్యమయిన గజమును ఆయత్తముగానుండెను. సర్వాభరణములు దాల్చి మంగళార్థము నియతలైన కన్యలెనమండ్రును గాచియుండిరి. వీణాదిసమస్తవాద్యములును సిద్ధములై యుండెను. అట్లే స్తుతిపాఠకులును మఱియితరులును ఆయితముగా నుండిరి. ఇక్ష్వాకువంశ్యులయిన రాజులకు పట్టాభిషేకము జరుగునపుడు వారియాచారముచొప్పున ఏయేపదార్థములు సమకూర్ప వలసియుండునో యారత్నాదిపదార్థములనుగొని యారాజులు మహారాజునాజ్ఞవలన రామాభిషేకముకొఱకు ఆరాజాంతఃపురద్వారమునంగూడి దశరథమహారాజు కనఁబడకుండుటవలన 'మనమువచ్చి యుండుట రాజునకు చెప్పువాఁడెవ్వఁడో! రా జింతకును దర్శన మియ్యకున్నాఁడు. ప్రొద్దుపొడిచియు నైనది. రామునిపట్టాభిషేకమునకు వలయు ద్రవ్యములన్నియు సిద్ధముగానున్నవి' అని తమలోఁ దా మనుకొనిరి. ఇట్లు వారనుకొనుచుండఁగా, రాజు మిక్కిలియు సత్కరించునాసుమంత్రుఁడు, ఆరాజులనుజూచి "రాజు నియోగింపఁగా నేను రామునిదోడ్కొనివచ్చుటకు అతనియొద్దకు వేగముగాఁ బోవుచున్నాఁడను. మీరురాజునకుఁబూజ్యులగు. ఆయుష్మంతులగు మీమాటచొప్పున నే నిప్పుడు మేల్కొని యుండురాజునొద్దకుఁబోయియతనిం జూచి 'మీకుసుఖమే నా? మీ రేలబయటికి రాలేదు' అని యడిగెద" అనిచెప్పి రాజుల పురాతనవృత్తాంతములనెల్ల నెఱింగినయావిన్నాణి మరలరాజాంతఃపురద్వారమునకుం బోయెను. వాఁ డెప్పుడు తలఁచిన నప్పుడు అడ్డిలేక యందు ప్రవేశింపఁగూడును గనుక నిరాటంకముగా దానిని ప్రవేశించి, రాజుఁగాంచి, యపుడు అతనివంశమును బొగడి, యతని శయనగృహంబును జేరి యచట నిలిచెను. వాఁ డట్లు రాజుపడుకటిల్లుకడకుఁబోయి తెరకుమాత్ర మీవల నిలిచి యారఘువంశజుని, గుణయుక్తములైనయాశీర్వచనములతో 'రాజా! చంద్రుఁడును సూర్యుఁడును శివుఁడును కుబేరుఁడును వరుణుఁడును అగ్నిదేవుఁడును దేవేంద్రుఁడును నీకు విజయము నొసంగుదురుగాక. రాజసింహా! మహనీయమైన రాత్రి గడచినది. ఈ రాత్రి నీవు చేయవలసినపనులన్నియును చేసి యైనది. మేలుకొనుము. ఇంకఁ జేయవలసినకార్యములను జేయుము. రాఘవా! బ్రాహ్మణులును సైన్యమునందలి ముఖ్యాధికారులును పట్టణమందలి ప్రముఖులును వచ్చినిన్నుదర్శింపఁగోరుచున్నారు. కనుక నిద్రమేల్కొనుము' అని పొగడెను. అంత దశరథుఁడు మేల్కొని, తన్నుప్రస్తుతించుమంత్రవిదుని సుమంత్రునిఁజూచి "కైక 'సూతా! రాముని దోడ్కొనిరమ్ము' అని చెప్పినది. దానికి నే నడ్డు చెప్పకుండుటచే ఒప్పుకొన్నవాఁడనే యైతిని గనుక అదియు నాయాజ్ఞయే యగు. అట్టి యాజ్ఞను నీ విట్లు ఉల్లంఘించుటకు కారణమేమి? అప్పుడు నేను నిదురలో నుంటిని గాన అదినాయాజ్ఞయో కాదో యని సంశయించితివో? ఇప్పుడునాకు నిదుర లేదు. నీ విపుడిచ్చటికిరాముని శీఘ్రముగాఁ దోడుకొనిరమ్ము" అని ఆకైకేయికొఱకు సూతునకు మరల నాజ్ఞాపించెను. వాఁడును రాజునాజ్ఞ విని యతనికి తలవంచి నమస్కరించి 'ఇఁకమిక్కిలి ప్రియమైన రామాభిషేకము జరుగును' అని తనలోననుకొనుచు రాజగృహము

వెనలి నిర్మలాత్ముఁడుగాన మఱేమియు కిటు కున్నదని తెలియక, డెందము ఆనంద మొంద, అవయవములు గరుపాఱ, రాజచిహ్నాహితము లైనటెక్కెములును వట్టి టెక్కెములును నిలిపి యలంకరించియుండు రాజమార్గమును జూచుచు, వేగముగాఁ బోయెను. అట్లు పోవునపు డచట సమస్తజనులును రామునిగుఱించియు పట్టాభిషే కమును గుఱించియు చెప్పుకొనుముచ్చటలను విని సంతసించెను. అంత నాసుమంత్రుఁ డు కైలాసశిఖరమువలె తెల్లనై సొడవుగలిగి దేవేంద్రునిమందిరమువలె కాంతిదళు కొత్తుచు మనోహరంబై యున్న రామునిగృహమును గాంచెను. ఆగృహమునకు తలు పులు మిక్కిలి పెద్దవి. అందు నూఱుతిన్నియలు వన్నెగులుకుచుండెను. అందందు ఎడ తెగక బంగారుబొమ్మ లుండుశిఖరములును రంగారుచుండెను. దాని వెలుపలిద్వారము మణులతోను పగడములతోను బాదుగఁ బడియుండెను. అది శరదృతువునందలి నె ల్లమబ్బువలె మిక్కిలి తెల్లనికాంతి గులుకుచు, మేరుపర్వతపుగుహవలె గంభీరమై, వ్రేలఁగట్టఁబడి యున్న మేలిబంగారుపూదండలనడుమ తళతళలాడు చుండుపెద్దమణు లచే రాణించుచుండెను. అందంతటను ముత్తెములును రత్నములును నెఱసిమెఱయు చుండెను. చందనాగరుధూపములు గుమగుమ యని బుగులుకొనుచుండెను. ఇట్టి లింపయినకమ్మనివాసనలు వీచుచుండుటచే అది చందనపుగొండదాపున నున్న దర్దుర పర్వతపుశిఖరమువలెఁ జూపట్టుచుండెను. మఱియు నందు బెగ్గురుపిట్టలయు నెమిళ్ల యు కూఁతలు ఇంపుగొలుపుచుండెను. సొగసుగా రచింపఁబడినతోఁడేళ్లు, గోడలు స్తంభములు మొదలగువానియందు నెఱసియుండెను. అంతటను మిక్కిలి సూక్ష్మము లైనచంద్రంపుఁబనులు చిత్రముగా రచింపఁబడియుండెను. నిబ్బరమైనకాంతిచే నది సకలప్రాణులచూడ్కులను మనస్సును కూడ ఆకర్షించుచుండెను. ఇంతేకాక యది సూర్యచంద్రులవలె ప్రకాశించుచు కుబేరునిగృహమువలెను దేవేంద్రునిభవనముఁ బోలెను దులకించుచుండెను. అందు నానావిధములైనపక్షులు అందంద సంచరించు చుండెను. మఱియు నది మేరుగిరిశిఖరమునకు సాటియై నీటు సూపుచుండెను. జనులు దానిసమీపమున గుంపులు గొని చేతులుమొగిడ్చికొని నలుగడల నిండియుండిరి. మఱియు పల్లెపట్టులజనులును రామునికి అభిషేకమగు నని మొగంబున సొంపుమీ ఱ, ఉత్సాహము దయివాఱ, కానుకలుగొని, అంతటను ఆవరించియుండఁగా నది పొలుపు సూపుచుండెను. అట్లు మహామేఘమువలె ప్రకాశించుచు, మిక్కిలి పొడ వై, చక్కఁగా నలంకృతమై, నానావిధరత్నవ్యాప్తమై గుజ్జులు అల్పదేహులు మొ దలైనవారు మెండుగాఁగలిగి, గండరించు చున్నయారామునిగృహంబును సుమం త్రుఁడు గాంచెను. వాఁడు మనుష్యులు నిండి యున్నయారాజగృహంబును జూ చుచు, మీఁదికప్పు గలదై గుఱ్ఱములు పూన్చియున్న తనరథమును రామగృహ మునకు అభిముఖముగాఁ దోలుకొనిపోవుచు, ఆపట్టణమందలిసమస్తజనులకును ఉల్ల ము పల్లవించునట్లు గావించెను. అంత నాసారథి, మహాధనసమృద్ధిగలిగి మృగములును

మయూరములును మిక్కిలి క్రిక్కిఱిసియున్న యారాముని వెనుగృహంబును బొందెను. రాముఁడు మేలైనవస్తువులకే యర్హుఁడుగాన అతనిగృహంబును అట్లు మేలిమి గలిగి యుండుట యరిదికాదు. సుమంత్రుఁడట్లు రామునిగృహమును జేరి, దేవేంద్రునిమందిరమును చేరినట్లు మిక్కిలి సంతసమునొంది గగ్గురు వ్రెడిచినవాఁడయ్యె. అంతవాఁడు కైలాసపర్వతమువలె పొడవులై తెల్లగా వెలుఁగుచు, చక్కఁగా నలంకృతములై, దేవతలమందిరములకు సరివచ్చు తొట్టికట్లను బ్రవేశించెను. అచట రామునికిఁ బ్రియులై అతనిమతముచొప్పున వర్తించుచుండుపురుషులనేకులు గనుపట్టిరి. వాఁడు వారలను గడచి యంతఃపురముసమీపమునకుఁ బోయెను. అచ్చట వాఁడు జనులు మిక్కిలిసంతోషమున రామునియభిషేకమును గణించియు, ఆ రాజకుమారునకును తక్కిన సమస్తలోకమునకును అన్నిట మంగళమును గలుగవలయుననియు, చెప్పికొనుచున్నమాటలు మిక్కిలి సంతసమున వినెను. దేవేంద్రుని గృహముఁ బోలి రమణీయమై, నానామృగపక్షులు గలిగి, మేరుగిరిశిఖరమువలె పొడవై, కాంతివెంపున సొంపారుచున్న, రామనివాసగృహమును వాడు గాంచెను. అచ్చట చేతులుమోడ్చి, కానుకలుదాల్చి, వాహనములుదిగి, కోట్లకొలఁదిని, పరార్థసంఖ్యను, లెక్కింపరానట్లు వచ్చియున్న పల్లెపట్లజనులు వానికిఁ గనుపట్టిరి అంత మహామేఘమువలెను వెనుపర్వతమువలెను గనుపట్టుచు, మత్తిల్లి, అంకుసమును సరకుగొనక, భరింపనలవికానిదై, రమణీయమై, రామునకెక్కఁదగినదై, మిక్కిలియున్నతదేహము గలిగి యున్నశత్రుంజయమనుగజంబును వానికిఁ గనఁబడెను ఆసారథియు నందు సర్వాలంకారకలితులై యున్నవందలకొలఁదిమంత్రిశిఖామణులును, రాజకుప్రియులైనవారును, రథగజతురగములతోడవచ్చి యచట నొక్కటిగాఁ గూడియుండఁగా వారినెల్లఁగడచి సర్వసంపదలచేత నిండి గిండరించుచున్న యంతఃపురమును బ్రవేశించెను. సుమంత్రుఁడు, పర్వతశిఖరమువలెను, ఇట్టట్టు చలింపని వెనుమేఘమువలెను విలసిల్లుచున్నదై, ఏడంతస్తులమిద్దెలతోఁ గూడి, ముద్దులు గులుకుమందిరసమూహములతో నొప్పుచున్న యాయంతఃపురమును, మొసలి బహురత్నములకు స్థానమయిన సముద్రమును జొచ్చునట్లు, తాను ఏయడ్డియు లేక ప్రవేశించినవాఁడయ్యెను. ఇది పదియేనవసర్గము.



—*సుమంత్రుఁడు రామునిఁ గైకేయీదశరథులకడకుఁ దోడ్కొనివచ్చుట.*—

రాజులపురాతనవృత్తాంతములను దెలిసినయాసుమంత్రుఁడు అభిషేకము చూచుటకై జనులు వచ్చి నిండియున్న యాయంతఃపురద్వారమును గడచి, మిక్కిలి జనసమ్మర్దము లేని రెండవకక్ష్యకుఁ బోయెను; ఆతొట్టికట్టున వయసుకాండ్రగుపురుషులు ఈఁటెలును విండ్లును దాల్చి, చెవుల మెఱుంగుపెట్టినకుండలములు ధగధగ మెఱయ, పరాకులేక, బుద్ధినిలుకడ గలిగి, రామునియందు మిక్కిలియుప్రేమ మీఱ, కాపై

యుండిరి*మఱియు నచ్చట రామునికి ప్రీతి గలుగుటకై యలంకారముగా కావివస్త్రములను గట్టి చక్కఁగా నలంకరించుకొని, యంతఃపురపుఁ బనికత్తియలకు అధ్యక్షులై, ఆ వాకిట మిగుల హెచ్చరికతోఁ గావలియున్న వృద్ధులైన వేత్రధారులను వాఁడు గాంచెను. ఆకట్టికవాండ్రు రామునికి ప్రియము సేయువారలు కావున సుమంత్రుని గౌరవించి నచో రామునకు ప్రియంబగునని తలఁచి వాఁడు వచ్చుచుండుటఁ జూచి సంభ్రమించి చివ్వున తమ యాసనములనుండి లేచిరి. సుమంత్రుఁడు రాజుల గొలుచువిధములందు మిగుల నిపుణుఁడు గాన తానై సెలవుపొందకయే లోపలికి పోవునంత చనవుగలవాఁ డయ్యును, మరియాదనుబట్టి లోనికి పోవక, వినయమున వారలం జూచి 'సుమంత్రుఁడు వాకిట వచ్చి కాచియున్నాఁడని శీఘ్రముగా రామునకుఁ జెప్పుఁ' డనియె, వారును తమ ప్రభుం డగు రామునికి ప్రియము సేయఁ గోరువారలుగావున, త్వరితముగా రామునియొద్దకుఁ బోయి భార్యాసమేతుఁడై యున్న యాతనితో 'సుమంత్రుఁడు వాకిట వచ్చియున్నాఁ' డని చెప్పిరి. రాముఁడు వారివలన సుమంత్రుని రాక యెఱింగి వాఁడు†తనతండ్రికి అంతరంగభూతుఁడు గాన తనకును అంతరంగునిగాఁ గొని రఘుతిలకుం డగు తండ్రికి ప్రియము సేయఁగోరి, తాను భార్యాసహితుఁడై యున్న యంతరంగస్థలమునకే వానిని రప్పించెను. ‡అప్పుడు రాముఁడు చక్కఁగా నలంకరించుకొని, పందినెత్తురువలె ఎఱ్ఱనైన కమ్మనివాసనలు బుగులుకొనుచున్న యచ్ఛంపు మేలి చందనపుఁబూఁత గలిగి, కుబేరునివలె వెలుఁగుచు,

* ఇందులకు 'తత్ర కాషాయిణో వృద్ధా న్వేత్రపాణీన్ స్వలఙ్కృతాన్ । దదర్శ విష్ఠితాన్ ద్వారి స్త్ర్యధ్యక్షాన్ సుసమాహితాన్' అని మూలము. విశేషార్థము. (కాషాయిణః) కావివస్త్రములు గలవారు-రామునకు ప్రీతి గలుగుటకై అలంకారార్థముగా కావికంచుకములను దొడిగినవారనుట. (వృద్ధాన్) వృద్ధులు-తొంబదియైదేండ్ల వయస్సుగలవారు-ఇట్టివయస్సుగలవారే అంతఃపురమునందు ఉంపఁదగుదురని తెలియుఁది, (వేత్రపాణీన్) బెత్తములను ధరించినవారు—రాముఁడు ధనుస్సు దాల్చి లోకమును రక్షించునట్లు తాము వేత్రములను దాల్చి రాముని రక్షించువారనుట. (స్వలంకృతాన్-సు+అలంకృతాన్) చక్కఁగా నలంకరింపఁబడినవారు-రాముఁడు చక్రవర్తి గృహమున మజ్జనము సేసి భుజించి తన దివ్యాంతఃపురమునకు వచ్చునపుడు, ఆ చక్రవర్తివలెనే వీరును రామునకు అంతరంగభూతులు గావున చనవుచేత రాముని ఎత్తి తొడలమీఁదం దిడుకొని కౌఁగిలించుకొని ఔదల మూర్కొని పిదప వదలుదురు. కనుక రాముని కుంకుమకస్తూరికాదిదివ్యలేపములు తమదేహముల నంటుకొనఁగా వానిచే అలంకృతులైనవారనుట, (సు) చక్కఁగా-అనుటచే సీతారాముల యలంకారముకంటె వీరల యీ యలంకారమే మఱింత చక్కఁగా నున్నదని భావము.

† అట్టిచోటికి రప్పించుటచేతనే వానిని తాను అంతరంగునిగా గ్రహించుటను రాముఁడు దెలిపినవాఁడు. ఇట్లు తాను సుమంత్రుని గౌరవించుట తెలిసినేని దశరథుఁడును సంతోషించునని రాముని యభిప్రాయము

‡ ఇందులకు మూలము 'తం వైశ్రవణసఙ్కాశ ముపవిష్టం స్వలఙ్కృతమ్ । దదర్శ సూతః పర్యఙ్కే సౌవర్ణే సోత్తరచ్ఛదే॥ వరాహరుధిరాభేణ శుచినాచ సుగన్ధినా । అనులిప్తం పరార్థ్యేన చన్దనేన పరన్తపమ్॥ స్థితయా పార్శ్వతశ్చాపి వాలవ్యజనహస్తయా। ఉపేతం సీతయా భూయ శ్చిత్రయా శశి

పరులనడంచు తేజంబును రాజిల్ల, మేలిదుప్పటిమడుఁగు పఱచినబంగారుమంచముపయిని గూర్చుండియుండెను. సీత, ప్రక్కనునిలిచి చామరముగొని వీచుచుండెను అతఁడు

నం యథా॥' దీనికి విశేషార్థము—(వైశ్రవణసఙ్కాశమ్) కుబేరునివంటివాఁడు. కుబేరునివలె మితిలేని యైశ్వర్యముగలవాఁడు-లేక (వైశ్రవణుఁడు)—'కామేశ్వరో వైశ్రవణో దదాతు' అని శ్రుతిచెప్పిన దాతయగుటచే అతనివలె దాతయైనవాఁడని యర్థము. అనఁగా-దాపునుండువారికి తనసౌందర్యముయొక్క పూర్ణానుభవమును కుబేరునివలె ఇచ్చుచున్నాఁడని భావము. (సౌవర్ణే)బంగారుమయమైనది-తనపయిని గూర్చున్నవానికిఁ దగినది. బంగారుకొండ తనపై వ్రాలిననీలమేఘమును ఎట్లు అందగింపఁజేయునో అట్లేతనపైఁ గూర్చున్నరామునిని అందగింపఁజేయునది, (సోత్తరచ్ఛదే) పైని బలుచనివస్త్రముతోఁ గూడినది-పువ్వువలె సుకుమారమైన రాముని దేహమునకుఁ దగినట్లు మిక్కిలి మృదువైన పఱుపుగలది. ఇట్టి, (పర్యఙ్కే)మంచముమీఁద-రాముని అట్టి యైశ్వర్యమునకు అనురూపమై అపూర్వమై యొప్పురచనయు ప్రతిమావిశేషములను గలిగి యొప్పునదియనుట—ఇట్టిదికావున నే మీఁద—'పర్యఙ్క మగ్ర్యాస్తరణం నానారత్నవిభూషితం। తమపీహ్యతి వైదేహీ ప్రతిష్ఠాపయితుం త్వయి-మేలైన దుప్పటిపఱుపులు గలిగి నానారత్నములచేత నలంకృతమైన యీమంచమునుగూడ నీకిచ్చుటకు సీత గోరుచున్నది' యని ఆ మంచమునుగూర్చి సుయజ్ఞునికి చెప్పినాఁడు. (ఉపవిష్టం) కూర్చున్నవాఁడు- 'సహపత్న్యా విశాలాక్ష్యా నారాయణముపాగమత్ విశాలాక్షియైన పత్నితోఁగూడి నారాయణుని ఉపాసించెను' అన్నట్లు భగవద్ధ్యానపరుఁడై యున్నవాఁడనుట. (స్వలఙ్కృతం) చక్కఁగా నలంకృతుఁడైనవాఁడు-ధ్యానమునకు అనుకూలమైన అంజలిచే అలంకృతుఁడైనవాఁడనుట-లేక దివ్యమాలాలంకృతుఁడైనవాఁడు-ఇట్టి, (తం) అతనిని, (సూతో దదర్శ) సూతుఁడు దర్శించెను. ఉత్కృష్టులలో నెల్ల అధికుఁడైన రాముని దర్శనము నికృష్టులలో నెల్లతక్కువయైన సూతునికి లభించెను. వానిభాగ్యాతిశయమేమి! అని భావము. పర్యంకవిద్యయందు చెప్పఁబడినరీతిని ముక్తపురుషులకే యనుభవింపఁదగిన దివ్యవేషమును సూతుఁడౌరా యనుభవించినవాఁడని రాముని సౌశీల్యాతిశయము వ్యంజితము. సౌశీల్యమనఁగా తక్కువవారితోఁడ మిక్కిలియుఁ గలసి మెలసియుండుట. 'స్రక్చన్దన వనితా'-'హారము చందనము స్త్రీ' అని చెప్పఁబడు భోగ్యవస్తువులలో మొదటి దివ్యమాలాయోగము చెప్పినాఁడు. ఇంక దివ్యచందనయోగము చెప్పుచున్నాఁడు:—(వరాహరుధిరాభేణ శుద్ధేనేన) పందినెత్తుటితో సాటియైన చందనముచేత - పందినెత్తురు మిక్కిలియెఱుపని ప్రసిద్ధము కుంకుమపూవుతో మెదుచుటచే పందినెత్తురువలె నున్నదనిభావము. లేక సీతయొక్క హస్తకమలములచే పూయఁబడినది గావున ఆమె హస్తకాంతితోఁగూడి యెఱ్ఱనైనది, (శుచినా) నిర్మలమైనది-సీతాహస్తముచే స్పృశింపఁబడినది గావున పవిత్రమైనది, (శుచినాచ) నిర్మలమైనదియును; ఇట చకారముచే సీతాకరస్పర్శమే కాక ఆస్పర్శముచేఁ గలిగిన శైత్యవిశేషము గలదియును అగునని యర్థము, (సుగన్ధినా) మంచివాసనగలది, 'సర్వగన్ధః' సమస్తపరిమళములు గలిగియుంట శ్రీదేవికిని సమానమైయుండుటచే శ్రీరూపయైన సీతాదేవి కరస్పర్శముచేఁ గలిగిన మితిమీఱినవాసనతోఁ గూడినది యనుట, (పరార్థ్యేన) శ్రేష్ఠమైనది-సీతచే పూయఁబడుటచే శ్రేష్ఠమైనదనుట - ఇట్టి లక్షణములు గల, (చన్దనేన) చందనముచేత. (అనులిప్తం) పిమ్మట పూయఁబడినవాఁడు. అనఁగా ఆగంధమును రాముఁడు సీతకుఁ బూసినపిదప సీత అతనికి పూసినదని సూచితమగుచున్నది, (పరంతపం) పగవారిని తపింపఁజేయువాఁడు-ఇట్టితనసౌందర్యమును అనుభవించుటకు విరోధులైనవారిని తొలఁగించువాఁడనుట. ఇఁక అప్రాకృతస్త్రీయోగమును జెప్పుచున్నాఁడు. (పార్శ్వతఃస్థితయా)

కెలననున్న యాసీతతోఁగూడి యినుమడిగా ప్రకాశించుచు చిత్రానక్షత్రముతోఁగూడి నచంద్రునివలెఁ గనుపట్టుచుండఁగా సుమంత్రుఁడు చూచెను. *ఆ సుమంత్రుఁడు వినయము నెఱపవలసినవిధము తెలిసినవాఁడు; వందియునైనవాఁడు; కావున, నిజదేహ

---

ప్రక్క నిలుచున్నదియు, చాపి అనునిపాతము పూర్వోక్తము లైనవానితోడిసముచ్చయమును దెలుపుచున్నది-అనఁగా రాముని దేహమున చందనముపూసియు చామరము చేతఁబుచ్చుకొనియు ప్రక్కనిలుచున్నది యనుట. ఇట్టిదైన, (సీతయా) సీతచేత, (భూయః ఉపేతమ్) మరలఁగూడుకొనఁబడినవాఁడు -లేక మిక్కిలి కూడుకొనఁబడినవాఁడు-సీత వినయముతో ప్రక్కనిలుచుకొని చామరము విసరుచుండెను. ఇది మొదట కొంచెము కూడుట యగును. అట్లు వీచుచుండి, అప్పటి అతని శోభావిశేషమును జూచి తానై బలాత్కారముతో అతని బిగ్గఁగౌఁగిలించుకొన్నది. కనుక ఇది మరల మిక్కిలి కూడుట యనియర్థము. 'భూయః' అనుటకు ప్రక్కను 'విరాజమానమ్' అని శేషమును అధ్యాహరించుకోవలయునని కొందఱు చెప్పెదరు. అప్పుడు (భూయః విరాజమానమ్) సీతతోఁగూడుటచే మిక్కిలియు ప్రకాశించుచున్నవాఁడని యర్థము. సీతారాముల అప్పటికూడికయొక్క అతిశయమును, దృష్టాంతమూలముగా విశదీకరించుచున్నాఁడు:-(చిత్రయా) చైత్రపౌర్ణమాసియందు చిత్ర అనెడు నక్షత్రముతోఁగూడ, ఉపేతం=కూడినవాఁడు-ఉదయించినవాఁడు, అగు, (శశినంయథా) చంద్రునివలె ఉన్నవాఁడనుట, మఱియు (చిత్రయా) అనుట చిత్రాయోగముచే చంద్రునికిఁ గలయతిశయమువలె, సీతాయోగముచే రామునికిఁ గలిగినయతిశయము చెప్పఁబడినది, (ఉపేతం) అనుటచే ఉదయించునప్పుడు చంద్రుఁడు రక్తుఁడై యుండునట్లు పందినెత్తురుతో సాటియైన చందనము పూసికొనుటచే రామునికిఁగలిగిన రక్తిమ తెలియుచున్నది. (శశినం) అనుటచే సీత కౌఁగిలించుకొనఁగా ఆమె స్తనముల మీఁదిచందనము ప్రోమ్మున అంటుకొని రాముఁడు తెల్లగా చంద్రునివలె ప్రకాశించినాఁడనుట సూచితము. ఇట్టిరాముని, (దదర్శ) సుమంత్రుఁడు చూచెను- దృష్టిసాఫల్యము పొందెనని భావము.

* ఇందులకు మూలము 'తం తప్తమివాదిత్య ముపపన్నం స్వతేజసా। వవన్దే వరదం వన్దీ వినయజ్ఞో వినీతవత్'-ఇట(ఆదిత్యం)సూర్యుని-అనుటచే ఒకసూర్యుఁడని కవి అభిప్రాయము గాదు. అట్లైన ఇది 'దివి సూర్యసహస్ర' అను వాక్యమునకు విరుద్ధమగును-లేక (ఆదిత్యమ్) అనుటచే 'సూర్యసహస్ర' మనెడియభిప్రాయము సిద్ధింపకున్నను (తప్తం ఆదిత్యమివ) అనుటచే సహస్రసూర్యులచేఁ గలిగిన తేజస్సమూహమువలె తపింపఁజేయువాఁడని సిద్ధించుచున్నది. దీనిచే అభూతోపమవ్యంజితమగుచున్నది గావున ఒక్కఆదిత్యుఁడు రామునికి సాటిగాఁడనుట సిద్ధించుచున్నది (స్వతేజసా) స్వాభావికమయిన తనయసాధారణ తేజస్సుచేత-ఇతరులచే కల్పింపఁబడినట్టి కాని, ఇతరులకు సాధారణమైనట్టి కాని తేజస్సుచేతఁగాదనుట, (తప్తం ఆదిత్యమివ తేజసా ఉపపన్నమ్) తపింపఁజేయుచున్న ఆదిత్యునివలెఁ దేజస్సుతోఁ గూడిన వాఁడు అని సంబంధము,(ఇందీవరశ్యామమ్) స్వభావముచే శ్యామవర్ణము గలవాఁడు-ఆదిత్యవర్ణము గలిగియుండునట్లు చెప్పుటచే దీపమునందు వత్తియు దానినడుమ నల్లనివ్యక్తియు దానిచుట్టును ప్రసరించి తెల్లగా వెలుఁగుచున్న తేజఃపుంజమునుఁబోలె రామునివిగ్రహము నల్లగాను దానిచుట్టువ్యాపించుకాంతి తెల్లనై వెలుఁగుచుండునదిగాను నుండు నని తోఁచుచున్నది(తంవైశ్రవణమ్) అనుట మొదలుకొని (స్వతేజసా) అనుటకును శుభాశ్రయమైన విగ్రహవిశేషము వ్యంజితము. మఱియు (దదర్శ)అనుటచే దృష్టిసాఫల్యము పూర్వము చెప్పఁబడినది. ఇట(వవన్దే) అనుటచే శిరస్సాఫల్యమును, (వన్దీ) అనుటచే వాక్సాఫల్యమును, సుమంత్రునికి చెప్పఁబడినది.

కాంతిచే సూర్యునివలె వెలుఁగుచున్న సీతానాయకుని ఆశ్రితవరప్రదాయకుని
రామునిఁ జూచి వినయము మీఱ సాష్టాంగముగా వందనము సేసెను. దశరథుఁడు
తా నేకాంతమున విహరించునపుడుగాని శయనించియున్నపుడుగాని కూర్చున్న
పుడుగాని సుమంత్రుని మిక్కిలి మన్ననతో దగ్గఱ నుండనిచ్చును. రాజునకు నిట్టి
యంతరంగుఁ డగును గాన సుమంత్రుఁడు రామునిఁ జూచి చేతులు మోడ్చుకొని
అంతరంగులు అడుగునట్లు 'విహారశయ్యాసనములందు సుఖమా' యని కుశలమడిగి
యతనితో 'రామా! కౌసల్య గన్న మేలిపట్టీ! నిన్నుఁ గని కౌసల్య సుపుత్త్రి ణై
నది. దశరథుఁడును కైకేయీదేవియు నిన్నుఁ జూడఁగోరుచున్నారు. అచ్చటికిఁబొమ్ము.
జాగు వల'దనియె సుమంత్రుఁడట్లు చెప్పగా మిక్కిలి కాంతి దీపించు పురుషలలాముఁ
డగు రాముఁడు పరమసంతుష్టుఁడై, వానిని గారవించి యంత సీతను జూచి "దేవీ! దశర
థుఁడును తల్లి కైకేయియుఁ జేరి నావిషయమై పట్టాభిషేకమును గుఱించి యేమో
యాలోచించుచున్నారు. ఇది నిజము. మదిరాక్షీ! కైకేయి ప్రియము గోరునది; మఱి
యు మిక్కిలి సమర్థురాలు; కనుక నే రాజు తాను మిక్కిలి వృద్ధుఁ డగుటచేత 'భరతుఁడు
వచ్చువఱకు రామాభిషేకమును నిలుపరా'దని అభిప్రాయపడుటయూహించి తెలిసికొ
న్నదై నాకొఱకు రాజును పురికొల్పుచున్నది. ఎందులకో పురికొల్పుచున్నదనిసందియ
పడకు. ఆమె నాయందు మిగులప్రీతిగలది; మహారాజునుఅనువర్తించునది; లోకమున
కు మేలుగోరునది; కనుక ఆమె పట్టాభిషేకము సేయుప్రయోజనము నాకు సమకూ
ర్పఁగోరునది యగును. మహారాజు ప్రియభార్యయగు కైకేయిం గూడి, నాప్రయోజన
మును మిక్కిలి కోరునట్టిసుమంత్రుని నాయొద్దకు దూతగాఁ బంపెను. ఇది భాగ్యము గ
దే! అచ్చట ఎట్టిసభ చేరియున్నదో అట్టిదూత వచ్చినాఁడు. వారు నామేలే కోరువారు
గాన నామేలు గోరునట్టిదూతనే పంపినారు. రాజు నాకిప్పుడె పట్టాభిషేకము సేయఁగ
లఁడు. ఇది నిజము. సంతోషము! ఇప్పుడిచటనుండి శీఘ్రముగా పోయి రాజును గైకే
యిని జూచెదను. నేను లేదని వగవకు. పరిజనులున్నారు. వారితోఁ గూడి సుఖముగా
నుండుము. వారితో నూరకుండ నేల; కూడి క్రీడించుచు నుండుము" అనియె.
*రాముఁడు బుజ్జగింపుఁబలుకులచే నిట్లు గారవింపఁగా నల్లనికన్నులు గలసీతయు

---

* ఇందులకు మూలము 'పతిసమ్మానితా సీతా భర్తార మసితేక్షణా । ఆద్వార మనువవ్రాజ మఙ్గ
ళాన్యభిదధ్యుషీ' విశేషార్థము;—(పతిసమ్మానితా) పతిచేత గౌరవింపఁబడినది పతి తనకంఠమందలిముత్తె
పుమాలను దీసి యామెకిచ్చి గౌరవించెననుట-పతి సీతపాదపల్లవముల నంటుచు బుజ్జగించెనని కొందఱి
మతము. సీతపతిచే అట్టిగౌరవమును బొందుట కర్హురాలని తెలుపుటకై రామునికంటె సీతకుఁ గలవైలక్ష
ణ్యమును జెప్పుచున్నాఁడు-(సీతా) సీతయనఁగా నాఁగటిచాలు. నాఁగటిచాలునఁ బుట్టుటచేత అయోనిజ
గావున రామునికంటె అతిశయముగలది గనుక ఆమెయందు అట్టిగౌరవము రామునికితగునని భావము.
(అసితేక్షణా) నల్లనికన్నులు గలది-రాముఁడు ముత్తెపుమాల ఇయ్యఁగా ఈమెయు నల్లనికనుచూడ్కులు
నిగుడ్చుటచే నల్లనికలువరేకులమాల ఇచ్చినదనుట. ఇట్టిసీత, (భర్తారం) మగనిని, (ఆద్వారం) వాకిలివ

పతికి మంగళములు కలుగవలయునని చింతించుచు 'బ్రహ్మదేవుఁడు ఇంద్రునకుంబోలె రాజు' పిదప రాజసూయయాగమునకు మహారాజవై యభిషిక్తుఁడగునట్లుగా, ఇప్పుడు నీకు యౌవరాజ్యమును, బ్రాహ్మణులను గొని వారిచే ప్రయుక్తమైనవిధానమున నియ్యఁదగును *అంత నీవు రాజసూయదీక్ష వహింపఁగా, వ్రతసంపన్నుండవై, మేలైన కృష్ణాజినమును ధరించి, పరిశుద్ధితో, జింకకొమ్ము చేతం దాలియున్న నిన్నుఁగన్నారఁజూచుచు నేనుగొలుతును. నిన్ను, తూర్పుదిక్కున దేవేంద్రుఁడును, దక్షిణపుదిక్కున యముఁడును, పడమటిదిక్కున వరుణుఁడును, ఉత్తరపుదిక్కున కుబేరుఁడును రక్షింతు

---

అను, (అనువ్రాజ) తన్ను ఎప్పుడును హృదయమునందే ధరించియుండు రాముని ఎడఁబాయలేక పట్టమహిషియగుటచే పోఁదగినంత ప్రదేశమువఱకు - అనఁగా అంతఃపురపువాకిలివఱకు - పోయెననుట, (మఙ్గళాని అభిదధ్యుషీ) మంగళములను చింతించుచున్నదై పోయును - రాముని సౌందర్యమునకు ఏమిహాని కలుగునో యని మనస్సు కలఁగి మంగళాశాసనము సేయుచు వెంబడించెననుట. (అభిదధ్యుషీ) మనస్సునఁ దలంచుకొనుచున్నది భర్తనుగూర్చిన మంగళాశాసనము గావున వ్యక్తముగా చెప్పక మనస్సునందే అనుసంధించిన దని భావము.

* ఇందులకు మూలము 'దీక్షితం వ్రతసంపన్నం వరాజినధరం శుచిమ్ । కురఙ్గశృఙ్గపాణించ పశ్యన్తీ త్వాం భజామ్యహమ్' విశేషార్థము - (దీక్షితమ్) నవనీతముతో అభ్యంగనము సేసి కన్నుల కాటుక పెట్టుకొని యజమానవేషముతో నున్నవానిని అనుట ఈ యజమానవేషమునకు 'యన్నవనీతేనాభ్యఙ్క్తే సర్వా ఏవ దేవతాః ప్రీణాతి యదాఙ్క్తే చక్షురేవ భ్రాతృవ్యస్య వృఙ్క్తే' అను శ్రుతి, (వ్రతసంపన్నం) వసిష్ఠుఁడు ఒకదినము ఉపవాసముండుమనఁగా, నేను సుకుమారుఁడనని మునియిట్లు సెప్పినాఁడనిలఁచి 'తస్రో రాత్రీర్దీక్షితస్స్యాత్ - ద్వాదశ రాత్రీర్దీక్షితస్స్యాత్' అను శ్రుతిచొప్పున మూఁడుదినములు ఆఱుదినములు ఉపవాసముండువాఁడనుట - కనుకనే (సంపన్నమ్) అని చెప్పినాఁడు, (వరాజినధరం) వస్త్రమును ధరించుటకంటె అజినమును ధరించుట శ్రేష్ఠమని చెప్పుటచే సూక్ష్మవస్త్రములనుగూడ నిరసించి అజినమును గట్టువాఁడనుట, (శుచిం) శుచియైనవానిని - 'ఏ స్త్రీయైనముట్టునను ధర్మపత్ని గావున నీతెను స్పృశించినదోషములేదు' అని ముని చెప్పినను, నీతెను స్పృశించినను స్నానముచేయును. ఇంక ఇతరులనంటుటని చెప్పనేలయనుట, (కురఙ్గశృఙ్గపాణిమ్) జింకకొమ్ము చేతఁ గలవాఁడు - దురదకుగీఱుకొనుటకై కురంగశృంగము దాల్చినవాఁడనుట 'ఏకవస్త్రధరోధన్వీ' - 'ఒకవస్త్రము గట్టి, విల్లుదాల్చి' అనునప్పటివేషము మనోజ్ఞమై యుండినను దానికంటెను తిన్నగీఱుకొనుటకు కురంగశృంగమును దాల్చినవేషము మిక్కిలిహృదయంగమమైన దని అతిశయము తెలియునది. ఇట్టి, (త్వాం) నిన్ను, !(పశ్యన్తీ) చూడఁగోరుదానను - ఇట చూచుటకై అని యర్థము - తద్దర్శనార్థమే కదా భగవంతుని భజించుట, అట్లైన సీతయు దర్శనము గోరినదై, (భజామి) భజించెదనని కోరెను. రాఁగలయొక ఫలమును కోరినపుడు దానికి అవాంతరమైన ఫలమును గోరకున్నను తప్పక ... యగును. కనుక సీత రామాభిషేకము జరుగవలెనని కోరినప్పుడు అయభిషేకమునకు విఘ్నము ... అవాంతరఫలమును కోరినట్టిదే యైనది గాన దానిని స్పష్టముగా ప్రార్థించినదికాదు. ఎట్లన సాపి ... నమగసిని జూపి ఇతనిచే నాకు పెక్కుపుత్రులు గలుగవలయునని కోరినపుడు అతఁడు పూర్ణాయుష్కుఁడై యుండవలయు నను అవాంతరఫలమును కోరకున్నను కోరినట్టిదేయైనది. అట్లే సీత ఇచట రామాభిషేకమును గోరుటయెల్ల దానికి విఘ్నము రాకుండుటను గోరుటయే యగునని తెలియునది.

గాక' యని మంగళములు మనస్సున తలంచుచున్నదై అతనిని వాకిలివఱకు వెంబడించిపోయెను. అంత పట్టాభిషేకమునకు నలయుమంగళాచారములు గయికొని వెలుఁగుచున్న రాముఁడు సీతయొద్ద సెలవుపుచ్చుకొని సుమంత్రునింగూడి, పర్వతగుహయందు కా 'పుండుసింహ మాపర్వతమునుండి వెడలునట్లు, తనగృహంబునుండి వెడలి వాకిట నమ్రుఁడై చేతులు మొగిడ్చికొనియున్న లక్ష్మణునిఁ జూచెను. పిదప పురుషలలాముం డగునా రాజకుమారుఁడు నడిమితొట్టికట్టున తన చెలికాండ్రను గూడుకొని పట్టాభిషేకార్థమై వచ్చినజనులను అందఱిని గాంచి వారికడకుఁబోయి మంచిమాటల వారలం గొనియాడి యంత, అగ్నివలెవెలుఁగుచున్నదై, పులితోలుపఱుపుగలిగి వెండితోఁ జేయఁబడియున్న మేలిరథము నెక్కెను. ఆరథము మేఘమువలె మిక్కిలి శబ్దించుచు, ఇఱుకటము లేక తగినంతవిరివిగలదై, మణులచేతను బంగారునను అలంకరింపఁబడియుండెను. మఱియు నది మిక్కుటమైనకాంతిచేచూచువారికన్నులను దొంగిలునట్లు చూపట్టుచు సూర్యునివలె ప్రకాశించుచునుండెను. ఏనుఁగుగున్నలవలె నున్న మేటిగుఱ్ఱములను బూన్చినయారథమును, వేయిగన్నులయింద్రుఁడు అశ్వములతోఁగూడి వేగముగాఁబోవు తనరథము నెక్కినట్లు, రాముఁడెక్కె, మెఱుఁగులు మిఱుమిట్లుగొన శీఘ్రముగాఁ బోయెను ఆశ్రీమంతుండు ఆకాశమున మహాధ్వనిగలమేఘమువలె తన రథశబ్దముచే దిక్కులను ధ్వనించునట్లు సేయుచు, మహేంద్రపర్వతమునుండి చంద్రుఁడు వెడలునట్లు గృహమునుండి వెడలెను. అతనితమ్ముఁడగు లక్ష్మణుఁడు ఒకచేత ఛత్రమును మఱియొకచేత చామరమును దాల్చి రథంబునందు వెనుకనిల్చి యన్నకు ఎండ మొదలయినవి తగులకుండునట్లు కాపుదల సేయుచుండెను అంత రాముఁడు బయలుదేఱుచుండఁగా జనులందఱును దొమ్మిగా కలకలధ్వనులు గావించిరి. అంత నపుడు మిక్కిలి మేటిగుఱ్ఱములనెక్కియు, కొండలవంటి యేనుఁగులనెక్కియు, రౌతులు నూఱులకొలఁదిని వేలసంఖ్యను రాముని వెంబడించిపోయిరి. అతనిముందట కవచములుదొడిగి, చందనమును అగురువును మేనఁ బూసికొని, కత్తులను విండ్లనుదాల్చి, రామునిమంగళము గోరుశూరులు నడచిరి. అంత నతఁడు వెడలునప్పుడు, మార్గమునందు వాద్యధ్వనులును వందిజనుల స్తోత్రశబ్దములును శూరులసింహనాదములు వినఁబడినవి. అప్పుడు స్త్రీలు మెయినిండసొమ్ములు దొడిగి మేడలకిటికీలనుండి రామునిపై పువ్వులసోనలు చల్లఁగా పగవారినడఁచు నాబలువీరుఁడు వానిని గయికొనుచు పోయెను. అంత సర్వాంగయవములందును ఒక్కకందును లేని సుందరీమణులు కొందఱు మేడలపైనుండియు, కొందఱు భూమియందుండియు, రామునికిఁ బ్రీతిగలిగింపఁగోరి మేలయినవాక్యముల నతనింజూచి 'నీవు సహజముగా తల్లికి సంతోషము వెల్లిగొలుపువాఁడవు. అట్టినిన్ను మఱియిప్పుడు నీతల్లి కౌసల్యచూచి యానందపడునటుకు సందియుమా! నీపోక, సఫలమై, పిదప నిన్ను తండ్రిరాజ్యము బొందియుండఁగా జనులు చూడఁగలరు' అని ప్రస్తుతించిరి. ఆస్త్రీలు, రామునమనంబునకు మిక్కిలి యింపుగూర్చు సీతాదేవిని,

స్త్రీలందఱిలోపలనుమిక్కిలి యుత్తమురాలుగాఁదలంచిరి. కావున నేవారలామెంగూర్చి 'రోహిణిచంద్రుని బొందినట్లు లీబిడ రామునిఁ బొందినది. కనుక పూర్వజన్మమున ఈ దేవి గొప్పతపస్సును లెస్సగా సలిపియుండుననుట నిజ'మని పొగడిరి. ఇట్లు మేడల పైనుండి యా స్త్రీలు పలుకుప్రియవచనములను రాముఁడు రాజమార్గమునఁబోవుచు వినెను. రాముఁడు,పల్లెపట్టులనుండివచ్చినప్రజలును,మిక్కిలి గగ్గురుతోఁ గూడియున్న పురజనులును,తన్నుఁగూర్చి 'ఈరాముఁడు రాజానుగ్రహమువలన నిపుడు విస్తారమైన రాజ్యలక్ష్మినిబొందుటకుఁ బోవుచున్నాఁడు. ఇట్టిరాముఁడు మనకు పరిపాలకుఁడు కాఁగలఁడు గావున మనకోర్కులన్ని యీడేఱఁగలవు. ఇతఁడు చిరకాలముగా ఈ రాజ్యమునంతయుఁ బొందియుండఁగలుగుట యీజనులభాగ్యమే. ఏలననితఁడు రాజై యుండఁగా ఎవనికిని ఒకప్పుడైనను ప్రియములేక పోవుటగాని అనిష్టముప్రాప్తించుట గాని సంభవింపదు ' అనిరి. అతఁడు గుఱ్ఱములు సకిలించుచును ఏనుఁగులు ఘీంకారములు సేయుచును వెంటరా,'జయ జయ' అని స్తుతిపాఠకులును సూతులును మాగధులును నేటివాద్యగాండ్రును ముందు గొనియాడుచుఁ బోవఁగా, మిక్కిలి గౌరవంబున కుబేరునివలె వెలుఁగుచుఁబోయెను.ఆఁడుగజములును మగయేనుఁగులును గుఱ్ఱములును రథములును,అందందు నెగసిబెరసియుండఁగా, చఁగుకములందు ప్రజలు గుంపులు గూడి నిండుకొనఁగా,అలంకారముకొఱకు రత్నసమూహములు చల్లంబడినదై, అమ్మెడుసరకుల సమూహముల వెక్కులు కొమరుచూప పొలుపారుచున్న రాజమార్గమును రాముఁడు చూచెను. ఇది పదియాఱవసర్గము.

---

రాముఁడు దశరథునియొద్దకు వచ్చుట.

ఆరాముఁడు పట్టాభిషేకంపుసిరి పెంపార, తనచెలికాండ్రుసంతోషింప, రథంబునందు నెలకొని, పతాకలును ధ్వజములు అందంద మిక్కిలిసొంపు గూర్ప, మేలైనయగురుధూపమువాసనలు గుబాళింప,నానావిధములైన జనములు నిండియున్న అయోధ్యాపురమును జూచెను.అందు మబ్బులవలెనుండు తెల్లనిగృహంబుల రాణించుచు, నగరుధూపము తావులు గుబులుకొనుచున్న రాజమార్గంబును నతఁడుప్రవేశించెను. మఱియు నతఁ డామార్గమున రాసులు గొనియున్న మేలయిన చందనపు చెక్కలును అగరుచెక్కలును, మఱియు నుత్తమము లైనయితరగంధద్రవ్యసులయు సన్నని తెల్లవస్త్రములయు పట్టుపుట్టములయు సమూహములును, బెజ్జము వేయని క్రొత్తముత్తియములును, ఎడగలుగ వేఱువేఱ పొదుగంబడిన మేలిపటికపురాసులును,మఱియును పలుదెఱఁగులైనయుంగడిసరకులును పిండివంటకములును నెరసి బెరసి యుండఁగాంచెను. మఱియు స్వర్గమునందలిదేవమార్గమువలె వెలుఁగుచు, పెరుఁగు పేలాలుఁ అక్షతలు హవిస్సు చందనాగరుధూపములు నానావిధములైన వాసనలు వెదచల్లు పుష్పమాలికలును గలిగి, యెప్పుడు వెలయుచుండు ముంగిళులతో

ం గూడియున్న రాజమార్గంబున సుహృజ్జనులు సేయునాశీర్వాదములును వెక్కు వినుచును, అందఱిని వారివారికిం దగినరీతుల గారవించుచును, బోయెను. రామునిస్నేహితులు అతనిం గూర్చి 'నీ విపుడు పట్టాభిషిక్తుఁడవై మున్ను నీతాతలును ముత్తాతలును ఆచరించినమార్గమును గయికొని మమ్ముం బాలింపుము. మేము, రాముఁడు రాజై యుండఁగా, ఇప్పుడితనితండ్రియు పూర్వులైన యితనితాతలును లాలనముతో మన కెంతసుఖము గూర్చిరో యంతకంటె నెక్కుడుసుఖముగా వసించియుండఁగలము. * ఇప్పుడు భోజన మేమివచ్చె? భోగములును మఱిజపహోమాదిపురుషార్థములును ఇప్పుడు చాలుఁజాలు. రాముఁడు రాజ్యమం దభిషిక్తుఁడై మఱల గృహమునకు బోవుచుండునపుడు అతనిని కలరూపునఁ జూతము. ఏలనఁగా రాముఁడు మహాతేజంబు రాజిల్ల రాజ్యమునకు పట్టాభిషిక్తుఁడగుట మాకెట్లు మిక్కిలిప్రియమో, యట్లే తక్కినది యేదిగాని యంతప్రియము కానేరదు' అని తమలో తాము శుభకరముగా తన్నుఁబొగడుచు చెప్పికొనుమాటలును మఱియుఁ దక్కినవచనములు వినుచు గంభీరుఁడు గాన తటస్థునివలె ఏయుబ్బును బొందక నిర్వికారుఁడై రాజమార్గంబునఁ బోయెను. మగవాఁడెవ్వఁడు గాని రాముఁడు చూపుమేరఁ గడచి దూరముగా పోయినప్పటికిని, అతనిమోహనాకారమునందుఁ దగిలియున్న మనస్సునుగాని కన్నులనుగాని మరల్చుకొనుటకు శక్తుఁడుగాఁడయ్యె. మఱి దగ్గఱనుండినపుడు వారెట్లుండురో చెప్పనేల! మగవారే యిట్లుండిరేని యిఁక మగువలయనురాగాతిశయ మేమనవచ్చు! †ఎవ్వఁడు రామునిఁ జూడకుండునో, రాముఁడును ఎవ్వనిని జూడకుండునో, వాఁడు లోకమున అందఱిచేతను నిందింపఁబడుచుండును. లోకులే కాదు; వాని యాత్మయే వానిని నిందించు

* ఇందులకు మూలము 'అలమస్యహి భుక్తేన పరమార్థైరలంచ నః' విశేషార్థము-(అస్యభుక్తేన) ఇప్పుడు భుజించుటచే. ఇప్పు డనుభవించుచున్న ఐహికాముష్మికభోగములు, (అలం) చాలును, (పరమార్థైః) మోక్షపర్యంతమైన పురుషార్థములు-లేక పరమపురుషార్థసాధనములైన జపహోమధ్యానాదులు, (అలం) చాలును-అక్కఱలేదని యర్థము.

† ఇందులకు మూలము 'యశ్చ రామం నపశ్యేత్తు యంచ రామో నపశ్యతి। నిన్దిత స్స వసేల్లోకే స్వాత్మాప్యేనం విగర్హతే' విశేషార్థము - (యః) ఎవఁడు - (రామంచ) రాముని - దర్శించునప్పుడే నిజసౌందర్యాతిశయమనెడి పరిపూర్ణమైన యమృతసరస్సున ముంచునట్టివానిని అనుట, (యస్తు) ఎవఁడైతే-ఎంత విలక్షణుఁడైనను అనుట, (నపశ్యేత్) చూడఁడో- స్తుతించుట, సల్లాపము సేయుట, సత్కరించుట మొదలైనకార్యములు చేయకపోయినను కన్నులులేని అచేతనముకంటె తాను నేరమైనవాఁడనుటకు సూచకముగా కన్నులార చూడనైన చూడఁడో యనుట, కావుననే, (యం) ఎవనిని, (రామోపి నపశ్యతి) రాముఁడును చూడఁడో-మనుష్యుఁడు అభిముఖుఁడైననే భగవంతుఁడు కటాక్షించును గనుక ఎవఁడు రాముని చూడఁడో అట్టివానిని రాముఁడును కటాక్షింపఁడనుట:-ఇచట 'యశ్చరామం నపశ్యేత్-ఎవఁడు రాముని చూడఁడో'-అనుటచే రామువిగ్రహసౌందర్యముచే ఆకృష్టులై అందఱును రామునే చూతురనియు, 'యంచ రామో నపశ్యతి-ఎవనిని రాముఁడు చూడఁడో' అనుటచే రాముఁడు సర్వలోకములకును ప్రియుఁడైకనఁబడుచుండువాఁడుగాన అతఁడు చూడనివాఁడొక్కఁడును లేడనియు సిద్ధించు

చుండును. ఆరాముఁడు ధర్మాత్ముఁడు గావున నాలుగువర్ణములవారియందును వారి వారివయస్సునకుఁ దగినట్లు దయచూపుచుండును. కనుక వారందఱును అతనిని అనుసరించియేయుండుదురు. ఆరాజకుమారుఁడు చదుకములకును దేవాలయములకును రచ్చచెట్లకును సభాస్థలములకును, ప్రదక్షిణమగునట్లుగాఁ బోయి రాజగృహంబు చేరి యందు తండ్రి వసించుచున్న మందిరంబు ప్రవేశించెను. ఆమందిరమున పలువిధములైన యుప్పరిగలశిఖరములు, మంగళకరములై మేఘసమూహమువలె వెలయుచు, కైలాసశిఖరమువలె తెలుపయి మిక్కిలి పొడవుగా మీఁదికి సాఁగి, ఆకాశమును గ్రమ్మి తెల్లనివిమానమువలెఁ గనుపట్టుచుండెను. మఱియు నందు మణిసమూహములచే వెలుఁగుచు, వర్ధమాన మనెడిశిల్పసన్నివేశముతోఁ గట్టఁబడినయిండ్లును పొలుపారుచుండెను. ఇట్లు దేవేంద్రునిభవనమువలె విలసిల్లుచున్న తండ్రివాసగృహరత్నమును కాంతి దళుకొత్త నారాజకుమారుఁడు ప్రవేశించెను. ఆపురుషతిలకుఁడు విలుకాండ్రు గాచుచున్నమూఁడుకక్ష్యలను రథముతోనే కడచి యంత రథము దిగి యవ్వలి రెండుకక్ష్యలను పాదచారియై కడచి యన్నితొట్టికట్లనుదాఁటి తనవెంట వచ్చిన వారినెల్ల నుగల్చి యంతఃపురమునకుఁ బోయెను. అంత నారాజకుమారుఁ డపుడు తండ్రికడకుఁ బోఁగానే యతనివెంట వచ్చినజనమంతయు, సముద్రము చంద్రోదయము గోరుచందమున, ఆరామునిరాకం గోరుచుండెను. ఇది పదునేడవసర్గము.

---

మున్నది. కనుక, అట్టిరాముని చూడనివాఁడును అట్టిరాముఁడు చూడనట్టివాఁడును అగుటచే, (లోకే) లోకమునందు, (నిందితో వసేత్) కలకాలము నిందింపఁబడుచుండును. సర్వంపసీపాపమే యిట్టిసిందకు నిమిత్తమని భావము, (లోకేనిన్దితః) వానిని నిందించుటకు తగనివాఁడు ఒకఁడును లోకమున లేఁడనుట - పరస్త్రీ)గమనాదిపాపకూపితునివలె అందఱును నిందింతురనిభావము. (ఏవం) వీని - ఇట్టిపాపిని, (స్వాత్మా) తనమనస్సు - లేక తన గాత్మ - తానే యనుట, (విగర్హతే) విశేషించి నిందించుచున్నది. లోకులకంటె ఎక్కువగా నిందించుచున్నది. ఇన్ని ఎవరు నిందించినను, నిందింపక తనయందు ప్రేమయే చూపుచుండెడి తనమనస్సు కూడ వానిని లోకులకంటె నధికముగా నిందించుచున్నదని భావము. గోవిందరాజులు.

(స్వాత్మాప్యేనం విగర్హతే) తనయాత్మయు వీనిని మిక్కిలి గర్హించుచున్నది. రాముఁడు ఒకప్పుడును చూడనట్టివానిని, రాముని సన్నిహితుఁడైనపుడు కంటిచేతను సన్నిహితుఁడు కాకయున్నపుడు మనస్సుచేతను చూడనివానిని, లోకులుమాత్రమే గర్హించుటలేదు. వాఁడు తన్ను 'ఇకీ! నేనెంతదౌర్భాగ్యుఁడను' అని తానే గర్హించుకొనును అని యర్థము. లేక ఎవఁడు రామునిని తనచోటికివచ్చినపుడు చూడఁడో, కావుననే ఎవనిని రాముఁడు తానున్నచోటికి వచ్చినపుడు చూడఁడో, అట్టివానిని, అపరోక్షబ్రహ్మమే యగురామమూర్తిని అనుభవించెడి అదృష్టము లేనివాఁడు గాన, ఇందును అందునుగల లోకులందఱును నిందింతురనియర్థము. ప్రయాసము లేక రామరూపుఁడైనయాభగవంతుని ప్రత్యక్షముగాఁ జేసికొనుమాత్రముచేతనే ముక్తి సంపాదింపఁగూడియుండఁగా ఇట్టియదృష్టమునకు నోఁచనివాఁడు ఎప్పుడును సంసారమును గడవలేఁడనుట. కావుననే (స్వాత్మా) అంతర్యామియగు భగవంతుఁడు 'వీఁడు పాపిష్ఠుఁడు. రామదర్శనరూపమైనముక్తిని సాక్షాత్కరించునట్లు చేసికొనియు దానినిమాలి జన్మమును ఉద్ధరించుకొనకపోయినాఁ'డని మిక్కిలి గర్హించుననియు నర్థము. మహేశ్వరతీర్థులు.

కైకేయి రామునికిఁ దాను వరము లడిగినవృత్తాంతము సెప్పుట.

ఆ రాముఁడు,తనతండ్రి ముఖంబున కాంతి తఱుఁగ మిగులదీనుండై మేలయిన మంచమునఁ గూర్చుండి కైకేయితోడనుండఁగా చూచి మిక్కిలియెచ్చరికతో వినయమున మొదట తండ్రిపాదములకు మ్రొక్కి పిదప కైకేయిచరణములకు నమస్కరించెను. రాజు 'రామా!' యని, అంత కన్నులనీరు గ్రమ్ముకొన; దుఃఖము మితిమీఱ, రామునిఁ జూచుటకుఁగాని పలుమాటలు పలుకుటకుఁగాని శక్తుఁడుగాఁడయ్యె. రాజునకు నింతవఱ కెప్పుడును గలుగనిభయంకరదుఃఖము గలుగుటఁ జూడఁగా, ఎట్టి సంకటములకును కలఁగనిరాముఁడుగూడ, తన్నుఁగూర్చి యతఁడు దుఃఖమునొంది యుండునోయని శంకించి,పామును కాలంద్రొక్కినట్లు,మిగులభయపడెను.మహారాజు ఇంద్రియములు సొంపు దక్కి, దుఃఖమును సంతాపమును ముక్కింప, నిట్టూర్పులు పుచ్చుచు, మనస్సుమిక్కిలి చెదరి, కలంపరానిదయ్యుఁ గలంగి యలలుగొట్టుచున్న సముద్రమునవలెను, అతితేజస్వి యయ్యు రాహుగ్రస్తుఁడైనసూర్యునివలెను, అతి నిర్మలుఁడయ్యు అబద్ధ మాడినఋషివలెను, సొంపు గుందియుండుట చూడఁగా రామునకు భయము కలిగెను. రాముఁడు ఇట్లుకలుగునని మనస్సునఁ దలంచుటకును శక్యముకాని యట్టిదుఃఖము తండ్రికి కల్గుట విచారించి, పున్నమయందు సముద్రునివలె మిక్కిలి తత్తఱపాటుఁ బొంది, పితృహితపరాయణుఁడు గావున నప్పుడతనిం గూర్చి తనలో 'ఎప్పుడుగాని తండ్రి కోపము నొందియున్నను నన్నుఁజూడఁగానే ప్రసన్నుఁడగును. ఇదేమి! ఇప్పుడుమాత్రము రాజునకు నన్నుఁ జూడఁగా సంతోషము గలుగకున్నది! అట్టియితనికి ఇప్పుడు నన్నుఁజూడఁగానే మనస్సు కొందలపడు చున్నదేల?' అని చింతించి దీనునివలె దుఃఖమునఁ బీడితుఁడై ముఖకాంతి పిరవిరఁబోవ కైకేయికి నమస్కరించి యంత నామెంజూచి 'నేను పరాకుచే అపరాధ మేమియు చేయలేదుగదా! మఱి నాతండ్రియేల కోపించియున్నాఁడో ఆకారణమును నాకు తెలుపుము.నీవే యితనికలఁక దీర్పుము. ఇతఁడు ఎప్పుడును నాయెడల మిక్కిలి వాత్సల్యము గలిగియుండువాఁడు. అట్టియితఁడు ఇపుడు మనస్సుకలఁకనొంది ప్రసన్నుఁడు గాక మొగము వెలవెలఁబోవ దుఃఖితుఁడై నాతో పలుకకున్నాఁడేమి? ఇతనికి శరీరవ్యాధిగాని మనోవ్యథగాని లేదే కదా. మనుష్యుల కెప్పుడును సుఖమే కలుగుట కష్టము సుమీ. కావున సంశయించెదను. భరతుఁడు చూచుటకు మిక్కిలి యింపై కనఁబడువాఁడు. ఆకుమారునికి అశుభ మేమియులేదు గదా? మహాబలుఁడగుశత్రుఘ్నునకుఁ గాని, నాతల్లులలోపల నెవ్వరికిఁగాని అమంగళ మొకటియుఁ గలుగదు గదా? నాతండ్రికి మహారాజునకు సంతోషము సేయకగాని, యతఁడు చెప్పినపని సేయకగాని, ఒకగడియసేపైన బ్రతుకనొల్లను. ఇఁక అతఁడు కోపించి యుండునేని నావెత యేమనిచెప్పుదు? మనుష్యుఁడు, తానీలోకమునఁ బుట్టుట కెవ్వఁడు కారణమని తెలియునో, యట్టిప్రత్యక్షదైవమై యున్నట్టి యాతండ్రికి ఎట్లు

లోనైె ప్రవర్తింపఁడు? అవశ్యము లోనై వర్తించుచునేయుండును. నీవు, మిక్కిలి ప్రియురాలవని గర్వించికాని కోపించికాని నాతండ్రితో, అతనిమనస్సు కంది కుందునట్లు పరుసుగా ఏమైనను పలికియుందువో! తల్లీ! రాజునకు ఇంతవఱకు నెన్నఁడును లేనియీ వికారము దేనివలన కలిగినది? నేను అడుగుచున్నాను. దీనిని నాకు కలిగినది కలిగినట్లు చెప్పుమీ' యనెను. మహాత్ముఁడగు రాముఁడిట్లు చెప్పఁగా కైక, వెసిమిటికి దుఃఖము కలిగించుమాట ఎట్లు చెప్పవచ్చునని సిగ్గు కొంచెమైనను లేకయు, అడవికిఁ బొమ్మని చెప్పుటకును జంకు మాలియు, దిట్టతనముతో భరతుని పట్టముగట్టు తనహితముసే యుద్దేశించి రామునిఁజూచి 'రామా! రాజునకు కోపము లేదు; మఱేమివ్యసనమును లేదు. ఇతనికిమనస్సున నొకకోర్కిమాత్రము కిలదు. నీవేమియనుకొందువో యనుభయము చే దానిని చెప్పకున్నాఁడు నీవు ప్రియుఁడవు కావున నీకు అప్రియమును చెప్పుటకు నితనికి నోరాడకున్నది. ఇతఁడేకార్యమును జేయ ప్రతిజ్ఞచేసెనో దానిని నీ వవశ్యమును జేయువలయును. ఈరాజు సత్యమే పలుకుదునని వ్రతము గలవాఁడు. అట్టియితఁడు మున్ను నన్ను గౌరవింపవలసినకాలమున నాకు వరమొసఁగి గౌరవించి, యిప్పుడు కల్లలాడునట్టికేవలునివలె ఏలయిచ్చితినని దుఃఖపడుచున్నాఁడు. ఆరాజు నాకు వరమిచ్చెదనని ప్రతిజ్ఞసేసి చెఱువులో నీళ్లు పోయినవెనుక కట్టంగట్టఁగోరునట్లు ఇప్పుడు 'ఏల ప్రతిజ్ఞచేసితి' నని వ్యర్థముగా చింతించుచున్నాఁడు. రామా! జగమునకు ధర్మమే మూలము! ఇది పెద్దలందఱును తెలిసి చెప్పుదురు. కావున రాజు నీకొఱకై నామీఁదఁ గోపించి సత్యమనెడిధర్మమును విడువకుండునట్లు సేయుము. రాజు చెప్పుమాట, అది నీకు మేలుగాని కీడుగాని నీవు చేయుదువేని, నేనే దానినంతయు నీకుఁ జెప్పెదను. రాజు చెప్పుమాట నీయందు విఫలమై చెడదేని, నీవును చేసెదనని ప్రతిజ్ఞ సేయుదువేని,యిప్పుడు నేను అతనికి మాఱుగా చెప్పెదను. "రాజేయేల చెప్పఁడందువేని అతఁడు నీమొగముచూచి యీమాట చెప్పఁడు" అనియె. రాముఁడు కైక చెప్పిన యీమాట విని 'తండ్రిమాటను నేను జవదాఁటుదునని యీ మెశంకించునంత సితి కలిగినదిగా!' యని దుఃఖితుఁడై రాజసమీపమున నామెంజూచి 'ఇసీ! నాబ్రతుకేల? తల్లీ! నన్నిట్టిమాట చెప్పఁదగదు. రాజు ఆజ్ఞాపించెనేని నేను నిప్పుననైన నుఱుకుదును. వేండ్రమయిన విషమునుగూడత్రాగుదును. సముద్రమునందును దుముకుదును. ఇతఁడు నాకు గురుండు; మఱి తండ్రి; ఇంతేకాక రాజు; నామేలును గోరువాఁడు. ఇట్టి యితఁడు నియమించెనేని ఏపనినైనను జేయకుందునే! కాఁబట్టి, తల్లీ! రాజుకోర్కి యేదో దానిం జెప్పుము. దాని నేఁజేసెదను. ఏమీ! చేయునట్లు ప్రతిజ్ఞ కూడ చేసెదను. రామునకు రెండునాలుకలు లేవుసుమా. ఒకతూరి చెప్పి మఱి రెండవతూరి లేదని చెప్పఁడు' అనియె. కైక అపూజ్యురాలు; కనుక ఎంతమాత్రము కపటము లేక చక్కటి గలిగిన సత్యవాది యగురామునిఁ జూచి మిక్కిలిదారుణముగా 'రామా! తొల్లి దేవతలకును అసురులకును యుద్ధము జరిగినప్పుడు ఆమహాయుద్ధమున

మీతండ్రి దేహమంతయు ములుకులు నాటంబడి తడఁబడఁగానే నాములుకలను బెఱికి బాగుచేసి కాపాడితిని. అందులకై నాకతఁడు రెండువరము లిచ్చెను. నే నారెండు వరములకును భరతునకు అభిషేకము గావలయుననియు నీ విపుడే దండకారణ్యమునకుఁ బోవలయుననియు రాజు నడిగితిని. నీవు పురుషతిలకుఁడవు. కనుక నీతండ్రిని నిన్నును ఆడితప్పనివారినిగా చేసికొనఁగోరితివేని, ఇప్పుడు నేను చెప్పుమాట వినుము. నీవు తండ్రియాజ్ఞయందు తప్పక నిలువుము. అతఁడు నాకు ప్రతిజ్ఞచేసినట్లు, నీవు పదునాలుగేండ్లు అరణ్యమున నుండవలయు. రామా! నీకు అభిషేకముసేయుటకై రాజు సమకట్టియుండు సమగ్రులనుగొని భరతునకే పట్టాభిషేకము సేయవలయును. నీ వీయభిషేకమును మాని పదునాలుగుసంవత్సరములు దండకారణ్యమందు జడలును కృష్ణాజినమును దాల్చి వాసముసేయుము. భరతుఁడు అయోధ్యాపురమునను౦డి, నానావిధరత్నపరిపూర్ణమై రథగజతురగములతోఁ గూడి యున్న యీ రాజ్యమును, పాలించుచుండుఁగాక. ఇట్లు రెండువరము లిచ్చుకారణమునుబట్టి యీ రాజు మిక్కిలి కారుణ్యము ముంచుకొనుటచేతనే ప్రియకుమారుని నిన్ను అడవికి పంపవలసివచ్చెనే యని వగపున మొగము ముడిచి నిన్నుఁ జూడనేరకున్నాఁడు. నీవు రఘుకులమునఁ బుట్టినవాఁడవు. రాజు మాటచొప్పున చేయుము. నీవు గొప్పగా సత్యపరిపాలనము చేసి రాజును అసత్యదోషము లేకుండ నుత్తరింపుము' అని చెప్పెను. ఇట్లది పరుషవచనములు చెప్పుచుండఁగా రామునకు మొగము వెలుకఁబాఱుట మొదలయిన బయటిశోకవికారము లేమియుఁ గలుగవయ్యె; లోపలను దుఃఖము గలుగదయ్యె. రాజుమాత్రము మహానుభావుఁడయ్యును పుత్రుని ఇఁక నెడఁబాయవలసివచ్చెనే యను వ్యసనము చేతపించి మిక్కిలి దుఃఖించెను. ఇది పదునెనిమిదవసర్గము.

---

## రాముఁ డడవికిఁ బోయెద నని కైకేయికిఁ జెప్పుట.

రాముఁడు ఎట్టిశత్రువులను చంపునట్టివాఁడు. అట్టిదిట్ట గావున నతఁడు, అప్రియమై మరణముతోసాటిగానున్న యామాటను వినియు,దుఃఖపడక కైకేయిని జూచి "చిత్తము. నీవు చెప్పినట్లే భరతునికి అభిషేకమగుఁగాక. నేనును రాజు చేసిన ప్రతిజ్ఞ చొప్పున జడలను కృష్ణాజినమును దాల్చి యిచటనుండి కదలి యడవికివాసము చేయఁ బోయెదను. అది యొకహెచ్చుకాదు. అయితే పగవారిని అడఁచునట్టివీరుఁడైనట్టియీరాజు మునుపటివలె నన్నేల గౌరవింపకున్నాఁడు? జాలిచేత నా! అయినను నా స్వభావ మతనికి తెలియునే. గౌరవింపకుండ నేల? ఇదిమాత్రము తెలియఁగోరుచున్నాను. అవ్వా! నీవు దైన్యము పొందవలదు. నేను నీయెదుటనే చెప్పెద. నీకన్నులయెదుటనే నారచీరలును జడలునుదాల్చి అడవికిఁ బోయెదను. నీవు మిక్కిలిసంతోషము గలిగియుండుము. రాజు నాకు మేలు గోరుహితుఁడు, ఆచార్యుఁడు, మఱియు కన్నతండ్రి, తాను చేసినవరప్రదానమును తెలిసి కావించువాఁడు. ఇట్టియతఁడు నియోగింపఁగా నే

ను శంక మాలి యతనికి ప్రియమైన కార్యమును దేనిని చేయను? ఏదియైనను చేయుదునే. అయినను రాజు భరతునకు అభిషేకము సేయువిషయము తానై నాతో చెప్పలేదే యనెడి యీసంకటము మాత్రము నామనస్సును, దహించుచునట్లు, బాధించుచున్నది. 'నీకు అప్రియ మగుదీనిని జంకు లేక రాజెట్లు చెప్పఁగలఁ'డందువా? ఏల! నేను ఒకరి ప్రేరణ లేక నాయంతటనే నాతమ్ముఁడగు భరతునకు సీతనుగాని రాజ్యమునుగాని ప్రియమైన ప్రాణమునుగాని ధనములనుగాని మిక్కిలి సంతోషంబున నిత్తును. అట్టి నేను, నాతండ్రి యగు రాజు తానై యాజ్ఞాపింపఁగా, నీకు సంతోషము గలిగించు ప్రయోజన మైయుండఁగా, చెప్పినట్లు చేసెద నను నా ప్రతిజ్ఞను పాలించుటయు ఘటిల్లఁగా, ఇట్టి సందర్భములందు రాజ్యాదులను భరతునకు నిత్తునని యింక చెప్పవలయునా! నాకేమియు అప్రీతి కలుగదు. కాఁబట్టి యిక నితనిని సంకోచింపవలదని నీవూఱడింపుము. రాజు, నేల చూడ్కులు నిలిపి మెల్లఁగా కన్నీరు విడుచుచున్నాఁడే. ఇది యేల? నిరర్థకమే చుమీ. ఇప్పుడు రాజుపంపున దూతలు వడిగల గుఱ్ఱముల నెక్కి మేనమామయింటనుండి భరతునిఁ దోడ్కొని రాఁబోవలయును. నేను, 'తండ్రి తానై నాతోఁ బొమ్మని' చెప్పలేదే యనువిచారము లేక, యిదిగో పదునాలుగేండ్లు వాసము చేయుటకై వేగముగా దండకారణ్యమునకుఁ బోయెదను" అనియె. కైక రాముఁడు చెప్పిన యప్పలుకులు విని సంతోషము నొంది రాముని పయనమునందు అక్కఱ గలదై పొమ్మని త్వరపెట్టుచు, అతనిం జూచి 'అట్లే కానిమ్ము. రాయబారు లగువారు భరతుని మాతుల గృహమునుండి తోడి తెచ్చుటకై వడిగల గుఱ్ఱముల నెక్కి పోవుదురు' అని, తనలో 'భరతుఁడు అన్నయందు భక్తిగలవాఁడు. వాఁడు వచ్చువఱకు రాముఁడిక్కడ నుండు నేని వాఁడు అడవికి పోనీయఁడు. నా కార్యము వసతప్పిపోవు' ననితలఁచినదై, రామునితో 'నీవు అడవికి పోవుటకు తనుకపడుచున్నావు. కావున నీకు జాగుసేయుట యుక్తము కాదని నాకు తోఁచుచున్నది. కావున త్వరితముగా అడవికి పోవలయును. నీవు పురుషశ్రేష్ఠుఁడవు. రాజు తన ప్రతిజ్ఞను రాముఁడు చెల్లించునో చెల్లింపఁడో యనిసిగ్గుపడినవాఁడై నీతో నేమియు మాటాడలేదు. ఇంతే కాని మఱేమియుఁ గాదు. కనుక నిందులకై నీవ విచారపడనక్కఱ లేదు. నీవు త్వరితముగా అడవికిఁ బోవుటచే అతనిసిగ్గును దైన్యమును పోఁగొట్టుము. రామా! నీ వీపట్టణమునుండి వేగ కదలి అడవికి పోవకుండు నంతవఱకును నీతండ్రి స్నానము సేయఁడు. భోజనముగాని చేయఁడు' అని చెప్పఁగా రాజు కైక చెప్పినకల్లమాటను విని 'ఇసీ! ఏటి బ్రతుకు! ఏమి కష్టము!' అనుచు నిట్టూర్పు విడిచి శోకమున మునిఁగి మూర్ఛితుఁడై బంగారమున సింగారము గులుకుమంచముపై గొబ్బున పడెను. రాముఁడును అట్లు పడిన రాజును లేవనెత్తి, కైకేయి పొమ్మని పురికొలుపుటచేత చబుకున కొట్టంబడిన గుఱ్ఱమువలె అడవికిఁ బోవుటకు త్వరపడెను. కాని, యా పాపాత్మురాలు 'అడవికిఁ బొ'మ్మని తనకు ఘోరమైన చెఱుపు గలుగునట్లు చెప్పినయప్రియ

మైనమాటవినియు దుఃఖమేమియునుబొందక యామెంజూచి *"తల్లీ!నాకు దేశనుందు పేరాస లేదు.ఈలోకమందుండవలయుననికాని యీలోకమును సమకూర్చుకోవలయుననికాని నాకు తమకము లేదు. నేను ఋషివంటివాఁడను. ధర్మమునుమాత్రమేయవలంబించియున్నవాఁడను. మఱేదియు నాకిష్టముగాదు. తండ్రిగారికి ప్రియమైన కార్యమేదియైనను, అది నాకు ప్రాణమునైననువిడిచి చేయఁగూడినదిగానుండినను, అట్టికార్యము సిద్ధముగా చేయఁబడినదేయని తెలియుము.తండ్రికి కాలుసేతులు పిసుకుట మొదలైనసేవలు సేయుటయు, అతఁడు చెప్పినపని చేయుటయు,ననెడిదీనికంటెను అధికమైనధర్మానుష్ఠానము ఒక్కటియు లేదు. తండ్రిగారు తామై అరణ్యమునకు పొమ్మని నాకు చెప్పకున్నను నీవు చెప్పినఁ జాలును. నీమాటనుబట్టి నేను ఇప్పుడే జనశూన్యమయినయరణ్యమునకు పోయి పదునాలుగేండ్లు వాసముచేసెదను. అమ్మా! కైకేయీ! నీవు ఒకరికన్న నెక్కువగా నన్ను ఆజ్ఞాపింపఁగూడినశక్తి గలదానవు. కావున నీమాటను నేను అవశ్యముగా వినవలసినవాఁడనై చేయుటకు సిద్ధముగానుండఁగా 'భరతునకు పట్టాభిషేకము కావలయును నీవు అరణ్యమునకుఁ బోవలయును'అని నాతో చెప్పక రాజుతో చెప్పి వరరూపముగా అడిగితివే! కావున నాయందు మంచిగుణమున్నదని కొంచెమైనను విచారింపవైతివి. ఇప్పుడే పొమ్మంటివిగదా. నేను మాతల్లియగు కౌసల్యయొద్ద సెలవు పుచ్చుకొని సీత నూఱడించి వచ్చునంతసేపు అనుమతింపుము. అటుపిమ్మట నిమిషమైనను నిలువక నేఁడె†దండకారణ్యమునకుఁబోయెదను. 'భరతుఁడు రాజ్యము పాలించుచు తండ్రికిని శుశ్రూషసేయుచుండునట్లు నీవు చూచుకొనవలయును. తండ్రికి శుశ్రూషసేయుట బహుకాలమునుండి వచ్చుచున్న ధర్మము. కావుననే చెప్పితిని"అనెను.తండ్రియగుదశరథుఁడు రాముఁడు చెప్పినమాట విని మిక్కిలి దుఃఖము పాలై,దానిచే కన్నీళ్లనడఁచుకొనఁజాలక పెద్దగొంతుగా నేడ్చెను. రాముఁడు అట్లు మూర్ఛిల్లియెఱుక తప్పియున్నతండ్రికి నమస్కరించి, యట్లే దుష్టురాలగుకైకకుఁగూడ మ్రొక్కి, అట్టికష్టమునకు కొంచెమైనను దుఃఖమునొందక, పితృవాక్యమును పరిపాలించుపుణ్యము లభించెనని సంతోషమున మిక్కిలికాంతి దళుకొత్తుచు,ఇల్లు వెడలెను.అట్లతఁడు తండ్రికిని కైకేయికిని ప్రదక్షిణముచేసి ఆయంతఃపురము వెడలి తన చెలికాండ్రనుజూచెను.సుమిత్రాదేవికడుపు చల్లఁగాపుట్టి యానందముపయిపయిఁగూర్చుచుండులక్ష్మణుఁడు,దాపుననేయుండుటవలన జరిగినవృత్తాంతము దెలిసి,కన్నులనిండ నీళ్లుగ్రమ్మ మిక్కిలికోపము నొంది యారామునివెనుకఁబోయెను. మంగళపదార్థము

*రాముఁడు 'భరతుఁడు వచ్చినయెడల తనకు రాజ్యము వాఁడిచ్చు'నని తలఁచినట్లుగా కైకేయి శంకించియుండెను. రాముని యీవాక్యమువలన ధనమందుఁగాని రాజ్యమందుఁగాని అతనికి అపేక్షలేదని తెలియుటచే ఆశంక నివారితమైనదని తెలియునది.

† దండుఁడు అనువాఁడు ఇక్ష్వాకునికొడుకు.అతనిరాష్ట్రమును అతనిపేరిట దండక మనఁబడెను. శుక్రునిశాపముచేత అతని రాష్ట్రమంతయు మట్టివాన గురిసి పూడి, క్రమముగా అరణ్యమై, దండకారణ్య మనఁబడినది.

లు దేవాలయములు మొదలైనవానికిఁ బ్రదక్షిణము సేయుచుఁ బోవలయు ననువిధిని బట్టి రాముఁడు అచ్చట నుంచియున్న యభిషేకసామగ్రికి ప్రదక్షిణము మాత్రము సేసి దానియందు అపేక్ష లేమిచే దృష్టి నిగిడింపక 'భరతునికి అభిషేకము గావలయు' నని కోరుచు, అందు దేవతాసన్నిధానముండుటను బట్టి మర్యాదకు మెల్లగాఁ బోయెను. లోకమునకంతయు నింపు గూర్చునా రామునిముఖవికాసము మిక్కిలి యైనది; మఱియొన్నఁడును తఱుఁగని కాంతితోఁ గూడినది; కనుక రాత్రిక్రమ్ముటచే చంద్రునికాంతి తగ్గకుండునట్లు రాజ్యము నశించినకష్టము పైకొనినను ఆముఖవికాసము తీసిపోయినది కాదు. రాజ్యమునువిడిచి యడవికిఁ బోవఁ జూచుచున్న రామునికి, సర్వలోకములనుమించి మానావమానములును సరకుసేయకుండు మహాయోగీంద్రునివలె, మనస్సువికారమేమియు నొందుట కానరాదయ్యె. ఆరాముఁడు అతిధీరుఁడు గావున మంగళకరమైన ఛత్రమును చక్కఁగా నలంకృతమైన చామరములను వదలి, తనపరిజనమును పురజనులను వదలి, రథము నెక్కక, తనవిపత్తికి తనకు దుఃఖము లేకపోయినను ఇతరులకు దుఃఖము కలుగుచున్నదే యనుదుఃఖము మనస్సుననే యడఁచి, వెలికి తెలుపక, ఇంద్రియములను నిగ్రహించి, యీయప్రియవార్త చెప్పుటకై తల్లియింటికిఁ బోయెను. రామునియభిషేకమహోత్సవము జరుగునని యలంకరించుకొని కాంతి దళుకొత్తుచు రామునిచుట్టుకొనియుండు జనులు, సత్యసంధుఁడైనయా శ్రీమంతుని రాముని మొగమునందు మనోదుఃఖము సూచించు నేవికారముగాని చూచినవారు కారు. శరత్కాలమందు మిక్కిలి కాంతుల వెలుఁగు చంద్రుఁడు తన ప్రభను విడువకుండునట్లు మహాబాహుఁడగు రాముఁడు స్వభావసిద్ధమయిన తనసంతోషమును ఎంతమాత్రమును విడువఁడయ్యె. ఆమహాభుజుఁడు మనంబున దుఃఖములకు లోనుగాఁడు గావున దాను కొంచెమైన వెత చెందక జనుల నందఱిని మధురవాక్యముల గారవించుచు తమ్ముఁడగు లక్ష్మణునిదగ్గఱికి వచ్చి కూడుకొనెను. మహాపరాక్రమవంతుఁ డయినయాతమ్ముఁడును అన్నతోడి సుఖదుఃఖాదులే కలవాఁడు గనుక రామునికిఁ గలిగినదుఃఖమును బట్టి తనకును దుఃఖము గలుగఁగా అది మనసున నడంచుకొని రాముని వెంబడించిపోయెను. రాముఁడు గృహముఁ జొచ్చి యందు తనకభిషేకము జరుగు నని మిక్కిలి యుత్సంతోషమునఁ గూడియున్న జనులను జూచి, యప్పుడు తనకు రాజ్యనాశము పాటిల్లుటయు చింతించి, దానిచే నవశ్యము దుఃఖము గలుగఁ గూడినదయ్యును, తాను దుఃఖించినచో తనహితజనులు ప్రాణమును విడుతు రనుజంకున దుఃఖమంతయు లోపల నేయడఁచుకొని, పైకి నేమియు నగపడకుండునట్లు వికారమునొందకుండెను. ఇది పందొమ్మిదవసర్గము.

— ✣ —

(రాముఁడు కౌసల్యతోఁ దానరణ్యమునకుఁ బోవుటను జెప్పుట; కౌసల్యావిలాపము.)

పురుషలలాముఁడైనయా రాముఁడు కైకేయీదశరథులకుఁ గేలించిన మోడ్పు చేతులతో బయలు వెడలఁగానే యప్పుడంతఃపురమునందలి స్త్రీలు మిక్కిలి హాయని

యేడ్వఁగా వెనుకబడుచుపుట్టెను. ఆరాజభార్యలు రామునింగూర్చి 'రాముఁడు తండ్రి చెప్పకున్నను,అంతఃపురమందలి మనకందఱికిని కావలసినకార్యములు తానేచేసి మనకు దిక్కయి రక్షకుఁడై కాచుచుండును.అట్టిరాముఁ డిప్పుడు ఊరువిడిచి యడవికేఁగోవనున్నాఁడే! తనతల్లి యైనకౌసల్యకు ఎట్లు ఎచ్చరికతో శుశ్రూషలు సేయుచుండునో యట్లే పుట్టుక మొదలుగా మాకునుశుశ్రూషలు సేయుచున్నాఁడు. రాముఁడు తన్ను పరులెంతపరుసుగాపలికినను కోపమునొందఁడు. మఱి కోపము గలిగించుకార్యములను సేయఁడు. పట్టియాగ్రహముచే కోపించినవారి నందఱిని ప్రసన్నులుగాఁ జేయుచుండును. అట్టిరాముఁడు ఇప్పుడు పట్టణమువిడిచి యడవికిఁబోవుచున్నాఁడు. అయ్యో! మనరాజునకుబుద్ధిచెడినది.కావుననే సకలభూతములకును రక్షకుఁడైనరాముని అడవికిపంపి ప్రాణిలోకమునకంతయు నాశము చేయుచున్నాఁడు' అని యందఱును పతియగు దశరథుని నిందించుచు దూడలం బాసినయావులవలె దుఃఖించుచు నేడ్చిరి. దశరథుఁడు పుత్రదుఃఖమున శోకించుచున్నవాఁడు; మఱి, యీయంతఃపుర స్త్రీలరోదన ధ్వనిని వినఁగా దుఃఖమినుమడింపఁగా మంచముపైఁబడి మూర్ఛిల్లెను. రాముఁడును వారల యేడ్పుచప్పుడు విని మిక్కిలి సంకటపడి, ఏనుఁగువలె నిట్టూర్పులువిడుచుచు, ఇంద్రియముల చిక్కఁబట్టి దుఃఖమును మ్రింగుకొనుచు తమ్మునింగూడి తల్లియంతఃపురమునకుఁ బోయెను.అతఁ డచ్చట రాజు మిక్కిలి గారవించుద్వారపాలాధ్యక్షుఁ డగువృద్ధపురుషుఁడు, ద్వారమునఁగూర్చుండియుండఁగాఁ జూచెను;మఱియు ద్వారముననిలుచుండినయనేకులను గాంచెను. వారందఱును రామునిచూడఁగానే దిగ్గునలేచి, జయశీలురలో మేలుబంతి యైనయారాఘవునిని 'జయజయ'అని యాశీర్వదించిరి. అతఁ డట్లు మొదటికక్ష్యను ప్రవేశించి యంత రెండవకక్ష్యను వేదవేత్తలై రాజుచే మిక్కిలి సత్కరింపఁబడువృద్ధబ్రాహ్మణులను జూచెను. రాముఁ డాబ్రాహ్మణులకు మ్రొక్కి యంత మూఁడవకక్ష్య చొచ్చి యందు వాకిలి గాచుచుండువృద్ధస్త్రీలను బాలలను గాంచెను. అపుడా స్త్రీలు మిక్కిలిసంతోషమున రాముని జేజేపెట్టి దీవించి,గృహములోనికిఁ బోయి, సంభ్రమమున అతనితల్లికి రాముఁడు వచ్చె నను ప్రియవార్తను జెప్పిరి.అప్పుడు కౌసల్య రాత్రియంతయు నియమమున నిదుర మేల్కొనియుండి తెల్లవాఱఁగానే కొడుకునకు మేలు గోరి విష్ణువును బూజించెను.కౌసల్య యెప్పుడును వ్రతములాచరించుటయం దాసక్తిగలది. మఱియప్పుడో, ఆమె తెల్లపట్టుచీర గట్టుకొనిమంగళాలంకారములుగైకొని సంతసంబున బ్రాహ్మణులచే హోమము చేయించుచుండెను.అప్పుడు రాముఁడు మంగళకర మైనతల్లియంతఃపురములోనికి పోయి యచ్చట బ్రాహ్మణులచే హోమము చేయించుచున్నతల్లిని జూచెను. మఱియు నచ్చట దేవకార్యముకొఱకు సమకట్టినద్రవ్యసమూహమును గాంచెను.అచ్చట పెరుఁగు అక్షతలు నేయికుడుములు హవిస్సులు పేలాలు తెలిపూదండలు పాయసము, పులగము (నువ్వులు బెల్లము) సమిధలు జలపూర్ణకలశములును రామునికిఁ గానంబడెను. తెలి

పట్టుచీర గట్టి జలముల విష్ణుతర్పణము సేయుచు, వ్రతోపవాసమున కృశించియు దేవత వలె వెలుంగుచున్న తల్లిని రాముఁడు చూచెను. ఆమె యప్పుడుధ్యానము సేయుచుండె నుగాన పెద్దసేపటికి, కన్నకడుపు చల్లఁగా పుట్టినకుమారుఁడు రాముఁడువచ్చుటఁజూచి మిక్కిలి యుప్పొంగి గోడిగ తనపిల్ల నెదుర్కొనునట్లు కొడుకు నెదుర్కొనెను. ఎదురు వచ్చినతల్లికి రాముఁడునమస్కరించె. అంతనామెయు చేతులు బారసాచిరామునికౌఁగి లించుకొని శిరముమూర్కొనెను. కౌసల్య, సహజముగా కొడుకునందు వాత్సల్యము గలది. మఱిపగవారి కెనిరింపరానియట్టికొడుకుమీఁద గాదిలిచెప్పఁదరమా. అట్లామె దనకొడుకును రామునిఁజూచి, యతనికిప్రియమును హితమును గలుగునట్లుగా 'వృద్ధులును ధార్మికులును మహాత్ములునై నరాజర్షులవలె నీవుదీర్ఘాయుష్యమును గొప్పకీర్తియు, నీకులమునకుఁదగినధర్మమును పొందుమా. రామా! నీతండ్రి ఆడితప్పఁడు. కనుక ఇంకనుఅభిషేకము మొదలు పెట్టలేదేయని సందేహపడవలదు. ధర్మాత్ముఁడు కనుకని న్నిప్పుడె యౌవరాజ్యమునం దభిషేకించునుజుమా' యనెను. తల్లి భోజనమునకై పిలిచి యాసనమియ్యఁగా, ఒకరిచ్చినయాసనమునఁ గూర్చుండకున్నను జేతితోనైనను తాఁకవలయుననువిధిబట్టి, దానిని తాఁకి యట్లుపలుకుచున్న తల్లికి 'యడవికిఁబోయెద' నని యెట్లుచెప్పుదునని కొంతసిగ్గుపడి, చేతులుమొగుడ్చుకొని, స్వభావముచేతనే వినయము గలవాఁడుగాన మఱి తల్లియందలిగౌరవంబున మిక్కిలివినయముసూపుచు, తానుదండకారణ్యమునకు పయనమగుటకు సెలవుపుచ్చుకొనఁబూని, యది చెప్పి సెలవుపుచ్చుకొనుటకు మొదలుపెట్టినవాఁడై 'తల్లీ! ఇప్పుడు మహాభయమొకటి నిజముగా రానున్నది. ఇది నీకు తెలియదు. ఈచెప్పమాట నీకును సీతకును లక్ష్మణునకును దుఃఖము కలిగించును. అయినను చెప్పకతీఱదు. అది యిఁకేమికాదు. నేనుదండకారణ్యమునకు పోయెదనే! నాకీమణిమయాసనమేల? *దర్భాసనము వేసికొనుకాలముగదా యిదిగో నాకు వచ్చియున్నది. నేను తేనెయు మూలములను ఫలములును దినుచు, వంటవాండ్రుసంస్కరించిన మేలిమాంసమును దినుట మాని, మునివలె విజనంబగువనమున పదునాలుగు సంవత్సరములు వసింపఁబోవుచున్నాను. మహారాజు, భరతునికి యౌవరాజ్యమొసంగెను. నన్నో, తాపసినై దండకారణ్యమునకుఁ బోవునట్లుచేసినాఁడు. నేను తండ్రియాజ్ఞచొప్పున వానప్రస్థకర్మములను ఆచరించుచు పండ్లును వేళ్లునుదిని యుబునుపుచ్చుచు †ఆ తొమ్మిదేండ్లు విజనమయిన యరణ్యమున వసించియుందు'నని చెప్పెను. ఆరాణి రాముని మాటవిని శోకము ముమ్మరింపఁగా, అడవిలో, గుద్దలిచే నఱుకఁబడిగూలుచెట్టుబోదవలె, స్వర్గమునుండి నేలఁబడిన దేవతాస్త్రీవలె, గొబ్బున మూర్ఛిల్లి నేలఁబడెను.

* ఇందులకు 'విష్టరాసనయోగ్యః కాలః'. అని మూలము. విష్టరమనఁగా ఏఁబదిదర్భలచే రచింపఁబడిన తాపసులయాసనము.

† ఇందులకు 'షట్చాష్టౌచవర్షాణి' అని మూలము. పదునాలుగేండ్లు అనుటచే ఎక్కువగా తోఁచునని ఆఱు ఎనిమిదేండ్లు అని తక్కువగా తోఁచుటను చెప్పినాఁడు.

దుఃఖమున కెంతమాత్రమును తగనితల్లి మూర్ఛిల్లి కూలినయరఁటివలె నేలంబడియుండఁగా రాముఁడు చూచి లేవనెత్తెను. బరువెక్కించుటచే మిక్కిలి యలసి, శ్రమతీర్చుకొనుటకై నేలంబడిపొరలి, లేచి నుఱ్ఱుక్కియున్న యాఁడుగుఱ్ఱమువలె, ఆబిడయు, దుఃఖభారమునకుఁ దాళక క్రిందఁబడి దూళి బ్రుంగిన దేహముతో, రాముఁడు లేవనెత్తఁగా లేచుటయు, అతఁడు తల్లి దేహమంతయు తనచేత దుమ్ము వ్రావఁ దడవెను. సుఖము నుభవించుటకే యామె తగినది. అట్టిరాణి దుఃఖముచే పీడిత యై తిన్ను సేవించుచున్న పురుషలలాముని రామునిం జూచి లక్ష్మణుఁడు వినుచుండఁగా 'పుత్రా! నేను దుఃఖము ననుభవించుకొఱకే నీవు నాకుఁ బుట్టితివి. నీవు పుట్టక యుండు వేని నేను గొడ్డురాలైనను 'బిడ్డలేదే' యనుదుఃఖమునకంటె మిక్కుటమైనయిట్టిదుఃఖము నాకు కలుగదు. పుత్రా! గొడ్డురాలికి బిడ్డ లేదే యనునొకదుఃఖము మాత్రమే కదా మనసులోనుండును. ఇట్లు బిడ్డను బాసి నేలఁబడి పొరలుచు నేడ్చునంతటిదుఃఖము వేఱొకటి కలుగదుగదా. వెనిమిటి యనురాగముతో రంజింపవలసిన కాలమున నేను జ్యేష్ఠపత్నికిఁ దగినట్టి (యాభరణములు ఐశ్వర్యము మొదలైన) యేమంగళము గాని, మఱి (మగనిగారాబము మొదలగువానిచేఁగలిగెడి) యేసుఖమును గాని, యింతవఱకనుభవించియెఱుఁగను. కొడుకు పుట్టినపిదపనైనను, ఆబలముచేత అవి యనుభవింపనా యని యింతకాలముంటిని. ఇఁక *నాకన్న తక్కువయగు సవతులు నన్ను మనస్సు బ్రద్దలగునట్లు ఇంపు గాని మాటలు పెక్కులాడఁగా అందఱికన్నను నెక్కువదాన నగుచు విన నున్నానుగదా. స్త్రీలకు సవతులచే మాటలు పడుటకంటె మిక్కిలిదుఃఖ మేమి యున్నది? కనుక నాదుఃఖమును నాయేడ్పును ఇంత యని చెప్పనలవికాదు. వాని కంతము లేదు. బల

* ఇందులకు మూలము 'సాబహూన్యమనోజ్ఞాని వాక్యాని హృదయచ్ఛిదామ్। అహం శ్రోష్యే సపత్నీనా మవరాణాం వరాసతీ' విశేషార్థము—(సా అహం) అట్టి నేను-ఇంతకును సుఖమే పొందకుండు నేను, (హృదయచ్ఛిదామ్) మనస్సు ఛేదించునట్టివారును-భర్తమనస్సును నాయెడల వైకల్యము కలిగించి వేఱుపఱుచువారనుట, (అవరాణాం) తక్కువవారును-పెద్దదియగుటచే తానొక్కతియే యట్లుపరుసుమాటలు చెప్పుటకుఁ దగినదిగాని తన్ను అట్లు చెప్పుటకు తగనివారగు, (సపత్నీనాం) సవతులయొక్క తనకు లోనైనవారు కారనుట, (బహూని) పెక్కులు-ఇట్లనుటచే పూర్వముకూడ స్వల్పముగాఁ గలవు-అని సూచితము, (అమనోజ్ఞాని) ఇంపుగాని పరుషములైనవి అనుట, దీనిచే ముందు మనోజ్ఞములు కలిసియుండుటయు తోఁచుచున్నది- ఇపుడు ఎంతమాత్రమును మనోజ్ఞములుకానివి - కేవలపరుషములైన వనుట, (వాక్యాని) వాక్యములను-సూచకములైన పదములనుకాదనుట, (వరాసతీ) ఎక్కువదానను అగుచు-ఎక్కువదాననై తక్కువవారియొద్దమాటలు వినుట మిక్కిలి దుఃఖకరమని భావము—నేనును తక్కువదాననై యుంటినేని ఈదుఃఖమేమియు కలుగదనుట, ఇచటకోపముచే, (సపత్నీనాం) అని బహువచనము. నిజమునకు కైకయొక్కతిని గుఱించియే చెప్పుమాటగావున ఏకవచనము గ్రాహ్యము. మఱియు, తటాలున 'నాయింటికి రాకుము' అనుటయును, కోపముతో మగనియెదుట 'వెడలిపొమ్ము' అనుటయు, 'కొడుకులేనిదానికి వేడుకలేమి' అనుటయు మొదలుగాఁగలవి సపత్నులాడు పరుషవాక్యము లని తెలియునది-

వంతుఁడగు నీవు దగ్గఱ నుండినను గూడ ఇట్లు నన్ను తిరస్కరించుట నీవు చూచితి వేకదా! ఇఁక నీవు దూరము పోఁగా చెప్పనేల. ఇఁక నాకు మరణమే కాని వేఱు లేద నుట నిజము. భర్త నన్ను ఎప్పుడును నిరాకరించుచుండును గాన, అతఁడు నా మేలిమి చెఱిపి, నన్ను తక్కువదానినిగాఁ జేసినాఁడు. కనుక కైకదాసీజనులతో సమానురాలనో, అదియును కాదేని, వారలకన్న తక్కువదాననో, అయితిని. మఱియొక దుఃఖము వినుము. ఎవఁడేని యొకఁడు నన్ను సేవించుచుండు నేని, లేక, ఒకఁడు సేవించునంత భాగ్యము నాకెక్కడిది! ఎవఁడేని నన్ను అనుసరించియుండునేని, వాఁడు, రాజైన కైక కొడుకును జూచి, యాభయమున, నాతో పలుకనైనఁ బలుకఁడు. ఆ కైకయో! ఎప్పుడును నామీఁద కోపమున కొఱకొఱలాడు మొగముతో పరుషములాడుచుండును. ఇఁక నిట్టి గతిమాలినదాననైన వెనుక, దాని యట్టి మొగము చూచి, పుత్రా! ఎట్లు తాళఁగలను? ఆ మాటల కెట్లు లోర్వఁగలను.* రామా! నీవు పుట్టినది మొదలుకొని యిప్పటికి పదునేడు సంవత్సరములుగా, నీకు యౌవరాజ్యము వచ్చి నాదుఃఖము తీఱునని కోరుచు దినములు గడపి

---

* ఇట 'దశసప్తచవర్షాణి తవజాతస్య రాఘవ' అని మూలము. రాముని వయస్సును ఇట విచారింపవలసియున్నది. వనమునకు పోవుసమయమున, కౌసల్య 'దశసప్తచవర్షాణి' పదియేడు సంవత్సరము లనెను. విశ్వామిత్రుఁడు, రామునిఁ బంపు మన్నప్పుడు దశరథుఁడు, 'ఊనషోడశవర్షో మే రామః' 'రామునికి ఇంకను పదియాఱేండ్లు కాలే' దన్నాఁడు. ఆ సంవత్సరముననే రామునికి వివాహమైనది. సీత రావణునితో 'ఉషిత్వా ద్వాదశసమా ఇక్ష్వాకూణాం నివేశనే' 'ఇక్ష్వాకులగృహమున పన్రెండు సంవత్సరములు వసించి' - అని వివాహమైనపిదప పన్రెండువత్సరములు అయోధ్యయం దుండినట్లు చెప్పినది గావున, దశరథుఁడు చెప్పినదియు వివాహము జరిగినదియు నైన పదియాఱేండ్లును, వివాహమైనపిదప పన్రెండేండ్లును, గూడి యడవికిపోవునప్పటికి ఇరువదియెనిమిది వత్సరములగుచున్నవి. సీత, 'మమభర్తా మహాతేజా వయసా పఞ్చవింశకః । అష్టాదశహివర్షాణి మమజన్మని గణ్యతే - మహాతేజుఁడైన నా భర్తకు ఇరువదియైదు సంవత్సరముల వయస్సు. నాకు పదునెనిమిదేండ్లు' అని అడవికిఁబోవునపుడు రామునికి ఇరువదియైదు సంవత్సరము లని చెప్పెను. ఇట్లు అడవికిపోవునపుడు రామునికి, కౌసల్య చెప్పినట్లు పదియేడేండ్లుగాను, దశరథుని మాటనుబట్టి ఇరువదియెనిమిదేండ్లుగాను, సీత చెప్పినట్లు ఇరువదియైదేండ్లుగాను, కనఁబడుచున్నది. ఈ మూఁడును పొసఁగుట యెట్లు? అన్నచో, మూఁటికిని సంగతి కలదు. ఎట్లన, కౌసల్య 'దశసప్తచవర్షాణి తవజాతస్య రాఘవ' అని చెప్పిన వాక్యమున, 'జాతస్య' అనుటచే ద్వితీయజన్మమును - అనఁగా ఉపనయనకాలమును గ్రహించునది. ఉపనయనకర్మముచే, బ్రహ్మక్షత్రియవైశ్యులకు ముువ్వురికిని ద్వితీయజన్మము కలుగుచున్నదని యాజ్ఞవల్క్యవచనము. అందు, 'గర్భైకాదశేషు రాజన్యమ్' "గర్భమునుండి పదునొకండులలో రాజును' అను సూత్రమున 'ఏకాదశేషు' అను బహువచనమును బట్టి రాజులకు ఉపనయనము గర్భనవమమందును, గర్భదశమమందును, గర్భైకాదశమందును, జేయవచ్చునని గ్రహింపఁబడియున్నది గావున, రాజగు రామునకు గర్భమునుండి నవమమున - అనఁగా జనించిన అష్టమమున, ఉపనయనము జరిగినది ఈ యెనిమిదేండ్లను గణింపక ఎనిమిదవ యేఁట జరిగిన యుపనయనము మొదలుగా గణించి పదియేడేండ్లు అయినవని కౌసల్య చెప్పినది సీత యెనిమిదేండ్లును పదియేడేండ్లును గూడఁ జేర్చుకొని, 'వయసా పంచవింశకః' ఇరువదియైదేండ్లన్నది గనుక కౌసల్య గణనకును సీత గణనకును విరోధము

తిని. నేనిట్లు, సవతితనపుసుద్దులకు యుక్తమైనవయస్సును బలమును క్షీణించినదాననయ్యును, సవతులచే తిరస్కారమును బొందెడియాతుదిలేనిదుఃఖమును చిరకాలము సహింప నోల్లను. నేను నిండుచందురునివంటి నీదు నెమ్మొగమునుజూడనిదాననై, దీనత్వ

---

లేదు. ఇఁక; దశరథునిగణనతోడి సంగతి విచారింపఁదగును. దశరథుఁడు, 'ఊనషోడశవర్షః' 'కొఱఁతపడు పదియాఱేండ్లవాఁడు' అనెను ఆకొఱఁత యెంత అని తెలియవలయును. దశరథుఁడు విశ్వామిత్రునితోడ పంపిన సంవత్సరమే రాముఁడు మారీచునితో యుద్ధముచేసెను గనుక వాఁడు రామునిఁగూర్చి 'బాలోద్వాదశవర్షోఽయ మకృతాస్త్రశ్చ రాఘవః' అని రామునికి పండ్రెండేండ్లుగా రావణునితో చెప్పినాఁడు కాఁబట్టి వివాహకాలమున రామునకుఁ బండ్రెండువత్సరములు. వివాహానంతరము 'సమాద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే। భుఞ్జానా మానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ' అనియు 'ఉషిత్వా ద్వాదశసమా ఇక్ష్వాకూణాం నివేశనే' అనియు సీత పండ్రెండేండ్లు అయోధ్యలోవసించియుండినట్లు చెప్పుటచే దశరథుఁడు చెప్పిన వివాహపూర్వపుపండ్రెండేండ్లును సీతచెప్పిన వివాహానంతరపు పండ్రెండేఁడులును జేరి ఇరువదినాలుగుసంవత్సరములగుచున్నవి. 'తత్ర త్రయోదశే వర్షే రాజామన్త్రయత ప్రభుః' 'ఆవివాహానంతరము పదుమూఁడవయేఁట రాజు రామునకు పట్టముగట్టుట కాలోచించె' నని సీతచెప్పుటచే రాముఁడు ఇరువదినాలుగేండ్లు నిండి ఇరువదియైదవయేఁట వనమునకుఁ బోయెననుట సిద్ధించుచున్నది. ఇట్లు 'ఊనషోడశవర్షః' అనుటకు పండ్రెండేండ్లుగా గ్రహించుటచే దశరథుని గణనయు సంగతమగుచున్నది. కావున రామునికి, ఎనిమిదవయేఁట ఉపనయనము, పండ్రెండవయేఁట వివాహము, అవ్వల పండ్రెండేండ్లు అయోధ్యావాసము, ఇరువదియైదవయేఁట అరణ్యప్రవేశమని సిద్ధము. మఱియు, 'మమభర్తా మహాతేజా వయసా పఞ్చవింశకః। అష్టాదశహి వర్షాణి మమజన్మని గణ్యతే॥' అని రామునకు ఇరువదియైదేండ్లవయస్సని సీత తనకు పదునెనిమిదేండ్లని చెప్పుటచే సీత రామునికన్న ఇంచుమించుగా ఏడేండ్లు చిన్నదియని తెలియవగును. అప్పుడువివాహము నాఁటికి రామునికి పండ్రెండేండ్లు కాఁగా సీతకు అయిదేండ్లని తేలుచున్నది; కాని, సీత యడవికిఁ బోవునప్పటిపదునెనిమిదేండ్లలో అయోధ్యయం దుండినపండ్రెండేండ్లను త్రోయఁగా ఆఱేండ్లు మిగులుచున్నవి గావున సీతకు ముందే చెప్పఁబడిన అయిదేండ్లును నిండి ఆఱవయేఁట వివాహమయ్యె నని సిద్ధించుచున్నది. అయినను రాముఁడు వివాహమైనతోడనే 'సీతయా సార్ధం విజహార బహూనృతూన్' అని సీతతోడ 'సంభోగసుఖ మనుభవించుటం జెప్పుటచే పండ్రెండువత్సరముల బాలునికి అదియెట్లు చెల్లుననరాదు. మిక్కిలిసౌకుమార్యమునఁబట్టి ప్రౌఢశరీరుండగుటచే నతనికి చెల్లఁగూడును. ఈకారణముననే సీతాదేవికిని ఆఱవయేఁటనే యౌవనారంభము కాఁగూడును. అయినను పండ్రెండేండ్లబాలుఁడును ఆఱేండ్లబాలయు సంభోగసుఖ మనుభవించుట చెల్లదనియు, రామునికి అడవికిఁబోవునప్పుడు ఇరువదియెనిమిదేండ్ల వయస్సుగానుండుననియు, కొందఱిమతము. వారు చెప్పున దేమనఁగా "ఊనషోడశవర్షః' అనుచో పదియాఱేండ్లకు ఏవో కొన్ని నెలలే ఊనముగానుండునుగాని నాలుగేండ్లు ఊనముగా చెప్పఁదగదు. కొన్ని నెలలు తక్కువయైనపదియాఱేండ్లవాఁడని యర్థము. అయితే, దశరథుఁడు విశ్వామిత్రునితో 'బాలోహ్యకృతవిద్యశ్చ నవేత్తిచ బలాబలమ్' "బాలుఁడు; విద్యయందు దాటితేటినవాఁడుగాఁడు; బలాబలమును ఎఱుఁగఁడు' అని పదియాఱేండ్లవానిని గుఱించి చెప్పెనా యన్నయెడల 'బాల ఆషోడశాద్వర్షాత్' "పదియాఱేండ్లవఱకు బాలుఁడు' అనువచనమునుబట్టియు బాల్యయౌవనసంధియపుడు బాలుఁడని వ్యవహరింపఁగూడుటంబట్టియు బాలుఁ డన్నాఁడని తెలియునది. అయితే ఆసంవత్సరమునందే మారీచుఁడు 'బాలోద్వాదశవర్షోఽయ మకృతాస్త్రశ్చరాఘ

మునొందితి, దిక్కుమాలినబ్రతు కెట్లు బ్రతుకుదును? నేను భాగ్యహీనురాలుగావున, ఉపవాసములుండి, దేవతల ధ్యానించి పెక్కువ్రతములుసలిపి, అతికష్టముతో నిన్ను పెంచినదంతయు, నిన్ను అడవిపాలు పుచ్చి, వ్యర్థమైనది. వర్షాకాలమున క్రొత్తనీటి వెల్లువ తాఁకఁగా మహానదిగట్టు పగులునట్లు, ఇట్టిదుఃఖవార్తను వినఁగా నామనస్సు పగులకున్నది. కనుక నిది గట్టిఱాయి యని తలఁచెదను. సింహము ఏడ్చుచున్న లేడిని చంపునట్లు,నన్ను యముఁడు తోడనే చంపకున్నాఁడు గావున నాకు నిజముగా చావు లేదు; నన్నుంచుటకు యమలోకమున చోటును లేదు అని నాకు తోఁచుచున్నది.నా హృదయమును దేహమును, ఇట్టిదుఃఖ మలముకొనియు, పగిలి పఱియలై నేలంబడ కున్నవి. కావున,నివి యినుముతో చేయఁబడి మిక్కిలి కటువై యుండుననుట నిజము. మఱియు దైవము ఏర్పఱపనికాలమున మరణము కలుగదనుట నిజమేకదా. కాన చంపునట్టియిట్టిదుఃఖము వచ్చినను నాకు చావెక్కడిది? నేను సంతానముకలుగవలయునని చేసినవ్రతములును దానములును ధ్యానములును నిరర్థకములైనవి;సలిపినతపస్సును చవుటినేల నాటినబీజమువలె మిక్కిలి నిష్ఫలమైనది ఇంతవఱకు నెన్నఁడు ననుభవింపనిదుఃఖముగదా యిది. మిక్కిలిదుఃఖము పీడించినపుడు, ఎవఁడుగాని,కాలముకాకున్నను,తనయిచ్ఛగా ప్రాణములు విడువఁగలఁడేని,నేను దూడను బాసినయా

---

వ్యా। అజాతవ్యఞ్జనః శ్రీమాన్ పద్మపత్రనిభేక్షణః' 'ఈరాముఁడు పండ్రెండేండ్లవాఁడు, బాలుఁడు, అస్త్రవిద్యయందు తేఱనివాఁడు, మీసలు అతని కింకను మొలవలేదు' అని మీసలులేని పండ్రెండేండ్లబాలునిగా చెప్పఁగా పదియాఱేం డ్లనుట యెట్లు? అన్నచో, మారీచుఁడు యుద్ధభయమున భ్రమిసి కాని రావణుని భయ పెట్టుటకుఁగాని యట్లు చెప్పియుండును. కానిచో, తన్ను వాయవ్యాస్త్రమువేసి ఎగఁజిమ్మిన విలుకానినే 'అకృతాస్త్రః' ,అనునా?ఇట్లే పదాఱేండ్లవానికి పండ్రెండేండ్లని చెప్పినాఁడు'విలువిద్య తెలియనియంత బాల్యముననే నన్నింతచేసినవాఁడు ఇప్పటివయస్సున మనల నెంతచేయఁడు' అనిరావణునికి జంకు పుట్టించుటకే యిట్లువాఁడు కల్లలాడినాఁడని తెలియునది.' అజాతవ్యఞ్జనః'అనుట,'ఈకన్యకు నడుములేదు' అన్నట్లు అతిశయోక్తి.కొంచెముగా మీసలు తలసూపెననియర్థముగాని మీసలే లేదనియర్థముగాదు. 'ఏకవస్త్రధరో ధన్వీ శిఖీకనకమాలయా''ఒకగుడ్డనుగట్టి సిగకలిగి' యన్నపసిబాలునికిపదాఱేండ్లుఎట్లు? అన్నచో,ఇట, 'ఏకవస్త్రధరః' అనఁగా ఒకగుడ్డను ధరించినాఁడనికాదు; గుడ్డలనంతయునొక్కటిగా దేహమునఁ జుట్టుకొని యుద్ధమునకు సన్నద్ధుఁడైనాఁడని యర్థము, 'వయసా పఞ్చవింశకః''ఇరువదియైదేండ్లవాఁడనుట' ఎట్లు?అన్నచో, ఎప్పుడును ఇరువదియైదేండ్లుగలవానివలె నగపడువాఁడని నిత్యయౌవనము తెలియునది. దేవతలును ఎప్పుడునిరువదియైదేండ్లవారివలెకనఁబడుట ప్రసిద్ధముగాఁబట్టి, కౌసల్య'గర్భైకాదశేషు రాజన్యమ్'అని పదునొకండవయేఁట జరుగు ఉపనయనముమొదలుగా లెక్కించి పదియేడేండ్లన్నది. కాన మొత్తమునకు జన్మమునుండి ఇరువది యెనిమిదేండ్లగుచున్నది. కనుక, రామునికివనప్రవేశసమయమునవయస్సు ఇరువదియెనిమిదేండ్లనుట సిద్ధము''అని చెప్పుచున్నారు. అయినను సీత సన్న్యాసియై వచ్చినరావణునిఁ జూచి 'వయసా పఞ్చవింశకః' 'ఇరువదియైదేండ్లవాఁ' డన్నమాట శాపభయమున చెప్పఁబడినదిగాన యిదియే యథార్థమగును. కనుక దీనిబట్టి రామునకు వనప్రవేశసమయమున వయస్సు ఇరువదియైదేం డ్లనుటయే సిద్ధము.

వువలె నిన్ను విడనాడియుండ నోపక, యిప్పుడె యమునికొలువుకూటమునకుఁ బోయి యుందును; మఱి యట్లు చేయనుగూడ శక్యముకాకున్నదే! అకాలమరణమును కలుగక పోయినను, రామా! చంద్రునివలెఁ బ్రకాశించుచుండు నెమ్మొగముగల నిన్నుఁ గన్నార చూచుచుండుటయు లేక యెడఁబాసి యిచట కుచ్ఛితపుబ్రతుకుబ్రతుకుటచే ప్రయోజన మేమియు లేదు. కావున, ఆవు మిక్కిలి దట్టపుమాలి వాత్సల్యముచే దూడను వెంబడించునట్లు, నేనును నీవెంట నడవికి వచ్చెద' ననియె. అట్లు కౌసల్య యపుడు దుఃఖమునకు తాళఁజాలకయు రాముని బాసి సవతులవలనఁ దనకుఁ గలుగఁగల మహావ్యసనమును ఆలోచించియు, రాముఁడు సత్యపాశబద్ధుఁడైయుండుటఁ జూచి, యొరులచే బద్ధుఁడైనతనకొడుకుం జూచి కిన్నరి విలపించునట్లు. తాను మిక్కిలివిలపించినదయ్యె. ఇది యిరువదియవసర్గము.

---

—లక్ష్మణుఁడు కౌసల్య నూఱడించుట; రాముఁడు సత్యము తప్పఁగూడ దనుట.—

అట్లు రామునితల్లి కౌసల్య పలవించుచుండఁగా లక్ష్మణుఁడు చూచి దీనుఁడై యామెదుఃఖములు అడఁచుటకు*అప్పటికిఁ దగునట్లుగా 'పూజ్యురాలా! ఒకయాఁడుదానిమాటకు లోనై రాముఁడు రాజ్యము విడిచి యడవికిఁ బోవుట నీకేకాక నాకుఁ గూడ సమ్మతముకాదు. రాజును ముదిసినముదుకఁడు. కనుక, అతనిమతి తలక్రిందై యున్నది. మఱియు విషయలోలుఁడు, మన్మథునికి వశుఁడు. కాన, నిట్టివాఁడు కైకేయి ప్రేరేపించుచుండఁగా, నేమాటంజెప్పఁడు? అయుక్తములు నూఱైనను చెప్పును. కాన యతనిమాట పాటింప రాదు.' 'రాజేమి సేయును. ఇది ,రామునిదోష'మందువా? కాదు. రాజ్యమును విడిచి యడవినుండునట్లు వెడలఁగొట్టునంతటి రాజద్రోహముగాని మఱి యేమహాపాతకముగాని రామునియందు నాకుఁ గనఁబడలేదు. (వృద్ధుఁడైనతండ్రి కామవికారమునకు లోనై స్త్రీతోడఁ గూడి లజ్జమాలి యిట్లుసేయుచున్నాఁడు గాన అధార్మికుఁడైనరాజును జంపునట్లు అతనిని జంపెదను). రామునకు మిక్కిలిశత్రువైనవాఁడుగాని, రామునివలన అవమానము నొందినవాఁడుగాని, యెవ్వఁడైనను, రామునిపై మఱుఁగునవేని దోషము చెప్పఁగా నే నెఱుఁగను. ఇఁక ప్రత్యక్షమునఁ జెప్పువాఁ డెవఁడు? కాన రామునియందు దోషమే యనుమానింపరాదు. అనుమానమేల! దేవతలంబోలినవాఁడై, కుటిలత్వము లేక, గురుశిక్షితుఁడుఁ నుజితేంద్రియుఁడునై, పగవారియందును ప్రేమ చూపుచు, ధర్మమే రూపు దాల్చిన ట్లున్నరాముఁడు నిర్దోషుం డనుట ప్రత్యక్షమైయుండఁగా అట్టికొడుకును, ఏదోషమును గానక, ఏకారణమును లేక, ధార్మికుఁ డగువాఁడెవఁడు దిగనాఁడును? అట్టికుమారుని రాముని కారణములేక యే

---

* ఇందులకు 'తత్కాలసదృశం వచః, అనిమూలము. అప్పటికాలమునకు తగినమాటను-అనఁగా, అప్పటి కౌసల్యదుఃఖమును ఉపశమింపఁజేయుటకై యట్లు చెప్పెనేకాని, మనఃపూర్వకముగా అట్లు చెప్పినవాఁడు కాఁడనుట.

విడిచినదశరథుఁడు,ధార్మికుఁడు గాఁడు; దుష్టుఁడుగాన యతనిమాట గయికొనరాదు. కాఁబట్టి ముసలివాఁడై నను మరల పసితనమువచ్చినట్లు కామపరవశుఁడై యున్నరాజు చెప్పినయాలోచనగానిమాటను, రాజనీతినిబట్టి యాలోచించుచునేని, యేపుత్రుఁడు మనస్సున నంగీకరించును?అన్నా!నిన్నడవికిఁ బంపువిషయ మెవనికిఁగాని తెలియకమునుపే,నీవునాతోఁగూడి రాజ్యమంతయు స్వాధీనము చేసికొనుము. నేను విలుదాల్చి పార్శ్వమునకాపై యుండఁగా, యమునివలె చూపట్టుచున్న నీకంటెను అధికపౌరుషము చూపఁజాలువాఁడెవఁడు? అట్టినీయాజ్ఞ నెవఁడు జవదాఁటనేర్చు! పురుషసింహమా! ఈ యయోధ్యయందలిజనులు నీకు ప్రతికూలమే దేని చేయఁబూనిరేని వీరినందఱిని వాఁడిబాణములచే రూపుమాపి అయోధ్యయం దొకమనుష్యుఁడును లేకుండునట్లు చేసెదను. ఇఁక భరతునిపక్షము నవలంబించియుండువారుగాని, వారికి హితముగోరుమఱియెవ్వరుగాని యెచ్చటనైనను కనఁబడిరేని వారినందఱిని జంపెదను. మెత్తనివానిని అవమానింతురు గనుక కటువుగా మనము కార్యము చేయవలయును. మనతండ్రి దుష్టుఁడై, కైకేయిపురికొలుపఁగా, దానిమాట విని మనకు పగవాఁడై విరోధము సేయునేని అతనిని ముందువెనుకచూడక పట్టిచంపుదము. అంత కాఠిన్యము కూడదేని బంధింతము. ఇట్లు చేయుటకు ప్రమాణము కలదు. తండ్రియైనను, గర్వించి కామాదులకు లోనై, తగును తగదని తెలియక,మేరమీఱి తప్పుదారిని త్రొక్కునేని అతనికిదండనము చేయవలయును. పురుషశిఖామణీ! అది యటుండనీ. నీకు ధర్మమున ప్రాప్తమై యున్నయీరాజ్యమును, రాజు నిన్నణపఁజాలునట్టియేబలము తన కున్నదని, లేక నీకీయకుండుటకు నేకారణము కలదని, తలఁచి, నీకియ్యక కైక కియ్యఁగోరుచున్నాఁడు? అతనికి అట్టిబలమును కారణమును రెండును లేవు. పగవారిని అడఁచునట్టి నీతోడను నాతోడను మీఁదుమిక్కిలి విరోధము పెట్టుకొని భరతునకు రాజ్యమొసఁగుటకు నితనికేమిశక్తిగలదు!'అని కౌసల్యతో'నేనుగూడ భరతునివలె దాయాదినే. అయినను నాకు సత్యముగా హృదయమందు అన్నయగు రామునిమీఁద అనురాగమున్నది.ఉన్నదని నీముందట నేను సత్యముమీఁదను,ధనువుమీఁదను,దానముసాక్షిగాను దేవతార్చనాదులతోడును ప్రమాణము సేసెద.అమ్మా!మండుచున్న యగ్నినిగాని రాముఁడు చొచ్చునేని నేనతనికన్నమున్నుగా నేయందు చొచ్చితినని నీవు నిశ్చయింపుము. సూర్యుఁ డుదయించి కిరణసమూహముచే చీఁకటిని పోఁగొట్టునట్లు,నేనును పరాక్రమమున నీదుఃఖమును పోఁగొట్టెదను. నాపరాక్రమమును అమ్మగారును రాముఁడును ఇప్పుడుచూతురుగాక' అనెను. మహాత్ముఁ డగులక్ష్మణుఁడు చెప్పినమాటవిని కౌసల్య యేడ్చుచుదుఃఖము తీఱునా యని మిక్కిలికోరుచు రామునిఁ జూచి' పుత్రా! నీతమ్ముఁడు లక్ష్మణుఁడు చెప్పుచున్నమాటలను వింటివిగదా. అవి నీకు రుచించునేని యింకనిటమీఁదఁ జేయఁదగినకార్యమును జేయుము. నాసవతి యధర్మముగా చెప్పినమాట విని,వగలం బొగులుచున్ననన్ను దిగవిడిచి,యిచటనుండి నీకుఁ బోరాదు. నీవుధర్మ

ములను దెలిసినవాఁడవు. కనుక పరమధార్మికుఁడవై ధర్మమును ఆచరించవలయునని కోరుదువేని నీ విచ్చటనే యుండి నాకు శుశ్రూష సేయుచు సాటిలేనియీ మేటిధర్మమును ఆచరింపుము. మాతృశుశ్రూషకన్న మేలైనధర్మము లేదు సుమా! తొల్లి కశ్యపునికుమారులలో నొకఁడు తల్లికి శుశ్రూషసేయఁగోరి, దానిచే మహాతపస్సును బడసి స్వర్గము నొందెను. నీకు మీతండ్రియైన మహారాజు, పెద్దతికమునుబట్టి యెట్లు పూజింపఁదగునో అట్లే నేనును, తల్లినిగావున, పూజింపఁదగినదానను. కాన తండ్రిమాటవలెనే నామాటను నీవు అంగీకరింపవలయు టావశ్యకము. అడవికిఁ బోవుటకు నేను అనుమతింపను. నీ విచటనుండి యెంతమాత్రము అడవికిఁబోఁగూడదు. నిన్నుఁ బాసినపిదప నాకు బ్రతుకేల? సుఖమేటికి? నీవు లేక యిచటనుండి సమస్తభోగము లనుభవించుటకంటె, నీతోఁ గూడి గడ్డి తినుచుండుటయైనను నాకు మంచిది. దుఃఖమున తల్లడిల్లుచున్న నన్ను దిగనాడి యడవికిఁ బోవుదువేని, నే నిచట ప్రాయోపవేశనముపూని నీరు నన్నమును లేకుండి ప్రాణములు విడుతునుగాని యెంతమాత్రమును బ్రతుకఁజాలను. నీకొఱకు నేను ప్రాణములువిడుచుకారణమున, నదీపతి యగుసముద్రుఁడు*పిప్పలాదునియెడల అధర్మమాచరించి బ్రహ్మహత్యవంటి పాతకమునొందినట్లు, లోకములం బ్రసిద్ధికెక్కునట్లుగా నీవు దుర్గతిని బొందఁగలవు' అనెను. ఇట్లు విలపించుచు విన్నయై యున్నతల్లిని కౌసల్యను జూచి రాముఁడు ధర్మాత్ముఁడుగావున ధర్మయుక్తమగువచనముల 'తల్లీ! నీ మాటచొప్పున నడచుకొన వలయునే. అయినను తండ్రిమాట మొదటిది గనుక బలీయమైనది. కావున తండ్రిమాటను నేను జవదాఁటఁ దెంపుసేయను. నీకు తల వ్రాఁక మ్రొక్కి నాయెడల మనస్సుకలఁక లేకుండునట్లు వేఁడెద. నేనడవికి పోవఁగోరుచున్నాను. సెలవిమ్ము. తండ్రివలెనే తల్లివగు నీవును పూజ్యురాలవే. అయినను జ్ఞానియు పండితుఁడును వ్రతపరాయణుఁడు నైన కండుమహర్షియు తండ్రిపనుపు సేయఁబూని ఆవునుగూడఁ జంపినాఁడు మున్ను మన వంశమునందు, సగరునికుమారు లాదఱును తండ్రి యగుసగరునియాజ్ఞచే భూమిని ద్రవ్వుచు మిక్కిలి భయంకరమైనవధమును బొందిరి. జమదగ్నికొడుకు పరశురా

*బ్రహ్మహత్యఅనఁగా బ్రాహ్మణుని చంపుటచేఁ గలుగుపాతకము. సముద్రునకు బ్రహ్మహత్య కలుగుట ఎచ్చటను తెలియరాదుగనుక ఇచట, బ్రహ్మహత్య అనఁగా బ్రాహ్మణునివలనఁ గలిగినహింస యని యర్థము సేసినయెడల, సముద్రుఁడు, పిప్పలాదుఁ డను బ్రాహ్మణునికి అపకారము సేయఁగా, ఆబ్రాహ్మణుఁడు కృత్యనుపుట్టించి సముద్రుని పీడించెను. కనుక పిప్పలాదబ్రాహ్మణునికిఁ గలిగినయాహింసయే సముద్రునకు బ్రహ్మహత్యగా నిట గ్రహించునది. లేక కౌసల్య, మొదట కాశ్యపుఁడుమాతృశుశ్రూష చేసి దానికిఫలముగా స్వర్గలోకమునుపొందుటను చెప్పి, యిప్పుడుమాతృశుశ్రూష సేయనియెడలఁ గలుగుదుష్ఫలమునకు ఉదాహరణముగా సముద్రుని చెప్పినదని గ్రహించినయెడల, సముద్రుఁడుమాతృదుఃఖమును గలిగించినయధర్మముచే (బ్రహ్మహత్యాన్) బ్రహ్మహత్యను - బ్రహ్మహత్యచే ప్రాప్తించునట్టినరకవిశేషములను - పొందినాఁ డనుపురాణకథను ఇట అనుసంధించుకొనునది.

ముఁడు తండ్రివాక్యము సేయువాఁడై కన్నతల్లి యగు రేణుకను తనచేతులారనే చంపినాఁడు. ఇట్లు అవ్వనైనను తమ్ముననైనను కన్నతల్లినైనను జంపి తండ్రియాజ్ఞ జరుపవలసియున్నదే ! ఇఁక తల్లికి కొంతకాలము దుఃఖముమాత్రము గలిగించుటకై వెనుదీసి యట్టితండ్రియాజ్ఞను మీఱి యడవి కెట్లు పోకుండవచ్చును? తల్లీ! దేవసమానులైన యీకండుమహర్షి మొదలయినవారును ఇంక నితరులును చేసినట్లు నేనును, నాతండ్రికి హితముగా నతనిమాటను వ్యర్థము సేయను. నేనొక్కఁడనే తండ్రియాజ్ఞ చొప్పున చేయుట లేదుగదా. ఇప్పుడు నేను నీకు చెప్పినమహాత్ములును చేసియున్నారే. నేను నీకు దుఃఖము కలిగింపవలయునని, ఇంతవఱకు లేక పూర్వాచారమునకు విరుద్ధమై యుండు క్రొత్తధర్మము సేయు లేదు. మహాత్ములైనపూర్వులు *సమ్మతించి యనుసరించిన యీ పితృవాక్యపాలన మనెడిపద్ధతిని అనుసరించెదనే కాని వేఱు కాదు. భూలోకమున అవశ్యముగా పితృవచనము చేయఁదగినది గావున దానిని చేయకుండఁజాలను. ఒకవేళ తల్లి మొదలైన తక్కినవారికి దుఃఖము కలిగినను తండ్రి పంపు సేయువానికి ఏ చెఱుపును గలుగదు' అనెను. రాముఁడు మాటనేర్పరులయందును మేటివిలుకాండ్రందఱియందును మొనగాఁడు. అతఁడు తల్లితో నిట్లు చెప్పి యంత లక్ష్మణునిఁ జూచి "లక్ష్మణా ! నీకు నాయందుఁగల చెలిమికి సాటి లేదు. నీపరాక్రమమును బలమును ప్రతాపమును మఱియెవ్వరికిని గలుగరావు. ఇది నే నెఱుఁగుదును. శుభలక్షణలక్షితా ! నాతల్లి కౌసల్య, సత్యముస్వరూపమును శాంతిస్వరూపమును తెలియనిది గావున మిక్కిలి దుఃఖమునొందినది అవన్నియుఁ దెలిసియు నీ వేల యిట్లు పలికెదవు ? లోకమందు సకలపురుషార్థములలోను ధర్మము శ్రేష్ఠము. ఏలనఁగా ధర్మమునందే సత్యము నెలకొనియున్నది. ఉత్తమమైన యీ పితృవాక్య పరిపాలనముకూడ ధర్మమునే యాశ్రయించినది గావున దీనివలన మిక్కిలి ధర్మము కలుగును. ధర్మమునందు నిలిచి దానినే ఫలముగాఁ గోరువాఁడు తండ్రికిఁగాని తల్లికిఁగాని మఱి బ్రాహ్మణునికిఁగాని చెప్పినట్లు చేసెదనని బాస యిచ్చి తప్పరాదు. నేనును తండ్రికి చెప్పినట్లు చేసెదనని ప్రతిజ్ఞ చేసినవాఁడను గనుక తండ్రియాజ్ఞను జవదాఁటఁజాలను 'కైకేయి యాజ్ఞయే కాని తండ్రియాజ్ఞ యెక్కడిది' యందువా ? తండ్రిమాటనుబట్టియే కదా కైకేయి నన్ను అడవికి పొమ్మని పురికొలిపెను. కాఁబట్టి తండ్రిని గూడ చంపి రాజ్యము గూర్చెదనని మిడిమేలపురాచధర్మము నాశ్రయించినయీ

* పూర్వులు సమ్మతించినదని అనుటచే, పూర్వులు సమ్మతింపనివి - అనఁగా చంద్రుఁడు తారను గూడుట యిత్యాదులు, పరిహృతములని తెలియునది. గోవధము మాతృవధము మొదలైన పూర్వులప్రవృత్తులు సాహసకృత్యములు గాన అధర్మము సేయుమని నిందింపరాదు. పితృనియోగము లేక చేసిననే అవి సాహసములగును. 'పితు శ్శతగుణం మాతా గౌరవేణాతిరిచ్యతే - పూజ్యత్వమందు తండ్రికంటె తల్లి నూఱంతలు హెచ్చు' అనువచనము శుశ్రూష సేయుటయందే కాని యాజ్ఞ సేయుటయందు కాదు. తండ్రియె నియామకుఁడు గనుక, తండ్రియాజ్ఞయే తల్లియాజ్ఞకంటె అతిశయమని తెలియునది.

దుష్టబుద్ధిని మానుము. * ధర్మమునే యవలంబింపుము. ఇటమీఁద నిష్ఠురకౌర్యము పూనకుము. నాబుద్ధిని అనుసరించి నడచుకొనుము' అనియె. ఇట్లు రాముఁడు నెయ్యము తియ్యమున తమ్మునికిఁ జెప్పి మరల కౌసల్యనుజూచి శిరము సోఁక మ్రొక్కి చేతులు మొగిడ్చి "తల్లీ! నేను అడవికిఁ బోవుచున్నాఁడను. పోవ ననుమతి యిమ్ము. నాప్రాణములతోడు, పోవుట కడ్డ చెప్పకుము. శుభముగా పోయి వచ్చునట్లు మాకు మంగళాచారములుగావింపుము. 'నామాటచొప్పున నడచుకొను' మనకుము. మొదట చెప్పిన తండ్రిమాటచొప్పున నడవికిఁ బోయి నాప్రతిజ్ఞ తీర్చుకొని, తొల్లి స్వర్గలోకమును విడిచి మరల దానిని బొందినయయాతివలె, అడవినుండి మరల నయోధ్యాపురమునకు వత్తును. తల్లీ! శోకమును హృదయముననే యడంచి యుంచుకొనుము. ఇట్లు చక్కఁగా వెలికిఁదోఁచునట్లు మిక్కిలి వగవకుము. తండ్రియాజ్ఞచొప్పున వనవాసము సలిపి మరలనిచటికివత్తును. తండ్రియాజ్ఞను నెఱవేర్చుభారము నాయొక్కనిదికాదు. తండ్రియాజ్ఞను నీవును నేనును సీతయు లక్ష్మణుఁడును సుమిత్రయు చేయవలసినవారము. ఇది అనాదికాలమునుండి జరుగుచున్నధర్మము కాని నేనై కల్పించినది కాదు. తల్లీ! నీ వీపూజాద్రవ్యములను వదలి మనస్సునందలిదుఃఖమును అడఁచి నేను వనవాసమునకై పూనినబుద్ధిని నీవును పూని నన్నుఁ బంపుము. ఈబుద్ధి పితృవచనపాలనధర్మముతోఁ గూడినది గావున నీకును అనుసరింపఁదగినది' అనియె. రాముఁ డిట్లుమిక్కిలిధర్మయుక్తముగాను, కలఁక లేక దిట్టతనంపువెంపుతోను, కళవళింపక గట్టిపూనిక దోఁచునట్లుగాను, చెప్పినయీమాట విని మూర్ఛిల్లినట్లుండిన యారాణి తెలివినొంది మరల రామునితో 'పుత్రా! నిన్ను పోషించి పెంచెడుమాధర్మమునుబట్టియు చెలిమిఁబట్టియు దేహసంబంధమునుబట్టియు నీకు తండ్రియెట్లో యట్లే నేనును పూజ్యురా లగుపెద్దను గాన తండ్రిమాటవలెనే నాపంపును నీవు త్రోసిపుచ్చ రాదు. కనుక నేను నీవు పోవుటకు సెలవియ్యను. అట్లు మిక్కిలి దుఃఖించుచున్న నన్ను దిగవిడిచి నీకు పోవఁ దగదు. నీవు లేక నాకీలోకమున బ్రతుకేల? తక్కినవారేల? పరలోకమేల? పితృలోకమునకుఁబోయి స్వధ లభించిన నేల! స్వర్గలోకమును జెంది అమృతమును ఆస్వాదించినను పస యేమి! ఆనందప్రదమైన మహర్లోకము మొదలుగా మీఁదిలోకములఁ గలప్రాణిసమూహము లన్నియును ఎదుటఁ బొడకట్టినను గడియసేపు నీవు నాయెదుట నుండుటతో సాటిగాదు' అనెను.

---

* కేవలనీతి గాక ధర్మముతోఁగూడిననీతిని అనుష్ఠింపుమని యిచట భావము. ధర్మమును విడిచి కేవలనీతినే యవలంబింపఁదగునని లోకాయతమతము. దానిని ఈశాస్త్రము ఖండించి ధర్మమును స్థాపించుచున్నది. కనుక, లక్ష్మణుఁడు అచ్చటచ్చట లోకాయతవిషయమును ఉపన్యసింపఁగా, రాముఁడు ఖండించి ధర్మమునే స్థాపించెడినని రహస్యము.

*మనుష్యులు కొఱవులతో బాధించి రానీకయడ్డగించినను,సరకుసేయక తానుపట్టిన దారినేచొచ్చుమహాగజమువలె,కౌసల్యయు లక్ష్మణుఁడును సూటియైనమాటలుచెప్పి వలదని వారించినను ధర్మమార్గమునే రాముఁడు పూనుటచేత, తల్లి మిక్కిలిజాలి పుట్టునట్లు పలవింపఁగా వినియు, మఱింతసంరంభముతో తనపట్టునందే నెల కొన్నవాఁడయ్యె. తెలివి యించుమించుగా తప్పినదై యున్నతల్లిని, దుఃఖపీడితుఁడై పొక్కుచు నున్నలక్ష్మణునిని, జూచి రాముఁడు ధర్మమున స్థిరముగా నెలకొన్నవాఁడు గావున అట్టిధర్మసంకటమున అతనిం బోలినవానికే తగినట్టిమాటలతో "లక్ష్మ ణా! నీకు నాయందుఁ గలభక్తియును నీపరాక్రమమును నేను ఎప్పుడును ఎఱుఁగు చుందునే కదా. అయినను నీవు, ధర్మమునందే నిలిచి యుండవలయు ననెడి నాయభి ప్రాయమును చక్కఁగా తెలిసికొనక తల్లితోఁగూడి మిక్కిలి దుఃఖమునకలుగునట్లు కారించుచున్నావు. † నాయనా! ధర్మమునకు ఫలభూతము లైనసౌఖ్యములను కలి గించుటకు కారణములు ధర్మార్థకామములని లోకమున నిశ్చయింపఁబడియున్నవి.ఆపు రుషార్థములన్నియును ఆధర్మమునందే నెలకొనియుండును.అన్నిటికినదియే ఆధారము. ఇందులకు సందేహము లేదు.ఒకభార్య,అనుకూలయై ధర్మమును,ప్రియురాలై కామ మును, సుపుత్రుని గన్నదై యా పుత్రునిభాగ్యరేఖచే అర్థమును, ఎట్లు గలిగించునో యట్లే ఒకధర్మమును అనుష్ఠించినయెడల సౌఖ్యప్రదములైన యర్థకామాదిసర్వపురు షార్థములును సిద్ధించును. ఏకార్యమునందు; ధర్మము అర్థము కామము అనుమూఁడు ను గలుగవు, యట్టిదానికిఁ బూనరాదు. ధర్మము సిద్ధించుకార్యమునకే పూనం దగును. 'ధర్మము లేక కేవల మర్థకామములు గలిగించుకార్యములకు నేలపూనరా' దందువేని, లోకమున కేవలము అర్థపరాయణుఁడగువాఁడు లోకులచే ద్వేషింపఁ బడుచున్నాఁడు. కేవలకామపరాయణత్వమును ప్రశస్తమైనది గాదుగదా. మన

* ఇందులకు 'నరైరివోల్కాభిరపోహ్యమానో, మహాగజోధ్వాంతమనుప్రవిష్టః భూయః ప్రజజ్వాల విలాపమేనం, నిశమ్యరామః కరుణంజనన్యాః' అనిమూలము.ఇది గోవిందరాజీయపాఠము.'నరైరివోల్కా భిరపోహ్యమానో మహాగజోధ్వాన్తమనుప్రవిష్టః । భీత్వాప్రజజ్వాల విలా...' అని మహేశ్వరతీర్థ పాఠము. ఇందులకు రాత్రియందు మనుష్యులు కొఱవులతో తఱుమఁగా,(ధ్వాన్తం)చీఁకటినిచొచ్చిన మహాగజము ఎట్లు, (భీత్వా)భయముచే, (ప్రజజ్వాల) మిక్కిలితపించిన దగునో యట్లె తనజనని కరుణ మైన విలాపమును విని మిక్కిలి, (ప్రజజ్వాల) తప్తుఁడయ్యెను-అని యర్థము గ్రాహ్యము.

† లేక 'లోకమున ఫలసాధనములుగా శాస్త్రాదులచే తెలియఁబడుచున్న ధర్మార్థకామములును అనుకూలయును ప్రియురాలును సుపుత్రవతియు నగుభార్యవలె, ఫలమునకు సాధనములే యగును. ఇట్లు మూఁడును సమానములుగా ఫలసాధనము లేని వానిలో దేనినైనను గైకొనఁగూడదా యున్నచో అట్లు కాదు. మూఁడును గలుగక ధర్మమాత్రము కలుగునట్టికార్యమునకే పూనవలయును. ఏలనఁగా అర్థ పరాయణుఁడు ద్వేషింపఁబడుచున్నాఁడు. కామపరాయణత్వమును ప్రశస్తము కాదు. కనుక కేవలధ ర్మమే యాశ్రయింపఁ దగినది' యనియు నర్థము.

కాతఁడు ఆచార్యుఁడు, రాజును, మఱివృద్ధుఁడును,తండ్రియునగు. అతఁడుకోపముననో, సంతోషముననో,మఱి కామముననో,తాను చేసిన ప్రతిజ్ఞ పరిపాలింపవలయునన్న ధర్మమునుబట్టి, యేదేని యొక కార్యమును నియోగించునేని, క్రూరవృత్తి లేనివాఁడెవఁడు చేయఁడు? క్రూరుఁడే చేయఁడుగాని. నేనును క్రూరుఁడనుగాను. కనుక తండ్రి చే భరతునకభిషేకమును నాకు వనవాసమును గావించి, యతని ప్రతిజ్ఞను పూర్ణముగాను చేయఁదగురీతిగాను, చేయకుండఁజాలను. నాయనా! అతఁడు నాకును భరతునకును ఆజ్ఞాపించుటకు ప్రభుఁడు; తల్లి కౌసల్యకును పెనిమిటి;కావున నతనియాజ్ఞ మీఱరాదు. ఆమెకు అతనితోడి దేగతి. ఆమెకు నతనితోడిసహవాసమె ధర్మము; అతఁడే పరలోక శ్రేయస్సునకు సాధనము.ఆమెకు, ధర్మంబు నడపువాఁడై ,పూర్వరాజులకన్నను విశేషించి తనకు నియతమైనమార్గమునఁ దప్పక వర్తించుచు,తనకు దిక్కైయున్న యట్టిపెనిమిటి బ్రతికియే యున్నాఁడు. తల్లియో తాను పట్టపురాణి యగును.ఇట్లుండఁగా ఈమె కొడుకునాశ్రయించి పోవుమఱియొక్కతెవలె, అనఁగా విధవస్త్రీవలె, నాతోఁగూడ నడవికెట్లు రావచ్చును? ఎంతమాత్రమును రాఁగూడదు.భర్త జీవించియున్నసీకు నావెంట రాఁగూడదు గావున నాకు అడవికిఁబోవుట కనుజ్ఞ యిమ్ము. దౌహిత్రుఁడు చెప్పినసత్యవచనమున యయాతి మరల స్వర్గము నెట్లు పొందెనో యట్లే నేనును బదునాలుగేండ్లనియమము ముగియఁగానే మరల సుఖముగ నిచటికి వచ్చునట్లుగా * మాకు మంగళాశీర్వచనములను గావింపుము. నేను ధర్మమును విడనాడి పట్టిరాజ్యముకొఱకు మహాఫలమైనకీర్తిని దిగవిడువ శక్తుఁడనుగాను. బ్రతుకునది స్వల్పకాలము. ఇందులకై యధర్మము నూని తుచ్ఛమైనభూమి నిపుడు సంపాదింప నేను గోరనే గోరను' అనెను. ఆపురుషలలాముఁ డట్లు తల్లిని కలఁక దేర్చి కైకేయి తన్ను త్వరితముగా నడవికిఁ బొమ్మని ప్రేరేపించుటవలన దండకారణ్యమునకుఁ బోవ నిశ్చయముగొని తమ్మునకు † తనమతమును చక్కఁగాఁ దెలిపి తల్లికి ప్రదక్షి

* ఇందులకు 'కురుష్వ నః స్వస్త్యయనాని' అనిమూలము 'నః'అనఁగా మాకు అని యర్థము. 'అస్మదోర్ద్వయోశ్చ' అని ద్వివచనమునకు బహువచనాదేశము గలదు గనుక 'మాకు'అనఁగా మాయిద్దఱికిని-నాకును లక్ష్మణునకును-అని ద్వివచనమే గ్రాహ్యము. ఎట్లన ఇంకను సీత తనతోఁగూడ నడవికి వచ్చెడియభిప్రాయము రామునకుఁ దెలియదు.'దీప్తమగ్నిమరణ్యంవా యదిరామః ప్రవేక్ష్యతి। ప్రవిష్టం తత్ర మాం దేవి త్వం పూర్వముపధారయ''జ్వలించుచున్న యగ్నినిగాని అడవినిగానిరాముఁడుచొచ్చునేని, నన్ను అందు ముందే ప్రవేశించినవానినిగా నిశ్చయింపుము' అని లక్ష్మణుఁడు చెప్పియుండుటచే అతఁడు తనతోడవచ్చుట రామునకు తెలిసియేయున్నది. కనుక (నః) అనఁగా తనకును లక్ష్మణునకే రాముఁడు చెప్పెనని ద్వివచనమే చెల్లెడిని.

† ఇందులకు (స్వదర్శనమ్) అని మూలము. తన మతమును-అనఁగా ధర్మరహస్యమును బోధించినాఁడని యర్థము. 'లోకమునందు ధర్మము అర్థము కామము అని మూఁడుపురుషార్థములు ప్రసిద్ధములు; వానిలో ధర్మము అన్నిటికిని మూలముగా నుండుటచేతను తక్కినరెండును అపాయముతోఁ గూడినవిగా నుండుటచేతను కేవలధర్మమే యాశ్రయింపఁ దగినది' అనుటే రాముని మతము.

ణము సేయ మనస్సున సంకల్పించుకొన్నవాఁ డయ్యెను. ఇది యిరువదియొకఁడవ సర్గము.

---

## రాముఁడు లక్ష్మణునికిఁ గైకేయి యెడలఁ గలరోషము నడఁచుట.

అంత దుఃఖంబున విన్ననై, మిక్కిలియంతరంగిలకంఠును మీఁదుమిక్కిలి యోర్వలేక కొఱకొఱలాడుచు, పెనుసర్పమువలె నిట్టూర్పులు పుచ్చుచు,కోపంబున కన్నులు చురచురమని యెఱ్ఱనగా, నున్నతనగారాబుతమ్ముని లక్ష్మణునిదిక్కు మొగమై రాముఁడు, మనస్సును గెలిచినదిట్ట గాన, అన్నిటను గలతనబలిమివలన,తనమనోవికారమును బయలుపుచ్చక లోపలనే యడఁచి "నీవు తండ్రి మొదలైనవారియెడ కోపమును, నాకిట్లు సంభవించెనని శోకమును, విడిచి ధైర్యము నవలంబించి యారంభించినయభిషేకము నిలిచెనే యనెడియీయవమానమును పాటింపక త్రోసి పుచ్చుము.మిక్కిలియు సంతోషము పూని యిప్పుడు నాయభిషేకమునకై సమకట్టిన యలంకారాదుల నన్నిటిని శీఘ్రముగా విడువుము. అపాయము లేనికార్యమునకు పూనుము. కనుక వనవాసమునకుఁ దగిన సన్నాహము సేయం దగును. లక్ష్మణా! నాయభిషేకమునకుఁ గాను సంభారములను గూర్చుటయందు నీకుఁ గలిగి యున్న యుత్సాహమును, అభిషేకమును నిలిపి యడవికిఁ బోవఁ దగిన నారచీరలు మొదలగువానిని సమకూర్చుటయందు నిలుపుము. నాకు అభిషేకము జరుగునో యని మనస్సున పరితపించుచుండునాతల్లి కైకేయికి 'రాముఁడు లక్ష్మణునితో నాలోచించుచున్నాఁడే. లక్ష్మణునితోఁ జేరి యతఁడు మరల రాజ్యమును పట్టుకొనునో' యని సందేహము కలుగకుండునట్లు సేయుము. నాకు అభిషేకము నిలిచిపోయెనని మనస్సునఁ బొగులుచున్న నాతల్లి కౌసల్యకు 'తండ్రియాజ్ఞ త్రోయరాదు. కావున రాముఁ డడవికిఁబోయి పదునాలుగేండ్లే యుండును గాన పిమ్మట నిచ్చటికి వచ్చును గదా. ఆపదునాలుగేండ్లును అల్పకాలములో తీఱిపోవును. కాన, యిందులకు విషాదపడఁదగదు' అని నేను మరల వచ్చువిషయమున శంక లేకుండునట్లు చెప్పుము. తల్లి కైకేయికిఁగాని కౌసల్యకుఁగాని మనస్సునందు శంకించునంతదుఃఖము కలిగినను దానిని నేను గడియసేపును నుపేక్షించి యుండఁజాలను. నే నింతవఱకు నెప్పుడైనను తల్లులకుఁగాని తండ్రికిఁగాని యొక్కింతయపకారమైనను, తెలిసికాని తెలియకకాని చేసియున్నట్లు నాకుఁ దోఁపదు. నాతండ్రియు ఎప్పుడును కల్లలాడఁడు; ఆడితప్పఁడు.అతనిపరాక్రమమో అమోఘము. కనుక నతనికి ఈభూలోకమున నెందును భయము లేదు.అయినను చేసినప్రతిజ్ఞ తప్పినయెడల పరలోకమును తప్పనేయని,పరలోకమున కష్టపడవలసియుండునే యని,పరలోకమువలన భయపడియున్నాఁడు.అతనికాభయము లేకుండుఁగాక. ఈజరుగుచున్న నాపట్టాభిషేకప్రయత్నమును నిలుపనియెడల అతనికి, తాను కైకేయికి వరమిచ్చినమాట సత్యము కాలేదని మనస్తాపము

కలుగును. అతనికి సంతాపము కలిగెనేని నేనును సైఁపఁజాలక తపింతును. కాఁబట్టి లక్ష్మణా ! అభిషేకమున కైనయీయాయలంకారవిధానమును విడిచి యిపుడే యిచట నుండియే యడవికిఁబోవఁగోరుచున్నాను. నేనిపుడు అడవికిఁ బోఁగా రాజకుమారి యగు కైకయు కృతార్థురాలై యేకలంక లేక కొడుకు భరతునకు నిరాటంకముగా నభిషేకము సేసికొనఁ గలదు. నేను నారచీరలు గట్టి కృష్ణాజినంబును జడలనుదాల్చి యడవికిఁ బోయినపిదప కైకేయికి మనస్సున సొంపుకలుగును. నేను పోకుండుటవలని కునుకది కలుగదు. అడవికిఁ బోవలయుననెడియీబుద్ధియు నాకు అలవడినది. అందులకై మనస్సును మిక్కిలి గట్టిపఱుచుకొంటిని. ఇట్లు ఆయితమైననన్ను అడవికి పోకనేనై ఆయాసపెట్టుకొనరాదు. మఱియెవ్వఁడు సత్యమును పాలించుటకై,నన్నడవికిఁ బంపవలయు ననుతలంపుఁగొని,యందులకై మనస్సును ఎట్లోస్థిరముగాఁ జేసికొనియున్నాఁడో,అట్టినాతండ్రిని దుఃఖపడునట్లు చేయరాదు. ఇంతేకాక నాకు అభిషేకము మాన్పవలయు ననుబుద్ధి యెవరు కల్పించి అందులకై మనస్సున నిశ్చయము చేసికొనియున్నారో, యట్టి (మంథరాది) జనమునకును దుఃఖము కలిగింపరాదు. కావున త్వరితముగా నడవికిఁ బోయెదను. జాగు సేయరాదు.లక్ష్మణా ! నన్ను అడవికి పంపుటకును నాకియ్యఁబడినరాజ్యమును మరల త్రిప్పించుటకును, కైకేయి కారణము కాదు.ఇందులకుదైవమే కారణమని తెలియవలయును. తల్లి కైకేయికిఁ గలిగినయీయభిప్రాయము దైవముచేతఁ గలిగినది. కాదేని నాయందు మిక్కిలివాత్సల్యము గలిగియుండునట్టి యామెకు నన్ను పీడింపవలయునని బుద్ధియెట్లు కలుగును? నీవు మెత్తనివాఁడవు. నేను చెప్పినది మెత్తగా నాలోచించిచూడుము. ఇంతవఱకెప్పుడుగాని నేను తల్లులయందు,కన్నతల్లి సవతితల్లి, యని భేదము పాటించినది లేదని నీవే యెఱుంగుదువు. ఆకైకేయియు నాయందును తనకొడుకునందును నింతవఱకు క్రోధము లేకుండుటయు నీకుం దెలిసియున్నది. ఇట్లుండఁగా దైవప్రేరణము లేకుండునేని,అట్టికైకేయికి అట్టినాయందు ఇట్టిబుద్ధి యేల కలుగును? మొదటనుండియు ఆమెవాత్సల్యము ననుభవించి యున్నవాఁడనైన నన్ను,ఆమె యిపుడభిషేకమును మాని అడవికిఁ బొమ్మని చెప్పరానిభయంకరవాక్యము లాడుటను జూడఁగా, ఇందులకు దైవముతప్ప మఱేదియు కారణము నిరూపింప నేరకున్నాఁడను.ఆమెవాత్సల్యము దూలుటకు కారణములేదు. కనుక దైవమే యింతకును గారణము. * మఱియు నామె మృదుస్వభావము గలది. అందును రాజకుమారి. అట్టియామె దయాదిగుణములు

* ఇందులకు 'కథం ప్రకృతిసంపన్నా రాజపుత్రీ తథాగుణా। బ్రూయాత్సా ప్రాకృతేవ స్త్రీ మత్పీడాం భర్తృసన్నిధౌ' అని మూలము. విశేషార్థము—(ప్రకృతిసంపన్నా) సాధుస్వభావముగలది. (రాజపుత్రీ) రాజకుఁతురు-మహాకులమునఁ బుట్టినదనుట, (తథాగుణా) అట్టిగుణము గలది. ఆమె దయాదిగుణములను పూర్వము మనము అనుభవించియున్నామనుట. ఈమూఁడువిశేషణములచేమంచి స్వభావమును గొప్పకులమును మేటిగుణమును చెప్పఁబడినవి. (సా) ఇట్టిలక్షణములు గలయాకైకేయి

మనకు తెలియనివిగావు. అట్టియాబిడ యొకయల్పస్త్రీవలె తనపతియెదుట నన్నుఁ బీడించునట్టిమాటలు పలుకునా? పలుకదు. అట్లుపలుకుటకు దైవమే మూలము. దైవంబుమహిమ యిట్టి దని చింతింప నలవికాదు. సమస్తభూతములలో దేనియందుఁ గాని యది చేయుపనికి తిరుగఁబాటు కలుగనేరదు, ఇది మిక్కిలి తెల్లము. నాకు చేతికివచ్చినరాజ్యము తప్పినది. ఆమెకు చిరకాల ముండినప్రేమ తప్పినది. నాస్థితియు ఆమె మతియు ఉట్టిపడ్డట్లు తలక్రిందైనదిగదా! కనుక దైవమున కెందును మాఱు లేదు. లక్ష్మణా! 'దైవమనునది యున్నదనుట ఎట్లు? ఉండినయెడల పురుషప్రయత్నముచే దానిని నివారింపఁగూడదా' యని యడుగుదువేని చెప్పెదను. అది మనము చేయు కార్యములఫలమునుబట్టి యున్నదని తెలిసికొనవచ్చును. మనము మిక్కిలి పాటుపడి యక్కఱతోఁ జేయుపనులు గొన్నింటికి ఫలము గలుగదు. మనమక్కఱలేక చేసినకార్యములకుఁ గొన్నిటికిని మిక్కిలిఫలము గలుగుచున్నది. ఇట్టిఫలములకు దైవముతప్ప వేఱుకారణము చూపట్టదు గాన దైవమున్నదని యనుమానము చేసిద్ధించుచున్నది. కార్యము ఫలించుటచేతనేకాని మఱి దైవమును దెలియుటకు వేఱుసాధనము లేదు. కనుక దైవమును ఎప్పుడును కార్యఫలముచేతనే అనుమానించి తెలిసికొనవలసియున్నది. అది, ఫలమునకు మునుపే తెలియునదిగానుండునేని యప్పు డది ప్రతికూలముగా తోఁచినచో ప్రతికారమేదైన ముందుగా చేసికోవచ్చునుగాని ఫలమునకు మును పెంతమాత్రమును తెలియరాక పిదపనే తెలియు నాదైవముతో ముందుగా మాఱాడి వారించుట కెవ్వఁడు పూనును. ఇట్లు దైవము ఫలముచేతి అనుమానించియే తెలిసికొనఁగూడియుండుటవలన మిక్కిలిబలీయమైన దగునుగాన దానిని పురుషప్రయత్నముచే వారించుట కష్టము. సుఖము దుఃఖము శాంతి కోపము లాభము నష్టము జననము మరణము ఇవి మొదలుగా, కారణము తెలియరానికార్యము లన్నియును దైవకార్యములే. ఉగ్రముగా తపస్సునలుపుచు దేవతలనుగూడ సరకుసేయనివిశ్వామిత్రాదిఋషులును దైవంబునం బీడితులై తాము పూనినవ్రతోపవాసాదితీవ్రనియమములను వదలి, కామక్రోధములకు లోనై ఋషిత్వము దూలినవారగుచున్నారు. ఈలోకమున ఆరంభించినకార్యమును నిలిపి యంతకుమునుపు మనస్సునఁ దలంపనుగూ

(ప్రాకృతా స్త్రీ ఇవ) కేవలురాలైనయాఁడుదివలె-అనఁగా తనకు విరుద్ధముగా దుస్స్వభావమును దుష్కులమును దుర్గుణములను గలనీచస్త్రీవలెననుట, (భర్తృసన్నిధౌ)మగనియెదుట-మఱియెవఁడో యొకనియెదుటఁగాదు, దూతలు మొదలైనవారిమూలమునఁగాదు, తినకులాదులకు తగినట్లు తాను మిక్కిలిలోనై నడచుకొనవలసినపతికన్నులయెదుటనే యనుట. (మత్ + పీడాం) తనమీఁతిలేనిస్నేహమునకు పాత్రుఁడైన నన్ను పీడించుట-పట్టి అప్రియమును కాదు; మిక్కిలి పీడించునట్టిమాట ననుట, (కథం)ఎట్లు, (బ్రూయాత్) చెప్పును - సూచించుటకాదు - స్పష్టముగా చెప్పవాయనుట. ఇన్ని సందర్భములనుబట్టి కైకేయి తానై యిట్లు చెప్పట యసంగతముగా నున్నది గావున దైవమే యిందులకు కారణమని భావము.

డఁ దలంపని కార్యమే మఱొకటి తటాలున సంభవించుచున్నదే. అది దైవకార్యమే. నేనిపు డుపదేశించిన యీబుద్ధి యథార్థమైనది. అట్టిబుద్ధిచేత నామనస్సును నేనే యడఁచియున్నాను. కనుక నాకు పట్టాభిషేకము చెఱుపు నొందినను పరితాపము కలుగకున్నది. దైవశక్తియిట్టిది కావున నే నుపదేశించినబుద్ధియోగపుబలమున నీవు పరితాపమును విడిచి నామతము ననుసరించి యభిషేకార్థమై చేయఁబడు నలంకారాదికర్మములను నిలుపుము. లక్ష్మణా! ఇప్పు డభిషేకమునకై సమకట్టియున్న యీమంగళకుంభములందలిజలం బంతయు నాయభిషేకమునకుఁ గాకున్నను నేను తాపసులకుం దగినవ్రతమును సంకల్పించుకొన్నప్పుడు చేయవలసినస్నానమునకు నుపయోగపడును గాక. ఒకవేళ నీజలముతో స్నానము చేసితినేని రాజ్యముకొఱకు చేసితినని, కైకసందేహపడును గాఁబోలు. ఇది రాజద్రవ్యము; మఱి రాజ్యమున కుపయుక్తమైనమంగళద్రవ్యములు మిక్కిలి గలిగియున్నది. ఇట్టిజలము నాకేల? నేనే చేఁదుకొన్నజలములో స్నానము చేసి వ్రతనియమము చెల్లించుకొనియెదను. లక్ష్మణా! సంపద తలక్రిందైనదని నీవు సంతాపపడకుము రాజ్యమును సరిగా పాలించుటచే మిక్కిలి ధర్మము కలుగును. వనవాసమున తపస్సు సిద్ధించును. కావున రెండును సమానములే. అయినను, విచారించిచూడఁగా రాజ్యమున ప్రజలకు వలయు కార్యాకార్యములచింతయు కష్టమును మెండు. వనవాసమునం దాకష్టము లేదు; మఱి పితృవాక్యపరిపాలనధర్మము సిద్ధించును. కనుక వనవాసమునందే మిక్కిలి ఫలము కలదు. అది మహాభ్యుదయమునకు సాధనముగా నున్నది. లక్ష్మణా! ఇపుడు పూనినకార్యమును చెఱుపుటకు పిన్నతల్లి కారణమని శంకింపరాదుగదా. ఆమె, దైవము పురికొలుపుటచే అప్రియము పలుకుచున్నదే కాని వేఱు కాదు. ఆమెను పురికొలిపిన దైవమో అట్టిప్రభావము గలదని నేను తెలిపితినిగాన నీకు దెలిసియున్నది. కనుక దైవము కారణమైనదానికి ఆమెను దూఱుట తగ' దనియె. ఇది యిరువది రెండవసర్గము.

---

### లక్ష్మణుఁడు దైవముకంటెఁ బౌరుషమే బలీయ మనివాదించుట.

* రాముఁ డిట్లు పలుమాఱు చెప్పుచుండఁగా లక్ష్మణుఁడు, తన కది సమ్మతము కానందున తలవాంచి విని రాముఁడు ధర్మమునందు మిక్కిలి నిలుకడ గలవాఁడని సంతోష

---

* ముందు 'దైవము ప్రబలమైనది గావున రాజ్యము తప్పిపోయినదని సంతాపపడరాదు. ధర్మము సర్వశ్రేయములను సాధనము పితృవచనపరిపాలనమును ధర్మమూలమే గావునను దాని నవశ్యము చేయవలయును. తల్లివచనము తండ్రి యాజ్ఞ కవిరుద్ధ గావున అనంతరమే చేయవలయును' అని యింతమాత్రము యుక్తిపూర్వకముగా రాముఁడు సిద్ధాంతము చేసెను. ఇందులకు, 'పౌరుషబలమే బలీయము. దైవబలము దుర్బలులకే అనుసరింపఁదగినది. అర్థకామములకు విరుద్ధమైనధర్మమును ఆచరింపరాదు' అని సంగ్రహముగా ముందు లక్ష్మణుఁడు చెప్పినవాక్యమే పూర్వపక్షము. సంగ్రహమైన యీపూర్వపక్షమును లక్ష్మణుని ముఖమున నేయీసర్గమందు విస్తారముగా ప్రతిపాదించి దానికి రాముఁడు సంగ్రహముగా సిద్ధాంతమును దెలుపుచున్నాఁడని తెలియునది.

షమును, రాజ్యము విడుచుచున్నాఁడని దుఃఖమును, మనస్సునఁ బొంది యీ రెంటినడుమ నూఁగుచుండెను; కాని యట్లే స్థిరముగా నుండలేదు. ఆ పురుషసింహుఁ డపుడు సంతోషము విడిచి దుఃఖంబున రోషంబు మీఱ బొమలు ముడివెట్టి, పెట్టెలోఁ జిక్కిన మహాసర్పము రోషంబున బుసలుకొట్టునట్లు నిట్టూర్పులు పుచ్చెను. బొమముడిచే బెడిదమై చూపఱకు ఎదురుకొని దేఱిచూడరాకున్న యాలక్ష్మణుని మొగంబు, కుపితంబైన సింగంబు మొగంబుతో సాటియై ప్రకాశించుచుండెను. ఏనుఁగు తన తొండమును విదుల్చునట్లు అతఁడు తన ముంజేతిని కోపమున విదుల్చుచు, మెడను అడ్డముగాను క్రిందుగాను మీఁదుగాను దేహము తాఁకం ద్రిప్పివైచి కడకంటిచూడ్కు లడ్డముగా నిగుడ్చుచు, అన్నను జూచి "నీవు అన్నియు తెలిసినవాఁడవు, అట్టి నీవు పితృవచనపరిపాలనధర్మమునకు చేటు వాటిల్లుననియు, లోకులు నీవు ధర్మ మాచరింపనియెడల తాము దానిని ఆచరింపక విడుతురను శంక లేకుండవలయుననియుఁ, దలంచి యడవికిఁ బోవుటకై మీఁదుమిక్కిలి యిట్లు తొందరపడుట యుక్తము గాదు. ఎట్లన నీవు దైవమును కూడ నిరాకరింపఁ జాలునట్టి శూరుఁడవు. మఱియు క్షత్రియులలోన శ్రేష్ఠుఁడవు. ఇట్టి నీవు దుర్బలమైన దైవమును మహాప్రబలమైనదిగాఁ జెప్పుట చూడఁగా నీకు మిక్కిలి భ్రాంతి గలిగినట్లున్నది. అట్లు మిక్కిలి భ్రాంతి కలుగదేని నీయట్టివాఁ డిట్టిమాట యెట్లు చెప్పును? చెప్పఁడు. దైవము దుర్బలులకే పరిగ్రహింపఁ దగినది. అది మఱియొకరి నాశ్రయించియే తనయపేక్ష తీర్చుకొనునది. కావుననే యది మిక్కిలి దీనమైనది. తానై యేదియు చేయుటకుఁ గాని పౌరుషమును నిరాకరించి పని చేయుటకుఁ గాని *శక్తి లేనిది. అట్టి దైవమును ఏమని పొగడెదవు? పాపాత్ములయిన యా కైకేయీదశరథులును నీకు పాపులని యేల శంక కలుగలేదు? వారు పాపులుగావున అట్టివారి పనుపు సేయకుండుటచే నీకు ధర్మహాని యేమియుఁ గలుగదు. 'వారు ధర్మాత్ములే; పాపాత్ములని యెట్లు శంకింతు' నందువా? లోకమున ధర్మమును పైకి నెపముగాఁ జూపి దానిచేత తమ దుష్కార్యములను సాధించుకొనువారును, ధర్మ మాచరించునట్లు వేషము వేసికొని దానిచే తమ తప్పులు గప్పిపుచ్చుకొనువారును, గలరు. అట్లే కైకేయీదశరథులు నీకు పట్టాభిషేకము సేయువారివలె పైకి ధర్మము నభినయించుచున్నారు గాని నిజమునకు రహస్యముగా నీకు అప్రియము చేయువారగుటవలన మన యీ యభిషేకప్రయోజనమును నిలుపవలయుననికోరి, చక్కఁగా, ఈదురాలోచనము చేసినారు. ఇది తెలియదా యేమి? రాఘవా! వారు నీ యభిషేకమునకు పూర్వమే యిట్లు

* 'అది కార్యము చేయుటకే శక్తి లేనిదైనప్పుడు కార్యము దానిచే ఫలించుటయే కలుగదు. కనుక కార్యఫలముచే అది యున్నదని అనుమానించుటయు తగదు. ఇట్లు అది యున్నదనుటయే కలుగనప్పుడు లేనిదానిని ఆశ్రయించుట నీకు భ్రమయే యగును' అని లక్ష్మణుఁడు దైవము నుల్లంఘింప శక్యము కాదన్న రామునిమతమును పరిహరించినాఁడు. ఇఁక పాపాత్ములగు కైకేయీదశరథులమాట వినరాదని చెప్పి 'పితృవచనపరిపాలనధర్మము నాచరింపనిచో చేటు కలుగు' నను విషయమును పరిహరించినాఁడని తెలియునది.

*దుర్మంత్రము చేయుటకు ప్రయత్నము చేసి యున్నవారు. కాదేని, వరమిచ్చినట్లు బహుకాలమునకు పూర్వమే మాట గలిగినది గాన రాజు దాని నింతకుమును వెప్పుడో యిచ్చివేసియుండును గాని యిప్పు డియ్యవలసివచ్చుటకలుగదు. వీరోత్తమా! పెద్దవాఁడవైన నిన్ను విడిచి మఱియొకనికి, పిన్నవానికి, అభిషేకము సేయుట లోకులందఱును ద్వేషింపఁదగిన కార్యము దీనిని వారిద్దఱు చేయఁబూనినవారు. ఇదిమాత్రము నేను సహింపనేరను. ఆవిషయమందు మాత్రము నీవు నన్ను మన్నింపవలయును. 'పితృవచనపరిపాలనము అవశ్యధర్మ'మందువా? నీవు మహాబుద్ధిగలవాఁడవు. అయినను, ఏధర్మమునుబట్టి, నీకుమునుపు రాజ్యముగట్టుకొనవలయు ననియుండినబుద్ధి యిప్పు డడవికిఁ బోవలయునని వేఱుగా భేదించినదో, ఏధర్మము ప్రసక్తింపఁగా దానిని జేయకున్న పాపము గల్గునేయని మోహము చెందియున్నావో, పితృవచనపరిపాలన మనెడియాధర్మము నాకు ద్వేష్యముగానున్నది కాని యిష్టముకాదు. 'మోహమేమి' యందువా? పౌరుషకర్మముచే ప్రతీకారము చేయుటకుశక్తుఁడవు. తండ్రి, కైకవలలోఁ జిక్కి మిక్కిలి యధర్మమును అతినిందితమునైనయాజ్ఞ సేయఁగా, ఇట్టినీవు దానినతిరస్కరింపఁజాలియు, చేయఁజూచెద వెట్లు? ఇది మోహము లేక చేయఁబూనవు. కపటముగా వరములని కల్పించి, వారీయభిషేకకార్యవిఘాతమును జేసియున్నారు. వారిట్లు చేసియుండియు నీకట్లు చేసినారని తోఁచకున్నదే! ఇందులకే నాకు దుఃఖము కలుగుచున్నది. ఇట్టికాముకుఁడైన తండ్రిమాటచొప్పున నడచుకొనవలయు ననెడిధర్మముగూడ మిక్కిలి లోకనిందితమైనదేకాని యనుష్ఠింపఁదగినది కాదు. కామపరవశులై నీకెప్పుడును కీడుగోరుచు, తలిదండ్రులను పేరు పెట్టుకొనియున్నట్టి యానీపగవారు, కోరరానిదియొకటికోరఁగా, దానిని ఆవేర్పవలయునని మనస్సులోఁగూడ నీవెట్లు తలంపవచ్చును? 'ఆయిద్దఱికిని, అభిషేకము చెఱుపవలయునన్న బుద్ధిపుట్టుట, దైవకృతమే కాని వారలస్వభావముచేఁ గలిగినది కాదు' అని నీవు తలఁచుచున్నావు. అయినను నీ వట్టియభిప్రాయమును గొనరాదు. నాకెంతమాత్రము దైవము ప్రమాణమనుట సరిపడదు. పరాక్రమశాలులై దృఢచిత్తులగు ధీరులును దానిని ఆశ్రయింపరు; తమంతటనే తమకార్యమును సాధించు

* దశరథుఁడు కైకకువరమిచ్చి బహుకాలమైనది. కనుక దాని నింతకుమునుపు ఎప్పుడో కైకయడిగి యొనఁగూర్చుకొనియుండును. లేక దశరథుఁడు ధర్మజ్ఞుఁడు గనుక కైకయడుగకున్నను తానే తీర్చియైనయుండును. ఇట్టిసమయమున దాని నడుగుటయు నిచ్చుటయు నుండవు. అయినను పట్టాభిషేకము వెల్లడిసేయుటయును, అనంతరము వరముప్రస్తావించుటయును, బట్టి చూడఁగా 'భరతునకు రాజ్యముగట్టవలయును. రాముఁడు జ్యేష్ఠుఁడు గావున వానిని విడిచి భరతునకిచ్చుట పొసఁగదు. కనుక రామునికభిషేకము సేయునట్లు ప్రయత్నము సేసెదను. అప్పుడు నీవు రెండువరములడుగుము. ఒకటికి, రాముని అడవికిఁ బంపుము. మఱొకటికి భరతుని పట్టముగట్టుదను', అని దశరథుఁడు యీయభిషేకమునకు మునుపే కైకేయితో దురాలోచనము చేసి యిందులకై ప్రయత్నములు సేసియుండవలయునని లక్ష్మణుని భావము.

కొందురు. తనపురుషప్రయత్నమున దైవమును అడఁగద్రొక్కుటకు నెవ్వఁడు సమర్థుఁడో యాపురుషుఁడు దైవమును నమ్మి తనప్రయోజనమును పాడు చేసికొని కంది కుందఁడు. జను లిప్పుడే దైవసామర్థ్యమును పురుషునిసామర్థ్యమును ప్రత్యక్షముగాఁ జూడఁగలరు. దైవముప్రబలమో మఱిపురుషకారము ప్రబలమో యని యారెంటికిఁ గలతారతమ్యము నిప్పుడే స్పష్టము గావించెదను. ఏదైవముప్పుడు నీపట్టాభిషేకమును జెఱిపినదిగానీవు తలఁచితివో, యాదైవమే యిప్పుడు నాపౌరుషము చేత ప్రతిహతము కాఁగా జనులందఱునుచూడఁగలరు. అంకుశమును సరకుసేయక సంకెలలుత్రెంచుకొని మదపుబలిమిచే మిక్కిలి విజృంభించి మాఱులేక పరుగిడు చున్న యేనుఁగును, నేర్పరి యైనమావటీఁడు మరల్చునట్లు, దుర్నివారమని నీవే చెప్పుచున్న దైవమును నాపౌరుషముచే మరల్చెదను. దిక్పాలురందఱు నొక్కటియైవచ్చినను, ముల్లోకములన్నియు నొక్కటిగాఁగూడి తాఁకినను, ఇప్పుడు,నేను జరుపుటకుఁ బూనియుండు రామునియభిషేకమును నిలుపఁజాలవు. ఇఁక ముసలివాఁ డగుమనతండ్రియొక్కఁడు ఏమియు చేయలేఁడని చెప్పనేల? కాన నీవు మహారాజవేయైతివి. ఎవరు రహస్యముగా ఒకరితోనొకరుగూడి యాలోచించి నీకు అరణ్యవాసము సనుకట్టిరో,యాసాపాత్ములు నీకుఁ జెప్పిన పదునాలుగేండ్లును తామే యడవిలోనుండునట్లు గావించెదను. అట్లుకావించి, యందువలన,ఎవ్వతినీపట్టాభిషేకమును జెఱిపి తనకొడుకునకు రాజ్యము రావలయునని కోరుచున్నదో దానికిని తండ్రికిని గలిగియున్న పేరాసను త్రుంచెదను 'తండ్రి దైవబలముగలవాఁడేని నీపౌరుషమేమిచేయు'నందువా?నాపౌరుషమునకుముందు దైవము నిలువను. కాన తండ్రికిఁగాని మఱియెవ్వనికిఁగాని నాతో విరోధముగొన్నవానికి నా పౌరుషముచే దుఃఖముకలిగినట్లు,దైవముచే సుఖముకలుగదు. నాపౌరుషమునకుఁ జిక్కినవానిని దైవమువిడిచిపుచ్చజాలదు. మీఁద నీవు ప్రజాపాలనము సేసి రాజ్యసుఖముల ననుభవించి వేయిసంవత్సరములు జరిగినకడపట, నీవు వానప్రస్థాశ్రమముపూని వనమునకుఁ బోవఁగా నీకుమారులు రాజ్యపరిపాలనము సేయుదురు కాని భరతునకెన్నఁటికిని రాజ్యమే కలుగనేరదు. శక్తియున్నంతవఱకును ప్రజలను బాలించి,యంత నాప్రజలను బిడ్డలవలెఁ గాపాడునట్లు చెప్పి కొడుకుల కప్పగించి, యిట్లు పూర్వకాలపు రాజర్షు లాచరించినవిధమున వనవాసము సేయఁ బోవలయునని కదా శాస్త్రము విధించుచున్నది. ధర్మాత్మా! ఇప్పుడు రాజుమనస్సు చంచలముగా నున్నదనియు కాఁబట్టి నీవు సాహసించి రాజ్యమును స్వాధీనము చేసికొన్నయెడల అందనేకవిధభేదములు కలిగి నవరించుట కసాధ్య మగుననియు శంకించి నీవు రాజ్యమును అంగీకరింపవేనియు దానిం జెప్పుము. నీవును వీరుండవు. నేనును నీకుఁ దోడై నిలిచి చెలియలికట్ట సముద్రమును నెట్లు పొంగి పొర్లకుండఁ గాచుచుండునో అట్లు నీరాజ్యమును కలంత యేమియు లేకుండునట్లు గాచెదను. ఇట్లు చేయనేని నేను వీరలోకంబునకుఁ దప్పిపోవుదు నని ప్రతిజ్ఞ చేసెదను. నీవు వసిష్ఠాదులం గొని మంగళ ద్రవ్యయుక్తము

లగుజలముల పట్టాభిషేకము చేసికొనుము. ఇఁక అభిషేకకార్యమునకుఁ బూనుము. ఎవరైనరాజులు నీపైకి నెత్తివచ్చిరేని వారలనందఱిని వారించుటకు నేనొకఁడుచాలును. ఈనాచేతులురెండును నామేనికి అలంకారము కొఱకుఁ గాదు. నావింటిని చేతులకు సొమ్ముగాఁ దాల్పలేదు. కత్తిని ఊరక వీరభూషణముగా నడుమునఁ గట్టుకొనుటకై యున్నది కాదు. నాబాణము లూరక చూపునకు ఎదుటివానిని స్తంభింపఁ జేయుటకున్నవి గావు. ఈయాయుధములు నాలుగును మఱి తక్కినవియు పగవారి నడఁగఁ ద్రొక్కుటకై యున్నవికానిమఱిదేనికిఁగాదు. నాకెవ్వఁడుపగవాఁడనియెన్నఁబడునో, వాని నునుఱుతో నిలుపనే నోర్వను. ఆపగవానిని, వాఁడు దేవేంద్రుఁడైనను గాని, వాఁడి మొన గలిగి మెఱుపులంబోనిమిడుఁగుఱులు చెదఱ మెఱయుచున్న కత్తిం బూని గూల్పక విడువను. నాకత్తివాట్లచే గజములయు గుఱ్ఱములయు మనుష్యులయు కాలుసేతులును తలలును తొడలును తుత్తుమురై భూమిపయి నెఱసియుండఁగా నది దట్టంపుటడవివలె నెడములేక క్రిక్కిఱిసి సంచరింప రాకుండును. ఇదిగో యిప్పుడే నాకత్తిమొనవాటున కొట్టువడి దానినుండి చెదరుమిడుఁగుఱులతోఁ గూడినవై పగవారియేనుఁగులు, మండుచున్న కొండలవలెను, మెఱుపులతోఁగూడిన మబ్బులవలెను, జూపట్టుచు నేలం గూలఁగలవు. నేను ఉడుపతొలుకవచమును అల్లెత్రాటి దెబ్బ తాఁకకుండుటకై వ్రేళ్లకుం దొడుగుకొని, విల్లుదాల్చి, మార్కొనినిలువఁగా తన్నుఁ బురుషుఁడని తలఁచి, నాయెదుర నిలుచువాఁడెవఁడు ? అందఱును ఆఁడువారివలెఁ బరుగిడుదురేకాని. 'ఒక్కండవు పెక్కండ్రతో నెట్లు పోరుదు?' వందువా? నేను నొక్కబలవంతుని పెక్కుబాణములను, ఒక్కబాణంబున పెక్కుజనులను వైచి యెగఁ జిమ్ముచు నిట్లు నరతురగగజమ్ముల నెఱకుల నాటునట్లు బాణములు వైతును. ప్రభూ! నా నేర్చిన విలువిద్యమహత్వమునఁ గలవాఁడిమి యిదె రాజును ప్రభువుగాఁ జేయుటకుం జాలునని నీవు తెలియుదువు సుమీ! రామా! చందనపుఁ బూఁతలకును, బాహుపురులు దాల్చుటకును, ధనములు దానము సేయుటకును, చెలికాంద్రను బాలించుటకును ఈనాభుజములు యోగ్యమయినవి. అయిన నవి యిప్పుడు వానిని విడిచి నీయభిషేకమునకు చెఱుపుచేసినవారినెల్ల తూలఁగొట్టుపనికిఁ బూనంగలవు. నీ పగవాఁ డెవ్వఁడు చెప్పుము. వాని నిప్పుడె ప్రాణములకుఁ బాపెద. వాని కీర్తిని దూలించెద. వానిస్నేహితు లందఱిం దఱిమెద. భూమియంతయు నీ యధీనముగాఁ జేయునట్లు నాకు ఆజ్ఞమాత్ర మిమ్ము. నీ యాజ్ఞయే యెదురుచూచెద; నీ కింకరుండనేకాని వేఱుగాదు. కనుక యాజ్ఞసేయుము' అనెను. రఘుకులవర్ధనుండగురాముఁడు లక్ష్మణుఁడు చెప్పినదంతయు విని కన్నీరు దుడిచి, తనకును సమ్మతిలేమిచేఁ గలిగినకన్నీరు దుడుచుకొని, పలుమాఱు చల్లనిపలుకుల నోదార్చి యంతనతనిం జూచి*'లక్ష్మణా! నీ వెప్పుడును మెత్తనివాఁడవు, ఇట్లేల కోపంబు నొందితివి.

*లక్ష్మణుఁడు చేసిన పూర్వపక్షమునకు రాముఁడు మును పు చేసిన సిద్ధాంతమునే యిపుడు సంగ్ర

నేను తండ్రిమాటయందే స్థిరముగా నిలుతునుగాని దాని నెంతమాత్రము జవదాఁటువాఁడను గానని తెలియుము. ఇదియే చుమీ. పరమధర్మము' అనియె. ఇది యిరువదిమూఁడవ సర్గము.

---

## రాముని వనవాసనిశ్చయమును గౌసల్య యనుమోదించుట.

కౌసల్య, రాముఁడు తండ్రియాజ్ఞను పరిపాలించుటయందే కన్ను గలిగి యున్నాఁడని నిశ్చయించి, కన్నీళ్లచే డగ్గుత్తికపడ మిక్కిలి ధర్మయుక్తముగా నతనిం గూర్చి 'ఇంతవఱకు దుఃఖమెఱుఁగఁడు! ధర్మాత్ముఁడు; సమస్తప్రాణులకును నింపుగాఁ బలుకువాఁడు; సార్వభౌముండైనదశరథమహారాజునకు నాయందుఁ బుట్టినవాఁడు. ఇట్టిరాముఁడు దైవవశమున నేల రాలినధాన్యకణములను ఒక్కొక్కటిగా నేఱికొని యెట్లు జీవింపఁగలఁడు? ఎవ్వనిభటులును పరిచారకులును మృష్టాన్నంబుల దినుదురో యట్టిప్రభుండు రాముఁడు అడవిని వేళ్లను పండ్లను నెట్లు దినియుండఁగలఁడు! రాజు, మిక్కిలిగుణవంతుఁడును మనోహరుఁడునైనరాముని అడవికిఁ బంపుచున్నాఁ డనుమాటను విన్నను, ఇట్టికొడుకును పంపుట యసంభావితముగావున నెవఁడు నమ్మును? ఎవ్వఁడును నమ్మఁడు. అట్లు నమ్మెనేని రామునివంటివానికే యిట్టివి కలిగినపుడు మనకు నిట్లే యడవిపాలు గలుగునని రాజుదెస మిక్కిలి భయము నొందును. రామా! నీవు లోకులందఱికిని మనస్సునకు మిక్కిలి కూర్చువాఁడ వయ్యును దైవవశమున నడవికిఁబోవుచున్నావుగదా. దీనినిబట్టి లోకమున నెట్టివారికిని సర్వసుఖదుఃఖములను ఏర్పఱుచునట్టిది దైవమేయనియుఁ, గాన యదిమిక్కిలిబలీయమైన దనియు, సందేహము లేక తెలియుచున్నది. పుత్రా! ఇఁక నీ వెడఁబాయుటచే నాదేహమున శోకాగ్ని పుట్టును. నీవు నాకన్నుల కగపడకుండుటయే యానిప్పును ఎసకొల్పుగాలి. పనివి పనివి యేడ్చునాయీదుఃఖమే దానికిఁ గట్టెలు. నాయేడ్పుకన్నీరు దానియందు వేల్చెడియాహుతి. నిన్ను గాననిచింతచే మనస్సునందు ఉడుకుచున్న వేఁడియావిరి యందులకు పొగ. నిట్టూర్పులు దానిని వృద్ధిఁ బొందించుటకై నేను జేయుపురుషకారము. ఇట్లు సాటిలేక దరికొన్న యీ పెనుశోకాగ్ని నాదేహంబునందుఁ బుట్టి శిశిరర్తువునందు మంచుచేఁ దడిసియున్నపొదను దావాగ్ని క్రమముగా వాడంజేసి దహించునట్లు, జలమువలెఁ జల్లార్చునిన్ను విడిచి

---

హముగా నీవాక్యమునఁ జెప్పినాఁ డని తెలియునది. 'జీవతో వాక్యకరణాత్ ప్రత్యబ్దం భూరిభోజనాత్ గయాయాం పిణ్డదానాచ్చ త్రిభిః పుత్రస్య పుత్రతా' 'తండ్రి బ్రతికియున్నప్పుడు అతఁడు చెప్పినట్లు చేయుట, అతఁడు గతించిన వెనుక ప్రతిసంవత్సరమును గొప్పభోజనతర్పణము సేయుటయు, గయయందు పిండ మొసఁగుటయు అనెడి యీమూఁటిచే పుత్రునికి పుత్రత్వము సిద్ధించుచున్నది. కాని మఱొకటి సిద్ధింపదు' అనుస్మృతినిబట్టి పితృవాక్యమే అవశ్యము చేయవలయునని సిద్ధాంతము చేయుట తెలియునది.

యిచ్చట నొంటిగానున్న నన్ను కృశింపఁ జేసి దహింపఁగలదు. పుత్రా! ఆవు తనదూడను వెన్నాడిపోక యెట్లుండును? అట్లు నేనును నీవెచ్చటికిఁ బోయెద వౌ యచ్చటికి నీతోఁ గూడ వచ్చెదను' అనిచెప్పెను. పురుషలలాముం డగు రాముఁడు అట్లు తల్లి చెప్పిన వాక్యమును విని మిక్కిలి వగలఁ బొగులుచున్న యామెంజూచి 'రాజు మొదలే కైకేయిచేత వంచితుఁడై యున్నవాఁడు. నేనును అడవికి పోయెదను. నీవును నావెంట నత నిని విడిచివత్తువేని యతఁడించుకైనను జీవింపఁడనుట నిజము. స్త్రీకి తనభర్తను విడుచుట మిక్కిలి క్రూరము సుమీ. కాఁబట్టి నినుబోఁటిపూజ్యురాలు అట్టిక్రూరకార్యమును చేయరాదు; మనస్సులోఁగూడ తలంపనురాదు. నాతండ్రియగుమహారాజు ఎంతవఱకు జీవించియుండునో యంతవఱకు నీపతికిం బరిచర్య సేయుచుండుము. అదియె స్త్రీకి శాశ్వతమైన ధర్మము' అనిచెప్పెను. రాముఁ డట్లు చెప్పఁగా యాకౌసల్య కుశలమయిన బుద్ధి గలది గావున, దానికిని ధర్మయుక్తం బగుటచే మిక్కిలి సంతోషమునొంది దుఃఖముఁ బోఁగొట్టు నారామునింజూచి 'నీవు చెప్పినట్లే చేసెద' నని యె. ఆధార్మికశిరోమణియు తల్లి యట్లు చెప్పఁగా విని మఱల మిక్కిలి దుఃఖించుచున్నయామెను జూచి 'నేను మాత్రమే కాదు; నీవును నేనును ఇద్దఱును నాతండ్రి చెప్పినట్లు చేయవలయును. అతఁడు మన కెల్ల రాజు; మఱియుఁ బోషించువాఁడు, ఆచార్యుఁడు, శ్రేష్ఠుఁడు, నియామకుఁడు, ప్రభువు, కావున మనకందఱికిని నతనిపంపు త్రోసి పుచ్చరాకున్నది. ఈ * తొమ్మిదేండ్లుమాత్రము మహారణ్యమున సుఖముగా విహరించి పిమ్మట పరమసంతోషమున నీయాజ్ఞయందే నిలిచియుండుదు' ననియె. రాముఁ డట్లు చెప్పఁగా కౌసల్యవిని కొడుకునందు మిక్కిలి మక్కువగలది గావున కన్నీరు చిప్పిల్లి మొగమంతయు కాలువలుగట్ట పురపురఁబొక్కుచు తనగారాబుకొడుకుం జూచి'పగవారైన నాయీసవతులనడుమ నుండుట నాకుఁజెల్లదు. నీవు తండ్రి యిచ్చ చొప్పున నడవికిఁ బోవ నిశ్చయించితివేని † అడవిలేడినిబోలె నన్నును అడవికిం దోడ్కొనిపొమ్ము'అనియె.అట్లుచెప్పి యేడ్చుచున్న తల్లినిజూచి రాముఁడు నేడ్చుచు నామెతో'ఆఁడుదానికి బ్రతికియున్నంతకాలము పెనిమిటియే దైవము; పెనిమిటియే ప్రభువు. కాఁబట్టి రాజునాకుమాత్రమేకాక నాకును నీకును నియామకుఁడు.రాజు లోకమునకంతయు నాథుఁడై బుద్ధిమంతుఁడు నై యుండఁగా,అతఁడు మనకుమాత్రము నాథుఁడు గాకపోవునా. కనుక అతఁ డుండగా మన మనాథులముకాము. అనాథులవలె మనకు భయమక్కఱలేదు.'రాజు మంచివాఁడైనను సవతులవలనిభయము తీఱునా'యందు

---

* ఇందులకు 'ఇమానితు మహారణ్యే విహృత్య నవపఞ్చచ' అనిమూలము 'ఇమానినవపఞ్చచ' ఈ తొమ్మిదేండ్లు—అని స్వల్పముగా తోఁచుటకై చెప్పినమాట, 'విహృత్య' విహరించి-దీనిచే తన కు కష్టములేదని సూచించినాఁడని తెలియునది.

† అడవిలేడియనుటచే అడవిలేడి అడవిలో సంతోషమున నుండునట్లు నేనును అడవిలో నీకుఁ గష్టము గలిగింపకయు నాయంతట సుఖముగాను నుందు ననిభావము.

వేని రాజు గాఁబోవుభరతుఁడును మిక్కిలిధార్మికుఁడు. సర్వప్రాణులకును ప్రియములు పలుకువాఁడు. ఇఁక మాత యగునీకు నప్రియము సేయునా? 'వాఁడు స్వభావమున ధార్మికుఁడైనను తల్లిమాటను విని యేదైన నపకారముసేయు' నందువా? వాఁడు ధర్మమునందు మిక్కిలి నిరతుఁడు గనుక నెవ్వరు చెప్పినను వినక నిన్ను అనువర్తించి పరిచర్య సేయుచునే యుండును. నేను వనమునకుఁబోయిన పిదప నీవు కొంచెమైనను పరాకు లేక రాజునకు పుత్రదుఃఖమున నాయాసము కలుగకుండునట్లు గావింపవలయును. రాజు మొదలే వృద్ధుఁడు; మఱి యీపుత్రశోకమో భయంకరమైనదిగాన రాజును తుదముట్టింపకుండునట్లు నీవెచ్చరిక గలిగి యతనికి హితములగుకార్యములు సేయుచుండుము. ఎల్లప్పుడును వ్రతములును ఉపవాసములును సలుపుచు మిక్కిలియు నుత్తమురాలని వాసి గన్నట్టిస్త్రీయైనను, పెనిమిటిని అనుసరించి యుండదేని యది పాపాత్మురాలే యగును. పెద్దలకు నమస్కరింపక దేవతాపూజలను సేయక యుండు స్త్రీయైనను, భర్తకు శుశ్రూష సేయుచుండెనేని యుత్తమంబైన స్వర్గమును బొందును. ఆఁడుది యెప్పుడును భర్తకు ప్రియమును హితమునైన కార్యములు సేయుచు సేవ గావించుచునే యుండ వలయును. ఈధర్మము పూర్వకాలమునుండి లోకమునకు శిష్టాచారమువలనం దెలియుచున్నది. ఇట్లే వేదమునను జెప్పఁబడియున్నది. తదనుకూలముగా స్మృతులందును ప్రతిపాదింపఁబడినది. తల్లీ! నా కొఱకు, నేను క్షేమముగా వచ్చుటకై, శాంతిక పౌష్టికహోమములచేతను పుష్పాదులచేతను దేవతలను బూజింపవలయును. మఱియు సువ్రతులయిన బ్రాహ్మణులను నట్లే పూజింపవలయును. ఇట్లు చేసితివేని నేను వచ్చువఱకు నీకు సుఖముగా ఉబుసుపోవును. నీ విట్లు నేను మఱల సుఖముగా నయోధ్యకు వచ్చుటను గోరుచు స్నానాదినియమమును గైకొని నిషిద్ధపదార్థములను భుజింపక సాత్త్వికముగా నియతమైన యాహారమును గొనుచు నేను వచ్చుకాలము నెదురు సూచుచుండుము. నేను వనమునుండి మరలి వచ్చినపిదప, ధార్మికోత్తముఁడగురాజును, ప్రాణములు పెట్టుకొని యుండినపక్షమున, మే లయిననీకోర్కి యంతయు పొందఁగలవు' అనియె. ఇట్లు రాముఁడు చెప్పఁగా కౌసల్య పుత్రశోకమునఁ బొక్కుచు, కన్నీరు గ్రమ్మికన్నులు కలఁగఁబాఱ, రామునిఁజూచి 'పుత్రా! వీరోత్తమా! నీ వడవికిఁ బో వలయునని మనస్సున గట్టిగా పట్టుపట్టి యున్నావు. దానిని త్రిప్పుటకు నాచేతంగాదు. ఇది కాలమహిమ. కాలము నతిక్రమింపరాదనుటనిజము. పుత్రా! నీవు బుద్ధినిలుకడతో నడవికిఁబొమ్ము. నీవు ప్రభుఁడవు. నీ కెప్పుడును మంగళమే యగుఁగాత. నీవు మరల నడవినుండి రాఁగానే నా కష్టములన్నియుఁ దీఱి సుఖముండెదను. మహాభాగుండవైన నీవు,పితృవచనపరిపాలనవ్రతము నాచరించి కృతార్థుండవై తండ్రిఋణము దీర్చుకొని యడవినుండి మరల వచ్చినంతనే నేనును బరమసౌఖ్యంబు నొందఁగలను. రాఘవా! భూమియందు దైవముపోకడ యిట్టిదని యూహించుటకు నెవ్వరికిని దరముకాదు.

ఇట్టిది కావుననే యది, తల్లినగు నామాటనుగూడఁ ద్రెంచుకొని యడవికిఁ బోవునట్లు నిన్నుఁ బురికొలుపుచున్నది. పుత్రా! నీవు మహాబాహుఁడవు. నిన్నెవ్వఁడు మార్కొనలేఁడు. కనుక నిపుడు తరలిపొమ్ము. మరల క్షేమముగా నిచటికి వచ్చి యింపైన బుజ్జగింపుమాటల నాకానందము గూర్పఁగలవు. నీవు పదునాలుగేండ్లు దీఱఁగా, నారచీరలు జడలును దాల్చి యడవినుండి మరలి యిచ్చటికి రాఁగా, నిను జూచునప్పటి కాలము ఇప్పుడే నాకుఁ గలుగు'నాయనియె. కౌసల్య రాముఁడట్లు పితృవచనప్రకారము న వనవాసముసేయ నిశ్చయించి యున్నాఁడని యెఱింగి మిక్కిలియాదరంబు మీఱ నా శుభలక్షణలక్షితునిఁ జూచి యిట్లు మంగళాశీర్వచనంబులు సేయఁ గోరినదయ్యె. ఇది యిరువదినాలవసర్గము.



## కౌసల్య రామునకు మంగళాశీర్వచనము లొసఁగుట.

కౌసల్యాదేవి గొప్పమనస్సుగలది; కావున నాసంకటమును విడిచి యేడ్చుటవలనఁ గలిగినయశుచిత్వము పోఁగొట్టుకొనుటకై జలంబుల నాచమనము సేసి రామునకు మంగళాశాసనములు గావించెను. 'రఘూత్తమా! నిన్ను నిలుపుటకు నాకు వశము గాకున్నది. నీయిచ్చవచ్చినట్లు నీవు డడవికిఁ బొమ్ము. అయిన నచ్చటనే నిలువక గడువు తీఱఁగానే వేగ మరలిరమ్ము. ఇట్లువచ్చి సత్పురుషు లగురాజుల క్రమమున నభిషేకము సేసికొనుము. రఘుకులతిలకా! నీవు ప్రీతితోడఁ బరిపూర్ణముగా నియమంబున ఏధర్మమును గొంచెమైనను దప్పకుండ ననుష్ఠించుచున్నావో యాధర్మమే నిన్ను నలుగడల రక్షించుచుండుఁగాత. పుత్రా! నీవు చదుకముఁలందును దేవాలయములందును ఏదేవతలకు నమస్కారము సేయుదువో ఆ దేవతలు అడవియందు మహర్షులతోఁ గూడ నున్ననిన్ను అన్నిటఁ గాపాడుదురు గాక. బుద్ధిమంతుఁడైన విశ్వామిత్రుఁడు నీకొసఁగిన దివ్యాస్త్రములన్నియు సుగుణశ్రేష్ఠుండ వగునిన్ను ఎల్లప్పుడును ఎల్లయెడల రక్షించుచుండుఁగాక. మహాబాహూ! నీవు చేయుచున్న పితృశుశ్రూషయు మాతృసేవయు నీసత్యవ్రతమును నిన్ను అన్నిసంకటములనుండి రక్షించుచుండఁగా చిరకాలము బ్రదుకుము. పురుషశిఖామణీ! నీవు అడవియందు చరించుచుండఁగా పరాకునఁ గలిగిన ప్రత్యవాయము సైఁచుచు, అందలియాశ్రమముల నుండుసమిధలు దర్భలు పవిత్రములు అగ్నివేదికలు దేవస్థానములు దేవపూజార్థము రచితములైన నానావిధస్థలములు పర్వతంబులు పెనుమ్రాఁకులును తీఁగలును చిన్నగొమ్మలును మడుఁగులును పక్షులు సర్పములు సింహములును నిన్నుఁ గాపాడుచుండుఁగాక. సాధ్యులును విశ్వేదేవతలును వాయువులును మహాఋషులును నీకు మంగళ మొసఁగుచుందురుగాక. ధాతయు విధాతయును దేవతలును, లేక, ఆధారభూతుండైన విరాట్పురుషుఁడును సృష్టికర్తయగు బ్రహ్మయు, నీకు మంగళ మొసంగుదురుగాక. మఱియు ద్వాదశాదిత్యులలోఁ జేరినపూషయు భగుఁడును

అరణ్యమందును నీకు మంగళము లొసంగుదురుగాక. అట్లే దేవేంద్రుఁడు మొదలు గాఁ గలదిక్పాలురందఱును నీకు మంగళమొసంగుదురుగాక. వసంతాదిఋతువులు ను శుక్లకృష్ణపక్షములును చైత్రాదిమాసములును ప్రభవాదిసంవత్సరములును రాత్రులును పగళ్లును ముహూర్తములును నీ కెల్లప్పుడును మంగళము నొసంగు చుండుఁ గాక. పుత్రా! ధ్యానమును, పరిపక్వ మైనయోగమును, ధర్మమును, నిన్ను అన్నిచందముల రక్షించుఁగాక. భగవంతుఁడగుకుమారస్వామియు చంద్రుం డును బృహస్పతియు సప్తర్షులును నారదుండును నిన్ను అంతటను రక్షించుచుండు దురుగాక. పుత్రా! అంతటను బ్రసిద్ధములైన దిక్కులును దిక్పాలురును నేను జేయు స్తోత్రంబులకు ప్రసన్నులయి నీవు పోయెడియడవియందు నిన్నెల్లప్పుడును గాపాడు చుందురుగాక. కులపర్వతములును సకలసముద్రములును కుబేరుఁడును వరుణుఁడును ఆకాశమును భూమియు సకలనదులును సర్వనక్షత్రములును అంగారకాదిగ్రహ ములును తదభిమానిదేవతలును అహోరాత్రములును సంధ్యలును అడవినున్న నిన్ను రక్షింపుచుండుఁగాక. *పవిత్రములైన ఋతువులాఱును మాసములును సంవ త్సరములును కలలును గాష్ఠలును నీకరణ్యమున సుఖము గూర్చుచుండుఁగాక. బుద్ధి మంతుఁడవై తండ్రిపంపున మునివేషము ధరించి కాఱడవిం దిరుగుచున్న నీకు దేవ తలు ననుగులు నెల్లప్పుడును సుఖంబు లొసంగుచుందురుగాక. కుమారా! మిక్కిలి కుపితులై క్రూరకర్మములు గావించు రాక్షసులవలనను పిశాచములవలనను మఱి సమస్తము లైనక్రూరమృగంబులవలనను నీకు భయముకలుగ కుండుఁ గాక. చొరరానియడవిని గోఁతులును తేళ్లును అడవియీఁగలును దోమలును పాము లును ఇంక నితరము లైనపురుగులును నిన్ను బాధింపకుండుఁ గాక. కొడుకా! పెనుగజములును సింహములును పెద్దపులులును ఎలుఁగుబంట్లు మొదలగుకోఱల మృగములును నీకుఁ గీడుసేయ కుండుఁగాక. మఱియు మనుష్యమాంసము దినుచు భయంకరము లై యుండు నితరక్రూరజంతువులును, నే నిచ్చటఁ జేయుపూజచే సంతో షము నొంది నిన్నడవియం దెంతమాత్రమును హింసింపకుండును గాక. రామా! మార్గములు నీకు ఫలమూలాఢ్యము లైనయన్ని పెంపుసొంపులతోఁ గూడి శుభంబు లగుఁ గాక. ఎల్లయెడల నీపరాక్రమకృత్యములు మాఱు లేక చెల్లుచుండుఁగాక. ఎందును మంగళముల నందుచు వనమునకుఁ బొమ్ము. అంతరిక్షచరులైన దేవతలవల నను మఱితక్కుంగలదేవతలవలనను నీకు మంగళములు కలుగుఁగాక. నీశత్రువుల

* ముందు చెప్పఁబడిన ఋతువులు మొదలైనవి మరల చెప్పుట పునరుక్తి యగును. అయిన నిచట ఋతువులు మొదలైనవానిని చెప్పుటచే వానియధిదేవత లనుగ్రహించినయెడల ఆదోషము కలు గదు. లేక, కౌసల్య పుత్రరక్షణమందుఁ గలప్రేమపారవశ్యముచే చెప్పినదే మఱిచి చెప్పినదిగాన దోషము లేదనియుఁ గొందఱియభిప్రాయము.

వలనఁగూడ నీకు మంగళమే కలుగుఁగాక. రామా! బృహస్పతియు చంద్రుఁడును సూర్యుఁడును కుబేరుఁడును యముఁడును నేను జేయుపూజ లంది దండకారణ్యమున వసింప నున్ననిన్నుఁ గాపాడుచుందురుగాక. రామా! నీవు నదులందు స్నానము సేయు కాలముల నగ్నిదేవుఁడును వాయుదేవుఁడును అగ్నిహోత్రధూమమును, విశ్వామిత్ర మహర్షి నీ కుపదేశించినమంత్రములును, నిన్ను రక్షించుచుండుఁగాక. సకలలోక నాథుం డగుబ్రహ్మదేవుఁడును సమస్తప్రాణిపోషకుఁ డగునారాయణుఁడును ఋషు లును తక్కినదేవతలును వనవాసము చేయునిన్నుఁ గాపాడుచుందురుగాక! ఇట్లు యశస్వినియు విశాలనేత్రియు నగుకౌసల్య రామునకు మంగళాశాసనములు చేసి పుష్ప మాలికలర్పించి తత్తదుచితంబు లగుస్తోత్రముల దేవతలం బూజించెను. అంత రాము నకు మంగళము కలుగుటకై యగ్నిహోత్రము గొని తెచ్చి మహాత్ముఁ డైనబ్రాహ్మ ణునిచే విధ్యుక్తముగా హోమము సేయించెను. ఆస్త్రీరత్నము హోమమునకై తెల్ల పూవండలను సమిధలను తెల్లయావాలును దెప్పించెను. ఆఋత్విజుఁడు సర్వోపద్ర వములు శమించుటకును, ఆరోగ్యము గలుగుటకును, యథావిధిని హోమము చేసి, వేల్వఁగా మిగిలినహవిస్సుచే వెలుపటిబలి గావించెను. మఱియు తేనెయు పెరుఁ గును అక్షతలును నేయియు దక్షిణలును బ్రాహ్మణుల కిచ్చి వారిచే పుణ్యాహము చదివించి మఱియు వనమున రామునకు మంగళములను గూర్చుమంత్రములను జెప్పించెను. అంత మహాకీర్తిమంతురా లైనరామునితల్లి బ్రాహ్మణోత్తముఁ డైన యాఋత్విజునకు అతనికోర్కికిం దగినగొప్పదక్షిణ నిచ్చి రామునింజూచి 'సమస్తదేవ తలును నమస్కరించుచుండు దేవేంద్రునకు, వృత్రుఁడు నశించుటకై, యేమంగళము గలిగెనో యామంగళము నీకును గలుగుఁగాక. మున్నువినత తన కొమారుఁడై న గరుడుఁడు అమృతముం గోరి పోవుచుండునప్పుడు అతనికి, ఏమంగళము గావించెనో యామంగళము నీకుఁ గలుగుఁగాక. సముద్రమును చిలికి యమృతమును పుట్టించు కాలమున అదితి, తనకొడు కగుదేవేంద్రుఁడు రాక్షసులను జంపఁగా ఏమంగళము నొసంగెనో ఆమంగళము నీకిప్పుడు కలుగుఁగాక. విష్ణుదేవుఁడు త్రివిక్రమావతార మున మూఁడడుగు లిడునపుడు మితి లేనిప్రభావము గలయాదేవునికి ఏమంగళము కలిగెనో యామంగళము నీ కిపుడు కలుగుఁగాక. మహాబాహూ! సహజముగా మంగళప్రదము లైనవానిని మఱింతమంగళకరములుగాఁ జేయు వసంతఋతువు మొద లైనఋతువులును సముద్రములును ద్వీపములును వేదములును స్వర్గాదిలోకము లును దిక్కులును నీకు మంగళముల నొసంగుచుండుఁగాక' అనియె. వాలుఁగన్నులు గలయాకాంతామణి యిట్లు కొడుకు నాశీర్వదించి యతనిశిరంబున నక్షత లుంచి,య తనిమేనికి గంధములను బూసి, ఫలము గలిగించునట్టివీర్యము గలదిగా ప్రసిద్ధిగాంచి లోపలిశల్యములను వెలికిఁ దీయునది యైనవిశల్యకరణి యనుమూలికను రక్ష గా రామునిచేతఁ గట్టి దానిని మంత్రములతో నభిమంత్రించెను. అమ్మహాకీర్తిమతి, దుః

ఖముబారికిం జిక్కి స్రుక్కుచున్నను, ప్రయాణకాలమున అమంగళము సేయరాదు గావున, మనస్సునం గాకున్నను, నోటమాత్రము మహాసంతోషము నొందినట్లు చూప ట్టుచు, పలుకులు తొట్రుపడంగా నాతనిశిరంబు వంచి మూర్కొని కౌఁగిలిం చుకొని "పుత్రా! నీవు కృతార్థుఁడ వై సుఖముగాఁ బొమ్ము. నాయనా! నీవేరోగ మును లేక అన్నికార్యము లొనఁగూడినవాఁడవై మరల నయోధ్యకువచ్చి రాజపద్ధ తి యగురాజ్యపాలనమును స్థిరముగాఁ గయికొనియుండఁగా చూడఁగలను.నీవుమరలి రాఁగా నేను అడవిని 'ఏమయ్యెనో;ఎట్లున్నాఁడో' అని చింతించుచుండు దుఃఖంపుఁ దలఁపు లన్నియును నశించి మొగము సంతోషమున మెఱయుచుండఁగా, పూర్ణచం ద్రుఁ డుదయించినట్లు అడవినుండివచ్చి కన్నులపండువుగా పొడసూపిననిన్ను చూ డఁగలను. రామా! నీవు తండ్రియాజ్ఞను తీర్చి యడవినుండి యిచ్చటికి వచ్చి సింహాసనము నారోహించియుండఁగా మరల చూడఁగలను.అడవినుండి యిచటికి నచ్చి రాజోచిత ములైన వస్త్రాభరణాదిసమస్తమంగళములతో నొప్పుచు నాకును నాకోడలికిని ఎప్పు డును కోర్కులు నింపుచుండుము. ఇప్పుడు అడవికిఁ బొమ్ము. నే నిపుడు పూజ సేసినశివాది దేవతాసమూహములు మహర్షులును భూతములును అసురులును ఉర గులును దిశలును నాపూజకుఁ దృప్తి నొంది వనమునకుఁ బోవు చున్ననీకు బహు కాలము హితముఁగోరుచుందురుగాక" యనియె. ఇట్లాయమ కన్నీరు కాలువలు గట్ట కొడుకునకు విధ్యుక్తముగా మంగళాశీర్వచనము చేసి తీర్చి రథార్థముగా నతనిచుట్టుఁ దిరిగి సారెసారెకు బిగియఁ బట్టి కౌఁగిలించుకొనెను. అట్లు కౌసల్యాదేవి రామునివల నొనినంత మహాకీర్తిమంతుఁ డగునారాముఁడు తల్లియడుగులను మాటిమాటికిఁ బట్టుకొని మ్రొక్కి మిక్కుటపుదుఃఖము కలిగినను కాంతినిధి గావునఁ దఱుఁగనినిజ కాంతిని వెలుఁగుచు సీతాదేవిగృహంబునకుఁ బోయెను. ఇది యిరువదియైదవసర్గము.



## రాముఁడు సెలవు పుచ్చుకొనుటకై సీతకడకుఁ బోవుట.

రాజకుమారుం డగురాముఁడు తల్లిచే మంగళాశీర్వచనము నొంది,కౌసల్యకు నమస్కరించి, మిక్కిలి ధర్మయుక్తమైన మార్గమును గట్టిగా నవలంబించి,వనమునకుఁ బోవ నమకట్టి, రాజమార్గంబు నిజకాంతిచే వెలిఁగించుచు, ప్రవేశించె. అచ్చట జ నులు రామునిఁ జూడఁగానే యాతనిగుణసంపత్తి వారలమనంబులను ప్రీతిగొలిపి మిక్కిలి కలఁచిపుచ్చినదయ్యె. రామాభిషేకముకొఱకు నియమమున వ్రతము పూనియున్న సీతాదేవికి, రాముని యభిషేకము చెడుట మొద లైనవృత్తాంత మే మియుఁ దెలియదు. ఆమె మనంబున రాముఁడు యావరాజ్యమునం దభిషిక్తుఁడగు ననియే తలంచుచుండినది. సీత పట్టాభిషిక్తుఁడైనభర్తకు పట్టమహిషి చేయవలసిన పాదార్చనాదు లైనయాచారములను దెలిసినది. అభిషిక్తు లైనరాజులకు శ్వే తచ్ఛత్రచామరాదు లైనవిశేషలక్షణములను ఎఱింగియుండునది. కనుక నామె

తానే రాముని యభ్యుదయముకొఱకు దేవతాపూజ గావించి యభిషిక్తుఁడై వచ్చు భర్తకు వలయుపూజావిధానములు సలుపునదియై, అట్టి శ్వేతచ్ఛత్రాది లక్షణముల తోడ నా రాజకుమారుని రాక నెదురు సూచుచుండెను. అంత రాముఁడు 'ఈదుఃఖ వృత్తాంతము సీత కెట్లు చెప్పుదు'నని లజ్జచే తలవంచుకొని, చక్కఁగా నలంకృతమై మహాసంతోషంబునఁ దేలుచుండు జనులు నిండియున్న నిజగృహంబును బ్రవేశించెను. అంత సీత తటాలున లేచి భయంబున వడఁకుచున్నదై, రాముఁడు శోకంబునం బొక్కుచు చింతచేత నింద్రియములు గలఁగి యుండఁ గాంచెను. ధర్మాత్ముఁ డగు నారాఘవుఁడు సీతను జూడఁగానే మనంబునందలి దుఃఖము నెంతమాత్రము నడఁచుకొన జాలఁడయ్యెను. కావున నతని దుఃఖము బయలుపడెను. మొగము వెలువెలఁబాఱె, మేనంతయు చెమర్చె, దుఃఖమునకు తాళఁజాల కున్నయాతనిం జూచి సీత మిక్కిలి దుఃఖంబునఁ బొగులుచు 'నాథా! ఇప్పు డేమిది? రాఘవా! ప్రాజ్ఞు లయిన బ్రాహ్మణులు బృహస్పతిదేవతాకమైనదియు కార్యములు పూనినవారికి సంపత్కరమైనదియు నిపుడు నీయభిషేకమునకుఁ దగినదిగా విధింపఁబడినదియు నగు పుష్యనక్షత్రము వచ్చియున్నదని చెప్పుచున్నారే. ఇట్టిమంగళసమయమున నీ విట్లేల మనస్సుగుందుచున్నావు? సొగసైన నీ నెమ్మొగము, నూఱుకమ్ములు గలిగి నీటియందలి నురుఁగువలె తెల్లనై యుండుఛత్రమును పైని బట్టకుండుటచే, దానివలనం గలుగుసొంపునఁ బ్రకాశింపకున్నది. తామరరేకులవంటికన్నులు గలనీ మొగముపై, చంద్రునివలెను హంసవలెను తెల్లనై యుల్లసిల్లు మేటిచామరములు వీచుట లేదేల? పురుషరత్నమా! మాటకారు లగుస్తుతిపాఠకులును, పురాతనవృత్తాంతములను బ్రశంసించుసూతులును, వంశావళిని గీర్తించు మాగధులును, సంతోషమున నిన్నిచట మంగళవచనములం బ్రస్తుతింపకున్నా రేమి? వేదాంతవిదులైన బ్రాహ్మణులు శిరస్స్నానముచేసి శుద్ధుఁడవై యున్న నీశిరమున తేనెయు పెరుఁగును యథావిధిగ తీర్థోదకముతో నభిషేకింపకున్నా రేల? మంత్రులు మొదలైనవారును ఆయావీథులవారిలో ముఖ్యులయినవారును, పట్టణమందలిజనులును, పల్లెపట్లజనులును చక్కఁగా నలంకృతులై నిన్ను వెంబడించి రా రేమి? మిక్కిలి వేగముతోఁ గూడి, బంగారముచే నలంకరింపఁబడి, నాలుగు గుఱ్ఱములు పూన్చి యుత్సవార్థముగా సింగారింపఁబడియుండు పుష్యరథము నీ ముందట రాకున్న దేమి? వీరాగ్రణీ! నల్లనిమేఘమువలెను పర్వతంబుకైవడిని పొడసూపుచు, శ్రీమంతమై శుభలక్షణలక్షితమై యుండుపట్టపేనుఁగు నీవు పయనమై వచ్చునపుడు నీముందట లేకున్న దేమి? సొగసై యగపడు రామా! వీరులు, బంగారముచే వన్నెగులుకు సింహాసనమును మున్నిడుకొని ముందటఁబోవఁగా నీవు రావలయును. అట్టిరాక లేదేమి? ఇపు డెంతసంతోషముగా పట్టాభిషేకము సన్నద్ధమైయున్నదో యంత దుఃఖముగా ఇదివఱకెన్నఁడును లేని యీరంగు నీమొగమునకుఁ గలిగియున్నది. సంతోషము కనఁబడకున్నది. ఇది యేమి?' యనియడిగెను. ఇట్లు విలపించుచున్న

యాయవమం జూచి రాముఁడు "సీతా! పూజ్యులగు మాతండ్రిగారు నన్ను పట్టణమునుండి యడవికిఁ బంపుచున్నారు. జానకీ! నీవు గొప్పవంశమునం బుట్టినదానవు, ధర్మమును తెలిసినదానవు. ఊరక తెలియుటయేకాక ధర్మమునే యాచరించుదానవు* జనకమహారాజుకొమార్తవు. కనుక నాతురపడి ధర్మము నతిక్రమింపవు. నా కీవనవాస మెట్లు గలిగెనో యాక్రమమును జెప్పెద వినుము. ఆడి తప్పనివాఁ డగు నాతండ్రి దశరథమహారాజు మునుపు నాతల్లి కైకేయికి గొప్పవరములు రెం డిచ్చెనుజు. ఇపుడు రాజు పూన్కిచే నాయభిషేకము సన్నద్ధమైయుండఁగా, ఆమె మునుపటిసంకేతముచొప్పున ఆరెండు వరము లడిగినది. రాజును చెప్పితప్పనివాఁడుగనుక, ధార్మికుఁడు గావునను, ధర్మమునకు లోనై యాబిడకుఁ జిక్కినాఁడు. ఆరెండువరములలో నొకటికిఁగా నేను దండకారణ్యమునఁ బదునాలుగేండ్లు వాసము చేయవలయును. రెండవవరమునకై నాతండ్రి, భరతుని యౌవరాజ్యమందుఁ గూర్పనుగూడఁ గూర్చినాఁడు. ఇట్లు తండ్రిచేత నాజ్ఞాపితుఁడను గావున నే నిపుడు విజనం బగువనమునకుఁ బోవ నిశ్చయించి నిన్నుఁ జూచిపోవుటకై యిచ్చటికి వచ్చితిని. భరతునిసమీపమున మాత్రము నన్నెపుడుగాని కొనియాడవలదు. సంపదపెంపుతోఁ గూడినపురుషులు తమయెదుట పరపురుషులను బొగడఁగా సహింపరుగదా. కాఁబట్టి నీవు భరతునిముందట నాగుణములను శ్లాఘింపవలదు. భరతుఁడు నిన్ను పదుగురు బంధువులతో పాటిగా పోషింపవలసినవాఁడేకాని విశేషించి పోషింపవలసినభారము వానికి లేదు. కనుక నీతోడికోడండ్రకంటె నెక్కువయినపోషణమును నీవు గోరరాదు. నీవు భరతున కనుకూలముగా నుండిననే నీ వాతనిసమీపమున నుండఁజాలుదువు గాని ప్రతికూలముగా నుండఁ దరముగాదు. 'అతని కనుకూలముగా నడచుకొననేల' యందువా? రాజు పురాతనముగా వచ్చుచున్నయువరాజత్వమును ఆభరతునకే యిచ్చియున్నాఁడు. కనుక, సీతా! నీ వాతనికిని, విశేషించి రాజునకును, మనస్సున కలంక లేకుండునట్లు నడచుకొనవలయును. నేనును దండ్రియాజ్ఞను పరిపాలించుటకయి యిప్పుడే యడవికిఁ బోయెదను. నీవు దృఢచిత్తురాలవు. కనుక నాయం దనురాగము తప్పక నిలుకడ గలిగియుండుము. కల్యాణీ! నేను మునులు నివసించువనమునకుఁ బోయినపిదప నీవు వ్రతములును, ఉపవాసములును సలుపుచు నుండవలయును. ప్రతిదినమును వేకువను లేచి యథావిధిగా దేవతలను బూజించి, మనుష్యుల కందఱికిని ప్రభుం డయిన నా తండ్రికి దశరథునికి నమస్కరింపవలయును. ధర్మమునే దృఢముగా నాశ్రయించి యున్నదై సంతాపమున స్రుక్కుచున్న నా ముదిసినతల్లిని కౌసల్యను నీవు గౌరవించుచుండఁ దగును. తక్కిన నాతల్లు లందఱును, నా యందలినెయ్యమునను ప్రేమ

---

*రాముఁడు, తాను చెప్పఁబోవు గొప్ప ప్రియవార్త వినుటచే సీతకు మిక్కుటయమైన దుఃఖము కలుగునని తలఁచి యామెమనస్సు కలఁగక దృఢముగా నుండుటకై ఆమెకుఁ గలవివిధగుణములను కీర్తించుచు సంబోధించుచున్నాఁడని తెలియునది

యందును పాలించువిషయమునను,నాకు సమానులేయగుదురుగావున వారలకుఁ గూడ నీవు మ్రొక్కవలయును. నాకుఁ బ్రాణములకన్న మిక్కిలిప్రియు లైనభరతశత్రుఘ్నులను,నీవు విశేషించి నీతోఁబుట్టువును గొడుకును జూచుకొనునట్లు, చూచుకొనవలయును.భరతుఁడు దేశమునకును, మనకులమునకును రాజును ప్రభుఁడును గాన నీవతనికి అప్రియము నెప్పుడును చేయరాదు. రాజులు, తమకనుకూలముగా ప్రవర్తించి, యాలస్యాదులు లేక జతనమున తమ్ముఁగొలుచుచుండిననే మిక్కిలి సుప్రసన్ను లగుదురు;అట్లు సేయనిచో మిక్కిలియుఁ గోపింతురు. రాజులుతమధర్మపత్నులయందుఁబుట్టినపుత్త్రులనైనను,వారువిరోధము సేయుదు రేని,పరిత్యజింతురు.బంధువులు గానట్టిసాధారణజనులనైనను, వారు సమర్థులును తమకు హితము సేయువారు నగుదు రేని, తాము పరిగ్రహింతురు. కల్యాణీ! భరతుఁడు రాజుగావున అతనికి అనుకూలముగాఁ బ్రవర్తింపనియెడలఁ గష్టము నొందుదువు గనుక నతని ననుసరించి నడచుకొనుము. ధర్మమునం దెడతెగక నిలిచి సార్థకము లైనవ్రతములొనరించుచు నిచ్చటనే యుండుము. ప్రియురాలా! నేను మహారణ్యమునకుఁ బోయెదను. అట్టియడవికి నినుబోఁటిస్త్రీకి రాను దరముగాదు. కనుక నీ విక్కడనే యుండవలయుఁగదా. ఇచ్చట నెవ్వరికిని అప్రియముకలుగనట్లు అనుకూలముగా నడచుకొనుచుండుము. ఇదే నేను చెప్పుమాట; నీ మనస్సునం దేమఱకుండవలయు" నని చెప్పెను. ఇది యిరువదియావసర్గము.



రాముఁడు తనతోఁగూడ రావల దనఁగా సీత గోపించుట.

సీత తా నప్రియములు పలికినను అబిడతో ప్రియవచనములేయాడందగును.మఱియాబిడ ప్రియములే పలుకునది. అట్టికాంతకు నిట్టి యప్రియము చెప్పఁగా స్నేహవశమున మిక్కిలి కోపము గలిగి పెనిమిటింజూచి, ''రామా! నీవురాజకుమారుఁడవు. ఇది నీకే పనికిమాలినదని నిశ్చయముగాఁ దెలిసియు, నాబోఁటియాఁడుదానికిఁగూడ పరిహాసము చేయఁదగినట్టి యిట్టిమాటను జెప్పుచున్నావే. ఇదేమి చిత్రము ! ఇదివఱకెన్నఁడు నిట్టిమాట నీనోట నేనువిన్నదిలేదు.(నీవు చెప్పినమాట శస్త్రాస్త్రములం దారితేఱినట్టివీరు లైనరాజకుమారులకు మిక్కిలి తగనిదియు అపకీర్తికరమైనదియు గావున విననే తగదు. ఇంక చెప్పుటకు తగునా?) ఆర్యపుత్త్రా! తండ్రియును తల్లియును తోఁబుట్టువును గొడుకును గోడలును వీరందఱు తమతమపుణ్యపాపముల ఫలము లనుభవించుచు వానివలనఁ దమకుఁ గలుగు శుభాశుభకర్మముల నాచరింతురు. భర్తకర్ధశరీరమైన భార్యయొక్కతిమాత్రము భర్తకుఁ గలుగుభాగ్యములనే తానును అనుభవించుచున్నది. కాఁబట్టి నిన్నడవిలోనుండున ట్లాజ్ఞాపించుమాత్రముచేతనే నన్నును అడవిలోనుండుమని ఆజ్ఞాపించినట్లైనది. స్త్రీలకు తండ్రిగాని కొడుకుగాని తల్లిగాని చెలికత్తెలుగాని గతి కానేరరు.వారలు తమకుఁ దామే స్వతంత్రులునుగారు.పెనిమిటియొక్కఁడుమాత్రమే వారల కీలోకమందును బరలోకమందును ఎల్లప్పుడును గతి

యగును. మఱెవ్వఁడునుగాఁడు. రాఘవా! నీవిపుడే చొరరానియడవికిం బోవఁబయనంబ యితివేని నేనును నీముందట కఱకు దర్భముండ్లను జదియఁద్రొక్కుచుఁ బోయెదను. వెనుకవచ్చునీకు వానిపై నడుగులిడుట కష్టముగానుండదు. నీవు వీఁగుండవుగాన నను బోఁటి యాఁడుదాని నొంటిగా నడవికిఁ గొంపోయి యెట్లు గాపాడుదునని భయపడ రాదు 'నేనురావల దనఁగా వచ్చుచున్న దే'యనిగాని 'నన్ననువర్తించి యిది చరితార్థురాలగుచున్న'దనిగాని నీ కోర్వమిగలిగినను, 'నామాట నతిక్రమించి యడవిని కందమూలములను దినఁ దెగించుచున్న దే'యని రోషమునునీకుఁగలిగినను, త్రాగి మిగిలిన నిషిద్ధజలమును విడుచునట్లు వానిని బొత్తిగా ద్రోసి పుచ్చి నాయందు నమ్మికయుంచి నన్నునుగూడఁ గొంపొమ్ము. అప్పుడు భర్తను బాసి బ్రతుకునట్టిపాపము నాకుఁగలుగదు. 'మేడను విడిచి యడవికేల వచ్చెద' వనకు. మేడలపై నుండుటకన్నను, విమానముల నుండుటకన్నను, అణిమాదిసిద్ధులఁ బొంది యాకాశంబునం దిరుగుటకన్నను, అన్నియవస్థలయందును బెనిమిటి ననుసరించి యతనిపాదములకు సేవసేయుటయే విశేషించినది. భర్తయెడల నడచుకొనవలసిన విషయమునుగుఱించి నాకుఁ దల్లియును తండ్రియును అనేకవిధముల నుపదేశించియున్నారు. కనుక ఎట్లు నడుచుకొనవలయునో నాకిప్పు డెవ్వరును నేర్ప నక్కఱ లేదు. నేను, అరణ్యము చొరరానిదయ్యును, జనులు లేనిదయ్యును, పెద్దపులులు తోఁడేళ్లు మొదలగు నానామృగములచే నిండినదైనను, తప్పక నీతోఁగూడ వచ్చెదను. ఇట్టిపూనికచే దుఃఖముఁకలుగు నందువా? నేను త్రైలోక్యాధిపత్యము కలిగినను గణింపక, పెనిమిటికి శుశ్రూష సేయువ్రతము తప్ప మఱివేఱు తలంపక, మాతండ్రి యింటనుండునట్లే నీతోఁగూడ నడవిని సుఖముగా నుండెదను. వీరాగ్రణీ! నేను నీ కెప్పుడును సేవ సేయుచును, ఇంద్రియనియమమున, కామభోగంబుల వర్జించి, పూదేనియలతావులు బుగులుకొనుచుండువనములందు నిన్నుఁగూడి క్రీడించుచుండెదను. నీవుమానము గాపాడువాఁడవు; అడవియందు నన్నును, శరణుసొరని యితరజనులనుగూడఁ, గాపాడుటకు శక్తుఁడవై యుండఁగా నన్నొకతిని గాపాడుట చెప్పవలయునా? నేనిపుడు నీతోఁగూడ నే యడవికివచ్చెద. ఇందులకు కొంచెమైనను సందియము లేదు. అడవికి నీతోఁగూడ రావలయునని పూనియున్న నన్ను నీ కిచ్చట నిలుపశక్యము కాదు. 'అడవిని మంచియాహారము దొరక' దందువా? నే నచట నెపుడును బండ్లను గడ్డలను దినుచునుండెద. మంచియాహారము నాకక్కఱ లేదు. ఇందు సందియము లేదు. కాని, 'యది త్రాగవలయును ఇది తినవలయు' నని నీకు దుఃఖము కలిగింపక నీతోఁగూడ నుండెదను. నీవు బుద్ధిమంతుఁడవు. మఱినాకు నాథుండవు. ఇట్టినీవు తోడై యుండఁగా, నే నెంతమాత్రమును భయము లేక యడవియం దుండునదులను బర్వతంబులను పడియలను వనములను అన్నింటిని చూడఁగోరుచున్నాను. నేను వీరాగ్రణి యగునిన్నుఁగూడి యేభయంబును లేక మిక్కిలిహాయిగా, హంసలు కారండవములు నెరసి బెరసి చక్కఁగాఁ బూచియుండు తామరకొలఁకులను

జూడఁగోరుచున్నాను. నేను గట్టినియమంబుపూని యా తామరకొలఁకులందె జలక మాడెదను. కాని,స్నానమునకై వేఁడిజలములు కోరను.విశాలాక్షా! ఆతామరకొలఁకులందు నిన్నుఁగూడి మిక్కిలి సంతసంబునఁ గ్రీడించుచుండెదను, ఇట్లుఅడవియందైనను నిన్నుఁగూడి యుబుసుపుచ్చితినేని నూఱువేలవత్సరములు గడచినను నాకుఁ దెలియదు.ఇకఁ బదునాలుగేఁడు లెంత!నిన్నుఁబాసియో స్వర్గమయినను నేనొల్లను. పురుషలలామా ! నాకు స్వర్గమున వాసము లభించినను, నీవు లేకున్నచో నేను దానిని గూడ నెంతమాత్రము నొల్లను.*అడవి మిక్కిలి చొరరానిదై యుండినను అందుఁ గోఁతులు ఏనుఁగులు మున్నగు మృగములుండినను, నేను వెఱవక కూడవచ్చెదను. నేను నియమమున నీపాదములను చేపట్టి తండ్రియింట నుండునట్లు సుఖముగానుండెదను. నీపాదములను బట్టినదానికి భయమేమి? నిన్నుఁదక్క మఱియొక్కనియందును మనస్సు నుంపనిదానను. నీయందే మిక్కిలి యనురాగముగలదానను. నీవుపాసిపోయితివేని మరణమునొంద నిశ్చయించిన దానను.కనుక నిట్టినన్ను అడవికిఁ దీసికొనిపొమ్ము. నాప్రార్థన నంగీకరింపుము.నావలన,నన్నుఁగొనిపోవుటవలన,నీకేమియుభారముగలుగ" దనియె. పురుషతిలకుం డగు రాముఁడు ధర్మమునందు మిక్కిలియు ప్రీతిఁ గలవాఁడుగావున తనకాంత యలజడిపాలగుట కోర్వక యాబిడ యట్లు చెప్పివేఁడుకొనుచున్నను,

---

*ఇందులకు 'అహంగమిష్యామి వనం సుదుర్గమం, మృగాయుతం వానరవారణైర్యుతమ్। వనే నివత్స్యామి యథాపితుర్గృహే, తవైవపాదా వుపగృహ్య సంయుతా॥ అనన్యభావా మనురక్తచేతసం, త్వయావియుక్తాం మరణాయనిశ్చితామ్।నయస్వ మాం సాధు కురుష్వ యాచనాం, న తేమయాతోగురుతా భవిష్యతి' అని మూలము. దీనికిలోపల స్ఫురించుపరమార్థము-(సుదుర్గమంవనం) మిక్కిలిచొరరాని అడవికి, (గమిష్యామి) పోయెదను-వచ్చెదననుట, అది, (మృగాయుతం) మృగములోఁ గూడినది-అనఁగా'మారీచుండు మృగమై యందు వచ్చును. దానివలన మనకు వియోగము కలుగును; తిరుగమనలఁ గూర్చువాఁ డెవఁడున్నాఁడు. నీవు నన్నువిడిచి యెట్లు నిలుపోపుదు' వని రాముఁడు చింతించుచుండఁగా, సీత, (మృగాయుతం) మారీచమృగము వచ్చునట్టిదైనను, (వానరవారణైఃయుతం) వానరశ్రేష్ఠులతోఁ గూడినది-వానర శ్రేష్ఠులైన సుగ్రీవాదులతోఁ గూడినది గావున సంయోగమునకు హానికలుగ దనెనని భావము. (వనే) వనమందు-పూర్వపాదమందలి (వనం)అనుటయే చాలియుండఁగా మరల(వనే) అనుటనుబట్టి అశోకవనమని విశేషముగ్రహించునది,(యథాపితుర్గృహే)తండ్రియింటనుండునట్లు, (వత్స్యామి) వసించియుండెదను. అట్లు అశోకవనమందుండియు, (తవైవపాదావుపగృహ్య సంయుతా) నీపాదములనే చింతించుచు నియమములోనే యుందుననుట. (అనన్యభావామ్) రావణుఁడు గొనిపోయినను నీయందే నామనస్సుతగిలియుండును. భర్తయగుటంబట్టి గౌరవముచే అట్లుండుటకాదు, (అనురక్తచేతసం) అనురాగముచేతను నామనస్సుతగిలియుండుననుట. (త్వయావియుక్తాం) నిన్ను ఎడఁబాయుటచే, (మరణాయనిశ్చితామ్) జడను ఉరివేసికొని చావనిశ్చయించినదానను. (మాం) నన్ను, (నయస్వ) హనుమంతుని పంపుట మొదలగు వానిమూలమునఁ గొనిపొమ్ము, (యాచనాంకురుష్వ) ప్రార్థనను చేయుము-దేవతలు ప్రార్థించిన రావణవధమును చేయుమనుట, (అతః) కాఁబట్టి, (మయా) నాచేత, (తే) నీకు, (గురుతా) భారము-క్లేశము, (నభవిష్యతి) కలుగదు. అని రహస్యార్థము.

అడవికిఁ దోడుకొనిపోవ నొల్లఁడయ్యె. మఱి యాయమను నిలుపుటకై వనవాసమునం గలుగు దుఃఖములంగూర్చి మిక్కిలియుం జెప్పెను. ఇది యిరువదియేడవసర్గము.

---

రాముఁడు వనవాసము మిక్కిలిదుఃఖకర మని సీతకుఁ జెప్పుట.

సీత యిట్లు చెప్పుకొనుచున్నను, రాముఁడు, ధర్మంబులం దెలిసి దానియందు ప్రీతియుఁ గలవాఁడు గావున వనమునందుఁ గలుగు దుఃఖములను చింతించుచు నామెను దనతోఁ గూడఁ గొనిపోవుటకు సమ్మతింపఁడయ్యె. ఆధర్మాత్ముఁడు కన్నీళ్లు గ్రమ్మి కలకఁబాఱి యున్నయాబిడ నూఱడించియు, అచ్చటనే నిలుపుటకై మరల నామెం జూచి. 'సీతా! నీవు గొప్పకులమున జనించినదానవు; మఱియు నెల్లప్పుడును ధర్మమునందు మిక్కిలియాసక్తి గలదానవు. నీ విచ్చటనే యుండి ధర్మమునే యాచరించుచుండుము. నీ మనస్సునకు సుఖమునుమాత్రమే చూడకొనకుము. నామాట వినుట నీకు ధర్మము. కనుక నీ మనస్సునకుఁ గూర్చునట్లుగా నీవు చేయవలసిన ధర్మమునుగూడ ఆచరించుచుండుము. అబలా! నేను చెప్పినట్లు నీవు చేయవలయును గాని స్వాతంత్ర్యము గూడదు. అడవియందుఁ బెక్కుకష్టము లున్నవి. వానింజెప్పెద వినుము. సీతా! అడవిలో వాసము చేయవలయు ననెడితలంపును విడువుము. ప్రవేశించుటకు శక్యముకాని మహారణ్యమందు పెక్కుకష్టములు గలుగునని జనులు చెప్పెదరుగదా. నీ మేలును గోరియే నే నీమాటను చెప్పుచున్నాను గాని నిన్ను భరించుట కష్టమనికాదు. అడవియందు ఎప్పటికిని సుఖమే కలుగదు. ఎప్పుడును దుఃఖమే యగు నని నాకుఁ దెలియును. కొండలయందు జలజల పాఱుసెలయేళ్ల చప్పుళ్లును అందలి గుహాలయందుండు సింగముల పెడబొబ్బలను వినుట కలవిగావు. కావున నడవిలో నుండుట కష్టము. సీతా! నిర్జనప్రదేశములయందు జంకుమాలి విచ్చలవిడిని గ్రీడించుచు మత్తిల్లి యుండుసింహశార్దూలాదిమహామృగములు మనలం జూచినంతనే వింతగా నుండుటవలన సంభ్రమించి చంపుటకై యెదురు వచ్చును. కావున అడవిలో నుండుట కష్టము అందుఁ గలనదులు ఎల్లప్పుడును మొసళ్లతోఁ గూడి మిక్కిలి బురద గలిగి మదపుటేనుఁగుల కైన దాఁట నలవిగాకుండును. ఇఁక మనబోఁటులకు వానిని దాఁటి యవ్వలిగట్టు చేరఁ దరమా! కావున అడవిలో నుండుట మిక్కిలియుఁ గష్టము. అందలిదారులందు, కాళ్ల పెనఁగొనుతీఁగలును చుఱుక్కునఁ గ్రుచ్చుకొనుముండ్లును నిండియుండును. అడవికోళ్ల కూఁతలు వింత యగుటచే భయంకరముగా నుండును. నీళ్లు కొంచెమైనను దొరకవు. చొచ్చుటకును శక్యము గాకుండును. కావున నడవిలోనుండుట కష్టము. పగలంతయును పండ్లుగడ్డలకై తిరుగు కష్టమున బడలి రాత్రులందు నేలయందమంతనే రాలిన పత్రములం బఱచుకొని పరుండి నిదురింపవలయును. కావున నడవి మహాకష్టము. సీతా! రేయుంబవలును నియమంబున తమంతనె చెట్లనుండి రాలినపండ్లను దిని తృప్తి నొంది యుండవలయును.

మతేమియు దొఱకదు; కావున నడవిలో నుండుట కష్టము. మైథిలీ ! అడవియందు శక్తికొలఁదిని ఉపవాసము లుండవలయును. మఱి నారచీరలను గట్టుకొని జడలను దాల్చి యుండవలయును. నిత్యము దేవతలకును బితరులకును అప్పుడప్పుడు వచ్చు నతిథులకును యథావిధి పూజ సేయుచుండవలయును. ఎల్లప్పుడును నియమమును బూని యుండవలయును మఱియు బ్రతిదినమును పూఁటపూఁటకుఁ(బ్రాత ర్మధ్యాహ్న సాయంకాలములు మూఁటను) మూడుమాఱులు స్నానము సేయుచుండవలయును. కావున నడవి మహాకష్టము. వానప్రస్థులైన ఋషులు సేయువిధమునఁ దానే పూవులను గోసి తెచ్చి ప్రతిదినమును అగ్నివేదిని బలి యిచ్చుచుండవలయును. మైథిలీ ! వనవాసులు నియతముగలై నయాహారములనే భుజించుచుండవలయును. కావున నిత్యము పండ్లు మొదలగునవి యెంత దొరకునో యంతటితోనే తృప్తిఁ బొందుచుండవలయును; కావున నడవిలో నుండుట కష్టము. అందు గాలి యెప్పుడును హెచ్చుగా వీచుచుండును. రాత్రులయందు చీఁకటి మిక్కుటముగా నుండును. ఎల్లప్పుడును ఆఁకలి యధికముగాఁ గలిగియుండును. ఇట్టిగొప్పభయము లందుఁ గలవు. కాఁబట్టి యడవి మిక్కిలియుఁ గష్టము. మిక్కిలి పెద్దయొడలు గలకొండపాములు పెక్కులు మత్తిల్లి భూమిపైఁ బ్రాఁకుచుండును. వానిని జూడఁగానే నినుబోఁటికి దిగులు పుట్టకుండునా? కావున అడవి మహాకష్టము. నదులయం దుండునవై నదులవలెనే కుటిలములుగాఁ బోవుసర్పములు దారి కడ్డముగా పరుండియుండును. కాఁబట్టి యడవి మిక్కిలియుఁ గష్టము. మిడుతలును తేళ్లును పురుగులును అడవియీఁగలును దోమలును ఎల్లప్పుడును పీడించుచుండును. నీవు దాని కోర్వంజాలవు. కనుక అడవి నుండుట కష్టము. అడవిని ముండ్లు గలమ్రాఁకులును గఱికలును తెల్లును, కొమ్మ లొండొంటితో నల్లిబిల్లిగాఁ బెనఁచుకొని యుండును; నడచుటకుఁ గొంచెమైనను తెఱపి యుండదు. కాఁబట్టి యడవి మహాకష్టము. మఱియు నడవిపట్టులలో వసించువారికి శరీర కష్టములు పెక్కులు గలుగును; నానావిధములైనభయములు పుట్టును. కనుక నడవిలో నుండుట కష్టము. అందు ఎప్పుడును కోపమును లోభమును విడువవలయును. తపస్సునందే బుద్ధి నుంపవలయును. భయము బుట్టించునింకాదు లగపడినను భయపడరాదు. కావున అడవిలోనుండుట కష్టము. ఇట్లగుటంజేసి నీవు వనమునకు పోవుట చాలును. నినుబోఁటికి అడవి తగినదికాదు. ఇందు చక్కఁగా నాలోచింపఁగా వనములో నుండుట మీఁదుమిక్కిలి కష్టమనియె నాకు తోఁచుచున్నది' అని చెప్పెను. మహాత్ముఁ డగురాముఁడు తన్ను వనంబునకుఁ దోడ్కొనిపోవుటకు మనసు లేకుండుటఁ జూచి సీత యతనిమాటను బాటింపక మిక్కిలిదుఃఖితయై యాతనిం జూచి యిట్లనియె. ఇది యిరువదియెనిమిదవ సర్గము.



### సీత తా నడవికి రాక మాన నని రామునకుఁ జెప్పుట.

రాముఁడు చెప్పినమాట విని సీత దుఃఖిత యయి కన్నుల నీరు గ్రమ్మి మొగంబుపై నించుక వాలయ నల్లన నతనిం జూచి "నీవు వనవాసము చేయువిషయమున నేయే దోషములు చెప్పితివో అవన్నియు నీయెయ్యమును మున్నిడుకొని నీతోడం గూడి యున్న నాకు దోషములు కావు; గుణములే యగు నని యెఱుంగుము. రామా! జింకలు సింగములు ఏనుఁగులు పెద్దపులులు శరభములును పెద్దచమరములును పక్షులు మఱియు నడవిలో నుండుతక్కినమృగము లన్నియును నీరూపమువంటి రూపమును మును నెప్పుడును జూచియుండవు గాన నిన్నుఁ జూడఁగానే భయపడి యవ్వలికిఁ బాఱిపోఁ గలవుగాని మన కెదురునచ్చి చంపుననుట యొప్పదు. భయము కలుగునప్పుడు అందఱును భయపడుదు రేకదా. కావున వానివలన నాకు భయము గలుగదు. మఱియు నిన్నుఁ బొమ్మన్నయాజ్ఞయే నాకును బోవుట కాజ్ఞ యగుచున్నది. కనుక మీతండ్రి యాజ్ఞచొప్పున నేనును అవశ్యము నీతోఁగూడఁ బోవలసినదాన నైతిని. రామా! నీవు నన్ను దిగవిడచి పోదు వేని నిన్నుఁ బాసినందులకు నేను ప్రాణములు విడువవలసినది ధర్మము. రాఘవా! నేను నీతోడున నుండఁగా దేవతాధిపతి యగునింద్రుఁడైనను నన్ను తిరస్కరించి తేజము దక్కించుకొనఁ జాలఁడు. పెనిమిటిని బాసినపడఁతిమాత్ర మెంతయును బ్రతుకఁజాలదు. ఈవిషయమున నీవు మిక్కిలియు నా కుపదేశించియున్నావు. ప్రాజ్ఞశిఖామణీ! ఇంతే కాక మును నేను నాతండ్రియింట నుండునపుడు నాకు వనంబున వసించియుండవలసి వచ్చునని జ్యోతిర్విదు లగుబ్రాహ్మణులు చెప్పఁగా వినియున్నాను. ఇది నిజము. మహాబలా! నేను ముందు సాముద్రికలక్షణములు దెలిసినబ్రాహ్మణులవలన వనవాసము నాకుఁ గలుగు నని విని యది మొదలుగా నిత్యమును ఎప్పుడెప్పు డడవికిఁబోయి యుందునా యని యుత్సాహపడుచున్నాను. ఆలక్షణవేత్తలు నిర్దేశించినట్లు నేను వనములోఁ గొంత కాలము వసింపవలసి యున్న దేకదా. అడవికిఁ బోఁగలదిగా పెద్దలచేతను నిర్దేశింపఁ బడియున్నట్టినాకు నీతోఁ గూడ వనమునకుఁ బోవలయునే కాని మఱి వేఱు విధమున దానిని జెల్లించుకొనుటకు వీలులేదు. పెద్దలయాదేశమునుబట్టి వచ్చుచున్నాను గాని నాయిచ్చచేతను గాదు. నే నాబ్రాహ్మణులమాటను నిజము గావించుదాన నై నీతోఁ గూడ నడవికి వచ్చెదను. అందులకుఁ దగునట్లు వనవాసము నొడఁగూర్చు కాలమును వొడసూపినది. కావున తప్పక నీతోడ వచ్చెద. ఆబ్రాహ్మణులవాక్కు సత్యమగుఁగాక. వనవాసమునందు పలువిధము లైనకష్టములు కలుగు నని నాకును దెలియును జుమీ. అయినను వీరుఁడ వగునీ కవి గలుగవు మనస్సుదిట్టతనము లేని వారికే యవి సంభవించును. నేను కన్నె నై పెండ్లి గాకున్నపుడు నాతండ్రియింటిలో నొకనాఁడు నాతల్లియొద్దనుండఁగా సదాచారసంపన్న యైనయొక తాపసస్త్రీ నన్నుఁ జూచి నాకుఁ గొంతవనవాసము కలుగు నని చెప్పఁగా వినియున్నాను. నేనిక్కడవ

చ్చినపిదప నీతోఁ గూడ గంగాతీరమందలితపోవనాదులందుఁ గొంత వాసముచేయవలయు నని కోరుచుంటినిగదా. నాథా! మున్ను నిన్నును నాకోర్కె తీరునట్లు బహువిధములుగా వేఁడి ప్రసన్నుని చేసికొనియే యున్నాను. రాఘవా! నాకు వనమునకుఁ బోవుట పండువుగానున్నది. నీకు శుభం బగుఁగాక. శూరుండ వగునీవు వనములో వాసము చేయుచుండఁగా నీకు శుశ్రూష సేయవలయు నని కోరుచున్నాను. నీవును అసూయాదులు లేనినిర్మలాంతరంగుఁడవు. నేనును ప్రేమతోడ భర్త వగు నిన్ను వెంబడించి యనుసరించి నాపాపములను దూలించుకొనెదను. 'ఇచ్చటనేయుండి కులదేవత నారాధించి పాపములు పోఁగొట్టుకొనరాదా' యందువేని నాకుభర్తయే దైవము; అతనికన్న నెక్కుడుదైవము నాకులేదు. ఇంతేకాదు. పరలోకమందును నీతోఁ గూడ నాకు నెడతెగని సంగమును ఒప్పియుండును. మహామతీ! 'ఈలోకమున తండ్రి మున్నగువారిచేత ఏస్త్రీ ఏపురుషునకు తమతమవర్ణాదిధర్మము చొప్పున నుదకపూర్వకముగా నియ్యంబడునో, యాస్త్రీకి పరలోకమందును ఆపురుషుఁడే పెనిమిటిగానుండు' నని పవిత్రమైనయీవేదవాక్యమును మహాయశస్కులైనబ్రాహ్మణులు చెప్పఁగా వినికి గలదుగదా. నీవు, సదాచారసంపన్నయు పతివ్రతయునైయుదకపూర్వకముగాఁ బరిగ్రహింపఁబడినయిల్లాలిని, నన్ను, వనమునకుఁదోడ్కొని పోననొల్లకుండుటకేమికారణము? కాకుత్స్థా! నీయందుభక్తిగలదానను; పతివ్రతను; నీవెక్కడి దిగనాడెదవో యని దుఃఖితనై యున్నదానను; సుఖముగలిగినను దుఃఖము గలిగినను నీయెడల నొక్కతీరుగనే నడచుకొనుచుండుదానను; నీతోడి సుఖదుఃఖము లేకలదానను; ఇట్టినన్ను విడిచిపోవరాదు; తోడ్కొని పోవుటయే నీకుఁ దగును. ఇట్లు దుఃఖించుచున్న నన్ను వనమునకుం దోడ్కొనిపోవ నొల్లవేని నేను విషముదినియో నిప్పులనురికియో నీళ్లను దుమికియో ప్రాణములు విడిచెదను" అనిచెప్పెను. ఆబిడ యిట్లు పలువిధములఁ దన్నడవికిఁ దోడ్కొని పొమ్మని రాముని బతిమాలుకొన్నను ఆనుహాబాహుఁడు జనులెవ్వరు లేని యడవిలో సుకుమార యగునాచెలువ మెలఁగుట కష్టమని తలఁచి యామెను దోడ్కొనిపోవ సమ్మతింపఁడయ్యె. ఆ సీతయు రాముఁడిట్లు తోడ్కొనిపోవ నన్నమాటకు కన్నులఁ గాలువలు గట్టువేఁడికన్నీటిచే పుడమి నంతయుఁ దడుపునో యనునట్లు మిగుల దుఃఖించెను. ఇట్లు దుఃఖించుచు కోపశోకంబులు మీఱి, కెమ్మోవి పయింబడి నెత్తురు గారుచున్న యాసీతాదేవింజూచి బుద్ధిమంతుఁ డగునాకాకుత్స్థుండు తనతోఁగూడ రాకుండ నిలుపుటకై మిక్కిలియు నూఱడించెను. ఇది యిరువదితొమ్మిదవసర్గము.



**సీత రాముఁ డడవికిఁ దోడ్కొనిపోవ నన్నందులకు నాక్షేపించుట.**

జనకరాజసుత యగుసీత యిట్లు రాముఁ డూఱడించుచుండఁగా, వనంబున నెట్లయిన రామునితోఁ బోయి వసింపవలయునని పూని, విశాలవక్షుండును

శూరుఁడును రఘుకులాలంకారుఁడు నగుతనభర్తనుజూచి, స్నేహంబునను, పొంత మని యెడు తలంపుసొంపునను, ఇట్లని తిరస్కరింపఁజొచ్చెను.*"రామా! నీయందు సౌంద

---

* ఇందులకు 'కిం త్వా మన్యత వైదేహః పితా మే మిథిలాధిపః। రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్.' అని మూలము. దీనికి విశేషార్థములు (1) (రామ) రమింపఁజేయువాఁడు - పైకిఁ గనఁబడుచున్న రూపమునొక్క పసనుమాత్రము చూచి వసిష్ఠుఁడు (రాముఁ) డని పేరు పెట్టి నీకు లోపల సారములేదని తెలిసి అట్టిసారము గలదని సూచించు శత్రుఘ్నుఁ డను పేరు కడపటితమ్మునికిఁ బెట్టినాఁడు. కావున నే 'రామ ఇత్యభిరామేణ వపుషా తస్య చోదితః। నామధేయం గురు శ్చక్రే జగత్ప్రథమమంగళమ్' అని మేనియొక్క సొగసునుబట్టియే యిట్టిపేరు పెట్టినాఁడని యున్నది. అదిజగత్తునకు మంగళమును అయినప్పుడు ఆజగత్తులోనిదే యైన నాకేల యిట్లయినది? (రామ) 'సహస్రనామతత్తుల్యమ్' అన్నట్లు రామనామ మొకటి విష్ణుసహస్రనామములతో సాటియై ఆ యన్నింటిశక్తి గలది. అట్టి నామము గల నిన్ను సంబంధించియుండియు నాకీ యవస్థ యేమి? (వైదేహః) విదేహవంశమునఁ బుట్టినవాఁడు. 'కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః'-'కర్ముచేతనే జనకాదులు సిద్ధినిబొందిరి' అన్నట్లు కర్మకలాపములనువిడువకయే మోక్షసిద్ధికి ప్రయత్నించువారు గాన, ఆకర్మములను సహధర్మచారిణు లగుపత్నులతోఁగూడియే యాచరింపవలసినవారు గావునను, పత్నీవియోగము వారుక లేనివారనుట, (వైదేహః) జన్మించినది మొదలుగా దుఃఖ మెఱుఁగక యిప్పుడు నన్నుఁ గన్నందులకు అన్నిదుఃఖములు పడవలసి వచ్చినవాఁడు, (మిథిలాధిపః) మిథిలకు ప్రభువు - నీవు నన్నుదిగవిడిచి పోయినందులకు ఆప్రభువు మనసునొచ్చె నేని అతనిమిథిల యంతయు నొచ్చు నేయని భావము, (మిథిలాధిపః)ఒక దేశమును తనబుజములప్రాపున భరించియున్నట్టివానికి, ఒకఁడొక స్త్రీని తనభుజములప్రాపున భరింప లేఁడని తెలిసెనేని మనస్సు పుండగును గదా యనుట, ఇట్టివాఁడైన, (మేపితా) నాతండ్రి-జనకుఁడనుట - బిడ్డలు సమర్థులయిరేని, తాతిగుండె గలిగి అడవికిఁ బంప నేర్చినతండ్రులును గలరు. నా తండ్రియో నేను సామర్థ్యముగలిగియున్నను అడవికి పోవుటవిను నేని దుఃఖితుఁడగును. ఒంటిగానుండుటకును ఓర్చుటకును శక్తిగలబిడ్డను గనుక చేపట్టినవానియందు యుంచిన నే బ్రతుకునట్టిదియు అదిలేక పోయె నా బొత్తిగా నశించునట్టిదియు అగునను బోఁటిబిడ్డను గని చెడినాఁడే యనుట. 'ఇట్టిజనకుఁడు, (స్త్రియుం పురుషవిగ్రహమ్) పైకిపురుషాకారము గలిగి నిజమునకు స్త్రీయే యైనవానిని అనుట-కిరీటమును పీతాంబరము నే భేదము కలిగించునది; అవి లేనియెడల స్త్రీ యనుట కెంతమాత్రము భేదముండ దనుట. ఆకిరీటపీతాంబరములును లేవు; అవియుండినను మగచిహ్నములు గావున వానినిబట్టి యైనను నిన్ను మగవాఁడని తలఁచి యడవిలో నెవ్వరును కీడు సేయరు అట్లవి రక్షకములుగా నుండు నేయని యర్థము.(పురుషవిగ్రహమ్) బయటికి పురుషునియాకారము గలిగియున్నావు. కాఁబట్టియే యిట్టియనర్థము కలిగినది. (పురుషవిగ్రహమ్) పురుషునివంటి యాకారముమాత్రమే కాని యది శత్రువులను అడఁగఁ ద్రొక్కునట్టిది కాదు. పయిరునడుమఁ గట్టినట్టి వెఱ్ఱిబొమ్మవంటివాఁడవు, (పురుషవిగ్రహమ్) లోపల స్త్రీగాను బయటికి పురుషుఁడుగాను నుండుటచే స్త్రీత్వపురుషత్వములు కలసి యుండుటను మూఁడవ ప్రకృతిగా లోకులు చెప్పుదురు. నేను భయముచేతి నట్లు చెప్పలేదు. స్త్రీ కాదు పేడి కాదు పురుషుఁడు కాదు జంతువు కాదు అని వేయువేయు చెప్పితిని. ఇట్టివాఁడైన, (జామాతరమ్) అల్లుని అనుట-నీవు మాతండ్రికి పెద్దకొడుకైనట్లు మాతండ్రికి పెద్దల్లుఁడవైతివి (జామాతరమ్) 'జామాతా దశమోగ్రహః' - 'అల్లుఁడు పదియవగ్రహము' అన్నట్లు ఆఁడుబిడ్డను కని యిచ్చినవానికి అల్లునితోఁగూడ పదిగ్రహములు గలవు. పట్టి పీడించునిట్టియల్లునిగా, (ప్రాప్య) పొంది- తానే చూచి నీకిచ్చినాఁడు. కనుక మఱొకరు చేసినా

ర్యముమాత్రమే యున్నది. దానినిజూచి యంద ఱనుభవించుచున్నారు కాని మఱి పౌరుషము లేదు. మిథిలకు ప్రభుఁడును విదేహవంశ్యుఁడును నగునాతండ్రి, నన్నొక్క తెను గావనేరక విడిచి నీచెడవికిఁ బోయితి వని యెఱింగెనా, యిట్టినిన్ను 'అపుడు నాయ

---

రని నిందించుట కెంతమాత్రమును వీలులేదనుట, (త్వా) నిన్ను - సత్త్వశీలవింతని విఱిచి లోకము నంతయు భ్రమింపఁజేయుచున్న నిన్ను, (త్వా) పసిత్తుని అనువర్తించువాఁడ నగుటచే నేనే సూక్ష్మ ధర్మముల నెఱుఁగుదునని యభిమానము గలిగి యున్ననిన్ను, (త్వా) పట్టిసౌందర్య మొకటియే కలిగి మఱి యేసారమును లేనినిన్ను, (కిం అమన్యత) (కింపక్ష్యతి) అనియు పాఠము. ఏమి తలఁచును. లేక, ఏమనును. రాజు అనరాదు, రాజధర్మము తెలియువనగాదు, గురుకులవాసము చేసి యెఱుఁగ వనరాదు, కులపరంపరాగత మైనయాచారము తెలియువనరాదు, కులస్త్రీలకు భర్తతోడనే యుండుట యావశ్యకమనుట తెలియువనరాదు, కులస్త్రీ నుపేక్షింపకుండుటముఖ్యసాధనముగాఁగల యేకపత్నీవ్రతత్వము నీకు లేదనిగానియెన్న శక్యము గాదు. వేయేల అన్నియనుష్ఠానము లుండియు నీవిటు పెద్దపొరపాటుపడితి వనియే తలఁపవలసి యున్నది. (కింత్వామన్యత) నన్ను మామయగు దశరథునిచేతఁగాని అత్తయైన కౌసల్యచేతఁగాని మాతండ్రి యొప్పగింపలేదు 'ఇయంసీతా' ఈసీత అని నీ చేతనే ఒప్పగించినాఁడు. ఉత్తమస్త్రీలు భర్త నెడఁబాసి రేని ప్రాణములతో నిలువలేరని చెప్పియిచ్చినాఁడు. 'ఇయం' ఇది మిక్కిలియభిమానము గలది; అనఁగా 'ఆర్తార్తేముది తేహృష్టా' 'మగఁడు దుఃఖించిన దుఃఖించునది. సంతోషించిన సంతోషించునదియు' అని పతివ్రతిలక్షణములు చెప్పఁబడియున్నవి. దేహమును ప్రాణంబును భర్తకు వేఱుగాను తమకు వేఱుగాను నుండువారికే కదా యీ లక్షణములు. ఈబిడకో దేహమును ప్రాణమును నీవే కనుక తానిట్లు విలక్షణయై యుండునభిమానముగలదియని చెప్పియిచ్చినాఁడు 'సీతా' స్త్రీలకు తల్లిగుణము మిక్కిలి యుండును కాన భూమివలె నిది పట్టిగంధముసుమీ. కాన ఎత్తివిఱియోగించుకొనవలసినదం తేచుమీ, 'మమసుతా' దీనినిబట్టిగాకున్నను నన్నుఁ బట్టియైన గైకొనవలయునన్నాఁడు. 'సహధర్మచరీ' నీవుపూనుధర్మములకుఁగూడ ఇదియును పూనునన్నాఁడు. 'తవ' సహధర్మచరియైననీకు శేషముగానుండునన్నాఁడు. 'ప్రతీచ్ఛ' నీకు అర్హమగునట్లు పరిగ్రహింప వలయునన్నాఁడు. 'చ' అర్థ్మారాలేయని తెలియుటేకాక అనురూపమైన భోగముల నీ వియ్యఁదగినది యన్నాఁడు. 'ఏనామ్' ఇట్లునోఁచి కన్నట్టిదానిని, 'భద్రస్తే' నేను నోఁచి కన్నమాత్రమే కాని, ఫలము నీదే-భోగ్యత యొచ్చుట భోక్తకే పురుషార్థముగదా యన్నాఁడు. 'పాణింగృహ్ణీష్వ' చేయి చాఁపను దెలియదు; నీవే పట్టుకొనుమన్నాఁడు, 'పాణినా' చేతిని చేతితో నే పట్టుకొనుట తెలిసియుండియు నిచట చేతితో అని చెప్పనేల యన లోకమంతయు శరణు సొచ్చినను ప్రాపై కాచునట్టి వీరస్తుతి గలనీపాణియందు కన్నిడి ఇది తగినకార్యముల జరుపఁ జాలినదగుటచే దీనితో పట్టుకొనుమని విశేషించిచెప్పినాఁడు. ఇటువంటియవస్థలయందు ఊరక తోడ్కొనిపోవుట కాదు-ఎత్తుకొని పొమ్మని తెలుపుటకే కదా 'పాణినా' యని విశేషించి వర్ణించినది. ఇవంతయు నీవు మనస్సునఁ దలంపవైతివి. మఱి వేఱుగా గ్రహించితివో 'ఇయం' అని సౌందర్యమును జెప్పినాఁడనియు, 'సీతా' అని నా మాతృకులశుద్ధిని చెప్పినాఁడనియు, 'మమసుతా' అని పితృకులశుద్ధిని చెప్పినాఁడనియు, 'సహధర్మచరీ' అని నాసౌశీల్యమును చెప్పినాఁడనియు, 'తవ' అని నిన్ను కొనియాడెననియు, 'ప్రతీచ్ఛ' అని ఇచ్చిన వలదనను చెడిన వెదకను అనియుండక కయికొనుమన్నాఁడనియు, 'చ' అనుటచే కంటికి నింపైనదా యని యడిగినాఁడనియు, 'ఏనామ్' అని నాతండ్రి కావున మిక్కిలి సౌందర్యాదులు గలదానినిగా నన్ను భావించి వాత్సల్యముచే చెప్పినాఁడనియు, 'భద్రంతే' అని నాయందలిప్రేమకన్న నూఱంతలు నీయందు ప్రేమ

ల్లుఁడు నిజమున కాఁడుది; పైకి పురుషవేషము వేసికొని వచ్చి నాకూఁతును బెండ్లాడినాఁ' డని తలంచు నేకదా. అకటా! *ఈలోకులు జ్వలించుచున్న సూర్యునియందుఁ

---

గలిగి దృష్టిదోషము కలుగునోయని నీకు రక్ష చేసినాఁడనియు, 'పాణింగృహ్ణీష్వ పాణినా' అని క్రియా కలాపమునకు చేయవలసినవిధిని చెప్పినాఁడనియు, గ్రహించితివి. సర్వజ్ఞుఁడైన మాతండ్రి చెప్పినవానిని సరిగా గ్రహింపక, యిట్లు గ్రహించి, నేఁడు నన్ను దిగవిడిచిపోయినయెడల (కిం త్వామన్యత) నిన్ను మాతండ్రి యేమనితలంచును:—తనిశ్లోకి.

లేక-(హేరామ) ఓరామా, (పురుషవిగ్రహమ్) ఆకారమునకు పురుషుఁడై కనఁబడుచు, (స్త్రియం) స్త్రీయేయగు, (త్వాం) నిన్ను, (జామాతరమ్) అల్లునిగా, (ప్రాప్య) పొంది, నాతండ్రి, (కిమమన్యత) ఏమి తెలిసికొనెను, ఏమియు తెలియఁడయ్యె. పైకి పురుషుఁడవను నిజమునకు నీవు స్త్రీయే యగుదువు. నిన్ను ఇట్టివాఁడని తెలియక నాతండ్రి నన్నిచ్చినాఁడు తెలిసియుండిన నేనియిచ్చి యుండఁడని భావము.

లేక-'సఏవ వాసుదేవోఽయం సాక్షాత్పురుష ఉచ్యతే। స్త్రీప్రాయ మేతత్సర్వం జగద్బ్రహ్మపురస్సరమ్' 'ఆయీవిష్ణుఁడొక్కఁడే సాక్షాత్పురుషుఁ డనఁబడును. కనుక బ్రహ్మ మొదలుగాఁ గలతదితరమైన జగమంతయు స్త్రీప్రాయమే' అను విష్ణుపురాణముచొప్పున, (రామ) రామా, (త్వాం) నిన్ను (జామాతరమ్) అల్లునిగా, (ప్రాప్య) పొంది, (పురుషవిగ్రహమ్) పురుషాకారముగల తక్కిన జగమందలిజనమును (స్త్రియం) స్త్రీప్రాయముగా, (కిం) ఎందుకు (అమన్యత) తలఁచెను. విష్ణుదేవావతారుఁడగు నిన్నల్లునిగాఁబొంది నిన్నొకనినే పురుషునిగాను తక్కినవారి నెల్ల స్త్రీలనుగాను నాతండ్రి తలంచినాఁడేల? అతఁడు నీసంగతి తెలియక భ్రమించినాఁడు. లేనిచో నిన్నిట్లు తలఁపఁడని భావము.

లేక - (రామజామాతరం ప్రాప్య స్త్రియంపురుషవిగ్రహమ్) అనుదానిని రామజ-అమాతరం-ప్రాప్య-స్త్రియం-పురుష-విగ్రహమ్, అని ఛేదము చేసినయెడల, (రామజ) రమింపఁజేయుటకుజనించినవాఁడా - అవతరించినవాఁడాయనుట. (హేపురుష) క్రీడార్థముగా నిట్లవతరించినపరమపురుషా, (అమాతరం స్త్రియం) నీకు తల్లిగాని స్త్రీని-తల్లి కాక సవతితల్లియైన కైకేయిని, (ప్రాప్య) ఉద్దేశించి, నాతండ్రి, (విగ్రహమ్) కలహము, (అమన్యతకిం) తలంచెనాయేమి? తలంపనే లేదనుట. నీవు లోకులను రమింపఁజేయుటకై లీలార్థమిట్లవతరించిన పరమపురుషుఁడవు. నన్ను నీకిచ్చునపుడు నీసవతితల్లి కైకేయితోడ నిట్టికలహము పుట్టునని నాతండ్రి తెలిసినవాఁడు కాఁడని యర్థము. అయినప్పటికిని నన్నువిడిచి నీ వడవికిఁ బోఁ జనదని భావము.

లేక-(పురుషవిగ్రహమ్) భక్తులగు పురుషులను విశేషముగా పరిగ్రహించునట్టివాఁడును, (రామజామాతరం) ఇదసమాసము-రమింపఁజేయునట్టి యల్లుఁడయినవాఁడును, 'రమన్తే యోగినోఽనన్తే' అని శ్రుతి-ఆనందరూపుఁడైనయల్లుఁడైనవాఁడును, అగు - (త్వాం ప్రాప్య) నిన్నుఁ బొంది, నాతండ్రి, (స్త్రియం) తన స్త్రీని-ఇట స్త్రీశబ్దము తక్కినవానికి ఉపలక్షణముగనుక తన పుత్రమిత్రకళత్రాదికమును ఆముష్మికమును అనుట, (అమన్యతకిం) సత్యమని తలంచినాఁడా? లేదనుట-ఆనందరూపుఁడవై భక్తులను మిక్కిలి వశముసేసికొను నిన్ను అల్లునిగాఁ బొంది నాతండ్రి తక్కినపుత్రమిత్రాదులగు ఐహికాముష్మికముల నన్నిటిని తుచ్ఛముగా తలంచి పరమానందపూర్ణుఁడయ్యెను. ఇట్లు సర్వానందకరుండవగునీవు నాకేల దుఃఖము కలిగించెదవని భావము. మహేశ్వరతీర్థులు.

* ఇందులకు 'అనృతం బతలోకోఽయ మజ్ఞానాద్యద్ధి పశ్యతి। తేజో నాస్తి పరం రామే తపతీవ దివాకరే' అని మూలము-విశేషార్థములు. (అయంలోకః) ఈలోకము (యత్) దేనిని-రామునియందు

బోలె రాముని యందు మిక్కిలి తేజ మున్నదని యజ్ఞానముచేతఁ జెప్పెదరు. అది యబద్ధము. ఉండునేని యది, సూర్యునియందు కనఁబడునట్లు, కానిపింపలేదే. వేయి యకార్యములు చేసినదైనను భార్యను భరింపవలయునని పెద్దలు చెప్పుదురు. ఇట్లుండఁగా నన్నుఁ దోడ్కొనిపోవువిషయమున నీ వేమియకార్యము చేసితి వని విషాదపడుచున్నావు. కాలాగ్నిసదృశమైనకోపము గలనీకు భయ మెక్కడినుండి కలుగును? మఱొక్కరిని మనస్సునఁగూడఁ దలఁపక నీయందే మిక్కిలి యాసక్తురాలనై యున్ననన్ను విడువఁగోరుటకు ఏది కారణమో కానరాదు. మనస్సునందు ఏమి తలఁచి ఇట్లు విషాదపడెదవో, ఇట్లు భయమునొందితివో, తెలియరాదు ఆవిషాదమునను భయమునను ఇట్టిదాన నగునన్ను విడువఁ గోరెదవు. ద్యుమత్సేనునికుమారుఁడైన సత్యవంతుని ననుసరించుటయే వ్రతముగాఁ గలసావిత్రివలె, నన్నును, నిన్ను అనుసరించియే వర్తించుదానినిగా నెఱుంగుము. అనఘా! ఇట్లు గాక కులము చెఱుపునట్టిదుష్టురాలివలె, నే నొకప్పుడును మనస్సునవైనను నిన్నుఁదక్క నితరపురుషునిఁ జూచుదానను గాను. కనుక నీతోడ వనంబునకు వత్తునుగాని నిలువనేరను. అట్లు దృఢపతివ్రతనని తెలిసియు నన్నుఁ దోడ్కొనిపోనొల్లవా? మంచిది, *రామా! కుమారావస్థయందే

మిక్కిలి తేజస్సు ఉన్నదనుటను, (వక్ష్యతి) చెప్పనో, అది, (అజ్ఞానాత్) వారియజ్ఞానమువలన, (అనృతంబత) అబద్ధమేకదా, (తపతిదివాకరే ఇవ) జ్వలించుసూర్యునియందుఁబోలె, (రామే) రాముని యందు, (పరం తేజః నాస్తి) మిక్కిలి తేజస్సులేదు:—అని సీత, రామునకు తేజ మున్నదనుమాటను తానే నిరసించి లేదని నిర్ణయించినది. లేక, (అజ్ఞానాత్) రామునిస్వరూపము తెలియమిచేత, (అయంలోకః) ఈలోకము, (తపతి దివాకరేఇవ రామేపరం తేజో నాస్తి) జ్వలించుచున్న సూర్యునియందుఁబోలె రామునియందు మిక్కిలి తేజస్సు లేదు అని, (యత్) దేనిని, (వక్ష్యతి) చెప్పునుగో, అది, (అనృతమ్) అబద్ధము. జనులు రామునకు సూర్యునివలె తేజస్సులేదనుట యబద్ధము. అద యతనికి ఉన్నదనుట. ఇట సీత, లోకులు రామునికి తేజములేదనుటను నిరసించి తానున్నదని నిర్ణయించెనని యర్థాంతరము. లేక, రామునకు తేజస్సు లేదని మొదట నాక్షేపించి పిదప నట్లుచెప్పితి మే యనుభయమున లోకమే యట్లు చెప్పెడినిగాని తాను గాదని తనయపరాధమును సీతపరిహరించుకొనునట్లు అర్థము సేయుఁదగును. ఎట్లన (అయం లోకః) ఈలోకము, (తపతిదివాకరఇవ రామే పరం తేజో నాస్తి) జ్వలించుసూర్యునియందువలె రాముని యందు మిక్కిలి తేజస్సులేదు, అని (అజ్ఞానాత్) విచారింపక, (అనృతంయత్ వక్ష్యతితత్) అబద్ధమే చెప్పెడినో అది-వారట్లు రామునకు తేజస్సు లేదని యబద్ధము చెప్పుట, (బత) అయ్యో-నేను సహింపలేనని భావము.

*ఇందులకు 'స్వయంతు భార్యాంకౌమారీం చిరమధ్యుషితాం సతీమ్। శైలూషఇవ మాం రామ పరేభ్యో దాతుమిచ్ఛసి' అని మూలము-భరతునకు రాముఁడు రాజ్యము నిచ్చుట యోర్వక సీత దీనిని చెప్పినది. ఎట్లనఁగా:-రామా, (భార్యాం) భరించుటకు తగినది, ఏలనఁగా (సతీం) అనశ్వరమైనది, ఏలనఁగా, (చిరమధ్యుషితాం) చాలకాలముగా నీపితృపితామహులనుండి వచ్చినది, (కౌమారీం) కుమారవయస్కుఁడగునీకు పొందఁదగినది. అనఁగా యౌవరాజ్యరూపమైనది, అగు (మాం) రాజ్యలక్ష్మిని, (శైలూషఇవ) వేషధారివలె, (పరేభ్యః) భరతాదులకు, (దాతుమిచ్ఛసి) ఇయ్యఁగోరుచున్నావు, ఇట్లిచ్చుట నీకుఁ దగదు:—మహేశ్వరతీర్థులు.

నిన్నుఁ బెండ్లాడినదానను; బహుకాలము నీతోఁ గూడియాడి వసించియున్నదానను; పతివ్రతను; నీకు భార్యను. ఇట్టినన్ను, భార్యను వడుపున కిచ్చి బ్రతుకువానివలె, నీవై పరుల కియ్యఁగోరుచున్నావు. ఎవరికి హితము సేయుచుండు మంటివో, ఎవరికి శుశ్రూషసేయుకొఱకు నన్నిచటనే నిలుపుచున్నావో, ఆతల్లులకు నీవే యనుకూలుఁడవై చెప్పినపని సేయుచుండుము. నేనో నీవెంటనే వత్తును. ఎవని కింత సేపు హితము బోధించుచుంటివో, ఎవనినిబట్టి నీవు క్లేశపడుచున్నావో, అట్టి నాయీమాటను నీవేయిపుడు విని నేను చెప్పినట్లు తోడ్కొనిపొమ్ము. ఎవనియెడల హితముగా నడచుకొనునట్లు చెప్పితివో, ఎవనియభిషేక ప్రయోజనమునుబట్టి తండ్రిచే నిగ్రహింపఁబడితివో, యట్టిభరతునియిచ్చచొప్పున నీవనువర్తించుచు నతనిపంపు సేయుచుండుము. నేనో నిన్నే యనువర్తింతును. నన్నుమాత్ర మట్లుచేయు మని చెప్పకుము. సమస్తమును తెలిసిననీవు నన్నిచట విడిచి యడవికిఁ బోరాదు. తపశ్చరణమో, యరణ్యావాసమో, లేక స్వర్గప్రాప్తియో, ఏదైనను నీతోడిదే నాకగుఁగాక. నీవు లేక నాకేదియు వలదు. నీవెనుక నేను వచ్చుచుండఁగా నాకెట్టిమార్గమందును కష్టమేదియుఁ గలుగదు; మఱి యుద్యానవనములందు విహరించునట్లును, పూసెజ్జను బరుండియుండునట్లును, సుఖముగానే యుందును. దారియందు మొలచియున్నదర్భమొక్కలను ఱెల్లును, ముండ్లదుబ్బలును, మఱియుం గలముండ్లచెట్లును, నీతోఁ గూడఁ బోవునప్పుడు నాకు దూదివలెను జింకతోలుమున్నగుతోళ్లవలెను తాఁకుటకు సుఖముగానే యుండును. రమణా! అడవిలో పెనుగాలికి పైకినెగిరి నన్నుఁ గ్రమ్ముకొనుదుమ్మును, వాసన గట్టిన మేలిచందనపుఁబొడిగాఁ దలఁచెదను. నీ వడవియం దుండునప్పుడు అందు నడుమ లేఁతపచ్చికపట్టులందుఁ బరుండుటకంటె, నిచ్చట చిత్రకంబళములును దుప్పట్లును బఱచినపాన్పునందుఁ బరుండుట మిక్కిలిసుఖమగునా? కాదు. అడవియందు నీ వాకు లలములుగాని గడ్డగాని పండుగాని కొంచెముగానో యెక్కువగానో, యేది నీచేతులారఁ దెచ్చియిత్తువో యది నాకు అమృతరసమువలె నుండును. అందు ఆయాఋతువులందుఁ బూచెడియాయాపువ్వులను దుఱుముచు, ఆయాపండులను దినుచు, సుఖముగా, నాతల్లినిగాని తండ్రినిగాని యింటినిగాని, యొంతమాత్రమును స్మరింపకుండెదను నీవు నన్నుఁ దోడ్కొని యడవికిఁ బోయినపిదప, నీ కచ్చట నానిమిత్తమయి యేదియేని కష్టముగాని దుఃఖముగాని కనుపట్టదు. కావున నన్నక్కడ భరించుటకు నీకుఁగష్టముగానుండదు. వేయేల? ఒక్కమాట చెప్పెదవిను. రామా! నీతోఁ గూడియుండుటయే స్వర్గము. నిన్నుఁ బాసియుండుటయే నరకము. నాకు నీయందుఁ గలప్రీతి, నిన్నెడఁబాయఁజాలనంత మిక్కుటమైనదని యింతవఱకు పలువిధములు అనుభవించుచున్నవాఁడవు గాన నన్నుఁ బిలుచుకొనియే యడవికిఁ బొమ్ము. ఇట్లు అడవికి వచ్చుటకు భయముమాలి నిశ్చయముతో నున్ననన్ను వనంబునకుఁ దోడ్కొని పోవవా? అట్లేని యిప్పుడు, నీ విచట నుండునప్పుడే, విషము త్రాగి

ప్రాణములు విడుతునుగాని పగవారివశమునఁ గొంచెమైన నుండనుజుమా. రామా! నే నిపు డొకవేళఁ జావకున్నను, నీవు పోయినపిదప నయినను, దుఃఖమున నాప్రాణములు పోవుట తప్పదు. పిదప దుఃఖమునఁ జచ్చుటకంటె, నిపుడు నీ వుండఁగానే, నీవు దిగవిడిచి పోవునపుడే, ప్రాణములు విడుచుట మంచిది. పిదప దుఃఖమునఁ జచ్చుట మంచిదికాదు. నిన్నుఁ బాసి యీదుఃఖమును ముహూర్తకాలముగూడ సైఁపను. ఇట్లుండఁగా, మొదట సంవత్సరములు పది, నడుమ మూఁడు, కడపడ నొకటి, యిట్లు పదునాలుగు సంవత్సరములు సైఁచుటను జెప్పనేల!' అనెను. ఇట్లాబిడ శోకంబునఁ బొక్కుచు, జాలి పుట్టునట్లు మిక్కిలి విలపించి యంతఁ బురుషుని బిగ్గఁ గాఁగిలించుకొని పెద్దగొంతున నేడ్చెను. ఆయమ రాముఁడు చెప్పినమాటలు కటువులై గ్రుచ్చుకొనఁగా, విషము పూసినబాణమును నాటినయాఁడుగజమువలె నొచ్చి, అరణిని చిలుకఁగా నది చాలసేపు లోనడఁగి యున్నయగ్గిని గ్రక్కునట్లు, మాటల పరాకున చాలసేపు లోనడఁగియున్న కన్నీళ్లను గార్చినదయ్యె. అప్పు డామెకన్నుల నుండి, దుఃఖమువలనఁ బొడమి, యెడతెగక మిక్కిలి కాఱుటచే కాటుక యంతయుఁ బోవఁగా, పటికమువలె నచ్ఛముగా నున్నకన్నీరు, తామరనుండి పూఁదేనియ వలెఁ గాఱుచుండెను. స్వచ్ఛ మగుచంద్రబింబమువలెఁ బొలుపారుచు వెడఁదలైన కన్నులతో చెన్నారెడియాబిడనెమ్మొగము సంతాపంపువేఁడిమిచే, జలమునుండి తీసినతామర యెండతాఁకున వాడునట్లు, మిక్కిలియువాడినదయ్యె. అప్పుడు రాముఁడు, మిక్కిలి దుఃఖితయై మూర్ఛపోయిన ట్లున్నయాచిన్నారిని బాహువులఁ గవుంగిలించికొని మిక్కిలినమ్మిక పుట్టుబుజ్జగింపుమాటల ' దేవీ ! నీకు దుఃఖము కలుగునట్టయిన నాకు స్వర్గము లభించినను నొల్లను. సమస్తజంతువులను బుట్టించి పెంచి చంపు నారాయణునికి దేనివలనను భయము లేనట్లు, నాకును దేనివలనను భయము గలుగదు. సుందరవదనా ! ని న్నెడఁబాయ నోపనివాఁడ నయ్యును, నిర్భయుఁడ నయ్యును, ని న్నడవిని గాపాడ శక్తుఁడ నయ్యును, నీమనస్సునందలి యభిప్రాయ మంతయు నాకుఁ దెలియ కుండినందున నీవు నాతోడ వచ్చి యరణ్యమున వసించుటకు సమ్మతింప కుంటిని. మైథిలీ ! నాతోఁగూడ వనవాసము సేయుటకై నీవు సృజింపఁబడితివి. అందులకు నిశ్చయము చేసికొనియు న్నావు. కనుక, ఎట్టికష్టమందైనను కలంగని దిట్టమనస్సు గలవాఁడు కీర్తిని విడువఁ జాలనట్లు, నిన్ను నే విడువఁజాలను. ఏనుఁగుతొండమువంటితొడలు గలముద్దులాఁడీ ! వానప్రస్థధర్మము తొల్లి రాజర్షులు పత్నులతోఁగూడియే యాచరించిరి. సువర్చల సూర్యు ననుసరించి యుండలేదా. కావున నేనును బూర్వులధర్మమునే యనుసరించి నిన్నువనమునకుఁ దోడ్కొనిపోయెద. సువర్చల సూర్యునివలె, నీవు నన్ననుసరించి రమ్ము. జానకీ! తండ్రి యడవికిఁ బొమ్మన్నమాట యొక్కటియే కాదు. అట్లే చేసెదనని నేను సత్యమును జేసితిని కాన యాతండ్రిమాట మఱియు బలీయమైనది.

నాసత్యముతోఁగూడిన యతనిమాటయే నన్నడవికి నీడ్చుకొని పోవుచున్నది. కావున నేను బోవకుండుట లేనేలేదు. ఇదె యవశ్యము పోవుదును.సుశ్రోణీ! తండ్రికిని తల్లికిని విధేయుఁడై యుండుట యనునిదియే ధర్మము. ఇంతకంటెను ధర్మము లేదు. కనుక పితృవాక్యపరిపాలనమునకుఁ బూని యున్నట్టినేను,అధర్మము నతిక్రమించి బ్రతుకనొల్లను. 'పితృవచనము సేయుటేమి. దైవము నారాధించుచు నిండే యున్నఁ జాలదా' యందువా? ప్రత్యక్షముగా మన కాజ్ఞలుసేసి మనయారాధనములకు వశ్యులై యుండు తల్లి దండ్రి గురు వనెడియీప్రత్యక్షదైవమును విడిచి, ప్రత్యక్షముగా మన కాజ్ఞలు సేయక మనయారాధనములకును వశముగాక స్వతంత్రమై యుండుదైవమును ఆయావిధములనెట్టు లారాధింపనచ్చును?సొగసైన కడగన్నులుగలదానా! తల్లితండ్రి గురు వనెడియీముగ్వురే మూఁడులోకములు. వీరి నారాధించినచో ముల్లోకములను వశము సేసికొనవచ్చు. వీరికి శుశ్రూష సేసిన, ముల్లోకములందలిదేవతల నెల్ల నారాధించినంతఫలము కలుగును. కనుక వీరివలె పవిత్రమైనది భూమియందు మఱొకటిలేదు. కాఁబట్టి నేనువీరినే యారాధించుచున్నాను. సీతా! పితృశుశ్రూష పరలోకప్రాప్తి కెట్లు బలము గలిగించి మేలు సేయునో, యట్లు సత్యముగాని, దానమానములుగాని, యుక్తదక్షిణలతోఁ గూడిన యాగములుగాని, పరలోకప్రాప్తికి బలము గలిగించునవికావు. స్వర్గముగాని,ధనముగాని,ధాన్యముగాని విద్యలుగాని, పుత్త్రులుగాని, సుఖములుగాని, మఱియేదిగాని, గురుశుశ్రూష సలుపుచుండినచో అన్నియు సిద్ధించును. దానివలన సాధ్యముకానిదేదియు లేదు. తలిదండ్రులకు నెడతెగక యాసక్తితో శుశ్రూషలు సేయుచుండుమహాత్ములు దేవలోకమును గంధర్వలోకమును గోలోకమును ఇతరలోకములనుం బొంది క్రమముగా బ్రహ్మలోకమును బొందుదురు. అట్టిస్వతంత్రుఁడైనతండ్రి సత్యమును ధర్మము దృఢముగాఁ గయికొని, నన్నెట్లు ఆజ్ఞాపించునో యట్లే నడచుకొనం గోరుచున్నాను. తండ్రియాజ్ఞ ననువర్తించుట సనాతన మగుధర్మము గదా. సీతా! ఇంతవఱకు నీభావము నాకు తెలియకుండినందున, నిన్ను దండకావనమునకుఁ దోడ్కొనిపోవుటకు నాకు బుద్ధి పుట్టలేదు. అట్టి నీవు అడవిలోనుండెద నని చెప్పి నన్ను వెంబడించుటకు గట్టిగానిశ్చయించుకొంటివి.దానిచేనిప్పుడునీభావము తెలిసినది. కనుక నిన్నుఁ దోడ్కొనిపోయెదను. ఏకందును లేనియవయవములు గలదానా! మరులుగొలుపునట్టికన్నులదానా! అడవిని నాతోఁగూడ నుండుటకు దైవమే నిన్ను సృజించియున్నది గదా. కనుక, భయపడుస్వభావము గలయీఁడుదానవయ్యు నాతోఁగూడరమ్ము. నీకేభయమునుగలుగదు. అచ్చట నాతోడ ధర్మములాచరించుచుండుము. కాంతా!సీతా!భర్త ననుసరింప వలయుననునిశ్చయము నీకు మిక్కిలియుఁ గలిగినది. ఇది నీకులమునకును నాకులమునకును దగినది; మిక్కిలియుశుభమైనది. సుందరములగుపిఱుందులు గలదానా!ఇంక నీవు వనవాసమునకుయుక్తము లగుకార్య

ములను మొదలు పెట్టుము. ఇఁక నీవు లేకున్న నాకు స్వర్గమయినను సొంపుగాదు. బ్రాహ్మణులకు వివిధములయిన రత్నములును, భిక్షుకులకు యథేచ్ఛముగా భోజనమును, నొసంగుము. మఱి యెవ్వ రేదియాసింతురో యదితప్పక వారి కిమ్ము. జాగువలదు. త్వరపడుము. బ్రాహ్మణులకు దానము సేసినపిదప మిక్కిలివిలువ గలయాభరణములును, మేలైన వస్త్రములును, ఆటలాడికొనుట కుపయోగించుసొగసైనబొమ్మ లుమున్నగునుపకరణములును, పాన్పులును, పల్లకీలు మొదలగుయానములును, నావి గాని నీవిగాని యే వేవి యున్నవో వాని నన్నిటిని మనభృత్యుల కి''మ్మనియె. ఆదేవి, తానడవికి వచ్చుట పెనిమిటికి సమ్మతముగానున్నదని తెలియఁగా, మిక్కిలిసంతోషము నొంది, శీఘ్రముగా నతఁడు చెప్పినట్ల దానములు సేయ నారంభించెను. అంత మిక్కిలికీర్తి గాంచినయాదేవి పెనిమిటిచెప్పినమాట నాలోచించి, మిక్కిలిసంతసించి మనంబున మఱివేఱుచింత లేక దిటపఱుచుకొని ధార్మికు లైనవారికి ధనములను రత్నములను యథేష్టముగా దానము సేయఁ దొడంగినదయ్యె. ఇది ముప్పదియవసర్గము.



రాముఁడు లక్ష్మణుని రావలదని చెప్పుట.

లక్ష్మణుఁడు కౌసల్యాగృహమునుండి రామునితోఁగూడ మును పేవచ్చియున్నవాఁడు. కనుక నతఁడు రామునికిని సీతకును జరిగినసంవాదము విని తనలో 'తన కర్ధశరీరభూత యగు దేవిని దోడ్కొనిపోవుట కే యెంతో కష్టముమీఁద సమ్మతించినాఁడు. ఇఁక నాగతి యేమో' యని దుఃఖమున కన్నుల నీరుగ్రమ్మఁగా, దుఃఖము పట్టఁజాలనివాఁడై *యమ్మహాయశస్కుఁడు అన్న పాదములను గట్టిగాఁబట్టుకొని, మొదటఁ బురుష

* ఇందులకు మూలము 'సభ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య రఘునన్దనః । సీతా మువాచాతియశా రాఘవంచ మహావ్రతమ్' ఇందు లక్ష్మణుఁడు తనకు రాముని ననువర్తించు ప్రయోజనము సిద్ధించుకొఁనుటకు సీతాదేవిపురుషకారమున రాముని శరణాగతి సేయుచున్నాఁడు:—(సః) రాముని అనువర్తించుటకు రాముఁడే తప్ప మఱియొకయుపాయము లేనివాఁడు - అనన్యోపాయుఁ డనుట, (భ్రాతుః)తోఁ బుట్టువుయొక్క-ఇందు త్రోసిపుచ్చరాని భ్రాతృసంబంధమును జెప్పుటచే శరణ్యుఁడగుట చెప్పఁబడినది. (చరణౌనిపీడ్య) పాదములను పట్టుకొని-దీనిచే శరణాగతి చెప్పఁబడినది. (గాఢం) గట్టిగాపాదములను బట్టికొన్నాఁడనుట. దీనిచే మిక్కిలివిశ్వాసముకలిమి చెప్పఁబడినది. ఇట్లు చేసి, మొదట (సీతాం) పురుషకారముకొఱకు సీతాదేవిని ఆశ్రయించి, (ఉవాచ) చెప్పినాఁడు. పిదప, సీతాపురుషకారముచేత, (మహావ్రతం) 'నత్యజేయం కథంచన' 'ఏతద్వ్రతంమమ' అని యాశ్రితరక్షణ మనుమహావ్రతము గలవాఁడైన, (రాఘవమ్) రఘుకులుని- రఘుకులమునకు శరణాగతరక్షణమే ధర్మమని రాక్షససంవాదాదులందు ప్రసిద్ధము గాన అట్టికులమునందుఁ బుట్టినరామునితో, (ఉవాచ) చెప్పెను. శరణాగతివలన సర్వఫలములు సిద్ధించుచున్నవి గాన శరణు సొచ్చి తనయభిమతఫలమును దెలిపినాఁడనుట. 'సభ్రాతుశ్చరణౌ గాఢంనిపీడ్య' అనుటచే ద్వయవాక్యమందు పూర్వఖండమందలిశరణాగతియు, 'రాఘవముజాచ' అనుటచే ఉత్తరఖండమందలి ఫలప్రార్థనయు, 'సీతామువాచ' అనుటచే రెండుఖండములందలి పురుషకారపరిగ్రహమును ఇచట అనూదితమైన దని తెలియునది. గోవిందరాజులు.

కారముకొఱకు సీతను జూచి, పిదప నాశ్రితరక్షణ మనుమహావ్రతము దాల్చియున్న రామునిఁ గాంచి 'నీ వడవికిఁ బోవుట నాకిష్టము గాదు. *పోవలయు నని నీకు బుద్ధి గలిగెనేని, అందు మృగములును ఏనుఁగులు మిక్కిలి వ్యాపించి యుండును గావున నేను ముందు విలుదాల్చి పోవువాఁడనై నిన్ను వెంట నంటి వచ్చెదను. †నీవు నాతోఁ గూడి పక్షి మృగసమూహముల ధ్వనులు మిక్కిలి చెలరేఁగు చున్నయడవులను పెక్కులు దిరుగఁ గలవు ‡నీవు. లేనిచో నాకు దేవలోకప్రాప్తిగాని అమరత్వము

(సః) పరమపదమందే కాక అవతరించిన యీ లోకమందుఁగూడ కైంకర్యము సేయవలయునని కూడనే యవతరించినవాఁ డనుట, (రఘునన్దనః) పెద్దల ననువర్తించురఘుకులజుల నెల్ల తదీయానువర్తనముచే అనందింపఁజేయువాఁడు, (అతియశాః) తాను రాజకుమారుఁడై యుండియు 'అహం సర్వం కరిష్యామి' అని జ్యేష్ఠుని ననువర్తించుటచేఁ గలిగినమహాకీర్తి గలవాఁడు ఇట్టివాఁ డగులక్ష్మణుఁడు, (భ్రాతుః) లక్ష్మణునియనువర్తనము నంగీకరించి తన్మూలమున అతనినిభరించురామునియొక్క - లక్ష్మణునికి తనకైంకర్యము రాముఁ డంగీకరించుటయే తన్నతఁడు భరించుట యగునని భావము, (చరణౌ) పాదములను రెంటిని - ఇట ద్వివచనముచేత 'చరగతిభక్షణయోః' అను ధాతువుచే ప్రాప్యమును ప్రాపకమును రెండునైనది యనుట, (చరణౌ) చేయి పట్టినయెడల నొకవేళ నిరాకరింపవచ్చును. పాదములను బట్టినపుడు అవశ్య మంగీకరించియే తీఱవలయుననుట, (గాఢంనిపీడ్య) గట్టిగాఁ బట్టి- విడిచినయెడల నిలుపోపఁ జాలనితనయభినివేశ మెల్లఁ దోఁచున ట్లనుట-దీనిచే స్వీకారము తెలియునది. (సీతామువాచ) సీతను జూచి చెప్పెను. పాదములను బట్టుకొని చెవిలోఁగదా మాట చెప్పవలయును. చేతనులవిన్నపములను లక్ష్మీముఖముగానే వినఁ బూనెడు వాఁడు గావున తాను అడుగులు పట్టుకొని లక్ష్మీరూపయైన సీతమూలముగా చెవిలో మాటఁ జెప్పించినాఁడని యర్థము

లేక:—'ఆనుకూల్యస్యసంకల్పః ప్రాతికూల్యస్యవర్జనమ్ । రక్షిష్యతీతివిశ్వాసో గోప్తృత్వవరణంతథా । ఆత్మనిక్షేప కార్పణ్యే షడ్విధాశరణాగతిః' అనుశరణాగతియొక్క అంగములు ఇందుఁ జెప్పచున్నాఁడు:—'చరణౌ' అని ద్వివచనముచే ఉపాయోపేయత్వము. 'గాఢం' అనుటచే శంకలేమి - విశ్వాసమనుట, 'చరణౌనిపీడ్య' అనుటచేశరణాగతి, 'రఘునన్దనః' అనివంశపవిత్రకరత్వము, 'సీతామువాచ' అనుటచే పురుషకారవరణము, 'అతియశాః' అనుటచే కైంకర్యసామ్రాజ్యలాభముచేఁ గలిగినప్రసిద్ధి-ఆనుకూల్యసంకల్ప ప్రాతికూల్యవర్జనము. 'రాఘవం' అనుటచే శరణ్యత్వమునకుఁ దగినగుణాష్టకము. 'మహావ్రతమ్' అనుటచే శరణాగతపరిత్యాగముచే తనవ్రతమునకే హానికలుగుటయు వ్యంజితమగుచున్నది.

* ఈవాక్యముచే కైంకర్యప్రార్థనము చేయఁబడినది. ఇందు విల్లు (ధనుః) అనుట, కైంకర్యమునకు సాధనము.

† ఇందు, పెక్కులు (బహూని) అనుటచే సర్వదేశ సర్వకాల సర్వావస్థలందును దగిన సకలవిధకైంకర్యములను ప్రార్థించినాఁడని తెలియునది.

‡ ముందు అనన్యోపాయత్వమును జెప్పినట్లు ఇపుడు అనన్యప్రయోజనత్వమును జెప్పుచున్నాఁడు:—ఇందులకు, 'నదేవలోకాక్రమణం నామరత్వ మహం వృణే।ఐశ్వర్యంవాపి లోకానాం కామయే న త్వయావినా' అని మూలము. నీవుతప్పమ ఱేదియు నాకు ప్రయోజనము గాదనుట అనన్యప్రయోజనత్వమని తెలియునది, (దేవలోకాక్రమణమ్) 'దేవానాం పూరయోధ్యా' అన్నట్లు దేవలోకమనఁగా ఇచట పరమపదము. నీవు లేనిచో నాకు పరమపదప్రాప్తియు వలదనుట - నీకైంకర్యమును విడిచిన

గాని సమ్మతము గాదు. త్రిలోకైశ్వర్యము గాని నేను గోరను' అని చెప్పెను. లక్ష్మణుఁడు రామునితోఁగూడ వనమునకుఁబోవ నిశ్చయించి యిట్లుచెప్పఁగా, రాముఁడు తిన్ననిమాటలతో రావలదనుటయు,లక్ష్మణుఁడుమరలనతనింజూచి*'నీవు మునుపే నేను వనమునకు వచ్చుట కనుజ్ఞయిచ్చియున్నావు. అట్లుండఁగా మరలనన్ను రావలదనినిలుపుచున్నావే! ఇదియేమి? అనఘా! నేను నీతోడ వనమునకు రాఁగోరుచుండఁగా వలదని వారించుటకుఁ గారణమేమి? ఇది తెలిసికొనఁగోరెదను. నే నిప్పుడేమియపరాధము సేసితినో యని నాకు సంశయముగలిగియున్నదిగాన తెలుపు'మనియె. అంత మహాతేజుండగు రాముఁడు, తనముందట చేతులు మోడ్చుకొని తనకు మున్నుగానే యడవికిఁ బోవఁబూని యట్లు పోవుటకు దగినవీఁకుండునై 'కూడం దోడ్కొని పొ'మ్మనుచు బతిమాలుచు నిలుచున్నవానిని లక్ష్మణునిం జూచి "నీవు నాయందు నెయ్యము గలవాఁడవు. ధర్మపరాయణుఁడవు,వీరుఁడవు, ఎప్పుడును సన్మార్గమందే వర్తించువాఁడవు, నాకుఁ బ్రియుండవు, మఱి ప్రాణసముఁడవు, వశ్యుఁడవు, తమ్ముండవు, చెలికాఁడవును. కనుక నీవు నాతోఁగూడ వత్తువేని నాకుఁజెప్పినపనులు చేయఁజాలుదువు గాన నాకు సౌఖ్యమే. లక్ష్మణా! నాతోడ నీవిపుడు అడవికి వత్తువేని పిదప కౌసల్యనుగాని సుమిత్రనుగాని యిచట చూచుకొనువారెవరు? అందుకొఱకే నిన్ను రావలదంటిని. ముం దనుమతించుట యప్పటికి బరిహారముగాఁ జెప్పిన దేకాని వేఱుకాదు.'రాజే వారిని భరింపఁగలఁడందువా? భూమిపయి పర్జన్యుఁడు వర్షించునట్లు తనవారికోర్కులన్నియు కురియు

---

మోక్షమునుగూడఁ గోరనని భావము. (అమరత్వం) 'జరామరణమోక్షాయ' అన్నట్లు జరామరణముల నుండి విడివడుట యగుకైవల్యము తెలియునది- కైవల్యమనెడి మోక్షమును వరింపననుట, (లోకానాం ఐశ్వర్యం) త్రిలోకాధిపతిత్వము- లేక బ్రహ్మత్వము, దీనినిగూడ, (న కామయే) కోరననుట, ముముక్షువునకు ఐశ్వర్యము కైవల్యము మోక్షము అని పురుషార్థములు మూఁడు.. అందు మోక్షమే వలదనుచుండఁగా ఇఁక తక్కిన కైవల్యాదులను గాంక్షింతునా యని రామకైంకర్యమును విడిచి మూఁడు పురుషార్థములను ఒల్లకుండుట యిట చెప్పఁబడినది.

* ఒకచో 'ఉపక్లిప్తంచ యత్కిఞ్చిదభిషేకార్థ మద్య మే। సర్వం విసర్జయ క్షిప్రం కురు కార్యం నిరత్యయమ్' 'అభిషేకముకొఱకు ఇపుడు నాకుఁ గల్పింపఁబడిన కార్య మేదిగలదో దానినంతయు వేగ మానుము. కీడు లేనికార్యమును జేయుము' అని యనుమతి చూపినాఁడు. మఱొకచోట 'తస్మాదపరితాపస్సం స్త్వమప్యనువిధాయమామ్। ప్రతిసంహారయ క్షిప్ర మాభిషేచనికీః క్రియాః' 'కాఁబట్టి నీవుపరితాపములేక నన్ననుసరించి వర్తించుచు నాయభిషేకముకొఱకైన కార్యములను వేగ మాన్పుము' అని యనుజ్ఞ సూచించినాఁడు. ఇంకొకచోట 'భ్రాతృపుత్రసమౌ చాపి ద్రష్టవ్యౌ చ విశేషతః। త్వయా భరతశత్రుఘ్నౌ ప్రాణైః ప్రియతరౌ మమ' 'నాకు ప్రాణములకంటె మిక్కిలి ప్రియులైన భరతశత్రుఘ్నులను నీవు తోఁబుట్టువులవలెను గొడుకులవలెను విశేషించి చూడవలయును' అని భరతశత్రుఘ్నులనే యనుసరింపుమని సీతకుఁ జెప్పినాఁడు; లక్ష్మణుని అనుసరింపు మని చెప్పలేదు కనుక లక్ష్మణుఁడయోధ్యలో నుండక తనతోఁగూడనే యడవికి వచ్చునని సూచించినాఁడు. కావుననే లక్ష్మణుఁడు 'ముందనుమతించి యిపుడు వలదననేల?' యని యడిగినాఁడని తెలియునది.

చుచుమహాతేజుం డగురాజు కైకచిత్తమునకు లోనై కామపాశమునఁజిక్కి లడఁబడుచున్నాఁడే! అతఁ డెట్లు భరింపఁగలఁడు? అశ్వపతికూఁతు రగుకైక యీరాజ్యమునంతయుఁ గయికొన్నపిదప దుఃఖిత లయినతనసవతుల కెంతమాత్రమును మంచి సేయదు. 'పోషించుటకు భరతుఁడు లేఁడా? ' యందువేని, వాఁడును రాజ్యమును బ్రాపించినంత కైకేయి మాటయందే వర్తించువాఁడు గనుక మిక్కిలిదుఃఖిత లయిన కౌసల్యనుగాని సుమిత్రనుగాని తలంపనైన తలంపఁడు. 'నాకుమాత్రము భరించుట కెట్లు శక్య' మందువేని, నీ విచట నేయుండి రాజునను గ్రహము సంపాదించి పూజ్యురాలగు కౌసల్యను సుమిత్రను బోషించుచుండుము. రాజు అనుగ్రహము చూపఁడేని నీ వైనను నీయంతట వారినిబోషించుచుండుము; మా తాండకును. చెప్పినట్లు సేయుము. 'నీకైంకర్యమే కావలసియున్న నాకు తక్కిన యీరాజోలియంతయు నేల' యందువేని, నీ వన్నిధర్మములు తెలిసినవాఁడవు. నేను చెప్పిన యీప్రకారము సేయుదువేని యిది నీకు నాయందుఁగలభక్తిని మిక్కిలి చూపినట్టిదే యగును. మఱియు మాతృశుశ్రూషవలన సాటిలేని ధర్మమును మిక్కిలియుఁగలుగును. లక్ష్మణా! నీ విట్లు సేయుదువేని మనరఘుకులమువారందఱును ఆనందింతురు. కనుక నాకుఁగా నీ విట్లు చేయుము. మనము లేకున్నచో మనతల్లికి సుఖ మెంతమాత్రమును గలుగదు" అనెను. రాముఁడు మాటలయందు నేర్పరి; లక్ష్మణుఁడును అట్టినేర్పరితోఁగూడ మాటలాడునంతనిపుణుఁడు. కనుక రాముఁ డిట్లు మనస్సునకుఁ గూర్చునట్లుగాఁ జెప్పినమాట విని యతఁడు అపుడు రామునిఁ జూచి 'రామా! నీవు వీరుండవు, నీ ప్రతాపమునకే భయపడి భరతుఁడు కౌసల్యను సుమిత్రనను అక్కఱతోఁ జక్కఁగాఁ బూజింపఁ గలఁడు. ఇందులకు సందేహము లేదు. మఱి కౌసల్యను నొకరు పోషింపవలయునా? ఆమెను గొలిచి బ్రతుకువారు ఆమెయనుగ్రహమువలన వేలకొలఁదిని గ్రామములు వడసియున్నారు. అట్టియామె ననుఁబోఁటివారల వేవురినైనను బోషింపఁగలదు. అ ట్లగుటం జేసి మహాకీర్తిమతి యగుకౌసల్యాదేవి తన్నును నాతల్లిసుమిత్రను, నావంటివారల నెందఱినయినను బోషించుకొన శక్తురాలేయగును. *నీకుఁ బరతంత్రుఁ డయిననన్ను

---

* ఇందులకు మూలము. 'కురుష్వమా మనుచరం వైధర్మ్యం నేహవిద్యతే।కృతార్థోహం భవిష్యామి తవచార్థఃప్రకల్పతే'(మాం)నీకు శేషభూతుఁడైననన్ను,(అనుచరం)ఆ శేషత్వమునకుఅనుగుణమైన కైంకర్యము గలవానినిగా,(కురుష్వ)చేసికొనుము. నీకుఅనన్యార్హమైయుండుసొమ్మను. అట్టిసొమ్ము స్వామిని ఎడఁబాసెనేని దానిప్రాణములే నశించు ననిభావము. (కురుష్వ) అని యాత్మనేపదముచే క్రియాఫలము కర్తనే పొందునుగాన నన్నట్లు చేయుట నీకే ప్రయోజనమగుననుట. సొమ్మును బాసినయెడల స్వామికే కదా ఫలనాశమని భావము (ఇహ) ఇందు-నన్ను అనుచరునిగాఁ జేసికొనువిషయమందు, (వైధర్మ్యం) మన కిరువురకుం గల సేవ్యసేవకధర్మము లేకపోవుట, (న) కలుగదు - నీవు స్వామియగుటచే నీకు సేవ్యధర్మము చాలియున్నది. నేను స్వాభావికముగా శేషమైనవాఁడ నగుటచేతనే నాకు సేవకధర్మమును పూర్ణముగా నున్నది. కనుక నన్నుఅనుచరునిగాఁ జేసినంత 'సేవకుఁడుగానట్టివీనిని సేవకు

నీభృత్యునిగాఁ జేసికొనుము. అట్లుచేయువిషయమున ధర్మమేమియువిపరీతముగాదు. అందువలన నేనును కృతార్థుఁడ నయ్యెదను. నేను,పండ్లు మున్నగునవి తెచ్చియిచ్చుట వలన నీకును ప్రయోజనముగలుగును. నేను విల్లును బాణంబులును దాల్చి, *గుద్దలిని చిన్నగంపనుం దీసికొని, నీకు ముందుగా మార్గము సూపుచుం బోయెదను. నిత్యమును నేను నీకు ఫలమూలములను మఱియుఁ దపస్వులు పుచ్చుకొను తక్కిన యాహారములను తెచ్చియిచ్చుచుండెదను. †నీవు సీతంగూడి కొండనెత్తములందుఁ గ్రీడించు

---

నిగాఁ జేసితివేని; సేవ్యుఁడుగాని నేను స్వామినైతినేని; ధర్మము తప్పునే' యని చింతింపవలదనుట. లేక:- (వైధర్మ్యం) వైపరీత్యసాధకము-విపరీతము పుట్టుటకు మార్గము కలుగదనుట. నీవు తల్లిని గాపాడవలయుట మొదలైనవి చెప్పి నే నడవికి వచ్చినయెడల అవన్నియు చెడునంటివి. దానికి నేను సమాధానములు చెప్పితినిగాన నేను నీ కనుచరుఁడనై కూడవచ్చుటచే విపరీతము లేవియు నిచటఁ గలుగవనిభావము. తన్ను అనుచరునిగాఁ జేసికొనుటవలనిప్రయోజనమును జెప్పుచున్నాఁడు:—(తవ అర్థశ్చ ప్రకల్పతే) ఆయాసములేక నీకు ఫలమూలాదులు లభించు ప్రయోజనమును సిద్ధించుచున్నది. (అహం చకృతార్థః) నాకు నీకైంకర్యము నేయు లభించుటచే కృతార్థత్వము కలుగుచున్నది. లేక:— (మాం) స్వభావముచేతనే శేషభూతుఁడనైన నన్ను, (అనుచరం) స్వరూపానురూపమైన శేషవృత్తి గలవానిగా చేయుమనుట-శేషత్వము స్వభావసిద్ధమైనను, అది తెలిసికొని యందువర్తించుటలేదు గనుక నీవు నన్నాశేషత్వమునందు వర్తించునట్లు చేయుమనుట. శేషత్వ మూరక కలిగియుండిన పనలేదు. అది తెలిసి యందు వర్తించుటయే ప్రయోజన మనిభావము. (ఇహ) ఇందు-ఈజనునియందు-ఈనాయందనుట, (వైధర్మ్యం) శేషత్వవిపర్యాసము - శేషత్వము తప్పుట, (నాస్తి) కలుగదు; దీనిచేత శేషత్వము స్వభావముచేతనే సిద్ధమైయున్నదనియు, అట్లదియున్నదని తెలిసినవానికి - శేషత్వజ్ఞానము గలవానికి- శేషికైంకర్యము సేయుటయే ఫలమనియు, ఈరెండును (మాం) (అనుచరం) అనెడి యీరెండుపదములచే తెలుపఁబడినవి. (కృతార్థోఽహం భవిష్యామి) ఏమియు చేయకుండిన యెడల శేషత్వము చెల్లదు; కైంకర్యము చేయకున్నచో శేషత్వమునకు హాని కలుగును; గావున నీ కైంకర్యము నొసంగితివేని యట్టిహాని లేక కృతార్థుఁడ నయ్యెదననుట, (తవ చ)ఇట చకారముఅవధారణార్థకముగాన (తవ ఏవఅర్థః) అనుటచే నీప్రయోజనమే సిద్ధించుచున్నదగాని నాదికాదనుట. నీకొఱకు నేను కైంకర్యము చేసెదను గాని నాకొఱకుఁ గాదనియర్థము. పరులప్రయోజనముకొఱకు చేయు కైంకర్యమే పురుషార్థ మగుటవలన నిట్లు చెప్పెనాఁడని తెలియునది. కనుక నిచట శేషత్వాధ్యవసాయము- అనఁగా తాను శేషభూతుఁడని గట్టిగా నమ్ముట - ఉపాయము. అస్వార్థశేషికైంకర్యము-తనప్రయోజనముగుఱించి కాక శేషికి కైంకర్యము సేయుట-ఉపేయము, అనఁగా ఫలము. కనుక ఉపాయోపేయము లిట్టివని యిందు నిష్కర్షింపఁబడె నని రహస్యము.

* ఘాతుకజంతువుల నివారించుటకు ధనువు; గడ్డలు మొదలగువానిని పెల్లగించుటకు గుద్దలి; ఫలమూలాదులు తెచ్చుటకు పుటిక.

† ఇందులకు మూలము 'భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే। అహం సర్వం కరిష్యామి జాగ్రతస్స్వపతశ్చ తే' సర్వదేశకర్తవ్యములైన కైంకర్యములను ముందుచెప్పి యిప్పుడు విశిష్టవిషయమునకే-అనఁగా లక్ష్మీవిశిష్టుఁడైన పరమపురుషునికే చేయుకైంకర్యమే భోగ్యముగాన, (సహ వైదేహ్యా) సీతతోడ, అని మిథునమునకే కైంకర్యము సేయునట్లు చెప్పుచున్నాఁడు. ఇందు (జాగ్రతః స్వపతః)

చుండఁ గలవు. ఏలనఁగా నేను నీవు మేలుకొనియుండునపుడును నిదురించునపుడును కాపుగా సమస్తకార్యములను జేయుచుండెదను' అనెను. రాముఁడు, లక్ష్మణుఁడు చెప్పినయామాటకు మిక్కిలి సంతసిల్లి యతనిం జూచి 'లక్ష్మణా! అట్లయిన నీవిపుడు పోయి నీచెలికాండ్ర కందఱికిని జెప్పి సెలవు పుచ్చుకొనిరమ్ము. లక్ష్మణా! జనకరాజు మహాయజ్ఞమున, మహాత్ముఁడగు వరుణుఁడు చూచుటకు మిక్కిలి భయంకరములుగా నగపడు*దివ్యధనువులు రెండును, భేదింపరాని రెండు దివ్యకవచములును, అక్షయబాణములు గలయమ్ములపొదులు రెండును,బంగారుపూఁతగలిగి సూర్యునివలె ధగధగ లాడుఖడ్గములు రెండును దానై యిచ్చెను. వీనినెల్ల నేను బూజించి యాచార్యుఁడగువసిష్ఠునియింట నుంచి యున్నాను. నీవు చెలికాండ్రను వీడ్కొని ఆయాయుధముల నన్నింటిని దీసికొని శీఘ్రముగా రమ్ము' అని చెప్పెను. లక్ష్మణుఁడు వనవాసమునకై గట్టిగాఁ బూని, స్నేహితులయొద్ద సెలవు పుచ్చుకొని, యిక్ష్వాకుకులగురుఁడైన వసిష్ఠునికడకుం బోయి యతనిగృహమున నున్నయుత్తమము లగునాయుధము

---

మేలుకొన్నపుడును నిదుర పోవునపుడును-అనుటచే సర్వకాల సర్వావస్థలకును ఉచితమైన కైంకర్యము చెప్పఁబడినది, (సర్వం కరిష్యామి) అనుటచే సర్వవిధకైంకర్యము చెప్పఁబడినది. అనఁగా దేవీవిశిష్టుఁడగు శేషికి, శేషభూతుఁడైనవాఁడు సర్వదేశ సర్వకాల సర్వావస్థలందును సర్వవిధ కైంకర్యములను జేయవలయునని ఫలితార్థము. గోవిందరాజులు.

తిలక:-(భవాంస్తు)నీకు కైంకర్యమునేయుటయే ముఖ్య ప్రయోజనముగాఁ గలిగి నేనుబుట్టితిని. నీవు నా కైంకర్యమును బొత్తిగా నపేక్షింప నక్కఱ లేనివాఁడవయ్యును నన్ననుగ్రహించుకొఱకు నా కైంకర్యమును స్వీకరింపుము. వేఁటమున్న గువానివలె స్వీకరింపవలదు,(సహవైదేహ్యా)నీకును సీతకును ఇరువురికిని కైంకర్యము నేసెదను.(గిరిసానుషు రంస్యతే)పర్ణశాలయందే కాదు- జలక్రీడాది సర్వక్రీడాస్థానములందును కైంకర్యము నేసెదను, (అహం) నేను-ఆయాయవస్థలకు ఉచితములైన ఆయాకైంకర్యముల న్నిటినిజేయుటయే స్వరూపనిరూపక ధర్మముగాఁ గలనేను, (సర్వంకరిష్యామి)సర్వవిధకైంకర్యములను జేసెదను. (జాగ్రతః) మేలుకొన్నపుడు- దంతకాష్ఠము తెచ్చుట మొదలుకొని పడుక యేర్పఱుచుట వఱకు నీవు మేలుకొన్నపుడు చేయఁదగిన కార్యములను చేసెదననుట, (స్వపతః) నిదురించునపుడు— రాత్రి దుష్టమృగములవలనను రాక్షసులవలనను కీడు రానీక కాచుచు తెల్లవాఱువఱకును వలయుపనులను జేయుచుండెద నని భావము.

*ఇచట విల్లు మొదలైనవి రెండేసిగాఁ జెప్పుటచే అన్నదమ్ముల కిద్దఱికిని చెఱియొకటి యియ్యఁబడెనని తెలియుచున్నది. జనకునియజ్ఞమందు వరుణుఁడు విల్లు మొదలగువాని నిచ్చుట వినఁబడకున్నను, మునుపు చెప్పియున్నట్లు ఇచట ప్రస్తావించుటకుఁ గారణ మేమనఁగా నిది వాల్మీకియొక్క శైలి. అప్పటికి ప్రసక్తించినవిషయములను ప్రతిపాదించు పారవశ్యమువలన ఎక్కడ చెప్పవలసినది.అక్కడ చెప్పక, అట్లుచెప్పనిదానిని, మీఁద మఱొకచోట, వొకవ్యాజమున, మున్ను చెప్పియున్నదానిని మరలఁ జెప్పునట్లు, చెప్పుచున్నాఁడు. ఉదాహరణముగా, బాలకాండమునఁ జెప్పని మణిబంధమును 'మణిబన్ధమిదం దత్తం వైదేహ్యాశ్శ్వశురేణమే' అని సుందరకాండమునఁ జెప్పినాఁడు.అయోధ్యాకాండమునఁ జెప్పవలసినకాకాసురవృత్తాంతమును 'సపిత్రాచ పరిత్యక్తః' అని సుందరకాండమునఁ జెప్పినాఁడు.

లను దీసికొని వచ్చెను. లక్ష్మణుఁడు దివ్యములై రాజసింహుఁడగు రామునిచేఁబూజి తములై పుష్పమాలికాలంకృతములై యొప్పునాయాయుధము లన్నిటిని రాము నకుఁ జూపెను. ధీరుఁడగు నారాముఁడు ఆయుధములం దీసికొని వచ్చినలక్ష్మణునిం జూచి సంతోషించి "సౌమ్యా! నేను నిన్నెదురుచూచుచుంటిని. నేను కోరినకా లమునకు నీవును వచ్చితివి. పరంతపా! నేను నిన్నుఁ గూడి సాధనమునంతయు తప స్వులకును బ్రాహ్మణులకును నియ్యఁగోరుచున్నాను. ఇచ్చట పెద్దలందు దృఢభక్తి గల బ్రాహ్మణోత్తములును మఱి నన్నుఁ గొలిచి బ్రతుకువారును, ఎవ్వరున్నారో వా రికందఱికిని ఎప్పటికంటె నధికముగా దానము సేయఁ గోరుచున్నాను. నీవు పోయి బ్రాహ్మణశ్రేష్ఠుఁడును బూజ్యుఁడునగు వసిష్ఠపుత్రుని సుయజ్ఞునిమాత్రము శీఘ్రముగాఁ దోడుకొనిరమ్ము. నే నాసుయజ్ఞుని మఱియు శిష్టులైన యితర బ్రాహ్మణులను అందఱిని బూజించి పిదప నరణ్యమునకుఁ బోయెదను' అనియె. ఇది ముప్పదియొకఁడవసర్గము.



## రాముఁ డడవికిఁ బయన మగుటకై వలయుదానాదులు సేయుట.

అంత నాలక్ష్మణుఁడు, బ్రాహ్మణోపకారి యగుటచే మంగళకరమై, తనవనవాస మునకు సమ్మతించుటచే ప్రియమై యున్న రామాజ్ఞను గయికొని శీఘ్రముగా సుయ జ్ఞునియింటికిఁ బోయి యచట నగ్నిహోత్రగృహమునం దున్న యతనినిఁ బూజించి నమస్కరించి 'చెలీ! రాముఁ డడవికిఁ బోవనున్నాఁడు. నీ విపు డతనియింటికి వచ్చి దుష్కరమైన యతని కార్యమును జూడు' మని చెప్పెను. అంత నాసుయజ్ఞుఁడు వేగ సంధ్యావందనము గావించి లక్ష్మణునితోఁగూడ చని లక్ష్మీవిరాజమాన మైనరాముని రమణీయగృహమును బ్రవేశించెను. హుతంబైనయగ్నిహోత్రంబుచందమునఁ దేజ రిల్లుచు వచ్చినయావేదవిదునికి సుయజ్ఞునకు రాముఁ డంజలి ఘటించి సీతతోఁగూడ ప్రదక్షిణము గావించెను. పిదప నాకాకుత్స్థతిలకుఁడు మోచేతులపైనిదాల్చు మేలిఁ బంగారుబాహుపురులును, సుందరము లయినకుండలములును, బంగరుదారములఁ గ్రువ్వఁబడిన మణిసరములును, మూఁపులపయిని దాల్చుపురులును, కడియములును, మఱియును మే లయినచిక్కినసొమ్ములును పెక్కులు సుయజ్ఞున కిచ్చెను. అప్పుడు సీతాప్రేరణమున సుయజ్ఞునిఁ జూచి 'సౌమ్యా! చెలీ! సీత యిపుడు నీభార్యకు హార మును బంగారుమొలనూలును నియ్యఁగోరుచున్నది. వానిం దీసికొనిపోయి ఆయమ్మ కిమ్ము. చెలికాఁడా! సీత యిప్పుడు వనమునకుఁ బోవుచున్నది గావున నీ భార్య కిచ్చు టకుఁ గాను నీచేత, పలువిధము లయినరతనములు పొదుగఁబడి పలునన్నియల చె న్నారు బాహుపురులును మూఁపులపురులును నిచ్చుచున్నది మేలైన దుప్పటి పఱు పుగలిగి వివిధరత్నములచే నలంకృతమై యున్నయామంచమును గూడ నీ కియ్యఁ గోరుచున్నది. నాకు మేనమామ యిచ్చినశత్రుంజయ మనుగజమొకటి గలదు. దా నిని, మఱియు వేయియేనుంగులతోడ నీకిచ్చెదను' అనెను. రాముఁ డట్లు చెప్పఁగా

నానుయజ్ఞుఁడు వానిని ప్రతిగ్రహించి రామలక్ష్మణులకును సీతకును మంగళాశీర్వాదములు సేసెను. అంత ప్రియవాది యగురాముఁడు, తనపనులయెడ మిగులహెచ్చరిక గలిగి యున్నగారాబుతమ్ముని లక్ష్మణునిం జూచి, బ్రహ్మ దేవేంద్రున కాజ్ఞాపించున, ట్లాతనితో 'లక్ష్మణా, నీవు పోయి అగస్త్యపుత్రుని,విశ్వామిత్రుని కుమారుని ఈయిద్దఱు బ్రాహ్మణోత్తములను దోడ్కొనివచ్చి, పయిరును నీళ్లతోడఁ బూజించునట్లు, వారలను మేలివస్తువుల నొసంగి పూజింపుము. నీవు మానధనుండవు. మఱియు వారలకు వేలకొలఁదిని గోవులను బంగారములును వెండియును నిచ్చి తృప్తి గావింపుము. తైత్తిరీయశాఖ నధ్యయనము సేయువారి కాచార్యుఁడును పండితుఁడును వేదవిదుండు నయినయొకబ్రాహ్మణుఁడు కౌసల్యయెడ మిక్కిలియక్కఱ గలిగి యూమె నాశీర్వాదము సేయుచుఁ గొలిచియుండును. ఆబ్రాహ్మణునికి తృప్తి గలుగు వఱకు వాహనములును దాసీలును పట్టువస్త్రములును నొసంగుము. చిత్రరథుఁడను సారథి మనతండ్రికి మిక్కిలి చెలికాఁడు; బహుకాలము మనయింట నున్నవాఁడు. నీవు వానికి మిక్కిలివెల గలమణులను వస్త్రములను ధనములను అజాదులను కుఱుచ పశువులను వేయియావులను నొసంగి సంతోషము గలిగింపుము. మఱియు నిదె కఠశాఖ నధ్యయనము చేయువారును కాలాపశాఖ నధ్యయనము సేయువారును అనేకులున్నారు. పలాశదండధారు లగుబ్రహ్మచారులును పెక్కండ్రదె యున్నవారు. వీరందఱును ఎల్లప్పుడును వేదాధ్యయనము సేయుచుండువారు; కావున మఱి యేకార్యముగాని చేయువారు కారు;మఱియు కొంతసోమరులు;రుచ్యమయిన యూహారములు గోరుదురు. మహాత్ము లయినవారు కూడ వారిని సమ్మానించుచుందురు. వారలకు ఎనుబదిబండ్లనిండుగా రత్నములును శాలిధాన్యము మోయువేయియెద్దులను దున్నెడునెడ్లను ఇన్నూటిని నిమ్ము. లక్ష్మణా! వారు రుచ్యములను గోరువారు గావున వ్యంజనముగా పాలు పెరుఁగు నేయి మున్నగువాని కొఱకై వేయిగోవుల నిమ్ము. మఱియు బ్రహ్మచారు లనేకులు కౌసల్య నాశ్రయించి యున్నవారు ; కనుక వారలకు చెఱి వేయిగోవులచొప్పున నిమ్ము లక్ష్మణా! మనతల్లి కౌసల్య సంతోషించునట్లు నీ వన్నివిధములఁ నాబ్రాహ్మణుల నందఱిని బూజింపవలయు'నని చెప్పెను. అంత పురుషతిలకుఁ డగునాలక్ష్మణుఁడు రాముఁడు చెప్పిన ట్లాధనము నంతయు తానే కుబేరునివలె బ్రాహ్మణోత్తముల కొసంగెను. అంత రాముఁడు తనముంగల కన్నీళ్లు మ్రింగికొనుచు నిలుచున్న యాశ్రితులం జూచి వారల జీవనమునకై యొక్కొక్కనికి ధనము మిక్కిలి యొసఁగి 'మీరు నేను వచ్చునఱకు నాయిల్లును లక్ష్మణునియిల్లును ఎవ్వరును గాఁపులేమిచే శూన్యమగు నట్లుసేయక యెల్లప్పుడును కావలియుండి కాపాడుచుండవలయును' అని దుఃఖితు లయినయాయుపజీవులకుఁ జెప్పి యంత ధనాధికారిని జూచి 'ధనమును దీసికొని ర'మ్మని యాజ్ఞాపించెను. అంత రామునియుపజీవు లాతనిధనము నంతయుఁ దీసికొనివచ్చిరి. ఆధనరాశి మిక్కి

లియుఁగొప్పది గావున చూచువారికి వింత గొలుపుచుండెను. అంత నాపురుషసింహుఁడు లక్ష్మణునిం గూడి యాధనము నెల్ల బీదబ్రాహ్మణు లగుబాలురకును వృద్ధులకును నొసఁగెను. ఆకాలమున పేదఱికముచే గోరోచనపువన్నె పాఱినత్రిజటుఁడను బ్రాహ్మణుఁ డొక్కఁ డుండెను. అతఁడు గార్గ్యవంశజుఁడు. అతఁ డడవిలో నెప్పుడును చిన్నగొడ్డలియును గుద్దలియును దోఁటియును దాల్చి కందమూలాదులు ద్రవ్వుకొనియు కాయలు పండ్లు గోసికొనియు బ్రదుకుచుండును. మఱి పఱిగ లేఱికొనియు బ్రతుకుచుండెను. అతనిభార్య యెలప్రాయము గలది. ఆమె దారిద్ర్యమునకుఁ గుందుచు బాలు రగుకొడుకులం దీసికొని వృద్ధుఁడైనయాబ్రాహ్మణునిఁ జేరి 'ఈగొడ్డలిని గుద్దలిని పాఱవైచి నేను జెప్పినట్లు సేయు'మనియె. ఆబ్రాహ్మణుఁడును భార్య చెప్పిన మాట విని, మిక్కిలిచింపు లయి యుండుటఁబట్టి కప్పుకొన నలవి గానితనవస్త్రమును గప్పుకొని, రామునిగృహమునకుఁ బోవుమార్గము నుఁబట్టి పోయెను. జనసమూహమందు, ఆత్రిజటుఁడు భృగువువలెను అంగిరస్సువలెను బ్రహ్మతేజమున వెలుంగుచుండుటం జేసి యతఁడు రామగృహములోనికిఁ జొరఁగా, నందు అయిదవకక్ష్యవఱకును అతని నెవ్వరును వారింపరైరి. ఆత్రిజటుఁడును రాజకుమారుని రామునిం జేరి 'రాజపుత్త్రా! నీవు మహాకీర్తిమంతుఁడవు. నేను ధనహీనుఁడను, పెక్కుకొడుకులు గలవాఁడను; ఎప్పుడును అడవిని పఱిగ బ్రతుకు బ్రతుకుచున్నాఁడను. నన్నుఁ గటాక్షింపు,' మని చెప్పెను. అంత రాముఁడు నవ్వుచు వేడుకగా నతనిం జూచి 'గోవులు పెక్కువే లున్నవి. నీకు నొకవేయిమాత్రమె యియ్యను ; అంతయు నిచ్చెదను. అయితే నీవు కొయ్యను విసరివైవఁగా నది యెంతదవ్వు పోవునో యంతప్రదేశమునఁ బట్టఁ గలగోవుల నిత్తు' ననెను. ఆబ్రాహ్మణుఁ డంత సంభ్రమించి శీఘ్రముగా వస్త్రము మొలను జుట్టుకొని వేగమున కొయ్యను గిరగిరం ద్రిప్పి తనబలముకొలఁది విసరివైచెను. అతఁ డట్లు చేతినుండి విసరివైవఁగా నాదండము సరయూనదియవ్వలిదరిని గడచి పెక్కుగోవులను దాఁటి యాఁబోతుసమీపమునఁ బడెను. ధర్మాత్ముఁ డగురాముఁడు ఆత్రిజటునిఁ గౌఁగిలించుకొని సరయూనదిగట్టున నతనికొయ్య పడినచోటనుండి ఆయావుల నన్నిటిని గొల్లవాండ్రచే నతనియాశ్రమమునకుఁ దోలించెను. అంత రాముఁడు ఆగార్గ్యు ననునయింపుచు 'నీవు కోపింపవలదు. నేను వేడుకగా నిట్లు చేసితినే కాని మఱేమి కాదు. నీయీ తేజము నిరతిశయమైనదిగా నుండుటఁ జూచి దాని నే నెన్నఁగాఁ దెలిసికొనఁగోరి నేను కొయ్యను ద్రిప్పివైవుమని యీపని చెప్పినాను. మఱేమి కాదు, మఱియు నీ కేదేని గావలయు నని యభిలాష గలదేని దాని నడుగుము; ఇచ్చెదను. నేను ముందువలె పరిహాసము సేయుచున్నా నని తలఁపకు. సత్యముగాఁ జెప్పుచున్నాను. నీ కేమియు నడ్డము లేదు. నాధన మేదేద గలదో యది యంతయు బ్రాహ్మణులకొఱకే సంపాదింపఁబడినది. మీబోఁటులయం దది చక్కఁగా వినియోగపడెనేని నేను ఆర్జించినది సఫలమై నాకు సంతోషమును కీర్తియును గలుగు' ననియె. అంత

మహాముని యగు త్రిజటుఁడు నతనిభార్యయు ఆగోసమూహమును బుచ్చుకొని యం తకే సంతోషించి మఱేదియుఁ గోరక మహాత్ముం డగు రామునకుఁ గీర్తియు బలమును సంతోషమును సుఖమును వర్ధిల్లుఁగాకయని యాశీర్వచనము లొసంగిరి. రాముఁడును తాను ధర్మము దప్పక పరాక్రమమున సంపాదించినధనము నంతయు నిండుమనం బుతోఁ దనసుహృజ్జనులకు, వారివారికిఁ దగినసమ్మానవాక్యంబు లాడుచు, వారల కిమ్మని యాజ్ఞాపించెను. అందుఁ గల బ్రాహ్మణుఁడుగాని, బ్రాహ్మణుఁడు గాకున్నను, రామునితోఁ జెలిమిగలవాఁడుగాని, చెలికాఁడు కాకున్నను, మఱి భృత్యుఁడైనఁ గాని, తునకు బీదఱికమున బిచ్చమెత్తుకొనువాఁడుగాని, మఱి యెవ్వఁడుగాని, రాము నివలన యథోచితసమ్మానమును గోధనాదిదానములను బొంది తృప్తినొందనివాఁడొ క్కఁడును లేఁడయ్యె. ఆసమ్మానములును దానములును తొందరపడిచేసినను, అవి కొఱవడక అందఱికిని తృప్తికరముగానే యుండెను. ఇది ముప్పదిరెండవసర్గము.

---

## రాముఁడు సీతాలక్ష్మణులను దోడ్కొని పోవ ననుజ్ఞఁ గోరుటకై దశరథునికడకుఁ బోవుట.

రామలక్ష్మణులు సీతతోఁగూడ నట్లు బ్రాహ్మణుల కవ్వారిగా ధన మొసఁగి యంత సీతం దోడ్కొని తండ్రిని జూచుటకుఁ బోయిరి. అంత వారిరువురును, పూదం డలచేతం జుట్టఁబడి చందనాదులచే నలంకృతములై యున్నధనుఃఖడ్గాదుల నపుడు ధరింపఁగా, వారిరువురయాయుధములును దేఱిచూడరాని వై సీతాదేవియుఁ గూడ నుండుటంజేసి మిక్కిలియుఁ బ్రకాశించినవి. మార్గములందు బహుజనులు క్రిక్కి ఱిసియుండుటచే అందుఁ బోవుటకు నలవిగాకుండెను. కావున జనులు మేడలపై నెక్కి దీనులై రామునిఁ జూచుచుండిరి. అప్పుడు జనులు రాముఁడు ఛత్రముగూడలేక కాలినడతోఁ బోవుచుండుటఁ జూచి దుఃఖమున నుల్లములు పల్లటిల్ల నిట్లు పలువిధ ములుగాఁ దమలో 'ఎవ్వఁడు పోవుచుండఁగా గొప్పచతురంగసైన్యము వెంబడిం చుచుండెనో యట్టిరాముఁడు తా నొక్కఁడయి పోవుచుండఁగా సీతయును లక్ష్మణుఁ డును వెంబడించుచున్నారు. రాముఁడు ప్రభుత్వరసమును జక్కఁగా ననుభవించు వాఁడు! మఱి కోరినవారలకు కోరిన దెల్లనిచ్చువాఁడు. అయినను పితృశుశ్రూషాది ధర్మములందు గౌరవముగలవాఁడు గనుక తండ్రి చేసినప్రతిజ్ఞ పొల్లగుటకు నొర్వనే యొర్వకున్నాఁడు. మున్ను ఎవ్వతెను ఆకాశమునం దిరుగుభూతములకును జూడశక్య ము గాదో యా సీత నిప్పుడు రాజమార్గమున దలిజనులందఱును జూచుచున్నారు. సీతమేను మిక్కిలిసుకుమారము; కనుక మంచిమెయిపూఁతలాబడకుఁ దగును. ఆమె యెప్పుడును ఎఱ్ఱనిచందనముఁ బూసికొనునది ఇట్టిసీతను ఇఁక శీఘ్రముగా వానయు నెండయు చలియు రంగుమాఱునట్లు చేయఁగలవు. ఇప్పుడు దశరథునకుఁ బిశాచము పట్టి యిట్లు చెప్పుచున్నాఁడు. ఇది నిజము. లేకున్న నారాజు, తనగారాముకొమరుని రా

ముని నడవికిఁ బంపఁ గోరఁడుగదా. గుణహీనుఁడైన కొడుకు నయినను మనసువచ్చి
యడవికిఁ బంపుటయెట్లు? మఱి, దానమానాదిగుణము లట్లుండఁగా, ఒకనడవడి
మాత్రము చేతనే యీలోకము నంతయు గెలిచి వశము చేసికొన్న రామునివంటి
పుత్రరత్నమును అడవికిఁ బంపుటను చెప్పనేల? అహింసయు జాలియు విద్యయు శీల
మును శమమును దమమును అను నీయాఱుగుణములును పురుషులలో రాము
నికి సొంపు గూర్చుచున్నవి. కాబట్టి యట్టిరామునికి కొంతహింస సేయుట వ
లన ప్రజలందఱును. మండువేసవిని నీళ్లింకఁగా మిక్కిలి కొందలపడుజలజంతువులవ
లె, మిగుల పీడితులై యున్నారు. రాముఁడు జగత్తున కంతయు నధినాథుఁడు. అట్టిరా
మునికి వనవాసపీడ కలుగఁగా, మూలము చెడుటచేత పూవులతోఁ పండ్లతోఁ గూడ
చెట్టునాశము నొందునట్లు,అతఁడాధారముగాఁ గలయీజగమంతయు పీడితమైయున్న
ది. ధర్మమే యితనిసారము. ఇతఁడు మిక్కిలి కాంతిమంతుఁడు. కాన యితఁడు
మనుష్యాదిప్రాణిరూపమైనవృక్షమునకు వేఱు. తక్కిన సకలజనులును ఆవృక్షము
నందుఁ బూవులును పండ్లును ఆకులు కొమ్మలును. అట్లు ఆశ్రితులైన మనము ప
త్నులతోడను బంధువులతోడను గూడి, లక్ష్మణునివలె, రాముఁడు పోవుదారిఁబట్టి, య
డవి కతనివెంట నరుగుదము. మనము ఉద్యానవనములను భూములను గృహములను
వదలి రామునితోడి సుఖదుఃఖములే కలవారమై యాధార్మికునివెంటఁ బోవుదము.
మనము గృహములను విడిచిపోయినపిదప నందుఁ గలనిక్షేపములు పెల్లగింపఁబడిపోవు
ను;ముంగిళ్లు చెడి చీకాకగును. సేకరింపఁబడియున్నధనధాన్యములు కొల్లపోవును.మఱి
శయనాసనాదు లయిన ముఖ్యపదార్థము లవ్వలికిఁ గొనిపోవంబడును. ఇట్లవి పెంపు
చెడి ధూళిభృంగి గృహదేవతలును విడనాడి పోఁగా నందు కలుగులు ద్రవ్వి యెలుక
లిటునటు చెరలాడుచుండును. కలయంపులు చల్లుటయు చిమ్ముటయు నుండవు. వంట
లేమివలన పొగలు కప్పులమీఁద చూపట్టవు. బలికర్మములును యజ్ఞమంత్రధ్వనులు
ను అగ్నిహోమములును జపములును సున్నయగు. ఇట్లు క్షామకాలమునందుఁ బా
డుపడినవానివలెఁ గనఁబడుచు విఱిగినకుండలతో నుండుమనయిండ్లను కైకదీసికొ
ని సుఖముండుఁగాక. రాముఁ డేయడవికిఁ బోవునో, యది పట్టణమే యగుఁగాక; రా
ముఁడును మనమును విడిచిపెట్టినపిదప, ఈపట్టణమే యడవియగుఁగాక. మనము రా
ముఁడు పోయినయడవిలోఁ జేరినపిమ్మట, మనకు భయపడి యందలిపాములును బి
లములను విడిచి పోవును. మృగములును పక్షులును కొండనెత్తములు వదలి పాఱు
ను. ఏనుఁగులును సింగములును అడవులను బాసి పలాయితములగును. ఆసర్పము
లు మొదలయినవి అట్లు మనము పోయి చేరుచున్నతమవాసప్రదేశములను వదలి,
మనము విడిచి పోయినయీపట్టణములోఁ జేరి వసించుచుండుఁగాక.మనము పోయినపి
మ్మట గడ్డిపఱకలను మాంసమును పండ్లను దిను జింకలు పులులు కాకులు మొదల
గుజంతువులకును మఱితక్కుంగలక్రూరమృగపక్షిజాలమునకు వాసప్రదేశ మగు

నీదేశమును, కైకయు నామెకొడుకును బంధువులును, బొందుదురు కాక. మనమందఱము రామునితోఁ గూడ నడవిలో మిక్కిలి సుఖముగా వాసముచేయుచుండెదము' అని పరస్పరము మాటలాడుకొనిరి. రాముఁ డిట్లు అయోధ్యాజనులు అనేకవిధములుగాఁ జెప్పుకొనుమాటలను వినెను. వినియు నతనిమనసున కెంతమాత్రమును వికారము గలిగినదిగాదు. ఆధర్మాత్ముఁడు మదపుటేనుంగువంటి గరువంపునడక తీవి గులుకఁ బోయి దూరమున, కైలాసశిఖరమువలె తెల్లనై పొడవై పొడసూపు తనతండ్రి గృహమును గాంచి సమీపించెను. అందు వీరపురుషులు వినీతులై, కాపుండిరి. రాముఁ డారాజగృహముఁ బ్రవేశించి యించుకదూరమున దీనుఁడై యున్నసుమంత్రునిఁ జూచెను. అతఁడు తండ్రియాజ్ఞను యథావిధిగాఁ జేయఁ బూని యాతండ్రిని జూడఁగోరి దారియందు జనులు తన్నుం జూచి దుఃఖించినను తా నెంతమాత్రమును గొందలపడక నవ్వుచున్నట్లు కనంబడుచుఁబోయెను. మహాత్ముఁడును మహాధీరుండు నగునాదశరథకుమారుఁడు వనమునకుఁ బోవువాఁడై, యచట, రాజు తన్నడవికిఁ బొమ్మన్నది మొదలుగా దుఃఖమునం గంది కుందుచున్నసుమంత్రునిఁ జూచి తండ్రికిఁ దనరాక తెలుపుటకై వానిని ప్రతీక్షించుచు కొంతతడవు నిలిచియుండెను. రాముఁడు ధార్మికుఁడు గావున తండ్రియాజ్ఞ చొప్పున నడవికిఁబోనను నిశ్చయించి సుమంత్రునిఁ జూచి తాను నిదె వచ్చి కాచియున్నట్లు రాజునకుఁ జెప్పుమనియె. ఇది ముప్పది మూఁడవసర్గము.



## రాముఁడు దశరథునికడకు మరలఁ బోయి సెలవుఁ బుచ్చుకొనుట.

అంతఁ దామరపూరేకులవంటి కన్నులును చామనిచాయయు సన్ననినడుము గలిగి వెలుఁగుచుండు పూజ్యుండగు రాముఁడు సూతునిఁ జూచి తనరాక తండ్రికిఁ దెలుపుమని చెప్పెను. వాఁడును నింద్రియములెల్ల కలఁగఁబాఱ రామునిపంపున వేగముగా లోనికిఁ బోయి నిట్టూర్పులు పుచ్చుచున్నరాజును జూచెను. అప్పుడు భూపతి రాహుగ్రస్తుఁ డగుసూర్యునివలెను, నివురు గప్పిననిప్పువలెను, నీళ్లు లేనిచెఱువువలెను, పెంపుసొంపు దక్కి, వానికిఁ జూపట్టెను. ఉల్లము మిక్కిలియు తల్లడిల్లి 'రామా' యని రామునే పేర్కొనుచు వగచుచున్నరాజుంజూచి, మిక్కిలి ప్రాజ్ఞుఁడగు సుమంత్రుఁడు అంజలి గీలించి సమీపమునకుఁబోయి జయముగలుగున ట్లాశీర్వదించి భయమునఁ బలుకులు దొట్రుపడ మెల్లగాను మధురముగాను నతనితో 'పురుషసింహుఁడగునీపుత్రుఁడు ధనమంతయు బ్రాహ్మణులకును పరిజనులకును నొసంగి నిన్నుఁ జూడ వాకిటఁ గాచియున్నాఁడు. సత్యపరాక్రముఁ డగునారామునకు నీవు దర్శన మిమ్ము. అతఁడు తనచెలికాండ్రందఱియొద్దను సెలవు పుచ్చుకొని నీయొద్దను సెలవు వడయుటకై ని న్నిపుడు చూడఁగోరుచున్నాఁడు. జగతీనాథా! అతఁ డిఁక నడవికిఁ బోవనున్నాఁడు. కావున సూర్యుఁడు కిరణములతోఁ గూడియున్నట్లు సకలరాజగుణము

లతోఁ గూడియున్న యతనిని నీ విపుడె చూడుము' అనెను. సత్యవాదియు ధర్మాత్ముఁడును సముద్రముఁబోనిగంభీరుఁడును ఆకాశమువలె నిర్మలుఁడు నగునానరపతి వానిం జూచి 'సుమంత్రా! ఇపు డిచట నుండుభార్యల నందఱిని దోడ్కొనిరమ్ము, భార్య లందఱినిగూడి యాధార్మికునిఁ జూడఁగోరెద' ననియె. వాఁ డంతఃపురము గడచిపోయి రాజకాంతలంజూచి 'అమ్మలారా! రాజు మిమ్ముఁ బిలుచుచున్నాఁడు. శీఘ్రముగా నచటికిఁబోవలయును. జాగువల'దనియె. సుమంత్రుఁ డిట్లు రాజాజ్ఞచొప్పున చెప్పినమాటలు విని యాస్త్రీలు పతియాజ్ఞ తలఁ దాల్చి యతఁ డున్నమందిరమునకుఁ బోయిరి. వారందఱును మున్నూటయేబండ్రు. ఆపతివ్రతలు రామునికై వగచివగచి కన్ను లెఱ్ఱఁబాఱఁగా, కౌసల్యను పరివేష్టించి మెల్లనినడకలం బోయిరి. రాజు, భార్యలెల్ల వచ్చుటఁ జూచి సూతునిం బిలిచి 'సుమంత్రా! నాకొడుకును దోడ్కొని ర'మ్మనియె. వాఁడు నపుడు రామునిని, లక్ష్మణుని సీతనుం, బిలుచుకొని శీఘ్రముగా తనవచ్చినదిక్కు మొగమై మహారాజునొద్దకుఁ బోయెను. ఆరాజు దూరమునసనుండి చేతులుమోడ్చుకొని వచ్చుచున్నకొమారునిం జూచి దుఃఖితుఁడై చుట్టు నున్నభార్యలతోఁగూడి చివ్వున ఆసనమునుండి లేచెను. అట్లు రాజు లేచి రామునింజూచి వేగమున నెదురుగాఁ బోయెను. కాని యతఁడు దుఃఖపీడితుఁడై యుండుటవలన రామునిం జేరఁజాలక నడుమనే మూర్ఛితుఁడై నేలంబడెను. అట్లు దుఃఖితుఁడై దుఃఖవశమున తెలివిదప్పి నేలంబడినరాజుం జూచి యపుడు రాముఁడును మహారథుఁ డగులక్ష్మణుఁడును లేవనెత్తుటకై దగ్గఱికిఁ బాఱుతెంచిరి. రాజగృహమునందలి స్త్రీలు వేవురు భూషణధ్వనులు పర్వఁగా హాహాకారంబుల రామునిం బేర్కొనియేడ్చిరి. రామలక్ష్మణు లిద్దఱును సీతయును అతనిఁ జేతులఁ గ్రుచ్చియెత్తి రోదనంబు సేయుచుఁ బాన్పునం గూర్చుండఁబెట్టిరి. అంత రాముఁడు, కొంత సేపటికి మూర్ఛదేఱి దుఃఖసముద్రమున మునింగియున్నతండ్రిం జూచి, చేతులుమోడ్చి 'మహారాజా! నీవు మాకందఱికిని ప్రభుండవు. నీయనుజ్ఞ లేక పోరాదు. కనుక సెలవువేఁడెద. దండకారణ్యమునకుఁ బయనమై యున్న నన్నుఁ గంటఁ దడిలేక కుశలముగాఁ జూడుము. మఱి లక్ష్మణునకును సెలవిమ్ము. సీతయు నా వెంట నడవికి వచ్చుచున్నది. దానికిని అనుజ్ఞ యిమ్ము. నిజములైనకారణములు పెక్కు చెప్పి రావలదని యెంత వారించినను వీర లిచ్చట నిలువనొల్లరైరి. నీవు మాకందఱికిని మానము గూర్చువాఁడవు. శోకము విడిచి లక్ష్మణునకును నాకును సీతకును మాకందఱికిని, బ్రహ్మదేవుఁడు ప్రజలకుంబోలె, అనుజ్ఞయొసంగుము' అనెను. వనవాసమునకై జాగుసేయక తనయనుజ్ఞ కెదురుచూచుచున్న రామునిఁ జూచి, రాజు 'రామా! నేను కైకకు వరమిచ్చుటచేత మోసపోయితిని. ఇపుడు నన్ను నిగ్రహించి నీవే యయోధ్యకు రాజవుగమ్ము' అనియె. రాముఁడు ధార్మికశిరోమణి; మఱియు మాటనేర్పరి; కనుక తండ్రి చెప్పినది విని చేమోడ్చి గీలించి 'మహారాజా! నీవు వేలకొలఁది వత్సరములుగా భూమికిఁ బతివై పాలించుచున్నావు.

అట్టినీవు నన్ను అసత్యవంతునిగాఁ జేయఁదగదు. నాకును నిన్ను సత్యముతప్పినట్లుగాఁ జేయరాదు. కావున నే నడవికిఁబోయి వాసముసేయుదును. రాజా! నే నొకయైదును తొమ్మిదేండ్లు అడవిలో సుఖముగా తిరుగుచు వసించియుండి ప్రతిజ్ఞ తీఱినపిమ్మట మరల నిచటికివచ్చి మీపాదముల నాశ్రయించెదను' అనియె. రాజు సత్యపాశంబున కట్టువడి విడివడనేరక రోదనముసేయుచు దీనుఁడై రహస్యమున కైకయప్పుడె పంపుమని పురికొలుపఁగా చేయునదిలేక తనప్రియకుమారునిఁజూచి 'నాయనా! పొమ్ము. దానిచే పరలోకఫలమును ఐహికాభివృద్ధియు మరలనిచ్చుటికి రాకయుఁగలుగుఁగాక. మంగళకరమై, యొకజంతువుచేతను భయము కలుగనిమంచిమార్గమునుబట్టిపొమ్ము. వత్సా! నీవు సుగుణములచే రఘుకులమువారికెల్ల నానందము గూర్చువాఁడవు, సత్యస్వభావుఁడవు. నీమనస్సు ధర్మమునందే వర్తించుచుండును. ఇట్టినీకు నడవికిఁబోవలయు నన్న బుద్ధిని మార్పఁదరముగాదు. పుత్రా! నేఁటికిమాత్రము నీ వేవిధమునఁగాని పోఁగూడదు. ఇదిగో రాత్రియు సమీపించినది. ఈరాత్రియంతయు నిచ్చటనేయుండుము. ఇట్లుండు వేని ఒకదినమైనను నిన్నుఁగన్నారఁజూచుచు సుఖముగానుండెదను. నీతల్లిని నన్నుఁజూచుచు నీరాత్రియంతయు నిచట నుండుము. మేము నీకోర్కులన్నియుఁ దీర్చి తృప్తిఁ బొందించెదము. అంతి రేపు ప్రాతఃకాలమునఁ బోవచ్చును. పుత్రా! నాకుఁ బరలోకప్రీతినిగోరి, నీకుఁ బ్రియములగువాని నన్నిటిని బరిత్యజించి విజనం బగువనముచకుఁబోవుచున్నావు. ఇది యేవిధమునఁగాని యెట్టివారికిని జేయఁదరముగాదు. ఇట్టికార్యము నీవుసేయుచున్నావు. రామా! నిన్నడవికిఁబంపుట నాకెంతమాత్రము నిష్టముగాదు. అయినను సత్యముమీఁద బాసచేసిచెప్పెదను. నివుఱుగప్పిన నిప్పువలె తనలోని క్రూరగత్వమును తెలుపక దాఁచియుండినయీఁడుది, నన్ను నాకు వశముగాకుండునట్లు చలింపఁజేసి మోసపుచ్చినది. నేను సామాన్యముగా నిచ్చినవరములను అదియిట్లు విపరీతముగా నడిగి యేమఱించినది. అట్టిమోసమునుగూడ, నీవు, కులాచారమును నేఁగూల్చినకైక చెప్పినట్లు విని యొనఁగూర్చి తీర్చివైవఁ గోరుచున్నావు. నీగుణ మేమని చెప్పుదు: కుమారా! నాకు జ్యేష్ఠపుత్రుఁడవగునీవు తండ్రినగు నన్ను అసత్యము చెప్పనివానినిగాఁ జేయఁగోరుట అంత ఆశ్చర్యముగాదు' అనెను. అంత రాముఁడు తండ్రి కొంచలపడుచుఁ జెప్పినమాటవిని దుఃఖించి, లక్ష్మణుఁడును దుఃఖింప, నాతనితో 'తండ్రీ! అన్నికోర్కులు తీర్చి తృప్తిచేసెదనంటివి. మీరియ్యఁగా నే నిప్పుడు గుణవంతములైనయిష్టధర్మము లనుభవించినను మఱి రేపువానిని నాకిచ్చువాఁడెవ్వఁడు? కావున నిది వ్యర్థమే. అన్నికోర్కులకు బదులుగా అవ్వలికిఁగడచి పోవుటయే కావలయును. నానాదేశములతోఁగూడిన జనులును ధనధాన్యములును నిండియున్న యీ భూమినంతయు వదలిపోయెదను. దీనిని భరతున కొసఁగుము. వనవాసము చేయవలయు ననునాతలంపు యిపుడెంతమాత్రమును చలింపదు. నీ వడిగిన వరములనిచ్చువాఁడవు. కనుక మున్ను నీవు సంతోషించి కైకకు నేవరమిచ్చితివో దా

నినంతయు, పూర్ణముగానే యాయమ కిచ్చి సత్యసంధుఁడ వగుము. నేనును నీయాజ్ఞ నుఒకపలుకైనను తప్పక పరిపాలించుచు, వనంబునందుఁ జరించుఋషులతోఁ జేఁ గూడి, పదునాలుగేండ్లు, వసించియుండెదను. నిన్ను నిగ్రహించి నన్ను రాజు గమ్మంటివి. ఇట్టివిచార మేదియువలదు. భరతునకు రాజ్య మిమ్ము. నీవు రఘుకులసంతోషకారివి. నామనస్సునకు సుఖము నేని యుద్దేశించి రాజ్యమును గాంక్షించువాఁడను గాను. నీయాజ్ఞను సరిగా నెఱవేర్చుటయందే నాకుఁ గోరిక. ఈదుఃఖమును త్రోసివుచ్చుము; కన్నీళ్లు గార్చుచుండవలదు. నదీపతియై యెవ్వరికిని మార్కొనరానిదిట్టయగు సముద్రుఁడు కలఁతనొందఁడుగదా; అట్టివాఁడగునీవును గలఁతనొందరాదు. నాకు రాజ్యమందుఁగాని సుఖమందుఁగాని సీతయందుఁగాని మఱియీకామ్యపదార్థము లన్నిటనుగాని స్వర్గమునందుఁగాని ప్రాణమందుఁగాని యెంతమాత్రమును గోర్కి లేదు. పురుషలలామా! నీవు సత్యవంతుఁడగుటయే నాకుఁ గావలయును. అసత్యవంతుఁడగుటనొల్లను. ఇట్లని ప్రత్యక్షదైవ మగునీయెదుట నాసత్యముమీఁదను సుకృతముమీఁదను బాసచేయుచున్నాను. ప్రభూ! ఇచట క్షణకాలమైనను నిలుచుటకు నాకు శక్యముగాదు; కనుక నే నీదినము నిలువలేదని నీ వీశోకమును బూనకుము. నేను బూనినసంకల్పమునకు తిరుగఁబాటు కలుగదు. కైకేయి నన్ను వనమునకుఁ బొమ్మని ప్రార్థించినది; నేనును బోయెదనని చెప్పితిని. కాఁబట్టి నీయాజ్ఞ సేయుటే కాక నే నాడినసత్యమును గాచుకొనవలయును. కనుక నడవికి పోకతప్పదు. దేవా! ఇందులకై నీవుతహతహపడవలదు. మేము క్రూరములుగాక శాంతస్వభావము లయినజింకలు నెరసి బెరసి పలువిధము లయినపక్షులు కొలకొల కూయుచు నున్నవనమునందు సుఖముగా క్రీడించుచుండెదము. తండ్రీ! దేవతలకుఁగూడ తండ్రియే దైవమనికదా చెప్పఁబడియున్నది. ఇంక మనుష్యులకుఁ జెప్పనేల! కాఁబట్టి తండ్రియే దైవమని యెంచియే నేను తండ్రియాజ్ఞ చేసెదను, మనుజోత్తమా! పదునాలుగేండ్లు గడచిపోఁగా నిచ్చటికి వచ్చిననన్ను మరలఁ జూచెదవు. ఈసంతాపమును విడువుము. నరశార్దూలా! కన్నీట డగ్గుత్తికపడియున్నయీజనులనందఱి కన్నీరునాపి తేర్పవలసినభారము నీయది. అట్టినీవే యిట్లు దుఃఖమున తబ్బిబ్బునడితివేమి? నేనువిడిచినపట్టణమును రాజ్యమును ప్రాజ్యంబైన భూమియు భరతునకిమ్ము. నేను నీయాజ్ఞను బరిపాలించుచు నరణ్యమునకుఁ బోయెదను. అయిన నిప్పుడేరాను; అందు చాలఁగాల ముండెదను. మహారాజా! పర్వతసమూహములును పట్టణములును ఆరణ్యములునుగలిగి మంచి యెల్లలతోనొప్పి మంగళకరమై యున్నయీభూమిని నేను బరిత్యజించి పోవఁగా భరతుఁడే యంతయుఁ గైకొని పరిపాలించుచుండుఁగాక. ఇది నాయిచ్చచేఁ జేయఁబడినదికాదు. నీవేమిచెప్పితివో యది యట్లే జరుగవలయును. అనఘా! శ్రేష్ఠసమ్మతం బగునీయాజ్ఞను బరిపాలించుటయందు నా మనస్సు ఎట్లు దృఢముగా నుండునో, యట్లు ఉత్కృష్టము లయినకోర్కులయందుఁగాని నాకుఁబ్రియమైన దానియందుఁగాని యదియుండదు. కా

బట్టి యడవికిఁ బోవుట నాకుఁగష్టముగాఁ దోఁచునని నాకొఱకు నీ వెంతమాత్రముదుఃఖము నొందవలదు. కనుక నీకు అసత్యదోషము గూర్చుట, దానిచే నాకు సమస్త కామములును సుఖములునుగలిగినను ఒల్లను; మఱి సీతను ప్రాణములనుగూడ నొల్లను. ఇఁక నీయక్షయరాజ్యమును ఒల్లనే యొల్లనని చెప్పనేల. నీ సత్యవ్రతమునకు హాని లేనివిధముననే యవి యన్నియును గావలయును. నాకు దుఃఖము కలుగునని కుందకుము. నేను పలువిధము లయినవృక్షములు గలవనంబునకు తప్పకపోయి యచట ఫలమూలములను భక్షించుచు పర్వతములను నదులను కొలఁకులను చూచుచు సుఖముగా నుండెదను. నీవు దుఃఖమును విడిచి మిక్కిలి హాయిగా నుందువుగాత' యనియె. రాముఁ డట్లు చెప్పఁగా రాజు, నిట్టియిడుమం బడి, తాపమున మేను పురపురఁ బొక్క, దుఃఖమున మనసు కంది కుంద, నలఁగి కలఁగి, కొడుకుం గౌఁగిలించుకొని, ప్రజ్ఞయు మిక్కిలి దప్పి మూర్ఛిల్లి చేష్ట లించుకైనను లేకుండెను. అంత నారాజపత్నికైకయొక్క తె తక్కతక్కినరాజపత్ను లందఱును నొక్కటియై మిక్కుటముగా రోదనము చేసిరి. సుమంత్రుఁడు రోదనము సేయుచు మూర్ఛితుఁ డయ్యె. అచ్చటి జనులందఱును హాహాకారములు సేసిరి. ఇది ముప్పదినాలుగవసర్గము.

## సుమంత్రుఁడు కైకేయిని దూఱుట.

అంత సుమంత్రుఁడు కోపాతిశయమున తల విదిర్చికొని సారెసారెకు నిట్టూర్పులు పుచ్చి చేతులు పిసికికొనుచు, పండ్లు పటపటం గొఱికి కోపంబునఁ గన్నులెఱ్ఱఁబాఱ, దేహమంతయు పూర్వవర్ణమువిడిచి యెఱ్ఱఁదనము నొంద,కోపం బతివేగంబునఁ బైకొన, తీవ్రం బగుతాపమునం బొక్కుచు, దశరథునిమనసుగూడ కైకేయి యెడల రాగరహితం బగుటఁజూచి, వాఁడిశాణంబులం బోనివాక్యంబుల నామె హృదయం బదురునట్లు సేయువానివలె,వజ్రములవంటి వాగ్బాణములచే మర్మస్థానము నెల్ల భేదించునట్లు ఆబిడ గుట్టెల్ల బట్టబయలు సేయుచు "దేవీ ! దశరథుఁడు రాజు; మఱియు స్థావరజంగమాత్మక మయినజగమునకంతయు భర్త; ఇట్టి మహాప్రభుండగుపెనిమిటిని మనసు వచ్చి విడిచితివిగా! ఇట్టికట్టిఁడి వగు నీకు ఈలోకమునం దంతయు ఎంతటియకార్యమైనను చేయరానిది లేదు. మహారాజు ఇంద్రునివలె జయింపరానివాఁడు; పర్వతమువలె చలింపఁజేయరానివాఁడు; సముద్రమువలెఁ గలంచివుచ్చఁగూడనివాఁడు. ఇట్టియతనినిఁగూడ నీకట్టిఁడిపనులచే పురపురఁ బొక్కఁజేయుచున్నావు. కావున పతిని జంపుదానవు. పతినే కాదు; అతనిని జంపుటచే తుదకు కులమునంతయుఁ జంపుదానవని నాకుఁ దోఁచుచున్నది. దశరథుఁడు అందఱినిఁ బోషించువాఁడు; కోరినకోర్కు లిచ్చువాఁడు; మఱి నీకుం బెనిమిటి. ఇట్టి యతనిని అవమానింపకుమా. స్త్రీలకు పుత్రునైనను విడిచి పతి మనస్సు ననుసరించుటయే విశేషమయినది; కోటికొడుకులు కన్నను, పెనిమిటికోర్కి సేయుటయే యధికమైనది

రాజునకు మరణము కలిగినపుడు అతని కొడుకులు వయస్సుక్రమమునుబట్టి పెద్దవాఁ
డు మొదలుగా రాజ్యమును బడయుదురు గదా. కనుక రాజునకు పెద్దకొడు కగు
రామునకు రాజ్యము పడయుట ధర్మము. ఇక్ష్వాకువంశమునకు ప్రభుం డగు దశర
థుఁడు జీవముతో నుండఁగానే కులక్రమాగత మైనయిట్టిధర్మమును మాయింపఁ ద
లఁచితి వేమి? నీకొడు కైనభరతుఁడు రాజగుఁగాక. అతఁడే భూమిని బాలించుచుం
డుఁ గాక. ఎచ్చటికి రాముఁడు పోవునో యచ్చటికే మేమును బోయెదము. నీదేశము
నం దిఁక నొక బ్రాహ్మణుఁడైనను కాఁపుర ముండఁడు సుమా! కాకేమి! నీవుమర్యాద
తప్పి వారు లేచిపోవునంతటి దుష్కార్యమును జేయఁబూనియున్నావు. నీవు మర్యాద
తప్పిన యిట్టికులాచారము చేయుచున్నందులకు తోడనే భూమి బ్రద్దలువాయ వ
లయును. అది పగులకున్నదే! ఇది నా కాశ్చర్యముగా కనఁబడుచున్నది. వసిష్ఠాదు
లైనగొప్పబ్రహ్మఋషులు ఈయమర్యాదకుఁ గోపించి 'ఇసీ! పాడైపో'మ్మని వాగ్దం
డములు ప్రయోగించియుందురే. చూపఱకు భయంకరములై వేండ్రములైనయా
వాగ్దండము లయినను రాము నడవిపాలుసేయ నొడిగట్టి యున్నకట్టఁడి దానిని గాఱి
యపెట్టకే యున్నవేమి? * ఎవ్వఁడేని తియ్యనిపండ్లు పండుమామిడిచెట్లును గొడ్డ
లిచే నఱికి, వేఁపచెట్టునకు పాదులు మొదలగునవి గట్టి పెంచి, దానిని పాలచేఁ దడు
పుచు వచ్చునేని యావేము అతనికి దియ్యనిపండ్లనిచ్చునా? చేఁదుకాయలే యొసఁ
గును. గొప్పవంశమునఁ బుట్టియు నీతల్లికి స్వభావ మెట్టిదయ్యెనో యట్టిదే నీస్వభా
వము అని నాకుఁ దెలియును. వేఁపచెట్టునుండి తేనె స్రవింపఁ దనుమాట లోకము
నందు ప్రసిద్ధమే కదా. దుష్టురాలికి సుపుత్రి యెట్లుపుట్టును? మీతల్లి యొడిగట్టిన
పాపకర్మములు ముందు అందఱికిని వినికి గలదు. అట్లే యిప్పుడు మాకును దెలి
యును. వరప్రదాత యగునొకమహాత్ముఁడు నీతండ్రి కుత్తమం బగునొక వర
మొసంగెను. ఆవరమువలన నతనికి సకలప్రాణులు చెప్పుకొనుపలుకులు చక్కఁగా
దెలిసినవయ్యెను; కనుక తిర్యగ్జంతువులు చెప్పికొను మాటలుగూడఁ దెలిసియుండి
నవి. అంత నొకానొకప్పుడు మిక్కిలి తేజస్వియైనమీతండ్రి, తినపాన్పునొద్ద క్రిందుగా
జృంభ మనునొక తెగచీమ పలికినపలుకువిని దానిభావము గ్రహించియందులకు పలు
మాఱు నవ్వెను. అట్లు నవ్వినందులకు నీతల్లి తన్నుఁజూచియే పరిహసించె నని
తలంచి మరణంబును గోరునంతటికోపము నొంది పతితో 'రాజా! నీవు తిన్ననివాఁ
డవు. నీవిట్లు నవ్వుటకు కారణము తెలియఁగోరెద'ననియె. రాజును ఆశ్చర్యం జూచి
'దేవీ! నేను నవ్వినకారణమును జెప్పితినేని తోడనే నాకు మరణము కలుగును.
ఇందులకు సందేహాము లేదు' అనెను. నీతల్లియంత నీతండ్రిని కేకయరాజుం జూచి

* దీనిచే 'రాముని అడవిపాలు సేసి కైకేయి యభిమతము గూర్చుటచేత దశరథునికిఁ గష్టమే కాని యాకైకవలన నెంతమాత్రము సుఖము కలుగ' దని దశరథుని సుమంత్రుఁడు గూఢముగా నిందించుట తెలియనగు.

నీవు బ్రతుకుము లేక చావుము. అది నా కక్కఱలేదు. నవ్వినందులకు కారణము చెప్పుము. అప్పటికి నీవు నన్నుఁ బరిహాసింపలేదని తెలియుదును' అనెను. కేకయురాజు తనయిల్లా లట్లు చెప్పఁగా విని యిట్టిసంకటమునను విమర్శించి యావిషయమునంతయు మున్ను తన కావరము నిచ్చినయతనికి జరిగినట్లు తెలియఁజెప్పెను. అంత సత్పురుషుఁ డగు నావరప్రదాత రాజుంజూచి 'రాజా! అది చచ్చినను జావనీ, లేక పదవితొలఁగి పోయినను పోనీ, ఏమిచేసినను నీ వెంతమాత్రమును జెప్పకు' మనియె. రాజు ఆనిర్మలాత్ముఁడు చెప్పినమాటవిని తోడనే నీతల్లిని త్రోసిపుచ్చి కుబేరునివలె సుఖముగా విహరించెను. అట్లే నీవును పాపమందే కన్నుగలదానవు గాన దుర్జను లాచరించుపద్ధతినిఁ బూని నీతల్లివలెనే మోహమున నితనిని దుర్విషయములందుఁ జొనిపి చెఱుపుచున్నావు. 'గుణములందు తండ్రివలె కొడుకులును తల్లివలె కూఁతులును బుట్టుదురు' అను లోకు లాడుకొనెడియీ వార్త యిప్పుడె నాకు నిజమని తోఁచుచున్నది. ఇట్టిదానవు కాకుము. వెనిమిటికి విధేయురాలవై యతఁడు చెప్పినబుద్ధి పాటించి కయికొనుము. నీభర్త యిచ్చచొప్పున రాముని పట్టాభిషేకమున కనుమతింపుము. ఇప్పుడు రాముని వనవాసమును గుఱించి మిగుల దుఃఖితులై యున్నపౌరజానపదులైనయీప్రజలకు శరణగుము. పాపాత్ములు పురికొలుపఁగా వారిమాట విని, దేవేంద్రునివలె వెలుఁగుచున్న లోకనాథుఁడగు నీనాథునిని, పిన్నవానికిఁబట్టముగట్టి పెద్దవానిని అడవికి పంపునట్టియధర్మమునకు పాలుపఱుపకుము. * దేవీ! తామరరేకులవంటి కన్నులు గలశ్రీమంతుఁడైన యీభూకాంతుఁడు ఈ దశరథుఁడు పాపదూరుఁడు. కనుక నీకుఁ జేసిన ప్రతిజ్ఞ పొల్లు గావింపఁడు. ఈవిధమునఁ గాకున్నను మఱివేఱువిధమున నైనను, రాజ్యమునకన్న నెక్కుడు వెల గలరత్న భూషణాదుల నిచ్చియు నీకుఁ జెప్పినవరములు చేసి తీర్చును. రాముఁడు జ్యేష్ఠుఁడు, ఉదారుఁడు, సదాచారపరాయణుఁడు, దుష్టనిగ్రహశిష్టపరిపాలనరూపమైననిజక్షత్త్రియధర్మమును దప్పక నడపువాఁడు, బలవంతుఁడు. ఇట్లు పట్టాభిషేకమునకు వలయుగుణములు గలరామునకు నభిషేకము సమకూర్పుము. దేవీ! రాముఁడు, రాజై యున్న తండ్రింబాసి యడవికిఁబోవునేని నీకు లోకమందెల్ల పెద్దయపవాదముగలుగును. గుణసంపన్నుఁ డగునట్టిరాముఁడే రాజ్యమును బాలించుచుండుఁగాక. నీవును ఈకొందలము విడువుము. రాముఁడడవికిఁ బోయెనేని యీయయోధ్యయం దతనికంటె యోగ్యుండెవఁడును లేఁడు.కనుక నతఁడే రాజ్యమున కర్హుఁడు. పెద్దవాఁడగురాముఁడుండఁగా మఱొకఁడు,పిన్నవాడగు భరతుఁడు,పట్టమున కర్హుఁడును గాఁడు. రాముఁడు యావరాజ్యము దాల్చినపిమ్మట, గొప్పవిలుకాఁ డగుదశరథమహారాజు మున్ను ఇక్ష్వాకురాజులు గావించినయాచార

* ఇందులకు 'దేవి నీకు దశరథుఁడు వేడుకగా నూరక ప్రతిజ్ఞ చేసినాఁడు కావున దానినిప్పుడు చేయఁడు' అని మహేశ్వరతీర్థులయర్థము.

ము చొప్పున వనమునకుఁబోవును. ఇదియేధర్మము' అని చెప్పెను. ఇట్లు సుమంత్రుఁడు రాజసభయందు సాంత్వవచనంబులను కఠినవాక్యములను గైకేయిని మిక్కిలియుఁ గలఁచివుచ్చి యంత నెప్పటియట్ల చేతులు మొగుడ్చుకొని యుండెను. అప్పుడాదేవియో యెంతపరుసుగా మాటలాడినను కలఁగినదిగాదు.ఎంత లాలించి యడుగుకొన్నను జాలిచే మనస్సు నొచ్చినదియుఁగాదు. ఉగ్రముగానున్న యామెముఖవర్చస్సు కొంచెమైనను తేటపడినదియుఁ గాదయ్యె. ఇది ముప్పదియైదవ సర్గము.

---

— { దశరథుఁడు రామునిఁ జతురంగబలాదిసహితముగాఁ బంపఁ జూడఁగాఁ గైక యట్లు గూడదని నివారించుట సిద్ధార్థుఁడు కైకకు బుద్ధిసెప్పుట. } —

కైక యట్లుసమ్మతింపమి తెలిసినపిదప, దశరథుఁడు వరమిచ్చినట్లు తాను జేసినప్రతిజ్ఞకు చిక్కువడి పీడితుండై వేఁడినిట్టూర్పులుఁ పుచ్చి మాటికి సుమంత్రునితో 'సూతా ! రాముని వెంటనంటి పోవుటకై చతురంగములతోఁ గూడినసైన్యమును పెక్కురత్నములును మేలిపదార్థములను పూర్ణముగానిచ్చి శీఘ్రముగాఁబంపవసమకట్టుము. మఱియు భోగమువారు మాటకారితనంపునెఱనీటుల మనస్సును హరించుచును,మిక్కిలి ధనవంతు లగువణిజులు విడిదిపట్టులందు సరకులను బఱచుకొని విలుచుచును, ఇట్లు రామునిసైన్యము నలంకరింతురుగాక. ఎవ్వరు రామునిఁ గొలిచి బ్రతుకుచుందురో, మఱి యెవ్వరితో రాముఁడు వీర్యపరీక్షార్థము క్రీడించుచుందురో, వారి కందఱికిని సువర్ణరజతవస్త్రాదిబహువిధము లైనధనములు మిక్కిలి యొసంగి వారినిగూడ నీసైన్యముతోఁగూడఁ బోవ నియోగింపుము. ఉత్తమము లైన యాయుధములను దాల్చినవారును, నూనె నేయి మొదలైనవి గొనిపోవుబండ్లును, పట్టణమందలిమేటిజనులును,రాముని వెంటఁ బోవుదురుగాక. వనచరు లగుబోయవారును అడవిలో దారిచూపుటకై కూడఁబోవుదురుగాక. రాముఁ డట్లు సైన్యములం గూడి యడవిలో మృగములను ఏనుంగులను జంపుచు, అందుఁ బుట్టినతేనియలం ద్రావుచు పలువిధము లైననదులం జూచుచు రాజ్యమునుగూర్చి తలంపులేక సుఖముగా నుండును. రాముఁడు అడవియందు వసింపఁబోవునపుడు వానివెంట నాకుఁగలధాన్యకోశమును ధనకోశమునంతయుఁ బంపుము. వాఁడు పుణ్యక్షేత్రములందు యాగములుసేయుచు యథోక్తము లైనదక్షిణల నొసంగుచు ఋషులతోడంగూడి వనంబున సుఖముగా వాసముసేయఁగలఁడు. మహాభుజుం డగుభరతుఁడు నయోధ్యను బాలించుఁగాక. శ్రీమంతుఁడగురాముని సమస్తకామితార్థములనుంగూర్చి యడవికిఁ బయనముసేయుము' అని చెప్పెను. ఇట్లు దశరథుఁడు చెప్పఁగా కైకేయికి మిక్కిలి భయముకలిగి, ఆమెమొగముకూడ ఎండెను; ఎలుఁగును డగ్గుత్తికవడెను. ఆకైక దుఃఖితయై మిగుల దిగులుఁజెంది ముఖము శోషిల్లఁగా రాజుదిక్కు మొగమయి 'నీవు సజ్జనుండవుగా! ఇట్లు చేయుదువా? జనులుపోయి పాడుపడి, పయితేటత్రాఁగబడఁగా మి

గిలిన యడుగుమద్యమువలె,యనుభవింపఁదగిన మేలిపదార్థములుమాలి మిక్కిలియుఁ జవిగొనరానిదై యుండు నీరాజ్యమును భరతుఁడు గైకొనఁడు' అనెను. కైక సిగ్గుమాలి యిట్లు మిక్కిలి బెట్టిదముగాఁ బల్కఁగా రాజు ఆ వాలుఁగన్నులవన్నెలాఁడిని జూచి 'పగతురాలా! మోయరానిబరువు నాపై నెక్కించుటయేకాక యది మోయుచుండఁగా మఱియును పీడించుచున్నావేల ? దుష్టురాలా! నేను రాముని వెంట సైన్యాదులు పంపఁ బూనిన వెనుక వలదనుచున్నావు. దీనిని మునుపే, నీవు వరమడుగునపుడే, యేల వలదని యడుగుకొనవైతివి? కాన యడుగనిదాని నియ్యనొల్లను'అనెను. అతఁడు మిక్కిలి గోపించి చెప్పినమాటవిని,చెలువైనయంగములు గలయాకైకయు,మఱియొకవిధమున తనయభీష్టము చెలుపం బూనినాఁడని యినుమడిగా కోపించి రాజుంజూచి 'నీవంశమునందే సగరుఁడు తన జ్యేష్ఠపుత్రుని అసమంజుఁడనువానిని అడవికి వెడలఁగొట్టినాఁడు. వానిని అడవికి సైన్యాదులతోఁగూర్చి పంపలేదు. కావున నడవికిఁ బంపుటయనఁగా నిర్ధనుఁడుగా పంపుటయని సిద్ధించుచుండఁగా నిది వేఱ యడుగవలయునా? వాఁడు నిర్ధనుఁడై పోయినాఁడు. అట్లే వీఁడును బోవలయు'ననెను. దశరథుఁడామాటనువిని 'ఛీ' యని కసరి యూరకుండెను. అచ్చటి జనులందఱును అందులకు మిక్కిలి యేవపడిరి. కైకయో దానిని కొంచెమైనను పాటించినదిగాదు. అచ్చట రాజు మిక్కిలియు మన్నించుసిద్ధార్థుఁ డనుమంత్రియొకఁడుండెను. అతఁడు వృద్ధుఁడు; పరిశుద్ధుఁడు నగు.అతఁడు కైకను జూచి"అసమంజుఁడు దుర్బుద్ధిగలవాఁడై త్రోవలయందాడుకొనుచుండు పిల్లవాండ్రను బట్టితెచ్చి సరయూనదిజలంబులలోఁ బడవైచుచు వారు మునిఁగి బుడబుడయను బుగ్గలు లేచుటంజూచి నగుచు నిట్లు క్రీడించుచుండెను. అంత పురజనులు వాఁ డట్లు క్రూరకృత్యము సేయుటను జూచి కోపించి సగరచక్రవర్తితో 'నీవు రాష్ట్రమును వర్ధిల్లఁజేయువాఁడవు. కనుక నీవు అసమంజుని నొకనినైన నుంచుకొని మమ్ము వదలుము. లేక నమ్ముంచుకొని వానినైవ వదలుము' అనిరి. రా జంత వారినిజూచి 'మీ కీభయము కలుగుటకు కారణమేమి?' అనియడిగెను. రా జడుగఁగా నాప్రజ లతనిని జూచి 'ఈయసమంజుఁడు.బుద్ధి తబ్బిబ్బునొంది, యాడుకొనుచుండుమా బాలురనుబట్టి సరయూనదిని బడవైచి మూర్ఛుఁడగుటంజేసి యందులకు మిగుల సంతోషించుచున్నాఁడు' అనిరి. ఆరాజును ప్రజలాడినమాటవిని వారికిఁ బ్రియముసేయఁ గోరి ప్రియపుత్రుఁ డగునసమంజుని విడిచెను. ఆతండ్రి, పుత్రుని, వానిభార్యతోను సొంతపరిజనాదిసామగ్రులతోను వాహనము నెక్కించి యావజ్జీవము పట్టణమునకు రానీయక యడవిలోనే యుండునట్లు చేయవలయునని యాజ్ఞాపించెను. వాఁడును గుద్దలిని పుట్టికను గొని పాపాత్మునివలె అన్నిదిక్కులును దిరుగుచు కొండదుర్గములందు కందమూలాదులు త్రవ్వుకొని జీవించుచుండెను. ఇట్లు తనకొడుకు మహాపరాధము గావించుటంబట్టి సగరచక్రవర్తి పరమధార్మికుఁడుగావున వానిని బరిత్యజించెను. వానివలెనే యడవికిఁ బంపునంతటిపాపము రాముఁడేమి చేసినాఁడు?

రామునియందు దుర్గుణమేదిగాని చూచినవారముగాము. చంద్రునియందు మాలి న్యము లేనట్లు రాముని యం దెంతమాత్రమును దోషముగానరాదు. దేవీ! అట్లు గాక నీకు రామునియందు దోషమేదైనను అగపడెనేని దానినిప్పుడు కలరూపునఁ జెప్పుము. అప్పుడు రాముని నడవికిఁ బంపవచ్చును. దుష్టుఁడు గాక సన్మార్గమందే నిరతుఁడై యున్నవానిని దిగనాడుట ధర్మమునకు విరుద్ధమగుటవలన అట్టి దుష్కా ర్యము చేసినయెడల దేవేంద్రునికిఁగూడ తేజము దూలిపోవును. కాఁబట్టి, శుభాననా! రాముని పెంపుసొంపు నీవు దూలించుట యుక్తకాదు. అధర్మదోష మట్లుండఁగా లోకమువలనఁ గలుగునిందయైనను రాకుండునట్లు చూచుకొనవలయును గదా!" అ నియె. రాజు సిద్ధార్థుండు చెప్పినమాటలువిని దుఃఖమున నెలుంగు మిక్కిలియు మం దగిల, మాటలు తొట్రుపడ, కైకంజూచి, 'పాపంపునడవడిగలదానా! ఈసిద్ధార్థుఁడు చెప్పినమాటను గయికొనవా? నీమేలునుగాని నామేలునుగాని యెఱుఁగకున్నావు. మఱి కుత్సితమార్గమునుబూని యిట్లు కుచేష్టలు సేయుచున్నావు. అవును, నీచేష్ట కుత్సితమే. అది సన్మార్గమునకు సంబంధించినది గాదు సుమీ. నే నిప్పుడు రాజ్య మును సుఖమును ధనమును బరిత్యజించి రాముని వెంటఁ బోయెదను. నీవు రాజైన భరతునితోఁగూడ సుఖముగా రాజ్యమును చిరకాల మనుభవించుచుండుమీ' యనెను. ఇది ముప్పదియాఱవసర్గము.

---

(రామలక్ష్మణులు సీతయును కైకేయి యిచ్చిననారచీరలు ధరియించుట. వసిష్ఠుఁడు కైకను దూఱుట.)

రాముఁడు సిద్ధార్థుఁడు చెప్పినది విని పెద్దలయెడఁ జూపవలసిన వినయము చక్కఁగాఁ దెలిసినవాఁడుగావున, సవినయముగా నపుడు దశరథునిఁ జూచి 'మహారా జా! నేను భోగములనెల్ల వదలి వనమున కందమూలాదులు తిని జీవించువాఁడను. భోగము వీడినను గొందఱికి సంగము వదలదు. నేను సమస్తసంగములనుగూడఁ బరిత్యజించినవాఁడను. ఇట్టి నాకు ఈసేనమొదలైనవి వెంట వచ్చుటతో నేమికార్య ము? మేలయినగజమునిచ్చి దానిపదుమఁ గట్టుమోకునందు మనస్సు నుంచువానికి, అట్టియుత్తమగజమునే విడుచుచుండఁగా దాని త్రాటియందు ఆస గొనుటచే పన యేమి. జగతీనాథా! నీవు సత్పురుషులలో శ్రేష్ఠుఁడవు. కనుక నేను జెప్పినద్విష య ము నంగీకరింపుము. మదపుటేనుఁగునే విడిచినవానికి దానిపదుము త్రాటితోఁ బనిలే నట్లు, రాజ్యాదికమంతయు విడిచిన నాకు, సేనతోఁ బ్రయోజన మేమి? కనుక నీవు నా కీయఁదలఁచిన వానినన్నిటిని నేను భరతుని కిచ్చుచున్నాను. నాకన్ని కార్యములును జక్కఁగా దెలియును. నాకు నారచీరలుమాత్రమే తెప్పింపుము. నే నిఁకఁ బదునాలు గేండ్లు వనంబున వాసముచేయువాఁడను గావున అంతనఱకును కందమూలాదులు త్రవ్వి తెచ్చుకొనుటకై గుద్దలిని పుటికను రెంటిని దెప్పించి యుండు' అనెను. అంతఁ

గై కేయి యచట జనులు గుంపులుగూడియుండియు, వారియెదుట సిగ్గులేనిదై తానే నారచీరలం దెచ్చి రామునిఁజూచి 'గట్టుకొమ్ము' అనెను. ఆపురుషసింహుఁడును కైకేయి యొద్దనుండినారచీరలను రెంటిని బుచ్చుకొని మున్ను గట్టుకొనియున్న జిలుగువస్త్రములను విడిచి మునులు దాల్చెడియానారచీరలను గట్టుకొనెను. అచ్చటనే లక్ష్మణుఁడును తండ్రియెదుట మేలయినవలువల నూడ్చి ఋషులు గట్టుకొనువల్కలములను రెంటిని గట్టుకొని నిల్చెను. పట్టుపుట్టము గట్టియున్నసీత, యంత తాను గట్టుకొనుట కై తెచ్చిన నారచీరంజూచి, వలంజూచిన లేడివలె, దిగులునొందినదయ్యె. శుభలక్షణములు గల యా జానకి తనయుల్లము పల్లటిల్లుచున్నను పతివ్రతాధర్మమును దెలిసినది ; తనయనుష్ఠానముచే తక్కిన సతులకును పాతివ్రత్యమును దెలుపునది; కాన కైకేయి యిచ్చునారచీరలను మిక్కిలియు సిగ్గుపడుచునే పుచ్చుకొని తొడుగుచు కన్నుల నీరు గ్రమ్మ, గంధర్వరాజుంబోలెఁ దులకించుచున్న తన పెనిమిటింజూచి 'వనవాసులగు మునులు నారచీరలు ఏవిధమునఁ గట్టుకొందురు? చెప్పు' మనియె ఇట్లాసీతయు చీర గట్టుకొనఁ దెలియక మాటిమాటి కేమియుఁదోఁపక మ్రానుపడియుండెను. అయ్యెడ నాసీత యాచీరలలో నొకటిని మెడపై వైచుకొని మఱొకటిని చేతఁబట్టుకొని కట్టుకొను నేర్పుచాలక సిగ్గుపడి నిలుచుండెను. ధార్మికోత్తముం డగు రాముఁ డది చూచి సీతయొద్దకు శీఘ్రముగావచ్చి యాబిడ కట్టుకొనియున్న పట్టువలువపయిని నారచీరను తానేకట్టెను. ఉత్తముం డగు రాముఁడు సీతకు నారచీర గట్టుటఁ జూచి యంతఃపుర స్త్రీలందఱును కన్నీరుదొరుఁగ మిక్కిలి సంకటపడి యెంతయు కాంతి దళుకొత్తుచున్న రాముని జూచి 'నాయనా ! ఈబుద్ధిమంతురాలును ఇట్లు వనమునకుఁ బోవలయునని యాజ్ఞ లేదుగదా. నీకొక్కనికే కదా యది. మమ్ము నేలుస్వామీ! నీవు తండ్రివాక్యము చొప్పున నిర్జనం బగు వనమునకుఁ బోవఁగా నీవు వచ్చువఱకు నిన్నుఁజూచినట్లే యాసీతనుజూచుచు మాకన్నులు సఫలము గావించుకొను చుండెదము. ఈసాఫల్యము కలిగింపుము. పట్టీ! నీవు లక్ష్మణుని దోడుగాఁ జేసికొని యడవికిఁ బొమ్ము. ఈకల్యాణి ఋషివలె నడవిని వసింపఁ దగదు. కావున పుత్రా! మేమొకటి వేడుకొనెదము ; దానిని గావింపుము. అదేదికాదు. నీకాంత యీసీత యిచ్చటనే యుండుఁగాక. నిన్నుఁగూడ నుండ వేడుదుముగాని నీవు ధర్మమునందే యెప్పుడును వర్తించువాఁడవు గనుక మేమెంత, యడుగుకొన్నను నిచట నిలువనొల్లనే యొల్లవు. సీతనైన నిలిపిపొమ్ము' అనిరి. ఆదశరథకుమారుఁడు వారిట్లు పలువిధముల జెప్పుచున్నను కైకేయి యనుమతింపనందున ఊరక వినుచునే తనవంటి శీలముగల సీతకు నారచీరంగట్టెను. సీత నారచీరను గట్టుకొనఁగానే రాజగురుం డగువసిష్ఠుఁ డది చూచి యాబిడను గట్టుకొనవలదని వారించి కైక దిక్కు మొగంబై 'కైకేయీ! నీవు మితి మీఱి నడచుకొనుదానవు ; దుర్బుద్ధివి ; కులమును దుమ్మునఁ గలఁపుదానవు ; నీవు రాజును మోసపుచ్చుటయే కాక యంతటితో నిలువక మఱిమఱి మర్యాద

మీఱి క్రౌర్యమునకుఁ బాలుపడుచున్నావు. శీలము దిగనాడినదానా! సీతాదేవి యిప్పుడెంతమాత్రము నడవికిఁ బోవలసినది లేదు. రామునకు ప్రకృతము సిద్ధమై యున్న సింహాసనమును సీత యధిష్ఠింపఁ గలదు; అధిష్ఠించి రాజ్యముఁ బాలించుచుండఁ గలదు. 'స్త్రీ రాజ్య మనుష్ఠించుట యెట్లందువా? భార్యాసంగ్రహము గలవారికి (గృహస్థులకు) అందఱికిని *భార్యయే యాత్మయని యున్నది గదా. అట్లు సీతయు రాముని యాత్మ గావున నతనిచేఁ బాలింపఁ దగినభూమిని దాను బాలించుచుండఁ దగును. అట్లుగాక, సీతాదేవి, రామునితోఁగూడ నడవికిఁ బోవునేని, మేమునుగూడఁ బోయెదము. ఈపురిలోని వారందఱును బోయెదరు. రాముఁడు భార్యతోడం గూడఁ బోవుచోటికి దండనాయకులును బోవుదురు. రాజును, అతని నుపజీవించి బ్రతుకుచుండెడియీదేశమువారును బట్టణమువారును, అందఱును దాసీదాసాదిసకలపరికరములతోఁగూడ రాముని వెంటనంటి పోవుదురు. భరతుఁడును శత్రుఘ్నుఁడును నారచీరలఁ గట్టుకొని, యడవిని వసించువారై, అడవియందుఁ గాఁపున్నతమయన్నను రాముని ననుసరించి వర్తించుచుందురు. అంత దురాచారయును, ప్రజాహితకారిణియు నగునీవు జనులందఱును బోయి పాడుపడియుండు నీభూమిని వృక్షములతోఁగూడ నొక్కతవే పాలించుచుండుము. రాముఁడెచ్చట రాజై యుండఁడో యది యెంతమాత్రమును రాజ్యము గానేరదు. రాముఁడెచ్చట వాసముచేయునో ఆయరణ్యమును రాజ్యమే యగును. భరతుఁడు మనమహారాజునకుఁ బుట్టినవాఁడేయగునేని యతనికిఁ,దండ్రితనకు మనఃపూర్వకముగా నియ్యని భూమినిని బాలింపఁదగదు. అట్టితండ్రి నింతలు చేసిననీయెడ, అతనికి నీకొడుకువలె నడచుకొనుటయు నర్హముగాదు. నీవు భూమినుండి యాకాశమునకు దూఁకినను, తన తండ్రి వంశమువారి వృత్తమును, పెద్దయుండఁగా పిన్నకు రాజ్యము గట్టకుండువారి యాచారమును, భరతుఁ డెఱుఁగును గాన యెంతమాత్రమును ఆపాడిదప్పి నీవు కోరినట్లు,మఱియొక విధముగా నడచుకొనఁడు. రామునిని, నియతితో ననువర్తింపకుండువాఁడు లోకముననే కలుగఁడు. ఇఁకఁ దమ్ముఁడే యగుభరతుఁడు, అతని వెంటయును వర్తించునోఁ జెప్పవలయునా! కనుక నీవు నీకొడుకునందు మిక్కుటమైన స్నేహముచేత రాముని నింతలుచేసి రాజ్యము తీసికొన్నను రామానువర్తి యగుభరతునికది మిక్కిలి యొప్పదుగావున తుద కతనికి అప్రియమే చేసినదానవు. కైకేయీ! నీవిపుడే పశువులు నేనుఁగులు మృగములును పక్షులును రాముని వెంటఁ బోవుచుండఁగాఁ జూతువు. వృక్షము లతనిదెస మొగంబై వెంటఁ బోవుటఁ గాంక్షించుచుండుటఁ జూడంగలవు. దేవీ! నీ విఁక నీకోడలికి నారచీరను విడిచి మంచిసొమ్ముల నిమ్ము. నారచీర యీబిడకు నియ్యవలసినవిధియును లేదు; ఇచ్చుటయుఁ దగదు' అనిచెప్పి సీతను నారచీరను గట్టుకొనవలదని వారించెను అమ్ముని మరల కైకతో

---

* 'అర్ధో వా ఏష ఆత్మనో యత్పత్నీ' అనుశ్రుత్యర్థము ఇచట ప్రతిపాదింపఁబడినది.

'కైకేయీ! రాముఁడొక్కఁడు అడవిలో వాసముసేయుటయే నీవుకోరితివి. ఈసీతయు నట్లుండవలయునని వేఁడవైతివి. కనుక నిత్యమును అలంకరించుకొని యుండఁదగినయాబిడ సొమ్ములనుదాల్చియె రామునితోడ నడవిని వసించుచుండుఁగాక. ఈరాజకుమారి యుత్తమము లగువాహనములతోను బరిచారకులతోను వివిధములైనవస్త్రములతోను గిండ్లు మున్నగుసమస్తము; లైనయుపకరణములతోనుం గూడి పోనిమ్ము. నీవు వర మడుగునపుడు సీతఁగూడ నడవికిఁ బోవలయు నని వేఁడలేదుసుమీ' యనెను. రాజునకు కులగురుఁడును అప్రతిమప్రభావుఁడు నగు నాబ్రాహ్మణోత్తముఁడిట్లు చెప్పుచున్నను, సీత ప్రియుం డగుతనభర్తవేషాదులనే యనుకరించి యతనితో పాటిగా వనవాసము సేయఁగోరునది గావున,నాబిడకు నారచీర గట్టుకొనునభిప్రాయ మెంతమాత్రమును దిరుగఁబడినదిగాదయ్యె. ఇదిముప్పదియేడవసర్గము.

---

దశరథుఁడు సీతను నారచీర గట్టుకొననీయవల దని కైకను వేఁడుట.
రాముఁడు కౌసల్యను జూచుకొమ్మని తండ్రిని బ్రార్థించుట

ఆసీత, లోకనాథుఁ డయినరాముఁడే తననాథుఁడుగా నుండియు,అనాథవలె నారచీరఁ గట్టుకొనుచుండఁగా, అందలిజనులందఱును దశరథునిఁజూచి 'ఇసీ నీబ్రతుకేమి' యని బిగ్గఱ దూఱిరి. జను లట్లాడుధ్వనిని విని యారాజు దుఃఖితుఁడై తన ప్రాణమునందును ధర్మమునందును గీర్తియందును గలయక్కఱ త్రెంచుకొన్నవాఁడయ్యె. ఆయిక్ష్వాకుకులుఁడు వెచ్చనూర్చి యాభార్యను జూచి "కైకేయీ! సీత నారచీర గట్టుకొని పోఁదగదు. ఇది సుకుమారమైనది; మఱి మిక్కిలిపసిది; ఎప్పుడును సుఖముగానే యుండఁదగినది. ఇట్టిది యడవిలో నుండఁదగినది గాదని నాగురుఁడు చెప్పినది సత్యము. ఈసీత నారచీర గట్టుకొని జనులనడుమ బేల యగునొకతాపసస్త్రీవలె నిలుచున్నదే! పాతివ్రత్యనియమము గయికొని,రాజశ్రేష్ఠుం డగుజనకునికుమారియై యొప్పారునీకన్య,యిట్లగుటకు ఎవరికేమి యపకారము చేసినది?జనకరాజసుత సీత నారచీరలను విడిచిపుచ్చుఁగాక. సీతయు నిట్లు నారచీరలు గట్టుకొని యడవికిఁ బోవునని నేను మునుపు నీకుఁ బ్రతిజ్ఞ చేసియుండలేదు. కాన రాజపుత్రి వస్త్రాలంకారములు పూర్ణముగాఁ గయికొని మేలైన పదార్థములన్నియు నెత్తికొని సుఖముగా నడవికిఁ బోవుఁగాక. నే నింక బ్రతుకుటకు యుక్తుఁడను గాను. నాకు మరణకాలము దాపించినది. ఇట్లు చావ నున్న నేను నీవు కోరినదానినితప్పక చేసెద నని శపథపూర్వకముగ మొదటనే క్రూరప్రతిజ్ఞ చేసివైచితిని. నీవును తెలివిలేమిచే నాప్రతిజ్ఞకు రాము నడవికిఁ బంపి,కొడుకునకు రాజ్యము గట్టుటయే విషయముగా నిశ్చయించితివిగదా! ఏమిసేయుదును! వెదురును దానిపువ్వే దహించునట్లు నన్ను నాప్రతిజ్ఞయే దహించుచున్నది. పాపాత్మురాలా! రాముఁ డొకవేళ నేదైన నీకపరాధము చేసియుండునేని సీత ని ట్లడవికిఁ బంపుటకు నది చేసినయపకారము

నీ కేమి దొరికినది. ఈజనకరాజపుత్రి లేడివంటివిఱివిగన్నులు గలముద్దరాలు; మృదుస్వభావము గలది; కావున నపరాధము సేయనుంజాలదు; పాతివ్రత్యతపమును గలది. ఇట్టిచెలువ నీ కేమి యపకార మిచటఁ జేయుచున్నది ? పాపిష్ఠురాలా! నీకు రాము నడవికిఁ బంపుట చాలదా. ఇది యొక్కటియే నీయాత్మయుండువఱకు, నరక మనుభవించుటకుం జాలునే. మిక్కిలి దుఃఖకరములైనపాతకములను మఱిమఱి చేయుచుండుటచే నీకుఁ బ్రయోజన మేమి? మఱియు నేమియనుభవింతువో తెలియఁ జాలను. కైకేయీ! రాముఁ డిచటికి అభిషేకమునకై రాఁగా వానిఁజూచి 'నారచీర లుగట్టుకొని యడవిని బదునాలుగేండ్లుండు'మని చెప్పితివి. నేను,నీ వప్పుడు చెప్పినంత మాత్రమునకు,రాముని నడవికిఁ బంపునంతమాత్రమునకు, విని యూరకుండుటచే, చేయునట్లు ఒప్పుకొన్నవాఁడనైతిని కాని సీతను నడవికిఁ బంపునట్లును నీవు నడుగ లేదు. నేనును జేసెదనని యొప్పుకొనలేదు. సుకుమార యగుసీతనుగూడ నారచీరఁ గట్టుకొని యుండఁగా గన్నారఁ జూచుచున్నావుగా! నీ వెట్టిదానవే! అప్పుడు నే నెంత ప్రతిజ్ఞ చేసితినో యంతవఱకు, రాము నడవికిఁ బంపుమాత్రకు, ధర్మమున నిలు వక, దానినిగూడ నతిక్రమించి మీఁద సీత నిట్లు పఱచుపరమపాతకమున కొడి గట్టి నరకమునకుఁ బోవఁ గోరుచున్నావే" అనియె. మహాధర్మాత్ముఁ డగునాభూవరుఁ డిట్లు విలపించుచు కైకమనసు కరఁగమింజేసి దుఃఖమునకుఁ దుది కొంచెమైనను గానఁ డయ్యె; మఱి యాపుత్రదుఃఖము పైకొనఁగా, అందు మునిఁగి, మిక్కిలియు తల్లడిల్లుచు నేలఁబడెను. ఇట్లు కైకను బతిమాలుచు తలవాంచి కూర్చుండియున్న తండ్రిని జూచి రాముఁడు షనమునకుఁ బయనంబై 'దేవా!నీవు ధార్మికుఁడవు. నాతల్లి యీకౌసల్య మిక్కిలి కీర్తిమంతురాలు; మఱి ముసలిది; ఉత్తమమైనశీలము గలది; కావుననే తనగారాబుకొడుకును, నీ వడవికిఁ బంపుచున్నను, నిన్నేమియు నిందింప కున్నది. నీవు కోరినకోర్కు లిచ్చువాఁడవు. కాఁబట్టి నాయీకోర్కి తీర్పుము. మా తల్లికి,(జ్యేష్ఠపత్ని గావున),నీవు సమ్మానించుటయందుఁ గొఱఁతగలుగదు.అయిన నిప్పు డు నేను బోయినపిదప నన్నుఁబాసి దుఃఖసముద్రమునం బడియుండును. అందును, ఇంతవఱ కిట్టివిపత్తు ననుభవించి యెఱుంగనిది. కాఁబట్టి యిప్పుడు మునుపటికంటె మిక్కిలియు నీ వా యమను,నేను వేఁడికొనుటనుఁ జూచి, సమ్మానింపవలసియున్నది. పూజ్యుఁడ వగునీవు, మిక్కిలి కనికరింపఁ దగినయాకౌసల్యను పుత్రదుఃఖము నొంద కుండునట్లు మిక్కిలిమన్ననతోఁ జూచుకొనుచుందువేని యాయమయు నన్ను మి క్కిలి తలఁచుకొనుచున్నను,నిన్నుంబట్టి నీప్రాపున బ్రతికియుండును. నీవు దేవేంద్రు నికి సాటియైనమేటివి! కనుక పుత్రునియందు పేరాస గలనాతల్లి కౌసల్య నే నడవికిఁ బోయినపిదప దుఃఖమునం గృశించి ప్రాణములు విడిచి యమపురంబునకుఁ బోకుండు నట్లు నీ వాయమయందు నేనై వేఁడుకొన్న యీవిధమునఁ గావింపవలయును'అని చె ప్పెను. ఇది ముప్పదియెనిమిదవ సర్గము.

**దశరథుఁడు సుమంత్రునితో రామునకు రథము దేర నియమించుట. కౌసల్య సీతకు నీతి నుపదేశించుట. రాముఁడు కౌసల్యాదు లైనతల్లుల నూఱడించుట.**

రాజు రాముఁడు చెప్పినమాట విని, తానును దనభార్యలును నతండు ముని వేషము దాల్చియుండుటఁ జూచి, దుఃఖావేశమున మూర్ఛిల్లిరి. దుఃఖమున మిక్కిలి పొక్కుచున్నరాజును రాముఁడు చూడఁడయ్యె; చూచియు నుల్లము పల్లటిల్లఁగా నేమియుఁ బలుకఁడయ్యె. మహాబాహుఁ డగు నామహీపతి దుఃఖితుండై గడియసేపు మూర్ఛపోయిన ట్లుండి రామునే తలంచుకొనుచు విలాపము సేసెను. 'నేను మున్ను అనేకుల బిడ్డలను జంపియుందును; లేక పెక్కుప్రాణులను హింసించి యుందును. కావున నాకీపుత్రదుఃఖము పట్టినదని తోఁచుచున్నది. దేహము, తన్నుఁగల్పించినకర్మము నశించిననేకాని తాను నశింపదు. అట్టికాలము రాకున్నపుడు ఎవనికిఁ గాని దేహమునుండి ప్రాణము పోనే పోవదు. కావుననే కైకేయి నన్నిట్లు కాఱియ పెట్టుచున్నదే! ఇంత పెట్టియు నాకు మరణము కలుగకున్నది. మఱి యగ్నివలె వెలుంగుచున్న నాచిన్నికొమారుఁడు సూక్ష్మవస్త్రముల విడిచిపుచ్చి మునులు గట్టుకొను నారచీరలందాల్చి ముందటనుండఁగాఁ జూచుచున్నను నాకు మరణము కలుగకున్నది! ఇట్టికుత్రన్ని తనకార్యమును ఒనఁగూర్చుకొనుటకుమాత్రమే ప్రయత్నపడుచున్నకైక యొకతికిఁగా, ఈజనులందఱును దుఃఖపడుచున్నారు గదా! ఏమిసేయుదును' అని విలపించెను. రాజట్లు విలపించి కన్నుల నీరుగ్రమ్మ 'రామా' యని యొక్కమాటే పలికి యటమీఁద మాటాడ నేరకుండెను. రాజు గొంతసేపునకుఁ దెలివొంది, కన్నులనిండ కన్నీరు వెల్లిగొనఁగా, సుమంత్రుంజూచి 'నీవు పోయి విలాసార్థమయిన రథమొకటి మేటిగుఱ్ఱములం బూన్చి యిచ్చుటకై వచ్చి, యీ మహాబాగు నెక్కించుకొనిపోయి యీ దేశమున కవ్వల విడిచిపెట్టుము. తండ్రియు తల్లియుఁ జేరి సత్పురుషుఁడును వీరుఁడు నగుకొడుకును అడవిపాలు సేయుచున్నారే! వానిసత్పురుషత్వగుణములకు నిట్టిఫలము తగునా? తగదు. కాఁబట్టి గుణవంతులగువారి గుణములకు ఫలమిట్టిదేయని నాకుఁదోఁచుచున్నది. కావున గుణములే వలదు' అనియె. సుమంత్రుఁ డంత రాజాజ్ఞను గైకొని శీఘ్రగమనమునఁబోయి రథము నలంకరించి గుఱ్ఱములఁ బూన్చిదీసికొనివచ్చెను. బంగారుచే సింగారింపఁబడ్డదై మేటిగుఱ్ఱములఁబూన్చి యున్నరథము ఆయత్తముగా నున్నదని సూతుఁడు చేతులుమొగిడ్చి రాజకుమారునికి రామునికిఁ జెప్పెను. రాజును ధనాగారమునందు మెలఁగుచుండు ధనాధ్యక్షునిఁ బిలిపించెను. వాఁడు దేశకాలముల నెఱింగినవాఁడు; బాహ్యాంతరములం బరిశుద్ధుండు; ఆయావస్తువు లింతింతయున్నవని నిశ్చయించి చెప్పఁగలవాఁడు. రాజు వానితో 'సీత అరణ్యమున నుండవలసినసంవత్సరములు లెక్కపెట్టుకొని యీ పదునాలుగేండ్లకును జాలునట్లు ఉత్తమములైనవస్త్రములును మేలైన యాభరణము

లును శీఘ్రముగాఁదెచ్చి యాబిడకిమ్ము' అనెను. రాజట్లు చెప్పఁగా వాఁడు కోశగృహమునకుఁ బోయి కావలసినవన్నియు తోడనే దీసికొనివచ్చి పదునాలుగేండ్లకు సరిగా వచ్చునట్లు సీతకిచ్చెను. సుజాత యగు నాసీతయు నడవికిఁ బయనం బై, చక్కఁగాఁ దీరి పొలుపారుచున్న తనయవయవములను; వివిధములైన యాభూషణములచే నలంకరించెను. ప్రాతఃకాలమున నుదయించుచున్న సూర్యుఁడు తన ప్రశస్త కిరణంబులకాంతిచే నాకాశమును ప్రకాశింపఁజేయునట్లు, సీత భూషణములను జక్కఁగా నలంకరించుకొన్నదై యాభరణకాంతులచే నాగృహమునంతయుఁ బ్రకాశింపఁజేసెను. అత్తగారగు కౌసల్య, యల్పకార్యముల నాచరింపని యా సీతను బారసాచి కవుంగిలించుకొని శిరము మూర్కొని "ఈలోకమునం దంతయు చెడిపలగు స్త్రీలు, తమపురుషులు ఎల్లప్పుడును అడిగినదాని నిచ్చి గారవించుచుండినను, దైవికముగాఁ గష్టము వచ్చి వారికి పదవి తక్కువ యయ్యెనేని, వారినెంతమాత్రమును సరకుసేయకుందురు. మొదట మిక్కిలిసుఖమనుభవించినను మగని కష్టము మంచివారుగా నుండి పిదప వానికి పేదఱికము మొదలగునయాపదలు కొంచెమే వచ్చినను, దుష్టలయి వానిని దిగవిడుతురు. ఇది స్త్రీలస్వభావము. స్త్రీలకు కల్లలాడుటయే స్వభావము; గడి యగడియకు మనస్సు మాఱుచుండును. వారిమనస్సు ఇట్టిదని యెఱుఁగుటయుఁ గష్టము. వారు పాపకార్యములనే తలంచుచుందురు. వారి ప్రేమయు స్థిరముగాదు; క్షణకాలము తప్పిపోఁగూడును, *గొప్పకులముగాని, చేసినయుపకారముగాని, విద్యగాని, అగ్నిసాక్షిగా పరిగ్రహించినదిగాని, లోకమర్యాదగాని, స్త్రీలమనస్సునకుఁ గూర్పవు, ధనమొక్కటియే వారికిఁ గూర్చినది. వారిహృదయములు మిక్కిలి చపలములైనవి సుమీ. కులమునకుఁ దగిననడవడి గలిగి, సత్యముదప్పక, గురువులయుపదేశమును పాటిగాఁ బట్టి, శాంతి గలిగి, వర్తించునట్టిపతివ్రతలకు పరమపావన మైనవస్తువు పెనిమిటియే. వారికి పెనిమిటియొక్కఁడే మిక్కిలి యతిశయించినవాఁడు; మఱెవ్వరునుగారు. కాఁబట్టి నాకొడుకును, అడవికిఁ బంపఁబడినవాఁడని తలఁచి యవమానింపవలదు. వానిని, దరిద్రుఁడైనను ధనవంతుఁడైనను, నీవు దైవముగాఁ జూచుకొనవలయును' అనెను. సీతయు నాయమ చెప్పినమాట ధర్మమే. ప్రయోజనముగాఁ గలిగినదని తెలిసి తనయెదుట నున్నయాయత్తగారికి చేతులు మోడ్చి 'ఆర్యా! మీరాజ్ఞాపించునట్లంతయు చేసెదను. భర్తయెడల నెట్లు నడచుకొనవలయునో నాకుం దెలియును. మఱి నేనది వినియున్నాను. తాము నన్ను దుష్టస్త్రీలతో సాటిసేయవలదు. ప్రభ చంద్రునుండి తొలఁగిపోవనట్లు నేను ధర్మమునుండి యొంతమాత్రమును చలింపఁజాలను. వీణియ తంతులు లేనిచో వాయింపను. రథము చక్రము లేనిచోఁ బోవదు. అట్లే స్త్రీ, నూఱుగొడుకులను గన్నదైనను పెనిమిటి లేనిచో సుఖము నొందఁజాలదు. స్త్రీలకు తండ్రి

* కౌసల్య యీ సమయమున కైకను నిందించినదని తెలియునది. ఇట్లు స్త్రీలస్వభావములు చెప్పి పాతివ్రత్యదార్ఢ్యముకొఱకు పతివ్రతలగుణములను సీతకు నుపదేశించుచున్నది.

మితముగానే (ఐహికము మాత్రము) ఇచ్చును. తల్లియు మితిగానే యిచ్చును. పెనిమిటి యిచ్చుదానికి మాత్రము మితి లేదు. అతఁడైహికాముష్మికముల ఫలము లన్నియు నిచ్చును. అట్టి పెనిమిటి నెవ్వతె పూజింప కుండును! ఇట్టి పాతివ్రత్యధర్మము నవలంబించి యున్న దానను; మఱియు మహాపతివ్రతాశ్రేష్ఠ లయినవారివలన సామాన్యధర్మములను విశేషధర్మములను వినియున్నదానను. ఇట్టినే నేల పెనిమిటి నవమానింతును? స్త్రీలకు భర్తయేకదా దైవతము' అనెను. సత్త్వగుణపరిపూర్ణయైన కౌసల్య, సీత, తనమదికి నింపారఁజెప్పిన మాటనువిని, తోడనే రాముఁడడవికిఁ బోవనున్నాఁడే యనుదుఃఖమునను, సీతపాతివ్రత్య మేమి! యనుసంతోషమునను గన్నీరు విడిచెను. మిక్కిలిధార్మికుఁడగు రాముఁడు, తక్కినతల్లు లందఱును మిక్కిలియుఁ బూజించుచు తన తల్లిని వలగొని యంజలి గీలించి యామెతో 'తల్లీ! నీవు దుఃఖింపకుండుము. నాతండ్రిని జూచుకొనుచుండుము. వనవాసకాలము త్వరలోనే తీఱిపోవును. నీవు కన్నులు మూసికొని నిదురపోవుచుండఁగానే తొమ్మిదియు నైదేండ్లు గడచిపోవును. ఇవంతయు నీకొకరాత్రినిద్రవలె తీఱిపోవును. అంత నిచటికివచ్చి స్నేహితులందఱును జుట్టు బలసియుండఁగా సంపూర్ణమనోరథుఁడనై యున్న నన్నుఁ జూడఁగలవు' అనెను. రాముఁడు అన్నివిషయములను క్రోడీకరించి యింతమాటలో నిమిడ్చి నిష్కృష్టముగాఁ జెప్పి, యంత తనతల్లులను మున్నూటయేఁబదిమందిని వేఱువేఱ విమర్శించి చూచెను. ఆదశరథకుమారుఁడు తనతల్లివలెనే దుఃఖితులై యున్న యాతల్లులం జూచి యంజలి గీలించి ధర్మయుక్తముగా 'ఒక్కచోటనే కూడి యాడుచుండిన చిరపరిచయము చేతఁ గాని, అజ్ఞానముచేతఁగాని, నేనేదేని యపరాధము చేసితినేని, దానిని క్షమించుటకు మీరనుమతింప వలయును. మిమ్మును సెలవు వేఁడెద'ననియె. రాముఁడట్లు ధర్మయుక్తముగా మంచివిషయమును గూర్చి చెప్పినయామాటను రాజకాంతలు విని దుఃఖమున మనస్సు పల్లటిల్లినవారైరి. రాముఁడట్లు చెప్పినపుడు ఆరాజభార్యలు క్రౌంచపెంట్లం బోనికంఠస్వరమున రోదనము సేసిరి. మునుపు నిత్యము మద్దెలలు ఉడుకలు మేఘములు మొదలయిన వాద్యములు మ్రోఁగుచుండినయాదశరథునిమందిరము, అప్పు డచటిజనులు విపన్నులయి మిక్కిలిదుఃఖమున రామునిగుణములం బొగడుచు కైకం దెగడుచు పలువిధముల వాక్యము లాడుకొనుచు సేయురోదనధ్వనులచే వ్యాప్తమయియుండెను. ఇది ముప్పదితొమ్మిదవసర్గము.

---

రాముఁడు వనంబునకుఁ బయనమగుట; ప్రజలవిలాపము.

అంత రామలక్ష్మణులును సీతయు చేతులు మోడ్చుకొని రాజుపాదములం బట్టుకొని మ్రొక్కి తల్లిదండ్రులసేవ లభింపకపోయెనే యని దీనులై ప్రదక్షిణము

చేసిరి. రాముఁడు సకలధర్మములు దెలిసినవాఁడు గావున తండ్రియనుమతిలేక సీతను లక్ష్మణునిఁ దోడ్కొని పోవరాదని తెలిసి వారలకును నతనిచే సెల విప్పించి తల్లినివిడిచి పోవలసివచ్చెనే యనుదుఃఖము వేఱొకము గలిగింపఁగా నాయమకును నమస్కరించెను. వెంటనే లక్ష్మణుఁడును ఆయమకు నమస్కరించెను. కౌసల్యకును మ్రొక్కిన పిదప నతఁడు తనతల్లి యగుసుమిత్రపాదములం బట్టుకొని నమస్కరించెను. ఆ తల్లియు మ్రొక్కుచున్న లక్ష్మణునిం జూచి రోదనము సేయుచు * ఆమహాబాహుని శిరంబు మూర్కొని యతనికి హితంబు గోరి 'పుత్రా! కౌసల్య యెట్లు లోకరక్షణార్థము రామునిఁగన్నదో యట్లే నేనును, సుహృజ్జనుఁడగురామునియందు మిక్కిలి యనురక్తుఁడై యున్ననిన్ను, అతనితోఁగూడ వనంబునకుఁ బోయి పరిచర్య సేయుటకై

* ఇందులకు 'సృష్టస్త్వం వనవాసాయ స్వనురక్తః సుహృజ్జనే। రామే ప్రమాదంమాకార్షీః పుత్ర భ్రాతరి గచ్ఛతి' అని మూలము. విశేషార్థములు:—(సుహృజ్జనేరామే) సుహృదుఁడైనరామునియందు, (సు అనురక్తః) మిక్కిలి యనురాగముగల, (త్వం) నీవు, (వనవాసాయ) వనమునందువసించుకొఱకు-వనమున రాము ననువర్తించుకొఱకు,(సృష్టః) సృజింపఁబడితివి-నాయందు దైవముపుట్టించినదనుట. కాఁబట్టి, (భ్రాతరి) నీతోఁబుట్టువైన రాముఁడు, (గచ్ఛతిసతి) పోవుచుండగా - భార్యతోఁగూడ పుష్పించినవనములను జూచుచు ఆపారవశ్యమునఁ బోవుచుండఁగా ననుట, (ప్రమాదం మాకర్షీః) పరాకు పడకుము-రామునిగమనసౌందర్యము నీమనస్సును ఆకర్షించుకొనును గావున అతనిని రక్షించుకార్యమునం దేమఱి యుండకుము-అనియర్థము. లేక (రామే గచ్ఛతి) రాముఁడడవికిఁ బోవుచుండఁగా, (ప్రమాదంమాకార్షీః) అతఁడుపోనీ యనిపరాకున నిక్కడ సేయుండకుమని యర్థాంతరము. గోవిందరాజులు.

లేక:-(సృష్టస్త్వం) నీవు సృజింపంబడినవాఁడవు-రామకైంకర్యముకొఱకే పుట్టింపఁబడినవాఁడవు-ఒకరిప్రేరణ లేక నియంతటనే రామచరణసేవయం దాసక్తుఁడైనవాఁడవు గదా నీ వనుట - ఇట్టినీవు రామునికి దాస్యము సేయుటయందు చతుశ్శ్రీవుఁడవు గావున నీకు నేను జెప్పవలసినదేమున్నది యని భావము, (వనవాసాయ) వనవాసముకొఱకు సృజింపఁబడితివి. అనఁగా రామునికి సహాయుఁడుగానుండు ప్రయోజనమునకే నిన్ను నేను గంటిని. కనుక రామునితోఁడ నడవికిఁ బోదువేని నీవునావలన పుట్టినందులకు ప్రయోజనము సిద్ధించినదగును. లేకున్న నీవు పుట్టియు ప్రయోజనములేదని భావము. (స్వనురక్తః సుహృజ్జనే) ఒకఁడు నీకు సుహృదుఁడైనంతమాత్రమునకే వానియందు మిక్కిలి యనురాగముచూపుదువు. కాఁబట్టి, ఎల్లవారును ఉపజీవింపవలసిన రామునియందును అనురక్తుఁడవు గమ్ము. లేక, సుహృజ్జనుఁడగురామునియందు నీవు చన్నుగుడుచు నప్పటినుండియు మిక్కిలి ప్రీతిగలిగియుండఁగా ఇప్పుడతనితోఁగూడ పోవలయునని నేను జెప్పవలయునా యని యర్థము. అయినను పెద్దలగువారు పిన్నలకు నియమింపవలయునుగాన నేను నీకు నియమింపవలసినది కొంతయున్నది-(రామే ప్రమాదం మాకార్షీః) రామునియెడల పరాకుపడకుము.ఆప్రమాద మేమనఁగా, (భ్రాతరిగచ్ఛతి) రాముఁడుపోవుచుండఁగా అతనిగమనవిశేషమందే దృష్టినంతయు నిలిపితివేని ఆపరాకువలన ఏదైనను కీడుగలిగి అతనిని బోఁగొట్టుకొనవలసివచ్చును. కాన యట్లు సేయకుమనుట తనిశ్లోకి.

లేక:—(స్వనురక్తే సుహృజ్జనేపి) ఇచ్చటనుండు స్నేహితులందరియెడల మిక్కిలి యనురాగము గలవాఁడయ్యును, (వనవాసాయ) రామునితోఁడ నడవికిఁ బోయియుండుటకు, (సృష్టః) అనుమతుఁడవు-నేను అనుమతించుచున్నాననుట,తక్కినది సమము-మహేశ్వరతీర్థులు.

కంటిని. ఇందులకే నిన్ను దైవము నాయందు సృజించినది. కావున రాముఁడడవిని విచిత్రములు చూచుచుఁ బరవశుఁడై పోవుచుండఁగా నీవు పరాకు లేక యతనిఁ గాచుకొనుచుండుము. 'రామునితోఁ బోవలయుటయేల' యందువా? అనఘా! రాముఁడు రాజ్యాదులు లేక విపన్నుఁడై యున్నను, రాజ్యాదులు గలిగి సంపన్నుఁడై యున్నను, ఇతఁడే నీకు శరణము. ఏలనఁగా చిన్నవాఁడు పెద్దవానికి వశుఁడై యుండుట లోకమున సత్పురుషు లాచరించుధర్మము. ఇంతే కాదు; ఇట్టివర్తనమును, దానమును, యాగదీక్ష వహించుటయు, యుద్ధంబుల దేహము విడుచుటయు, ఇవన్నియు మాకులమునకుఁ దగినవి; బహుకాలముగా నుండివచ్చు ధర్మములు నైనవి. కావున దేహమును వదలవలసివచ్చినను రాముని రక్షింపవలయు" నని యిట్లు చెప్పి రాముఁడు దక్క మఱి దేనియందును ప్రీతిలేనివాఁడై రామునితోడఁ బోవ నుద్యుక్తుండై యున్నయా లక్ష్మణుని 'పొమ్ము పొమ్ము' అని మాటికిఁ జెప్పి మరల నతనితో * 'రాముని దశరథునిగాఁ దెలియుము. సీతను నన్నుగాఁ దలంపుము. అడవిని అయోధ్యగా నెన్నుము. నాయనా! సుఖముగా పోయి రమ్ము'అనిచెప్పెను.అంత సుమంత్రుఁడు వినయము దెలిసినవాఁడు గావున సవినయముగా,మాతలి యింద్రునికింబోలె, చేతులు మోడ్చి, రామునిఁ జూచి 'మహాయశుం డగు రాజకుమారా! రథమును దెచ్చితిని. ఎక్కుము. నీకు శుభం బగుఁగాక. నీ వెచ్చటికిఁ దోలుమని చెప్పదువొ యచ్చటికి శీఘ్రముగా నిన్నుఁ గొనిపోయి చేర్చెదను. పదునాలుగేండ్లు గదా నీ వడవియందు వాసము సేయవలయును. అట్లనియే నీకుఁ గైకేయి యాజ్ఞ చేసినది. కనుక జాగేల? అం దొక్కదినము చెల్లినను ఎంతో లాభ

---

*ఇందులకు 'రామం దశరథం విద్ధిమాం విద్ధి జనకాత్మజాం। అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్' అని మూలము. విశేషార్థములు:—అడవియందు వాసముచేయునప్పుడు తల్లియు తండ్రియు పట్టణమును స్మరణకు వచ్చి లక్ష్మణునకు మనస్సు చలించునో యనితలఁచి సుమిత్ర తండ్రి మున్నగువారికి మాఱుగా వేఱుతండ్రి మొదలైనవారిని ప్రతినిధులను జెప్పుచున్నది.-(రామం) రాముని, (దశరథం) దశరథునిగా-తండ్రిగాననుట, (విద్ధి) తెలియుము, (జనకాత్మజాం)సీతను, (మాంవిద్ధి)నన్నుఁగా-అనఁగా తల్లిగా, ఎఱుఁగుము-(అటవీం) అడవిని, (అయోధ్యాం) అయోధ్యగా-అయోధ్యవలె భోగస్థానముగా, (విద్ధి) తెలియుము. (తాత) నాయనా, (యథాసుఖంగచ్ఛ) సుఖముగాపొమ్ము. రాముని అనువర్తించుటయే ఉచితమైన సుఖమని భావము. రామునే తండ్రిగాను సీతనే తల్లిగాను అడవినే అయోధ్యగాను తలఁచి రాముని అనువర్తించుచుండుము; నమ్ముము అయోధ్యను తలఁచుకొని మనస్సుచలింపింపకుండుమని యర్థము. లేక:—రాముని, (దశరథం) దశ్ అనఁగా క్రచ్చుట - దంష్ట్రా వ్యాపారమునే యుట కనుక 'దశః' అనఁగా చేఁపలు మొదలైనవానిని దంష్ట్రిలతో క్రచ్చునది-అనఁగాపక్షి, లేక 'దశః పక్షీ విహఙ్గమః'అను హలాయుధనిఘంటువుచొప్పున 'దశః'అనఁగా పక్షి-ఇచటపక్షిగరుడుఁడు. (దశరథమ్) గరుడుఁడు రథముగాఁగలవానినిగా-విష్ణునిగా ఎఱుఁగుమనుట. సీతను (మాం) లక్ష్మిగా ఎఱుఁగుము. అటవిని, (అయోధ్యామ్)'దేవానాం పూరయోధ్యా'అని పరమపదము అయోధ్య యనఁబడును గాన ఆవిష్ణువునకు వాసస్థానమైనపరమపదముగా నెఱుఁగుమనుట. రాముని విష్ణువుగాను సీతను

మే గాన వాని నిపుడే చెల్లింప మొదలు పెట్టవలయు'.ననెను. సీత యత్తగా రిచ్చిన వస్త్రాభరణాదులచే చక్కఁగా నలంకరించుకొని మనంబున ముదంబు పొదల నిబ్బ

---

లక్ష్మిగాను అడవిని పరమపదముగాను ఎఱుఁగుమనుట-లేక:(రామం దశరథంచ విద్ధి) రామునిని దశరథునిని తెలియుము. ఈయిద్దఱికిఁగల తారతమ్యము నెఱుఁగుమనుట. (మాంజనకాత్మజాంచ విద్ధి) నన్నును సీతను తెలియుము-గుణములందు మాయిరువురకుం గల తారతమ్యమును గ్రహింపుమనుట.అట్లు చూడఁగా నాకంటె సీతయే నీకు హితపరురాలనిభావము. (అయోధ్యా మటవీంచ విద్ధి) అయోధ్యనను అడవినిని తెలియుము. వానిరెంటికిఁ గలతారతమ్యము తెలియుము. అయోధ్యకంటె అడవియే రామకైంకర్యమును ఎడతెగక చేయుటకు స్థానముగానున్నది గావున అదియే మేలనుట. నీవడవికిఁబోయి యిచ్చటనున్న మీతండ్రిని తల్లినగు నన్నును ఈ అయోధ్యను తలఁచుకొని చలింపకుము. దశరథునికంటె రాముఁడే అధికుఁడు. నాకంటె సీతయే హితపరురాలు. అయోధ్యకంటె అడవియే నీకుఁ బ్రియమైన కైంకర్యమునకు మిక్కిలి యనుకూలమైనది యని యర్థము.లేక:-(దశరథమ్) దశరథుని,(రామం)'రమ' అను ధాతువునుబట్టి ఉపరతుఁడైనవానిని గా-ఉడిగినవానినిగా-ఎఱుఁగుమనుట, (మాం) నన్ను, (జనక ఆత్మజామ్) నాతండ్రికి కూఁతునుగా తెలియుము-కైకేయి బాధపెట్టఁగా మఱి పతియు లేకపోవఁగా ఇఁక నాతండ్రియింటఁబోయి యుండు దానినిగా నెఱుఁగుమనుట-(అయోధ్యామ్)అయోధ్యను, (అటవీంవిద్ధి) అడవిగా తెలియుము. అడవివలె నిర్జనము కాఁగలదిగా తెలియుమనుట-నీవు రామునితోడఁ బోయిన వెనుక దశరథుఁడు ప్రాణములతో నుండఁడు గనుక నతఁడు లేఁడనియే తెలియుము. నేనును కైకేయి వెడలఁగొట్టఁగా తండ్రియింటఁ జేరుదును. ఈ పట్టణమును జనులందఱును విడిచి రామునివెంట పోఁగా శూన్యమై యడవియగునని తాత్పర్యము॥గోవిందరాజులు॥ లేక:- (రామందశరథం విద్ధి) ఉపాధివశమున తండ్రియగు దశరథునియందలి అత్యంతస్నేహమును విడిచి నిరుపాధికముగా తండ్రియైన రామునియందు ప్రీతినుంపుము. (మాంవిద్ధి జనకాత్మజామ్) ఉపాధివశమున తల్లినైన నన్ను విడిచి నిరుపాధికముగా తల్లియగు సీతయందు భక్తి సేయుము.(అయోధ్యామటవీం విద్ధి) ఉపాధిచేఁ గలిగిన యయోధ్యను వదలి రామనివాసమగుటచే నిరుపాధికముగా ప్రాప్యమైన దేశమగు నడవియందు ప్రీతినుంపుమనుట. లేక:-(రామం దశరథంవిద్ధి)రాముని దశరథునివలె సమ్రాట్టగునని తలంపుము:(మాం విద్ధి జనకాత్మజాం) నావలె నే సీతయు సమ్రాట్టుమహిషియవునని తలఁపుము. (అయోధ్యా మటవీంవిద్ధి) అడవిని అయోధ్యవలె పుష్పఫలసమృద్ధిగలదిగా తెలియుము-కనుక రామునిని సీతనను అడవిని కేవలముగా తలఁపక గొప్పగా నేయెన్నుమనుట. లేక:-(రామం దశరథం విద్ధి)దశరథుని రామునిగా తలఁపుము-రామునిని తండ్రియని పూర్ణబుద్ధితో తలఁచునట్లు దశరథునిఁగూడఁదలఁపుమనుట, 'అహం తావన్మహారాజే పితృత్వం నోపలక్షయే। భ్రాతాభర్తాచ బన్ధుశ్చ పితాచమమరాఘవః' - 'నాకు మహారాజునందు తండ్రిభావము కనఁబడదు. తోఁబుట్టువునుపోషకుఁడు బంధువును తండ్రియును నాకు రాముఁడే' యని నీవు చెప్పినట్లు దశరథుని ఎన్న యవమానింపకమనుట. (మాంవిద్ధి జనకాత్మజాం) నన్ను, దశరథుని పాణిగ్రహణము చేసికొన్న దోషమునుబట్టి అవమానింపక రామునితల్లికి సవతి యనుబహుమానమునుంచి సీతయెడల నెట్లో యట్లే నాయందును పూర్ణముగా మాతృబుద్ధి నుంపు మనుట. (అయోధ్యామటవీంవిద్ధి) 'వనం నగరమే వాస్తు యేనగచ్ఛతిరాఘవః' 'రాముఁడు పోవునదే పట్టణమగుఁగాక' అన్నట్లు రాముఁడు పోవు నడవిని బహూకరించునట్లే అయోధ్యనుగూడ బహూకరింపఁదగునుగాని అవమానింప వలదనుట. లేక:-(రామం దశరథం విద్ధి) రాముఁడును దశరథుఁడును ఇరువురును పెద్దలయ్యును ఎందు ఎ

రంపుఁబిఱుఁదులు చెలువు మీఱ, సూర్యునివలెఁ దేజరిల్లుచున్న యారథము నెక్కెను. అంత బంగారముచే రంగారుచు,నగ్నివలె ధగధగ మెఱయుచున్న యారథమును అన్నదమ్ము లా రామలక్ష్మణులును త్వరితముగా నారోహించిరి. సీతకు మామగా రగుదశరథుఁడు వనమున నుండవలసిన కాలమును లెక్కపెట్టి యందునకుఁ దగినట్లుగా నా బిడకు వస్త్రములును, ఆభరణములును, అట్లే పుత్రులకు ఆయుధసమూహములును, కవచములును దప్పక యిచ్చెను. సుమంత్రుఁడు సీత కిచ్చిన వస్త్రభూషణములును రామలక్ష్మణుల యాయుధములను, కవచములను, పుటికయును, గుద్దలియును రథము నడుమనుంచి అంత సీతతోడ రామలక్ష్మణులు ముగ్గురును రథము నెక్కుటఁ జూచి వాయువేగమునకు సాటియై శుభలక్షణములచే మదికిం గూర్చు గుఱ్ఱములను దిట్టముగా నడల్చితోలెను. రాముఁడు బహుకాలము వాసముసేయ నడవికిఁ బోవఁగానే యాపట్టణమంతయు మూర్ఛను మునింగె. మఱి గుఱ్ఱములు గజములు మొదలయినవియు మూర్ఛిల్లెను. ఉత్సవమును జూడవచ్చిన పల్లెపట్లజనులును మూర్ఛనొందిరి. అంత నాపట్టణమున జనులు మనసు కలఁగ, చేయునదితోఁపక,యింద్రియములు తొట్రువడ, రాముని వెంటఁ బోవఁ దమకించుచుండిరి. దుఃఖాతిశయమున మదపుటేనుఁగులు కుపితములై ఘీంకారములు సేయుచుండెను. పరితాపము మిక్కిలి గొని యిటునటు పరుగిడుగుఱ్ఱములసొమ్ములు గలగల మ్రోఁగుచుండెను.ఇట్లాపురమంతయు మహాధ్వని గలిగియుండెను. అంత నాపురమందలిజనులు బాలురు వృద్ధులు మొదలుగా రామునిఁ బాసి మిక్కిలియు దుఃఖార్తులై, దప్పిచే నలఁగినవారు జలమునకు బరువెత్తునట్లు, రామునిఁగూర్చి పరుగిడిరి. అట్లు పోవు వారందఱును రాముని రథమునకు పార్శ్వములం గొందఱుగాను పిఱుందఁ గొందఱుగాను బట్టుకొనివ్రేలుచు తలలెత్తి యాతని మొగముతట్టు చూచుచు ముఖమునందు కన్నీళ్లు వెల్లిగొని చిప్పిల్లుచుండఁగా పెద్దయెలుంగున సూతునితో 'సూతా! గుఱ్ఱములపగ్గముల నీడ్చి పట్టుము. మెల్లమెల్లగాఁ బొమ్ము. మేము రాముని మొగము చూచెదము. ఇప్పుడు తప్పిన నిఁక మేము చూచుట కష్టము. దేవకుమారునిం బోలి కోమరారుకొడుకు రాముఁ డడవికిఁ బోవుచుండఁగా అతని తల్లి మనస్సు ఎట్టిదో! పగులకున్న దే. అది యినుముతోఁ జేయఁబడినదియే యగును కాఁబోలు. సీత తోడినీడవలె పతిని వెంబ

---

వఁడు పరిచారకులు గలవాఁడో ఎవఁడులేనివాఁడో విచారింపుము. అట్లు తెలిసి ఆయిరువురిలో నెవ్వరిననుసరింపవలయునో యూహింపుము-అనఁగా పరిచారకులులేని రామునే అనుసరింపుమనుట, (మాంవిద్ధి జనకాత్మజాం) నన్నును సీతను దెలియుము-ఎవతె దాసీపరిజనముగలదో ఎవతె అదిలేనిదో విచారింపుము-పరిజనములేని సీతనే యనువర్తింపుమనుట, (అయోధ్యా మటవీం విద్ధి) అయోధ్యను అడవిగా తెలియుము అయోధ్యయందు ఐహికసుఖ మగురాజ్యమే కలదు-అడవియందు రామకైంకర్యరూపమయిన పారలౌకిక సుఖముగలదు. పారలౌకికసుఖము నిచ్చునట్టిదే అతిశయించినది గనుక అట్టియడవినే యాశ్రయింపుమని యర్థము.

డించిపోయినది. కావున నాబిడ కృతార్థురాలైనది. ఆయమ, పతివ్రతాధర్మము గట్టిగాఁ బూనినదై *సూర్యకాంతి మేరుపర్వతమును వదలనియట్లు దానిని విడువకున్నది. లక్ష్మణా! ప్రియవాదివై దేవసమానుం డగునన్నకు నెప్పుడును బరిచర్య సేయుచునే యుండుము. ఔరా! నీ వెంతకృతార్థుఁడవు. ఇతని వెంటఁ బోవుటయే నీకు గొప్పతపస్సిద్ధి. ఇదియే నీకు స్వర్గప్రాప్తిమార్గము' అనిరి. రాముఁ డిక్ష్వాకువంశమునకు సొంపు పెంపు గూర్పువాఁడు; మఱి యందఱికిని నింపయినవాఁడు. కనుక నట్టిరామునిని జనులందఱును వెంబడించిపోవుచు అతనిఁ జూయుటకుఁ దాళఁజాలక యిట్టిపలుకు లాడుచు కన్నీళ్లు నడఁచుకొనఁజాలరైరి. అంత రాజును మనంబునఁ గుందుచు దుఃఖితలగుతనకాంతలం గూడి 'నా గారాబుకొమరునిఁ జూచి వచ్చెద'నని చెప్పుచు గృహము వెడలెను. అట్లు వెడలునపుడు, ఒక పెనుగజమును బంధింపఁగా దానిని జేరిన యాఁడుగజములు దుఃఖమున మహాధ్వని గావించునట్లు, రామునిపోకకు స్త్రీలు రోదనము సేయుగొప్పచప్పుడు అతనికి ముందట వినవచ్చెను. శ్రీమంతుఁ డగునాతండ్రి దశరథుఁడు ఆదుఃఖమునుజూచి తాను, గ్రహణసమయమున రాహువు గ్రసించిన పూర్ణచంద్రునివలె, కాంతి గుందినవాఁడయ్యె. శ్రీమంతుఁ డగురాముఁడు ఇంతింతనరానిధైర్యము గలవాఁడు గావున జను లట్లు వెంబడించుటయు దుఃఖించుటయుం జూచియు, మనసునఁ గలంగక సూతుని త్వరితముగాఁదోలుమని యాజ్ఞాపించెను. రాముఁడు 'తోలుతోలు'మని పురికొలుపఁగా, జను లప్పుడు 'నిలునిలు'మని ప్రార్థింపఁగా, సూతుఁడు మార్గమున రెంటినిం జేయఁజాలఁడయ్యె. మహాబాహుఁ డగురాముఁడు బయలు వెడలఁగానే రథగమనమున రేఁగినదుమ్మంతయు పురజనులకన్నీళ్లం దడిసి యడఁగిపోయెను. రాముఁడు పయనమగునపుడు ఆపురజను లందఱును మిక్కిలి దుఃఖార్తులై యేడ్చుచు, కన్నీరుమున్నీరుగాఁ గార్చుచు, హాహాకారంబులు సేయుచు, ప్రజ్ఞమాలి సొమ్మసిల్లిరి. వారికన్నీటివెల్లిచే పురమంతయుఁ దడిసినదయ్యెను. చేపలిటునటు కలఁతనొందఁగా నల్లలాడుతామరలనుండి పూఁదేనె కాఱునట్లు, స్త్రీలనేత్రముల నుండి దుఃఖజనితం బైనకన్నీరు దొరిఁగినదయ్యె. శ్రీమంతుఁ డగునాభూకాంతుఁడపుడు పురమంతయు నొక్కటేమనంబున రామునికై పగచుచుండుటఁ జూచి, దుఃఖము మిక్కిలి పైకొనఁగా, వేరు నఱకఁగాఁ ద్రెళ్లువృక్షమువలె గొబ్బున నేలఁబడెను. అంత రాముని వెనుకఁ బోవుచున్న జనులు మిక్కిలి దుఃఖమున స్రుక్కి పొక్కుచున్న రాజుం జూచి హాహా యని బిగ్గఱ దుఃఖించిరి. జనులు కొందఱు 'అయ్యో రామా' యనియు, మఱికొందఱు 'హా రామునిఁగన్నతల్లీ' యనియుం, జేర్కొని యఱచుచు రోదనము చేసిరి. అంతఃపుర స్త్రీ లందఱును అట్లే బిగ్గఱ రోదనము గావించిరి. రాముం డాయాక్రోశధ్వనిని విని, వెనుకతట్టు తిరిగి జనులను జూచుచు న

*సూర్యుఁడు మేరుపర్వతమునకుఁ బ్రదక్షిణముగా పోవుచునే యుండును గావున అతనికాంతి ఆపర్వతమునం దెప్పుడును తగిలియే యుండునని తెలియునది.

ప్పుచు, దురపిల్లుచు మనసుతల్లడిల్లుచు మార్గమున తన్ను వెంబడించి వచ్చుచున్న తండ్రిని తల్లిని గాంచెను. అతండు, త్రాటం గట్టఁబడినగుఱ్ఱపుఁబిల్ల తనతల్లిం జూచునట్లు, తాను ధర్మపాశబద్ధుఁడు గాన తలిదండ్రుల స్పష్టముగాఁ జూడక యోరచూపునఁ జూచుచుండెను. వాహనము లెక్కిరాఁ దగినవారయ్యు, కాలినడను వచ్చుచున్నవారై, దుఃఖమున కెంతయు నర్హులు గాకుండునాతల్లిదండ్రులను, సుఖమునకే తగినవారయ్యు సుఖము దక్కి స్రుక్కుచున్నవారిని, జూచి, రాముండు 'సూతా! రథము వేగముగా పోనిమ్ము' అని ఆజ్ఞాపించెను పురుషలలాముం డగురామునికి తలిదండ్రులం జూచుట మిక్కిలిదుఃఖకరముగానుండెను; కాన బరిగోలచే పొడువంబడిన యేనుఁగు ఆపోటునకుం దాళఁజాలనియట్లు తాను వారలం జూచెడియాదుఃఖమునకు తాళఁజాలఁడయ్యె. ఆవు, దూడయం దతిప్రేమ గలది గావున, దానిని కట్టియున్నయింటికి వేగముగా వచ్చునట్లు, రామునితల్లియు రామునిదిక్కు పరుగెత్తి వచ్చెను. అట్లు ఏడ్చుచు రథము వెంటఁ బరుగెత్తి వచ్చుచు 'హారామా! సీతా! హా లక్ష్మణా!' యని యాక్రోశించుచు, ఆముగ్గురికిని గలిగినదుఃఖమునకుఁ గన్నీళ్లు గార్చుచు, దుఃఖవేగమున నర్తించు దానివలె నిటునటు నల్లలాడుచు నున్న తల్లిని రాముండు సారెసారెకుం జూచెను. రాజు 'నిలునిలు' మని బిగ్గఱ నఱచెను. రాముఁడు 'పొమ్ము పొమ్ము' అని సూతునికిఁ జెప్పెను. దానం జేసి సుమంత్రునికి నిలుచుటకును బోవుటకును దోఁపక చక్రములనడుమ నుండినట్లు మనస్సు నూఁగుచుండెను. రాముఁడు సూతునితో "రాజు నా మాట యేల వినవైతివని నిన్ను నిందించెనేని నీవు దానికి 'ఆసందడిలో నాకు నీవు చెప్పినది వినలే'దని బదులు చెప్పవచ్చును. ఈయబద్ధమైనను చెప్పవచ్చును గాని, వా రిప్పటిదుఃఖము నిట్లే చాలసేపు అనుభవించుచుండుటను జూచి యోర్వఁ దరముగా" దనియె. సుమంత్రుఁడును రాముఁడు చెప్పిన చొప్పునఁ జేయువాఁడై యతని వెంట వచ్చుచున్నయంతఃపురజనమునకు రాముచే ననుజ్ఞ యిప్పించి, గుఱ్ఱములుఁ దమంతనే వేగముగాఁ బోవుచున్నను వానిని, మఱింత శీఘ్రముగాఁ దోలెను. రాజునుసంబాధించినజనులు రామునకు ప్రదక్షిణముచేసి వెనుకకు మరలిరి. *అయినను అందు మనుష్యమాత్రులెవ్వరికిఁగాని, వారి దేహములు మరలెనే కాని వారిమనస్సును కన్నీళ్లును మరలినవి గావు. మంత్రులు రాజుం జూచి 'ఎవ్వఁడు శీఘ్రముగా రావలయునని కోరుదుమో అతనిని దూరముగా వెంబడింపరాదు.' అని చెప్పిరి. అవయవములన్నియు చెమర్చి, రూపంబున దుఃఖం బచ్చుపడి వెచ్చువెరుఁగ, దీనుఁడై యున్న యారాజు మంత్రులు చెప్పినమాటవిని అది సర్వవిధ

---

* లేక:- రాజును సంబంధించినయంతఃపురజనము దేహమాత్రమున మరలెనుగాని వారిమనస్సును కన్నీళ్లును మరలలేదు తక్కిన పౌరజనమో దేహమునఁగాని మనస్సునఁగాని కన్నీళ్లనుగాని మాఁటను మరలదయ్యెను: అని మహేశ్వరతీర్థులు.

ముల గుణయుక్తమై యుండుటచే దానిచొప్పున రాముని వెంబడింపక భార్యలును దాసును నిలిచి గారాముకొడుకగు రామునిఁ జూచుచుండెను. ఇది నలువదియవసర్గము.

—✦—

## ఆంతఃపురస్త్రీలవిలాపము. దుశ్శకునములు ప్రజలదుఃఖము.

పురుషలలాముం డా రాముఁడు మాతృజనపరివృతుం డై యున్న తండ్రికి మోడ్పుఁగేలు గీలించి యడవికి వెడలఁగానే రాజుతోడ వచ్చిన యంతఃపురపుస్త్రీలందఱును అప్పుడు మిక్కిలిధ్వని గలుగునట్లు హా యని విలపించిరి. వారు రాము నింగూర్చి "దిక్కుమాలి దుర్బలులై కరుణింపఁ దగియున్న యీ జనుల కెవ్వఁడు గతియై రక్షకుఁడై యుండునో, యట్టినాథుఁడు రాముఁడిపు డెచ్చటికిఁ బోవుచున్నాఁడో! తనపై నితరులు లేనితప్పులను జెప్పిననుఁగాని తాను గోపము నొందఁడు; ప్రజలకుఁ గోపము గలిగించుకార్యములను జేయఁడు; మఱి తన్నుఁ గోపించినవారిని కలకఁ దేర్చుచుండును. అట్టిరాముఁ డెచ్చటికో పోవనున్నాఁడు? ఆ మహాతేజుఁడు తనతల్లి యగు కౌసల్యయెడల నడచుకొనునట్లే మనయందును నడచుకొనును. అట్టివాఁడు ఎక్కడికి పోవుచున్నాఁడో! రాజు కైకేయి వారింపఁగా పడలేక వనమునకుఁ బొమ్మని యాజ్ఞాపింపఁగా, ఈ మన కందఱికిని తక్కిన జనులకును రక్షకుం డై యుండురాముఁడు, ఆమాటకు లోనై, యెచ్చటికి పోవుచున్నాఁడో! ఔరా! రాజెంత బుద్ధిహీనుఁడే! ప్రాణివర్గమునకంతయు మిక్కిలి ప్రియుండై ధార్మికుం డై సత్యవ్రతుం డగుచు నున్న రాముని అడవికిఁ బంపుచున్నాఁడే' అని యందఱును దూడను బాసిన యావులవలె దుఃఖపీడితులై యేడ్చిరి; మఱియు బిగ్గఱ నాక్రోశించిరి. రాజు, మును పే పుత్రశోకమునఁ బొగులుచున్నవాఁడు; మఱి యపు డంతఃపురమునందు బెట్టిదముగా వినంబడుచున్న యారోదనశబ్దమును విని మఱింత మిక్కిలియు దుఃఖితుఁడయ్యెను. రాముఁడడవికిఁ బోయినచింతచే హోతలు అగ్నిహోత్రములను వేల్వరైరి. అగ్నులును అంతర్హితము లయ్యెను. గృహస్థు లెవ్వరు నిండ్లయందు వండుకొనరైరి. ప్రజ లెల్లను పను లన్ని విడిచి మిన్నకుండిరి. *సూర్యుండును ఇంకను వ్యవధి యుండినను ముందుగానే యస్తమించెను. ఏనుఁగులు గ్రాసకబళములను గొనవయ్యెను. ఆవులు దూడలకుఁ బాలు గుడుపవయ్యె, †తల్లి తన తొలుచూలిబిడ్డఁడు వచ్చినను సంతోష

* రాముఁడు సర్వాత్మల కాత్మభూతుఁడు గావున అతని కి దుఃఖము కలుగఁగా అన్నిటికిని దుఃఖము కలిగినదని తెలియునది. కాఁబట్టియే రామాయణమందు ఏది చెప్పంబడినను అదియంతయు వాస్తవమేయని తెలియునది. మహేశ్వరతీర్థులు.

† ఇందులకుమూలము. 'పుత్రం ప్రథమజః లబ్ధ్వా జననీ నాభ్యనన్దత' విశేషార్థము-(ప్రథమజం పుత్రం) మొదటఁబుట్టినకొడుకును- మొదటఁబుట్టిన మహాగుణవంతుఁడగు రాముఁడే అడవిపాలు సేయఁబడినాఁడు. ఇఁక నాకొడుకుగతి యేమి? అనియర్థము. (లబ్ధ్వా) పొంది-అఱువదివేల సంవత్సరములెంతో కష్టపడి సంపాదించినకొడుకే అడవికిఁ బంపఁబడినాఁడు-అనాదిగా వ్రతోపవాసనియమము లుండి బహుకాలమునకుఁబడసినవానికి ఏమికలుగునోయని భావము, (జననీ నాభ్యనన్దత) తల్లి సంతోషింపని

మొందినదిగాదు. ఇక్ష్వాకుకులకూటస్థుఁడును ఆకాశమున నక్షత్రమైయున్నవాఁడును అగుత్రిశంకువును అంగారకుఁడును బృహస్పతియును బుధుఁడును ఇంక నితరములైన క్రూరగ్రహములును కొన్ని సంగమముచేతను, కొన్ని దృష్టిచేతను, కొన్ని వక్రగతిచేతను, చంద్రునిఁబొందియుండినవి. ఆకాశమున నక్షత్రములు కాంతి డిందువడియె. గ్రహములు ప్రభదూలియుండె, కోశలదేశనక్షత్ర మగు * విశాఖ పొగతోఁ గూడినట్లు మలిన మై చూపట్టుచుండినది. మేఘసమూహముతోఁ గూడినమహావాయువేగమున మహాసముద్రము పొంగునట్లు రాముఁ డడవికిఁ బోఁగానే అయోధ్యయంతయు చలనము బొందినది. దిశలెల్లను చెల్లచెదరై చీఁకట్లుగ్రమ్మునట్లుండినవి. గ్రహములు నక్షత్రములు గాని ఏమియుఁను బ్రకాశము లేకుండెను. పురజనులు, రాముఁడడవికిఁ బోవుటకన్న వేఱు బంధువియోగాదికారణములు లేకయే, దుఃఖము నొందినవారై యుండిరి. ఆహారమునందుఁగాని విహారమునందుఁగాని ఎవ్వరికిని మనస్సు గలుగదయ్యె. అయోధ్యయందలిజను లందఱును దుఃఖపరంపరచే పురపురం బొక్కుచు, ఎడతెగక నిట్టూర్పులు పుచ్చుచు, రాజుం బేర్కొని, దుఃఖించుచుండిరి. జనులందఱును గన్నీళ్లు మొగమునిండఁ గ్రమ్ముకొన గృహములకుం బోవక రాజమార్గమునం దిరుగుచుండిరి. అం దెవరికిఁగాని సంతోషము చూపట్టినది గాదు. ఒక్కొక్కఁడును మిక్కిలి దుఃఖమున మునిఁగియుండెను. వాయువు చల్లగా వీవదయ్యె. చంద్రుఁడు సొంపుగా చూపట్టకుండె. సూర్యుఁ డెండగాయఁడయ్యె. జగమంతయు కలఁగి నలఁగి యుండినది. కొడుకులు తల్లులచన్నుఁబాలు నొల్లరయిరి. భర్తలు భార్యలయెడల వలపుదక్కి యుండిరి. అన్నదమ్ము లొండొరులయెడ నెయ్యము మాలిరి. అనురక్తులైనవారందఱును పరస్పరము రాగముతప్పి తక్కిన యన్నిటిని విడిచి రామునే చింతించుచుండిరి. † అపుడు రామునిస్నేహితు

---

దయ్యె. కొడుకు పుట్టుటమొదలుగా 'ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి' 'వేడుకలందెల్ల తండ్రివలె ఒడియందిడుకొని ఉపలాలించువాఁడే' అడవికి పోవుచున్నాఁడు. ఇంక నీకొడుకేమిగియని కన్నకొడుకుం జూచియు తల్లి సంతోషింపదయ్యెనని భావము.

* (విశాఖా) విశాఖా నక్షత్రమునుండి పుట్టినసూర్యునివంశమున ఇక్ష్వాకుఁడు పుట్టినవాఁడుగావున ఆది ఇక్ష్వాకుకులనక్షత్రమగును. అది పొగతోఁగూడినట్లు కనఁబడుటచే రాజునకు రానున్నమరణవిపత్తు సూచిత మగుచున్నదని తెలియునది.

† ఇందులకు మూలము.'యేతు రామస్య సుహృద స్సర్వే తే మూఢచేతసః। శోకభారేణ చాక్రాన్తాః శయనం న జహు స్తదా' విశేషార్థము- (యేతు) ఎవరైతే - ఇట తుశబ్దముచేత ఇదివఱకుఁ జెప్పఁబడినవారికంటె వీరువిలక్షణులని భావము- అనఁగా ఇంతకుమునుపు చెప్పఁబడిన దశరథుఁడు రామునిపోకకు అనుమతియిచ్చెను. కౌసల్య మంగళాశాసనములు చేసెను. వీరో, అట్లుకాదు వీరియందు ఒకఁడైనను ఏమియుఁ జేసినవాఁడుకాఁడు, (రామస్య సుహృదః) రాముని చెలికాండ్రు-తండ్రికిఁగూడ దెలుపరాని రహస్యములను రాముఁ డెవరికి వెల్లడిసేయునో యట్టివారు అనుట, (సుహృదః) మిక్కిలి శో

లందఱును, దుఃఖాతిశయము పైకొనఁగా, మనస్సున నేమియుం జేయఁదోఁపక నేలం బడి లేవరైరి. అంత, త్రిలోకాధిపతియగునింద్రుఁడు లేనిచో భూమండల మంతయు ప్రాపుదక్కి వ్యాకుల మగునట్లు, మహాత్ముఁ డగురాముఁడు లేమింజేసి అయోధ్య యంతయు భయమునను శోకమునను బీడితమై గజతురగ భటసహితముగా మిక్కిలి చలనమునొంది బిట్టుగా నాక్రందనధ్వని గలిగియుండె. ఇది నలువదియొకండవసర్గము.

— ✣ —

## రాముఁ డరణ్యమునకుఁ బోయినపిదప దశరథునివిలాపము.

ఆ రాముఁడు పట్టణమునుండి వెడలిపోవుచుండఁగా అతనిరథగమనమువలన రేఁగినదుమ్ము ఎంతవఱకు నగపడుచుండెనో యంతవఱకును దశరథుఁడు రామునిదిక్కు చూచుచుండెనేకాని చూడ్కులు మరల్చినవాఁడు గాఁడయ్యె. రాజు, ప్రియుండును పరమధార్మికుఁడు నగుతనకుమారుని ఆదుమ్మునుజాడనుఁ బట్టి చూచుచుండునంతవఱకును ఆదుమ్మును కనఁబడుచునేయుండెను. ఆదుమ్ముం జూడఁగా, అది తనజాడనుబట్టియైనను,పుత్రునిఁజూచుచురాజు కొంతకాలముఱడియుండుఁగాకయని భూమినుండి మిక్కిలి వర్ధిలుచుండెనో యన్నట్లు తోఁచుచుండినది. రాజు రాముని రథధూళిగూడ కనఁబడకపోయినప్పుడు మేను విఱవిఱంబోవ మిక్కిలి దుఃఖితుఁడై నేలంబడెను. అది చూచి కౌసల్య లేవనెత్తుటకై యతనికుడిచేయిఁ బట్టుకొన్నది. కైక, భరతునియందుమాత్రమే ప్రీతిగలది గావున, రాజు నెడమప్రక్క నూరక నిలిచియుండినదికాని యతనిని లేవనెత్తినదికాదు. నీతివిదుఁడును ధార్మికుఁడును సదాచారసంపన్నుఁడును నగురాజు తనడాపలిప్రక్కనున్నకైకం జూచి యింద్రియములాకులతం బొంద “ఓసీ! కైకేయీ! చెడునడతలదానా! నీవు నాయవయవములను దాఁకకుమా. నిన్నుఁ గంటఁ జూడనొల్లను. నీవుభార్యవుకావు. నీకును నాకును కేవలబంధుత్వమును లేదు. నీతోడి సంబంధమేకాదు. నిన్నుఁ గొలిచి బ్రతుకువాఁరికిని నేను రాజుగాను. నాకు వారు భృత్యులుగారు. నీకు కేవల మర్థమునందే యాసక్తి; ధర్మమునందు నీకెక్కుడు లేదు. కావున నిట్టి నిన్ను విడిచెదను. ‘అగ్నిసాక్షికముగా చేపట్టిన

భవమైన హృపయముగలవారు అనఁగాత్మస్థులైన విడిచి రాముని సంరక్షించువారనుట, (సర్వేతే) వారందఱును- అంపఱొక్కవిధమేకాని ఒకఁడేనియు మఱొకవిధముగాన ండలేపనియర్థము సుహృదులైరేని రామునిపాదములుపట్టుకొని వేఁడి మరలింపరాదా యనఁగా చెప్పుచున్నాఁడు-(మూఢ చేతసః)బుద్ధి తప్పినవారైరనుట-కావున నే యట్లు చేయరైరనిభావము. తెలివితేటగా నుండువారు చేయఁదగినది. తెలివితప్పినవారెట్లు చేయఁగలరనుట.వారితెలివి తప్పుటకు హేతువు చెప్పుచున్నాఁడు-(శోకభారేణ చాక్రాన్తాః)శోకభారముచే ఆక్రమింపఁబడినవారు-పర్వతము పైఁబడ్డట్లు శోకభావముపైకొన్నదిగావున తెలివితప్పినవారైరనుట, (శయనం నజహుః) పడుకను విడువరైరి- నేలంబడి లేవరైరనుట పర్వతముపైఁబడ్డవారు ఎట్లు లేతురనుట. (తదా) అప్పుడు-ఆపారవశ్యకాలమందు (నజహుః) ‘ మంచమట విడిచిలేవరైరనుట-స్వబుద్ధిపూర్వకముగా పరుండినవారే లేతురు-వీరట్లు పరుండమిచే లేవఁజాలరైరనిభావము.

నేను పెండ్లము ఎట్లు కాకపోదు' నందువా? నీదు పాణిగ్రహించుటయు నిన్ను అగ్నిచుట్టు ప్రదక్షిణము సేయించుటయు ననెడి యీ రెంటివలన నీతోడిసంబంధముచే నాకుఁ గలుగు ఐహికము ఆముష్మికమును అన్నియును బరిత్యజించితిని. ఐహికసంబంధము వదలితినిగాన నీతోడి క్రీడాదులును వదలితిని. ఆముష్మికసంబంధమును వదలుటఁజేసి పరలోకార్థము నీతోడ అగ్నిహోత్రాదికర్మములను గావింపను. భరతుఁ డక్షయమైన యీనీరాజ్యము నొంది సంతోషించు నేని వాఁడు తండ్రినగునన్నుద్దేశించి యొసంగు జలతర్పణాదులు నాకుఁ జేరకుండుఁగాక" యనియె. అంత కౌసల్యయప్పుడు దుమ్మున బ్రుంగి యున్నరాజును లేవనెత్తి శోకమున స్రుక్కుచు నతనింగొని మరలెను. ధార్మికుం డగునాభూవిభుఁడు తనకొడుకు తాపసవేషము దాల్చిపోవుటను సారెకుఁ దలంచుకొని, కావలయునని బ్రాహ్మణునిఁ జంపినవానివలెను, చేత నగ్ని దాఁకినవానివలెను, మిక్కిలియు అనుతాపము నొందుచుండెను. రాముని రథముపోయిన మార్గములందు అడుగడుగునకు మరలిమరలి చూచుచు, స్రుక్కుచు, రాజును రాణియు రాహుగ్రస్తుఁ డగుసూర్యునికైవడి రూపంబున మిక్కిలియుఁ బ్రకాశింపకుండిరి. రాజును తన యల్లాడుకొడుకును దలఁచుకొని దుఃఖార్తుఁడై విలపించుచుండెను. అంత నతఁడు రాముఁడు పట్టణమును దాఁటెనని తెలిసి దుఃఖమున 'నాకొడుకుం దీసికొని పోయిన యుత్తమాశ్వములయడుగులును మార్గమున నగపడుచున్నవి. అమ్మహాత్ముఁడు మాత్ర మగపడకున్నాఁడు. మంచిచందన మలందుకొన యుత్తమస్త్రీలు వీవనలు గొని వీచుచుండఁగా, హాయిగా నుండుతలగడలయం దుండునట్టి నాకుమారరత్నము ఇప్పుడు ఎక్కడనో యొక్కచోట ఒకచెట్టుక్రింద కొయ్యనుగాని ఱాతినిగాని కలగడగాఁ బెట్టుకొని పరుండఁగలఁడు. ఇది నిశ్చయము. అట్టి నాకొడుకు దీనుండై దేహమంతయు దుమ్ము బ్రుంగి సొంపుదూలఁగా, నిట్టూర్పులుపుచ్చుచు, సెలయేటిదాపునుండి లేచెడియేనుఁగుమిన్నవలె నేలనుండి లేచును. మహాభుజుండును లోకనాథుండు నగురాముఁడు అనాథునింబోలె నేలనుండి లేచిపోవుచుండఁగా అడవిం దిరుగుచుండుపురుషులు నిజముగా చూడఁగలరు. ఆజనకుని యల్లారుముద్దులకూఁతురు ఎప్పటికిని సుఖము ననుభవించుటకే తగినది. అట్టిచెలువ యిపుడు ముండ్లవయి నడుగులిడి,యవి గ్రుచ్చుకొనుచుండఁగా, బాధపడుచునడవిలోఁబోవఁగలదు. ఇదినిజము. ఆబిడ యెప్పుడు నడవుల నెఱుఁగదు. బెట్టిదములై గగురుఁబుట్టించు క్రూరజంతువుల ధ్వనినివిని నిజముగా భయమునొందఁగలదు. కైకేయీ! నీకోర్కులీడేఱినవే! ఇంక విధవవై రాజ్యముచేయుము. నే నాపురుషతిలకునిఁ బాసి యెంతమాత్రమును జీవింప నొల్లను జుమీ' అనియె. రా జిట్లు విలపించుచు జనులు గుంపులుకొని చుట్టు బలసి యుండఁగా, బంధువు*మృతినొందఁగా స్నానముచేసినచ్చువానివలె, అమంగళముగా

* ఇందులకు 'అపస్నాత ఇవారిష్టం ప్రవివేశ పురోత్తమమ్' అని మూలము. మృతిస్నానము చేసినవానివలె అమంగళముగానున్న పట్టణవరమును బ్రవేశించెనని యర్థము. సజీవుఁడగు రాముని వెం

నున్నయాయయోధ్యాపురమును బ్రవేశించెను. అప్పురమునందలి చతుష్పథములును గృహద్వారములును శూన్యములై యుండెను. సత్త్వగలవారందఱును రామునివెంటఁబోయిరి గావున బడలి దుర్బలులై యున్నజనులుమాత్రమె రామునిఁ దలఁచుకొని దుఃఖార్తి పడుచుండిరి. రాజమార్గమునందును ఇటనట కొంచెముగానే జనులు గనుపట్టిరి.ఇఁక తక్కినమార్గములో జనశూన్యములై యుండెను. ఇట్లున్నయాపట్టణమునంతయుఁ జూచి రామునే తలంచుకొనుచు, పలవించుచు రాజు, సూర్యుఁడు మేఘమును బ్రవేశించునట్లు,నిజగృహమును బ్రవేశించెను. ఒకమడుఁగు మహాసర్పమును గలిగియుండుటం జేసి చొచ్చి కలఁపరానిదై యుండి, యాసర్పమును గరుడుఁడు అపహరించికొని పోవఁగా, సులభముగాఁ జొరఁగూడి యుండునట్టు, రామలక్ష్మణులును సీతయు నుండుటచే పూజనీయమైయుండి యాముప్పరును లేమిచే పగవారికిని నిర్భయముగాఁ జొరఁగూడినదై, యాగృహము గానిపించెను. అంత రాజు పలవించుచు నెలుంగు డగ్గుత్తికవడఁగా, మాటలు పెక్కులయ్యు నర్థమించుకయే గలమెత్తనివాక్యముల, వినరాని యెలుంగున, దీనముగా 'నన్ను శీఘ్రముగా రాముని తల్లియగు కౌసల్యయింటికిఁ గొనిపోవుదురుగాక; మఱియెచ్చటను నామనసున కూఱట గలుగదు' అనియె. ఇట్లు రాజు చెప్పఁగా దారిచూపువార లతనిని కౌసల్యా గృహమునకుం గొంపోయి చేర్చిరి.అతఁడచ్చట నుడిగి మడిఁగియుండెను.అంత నతఁడు కౌసల్యా గృహంబు బ్రవేశించి శయనము నొందియు నతనిమనస్సు నెమ్మది గానక కలంగంబాఱినదయ్యె. ఇద్దఱు గొడుకులును లేక, కోడలును లేక, యుండుటఁ జేసి యాగృహము చంద్రుండును నక్షత్రతారకలును లేనియాకాశమువలె రాజునకుఁ జూపట్టుచుండెను. పరాక్రమశాలి యగునామహారాజు ఆయిల్లాలినిఁజూచి చేయెత్తి పెద్దయెలుంగున 'అయ్యో, రామా! నన్ను దిగవిడిచి పోవుచున్నావే' యని యాక్రోశించి 'రాముఁడు మరల రాఁగా కౌఁగిలించుకొని కన్నారం జూడం గలపురుషశ్రేష్ఠు లందఱును సుఖమున వాఁడు వచ్చునంతకాలము బ్రతికియుండం గలరు. రాముఁడు వచ్చునంత వఱకు బ్రతికి యుండు పురుషశ్రేష్ఠు లందఱును సుఖంబున నొందెదరు గౌఁగిలించుకొని మరలివచ్చినరాముని ఆకాలమునఁ గన్నారం జూడఁగలరు. నా కట్టిభాగ్య

---

బడించి మరల పురమును ప్రవేశించు సమయమున 'అపస్నాతః' 'అరిష్టమ్' అనిచెప్పుట అశ్లీలము గాన యుక్తముగాదు. అయినను దశరథుఁ డప్పుడు సీతకు 'నూనం భయ ముపైష్యతి' 'నిజముగా భయమును బొందఁగలదు' అనివిపత్తిగలుగుటను శంకించుచు తన్మూలమున రామవిపత్తిని, దానివలన తనకును వినాశమును, గలుగునని శంకించినాఁడు. అట్లు సీతావిపత్తిమూలముననే రాముని విపత్తియు శంకించి 'సకామాభవ కైకేయి' 'కైకేయి!కోర్కె లీడేఱియుండవే'యని యన్నాఁడు. తాను వినాశముఁబొందునట్లు తలఁచి 'విధవా రాజ్యమావస' 'విధవవై రాజ్యముచేయు' మనియు తెలిపినాఁడు. కనుక నిట సీతారామాదులమరణములు నిజము గాకున్నను రాజుబుద్ధికి అట్లు దోఁచుటచే దానిని అనుసరించి కవి యిట్లు చెప్పుట యుచితమేకాన దోషములేదు.

మెక్కడిది?' అనివిలపించెను. అంత తనకుఁ బ్రళయకాలరాత్రివలె నతిభయంకరముగాఁ దోఁచుచున్న రాత్రి రాఁగానే దశరథుఁడు అర్ధరాత్రిసమయమునఁ గౌసల్యం జూచి * 'కౌసల్యా! నాచూపు రాముని వెంటనే పోయియున్నది. ఇంకను మగిడిరాలేదు.

---

* ఇందులకు మూలము 'రామం మే౽ నుగతాదృష్టి రద్యాపిననివర్తతే। నత్వాపశ్యామికౌసల్యే సాధు మా పాణినా స్పృశ, విశేషార్థములు-(రామం) రాముని-గుణసముద్రుని (మేదృష్టిః అనుగతా) నాదృష్టి వెంబడించిపోయినది-సముద్రుఁడు గ్రహించినది మరల వచ్చునాయేమి యనుట-(మేదృష్టిః) అఱువదివేలయేండ్లు చేసినయుపవాసాదులు నివర్తించినవి, నాదృష్టియో, (అద్యాపి ననివర్తతే) ఇంతకును నివర్తింపక-మరలిరాక-ఉన్నది. వానిదర్శనము లేకున్నను వానితల్లియగు నిన్ను దర్శనము సేయుటకుఁ దగినసమయముగా నుండియు మఱలి రాకున్నది. (నత్వాపశ్యామి కౌసల్యే) నిన్ను చూడ నేరకున్నాను. రామదర్శనములేక కేవలముకై కేయీముఖదర్శనము చేయుటచే కలిగినపాపమునివర్తించుటకై నీముఖమును జూడ నాతురపడితిని. అదియును లభింపదయ్యె. (సాధుమాపాణినాస్పృశ) నన్నుఁ జక్కఁగా చేతనంటుము-ఇంద్రియము లుండుటయు లేనియు వాని కార్యములవలననే నిత్యమును ఊహించుకొనవలయును కనుక నాచక్షురింద్రియము,రూపమును గ్రహించుశక్తిలేకుండుటచే, పోయినదని తెలియుచున్నది. త్వగింద్రియము ఉన్నదో లేదోయని యిప్పుడు తెలిసికొనుము. (సాధు) చక్కఁగా నంటుము, 'కైకేయితో సంకేతము చేసికొని రాముని నడవికి వెడలఁగొట్టినాఁడు. ఇప్పుడేమో కొంచెముదుఃఖముగలవానివలె నభినయించినాఁడు' అని తలఁపకుమా. 'ఏమో తెలియక చేసినాఁ'డని మనస్కరించి, (స్పృశ) అంటుము. లేక, (మాం పాణినా స్పృశ) రామునితల్లివగుటచే నీపాణిస్పర్శనము రామస్పర్శనమే గనుక నీచేత నన్ను స్పృశింపుమని భావము-గోవిందరాజులు.

లేక:-పంచేంద్రియము లొక్కొక్కటియు వేఱువేఱ అనన్యార్థశేషములగుట-రామునికిఁదప్ప నన్యుల కధీనములు గాకుండుట- యిటచెప్పఁబడుచున్నది. (రామం) రాముని - గుణసముద్రుని, (అనుగతా మే దృష్టిః)నాదృష్టి వెంబడించినది, (అద్యాపి) ఇంకను, (ననివర్తతే) మరలి రాకున్నది. సముద్రమునందుఁ బడినది మరలి వచ్చునా-'సముద్ర ఇవ గామ్భీర్యేగుణానామాకరో మహాన్' 'గాంభీర్యమందు సముద్రునివంటివాఁడును గుణములకు గొప్పగనియైనవాఁడును' అని రాముఁడును గుణాదుల సముద్రుఁడే కావున వానియందుఁ బడినదృష్టి మరలి రాకున్నదనుట, లేక, (రామం మేను గతా దృష్టిః) 'రామం రమయతాం వరం' 'రమింపఁజేయువారిలోపల శ్రేష్ఠుఁ డగురాముని' అని, చేతనమనియు అచేతనమనియు విభాగము లేక సర్వమును రమింపఁజేయు గుణముగలవాఁడు గదా వాఁడు. కనుక అచేతనమగు నాచక్షువును రమింపఁజేసినాఁడు. అన్నియెడల చక్షువే రూపమును గ్రహించునది. రామునియెడనో రూపమే చక్షువును గ్రహించినది. అనుగతములైన పదార్థములను చూడనుమాత్రము నేర్చిన చక్షువు ఇపుడు వానివెంట సంచారము సేయుటకును చాలినదయ్యెను. 'కామరూప్యనుసంచరన్' 'కామరూపము కలిగి వెంట తిరుగుచు' అను చేతనకార్యములను అచేతనము చేయుచున్నది. దేశాంతరమగుపరమపదమునందుఁ జేయఁబడు అనుసంచరణము సంసారచక్రమునందు రామునిఁగూర్చి చేయఁబడుచున్నది. లేక, (మేదృష్టిః రామ మనుగతా) 'చక్షుర్దేవానా ముతమర్త్యానామ్' 'దేవతలకుఁగాని మనుష్యులకుఁగాని చక్షువైనవాఁడు' అన్నట్లు దేవమనుష్యాదిమయ మగుజగత్తునకు ప్రధానదృష్టి యైనవాఁడు ముందుఁబోవుచుండఁగా నేను పోక నిలిచియుందునా, యని నాదృష్టియు వెంటఁబోయినది. (దృష్టిః) దృశిః ప్రేక్షణే యని వ్యుత్పత్తిచొప్పున సారాసారవివేకము చేసి విశేషము

కావున నిన్నుఁ జూడఁజాలకున్నాను. నీవు నాయందు కోపముంపక దయగలిగి నీవు

---

గ్రహింపఁజాలినదిగావున, రామునివెంటఁ బోవఁగలిగినది, (దృష్టిః) మనకు హితాహితములు తెలుపున ట్టిది తనకును హితము తెలిసి చేసికొనకుండునా? కావున నే రామునివెంటఁబోయినది, (మేదృష్టిః) నా దృష్టి-నాకు శేషమయినదిగావున అస్వతంత్రమై తాను యిట్లు స్వతంత్రించి యెట్లుపోవచ్చును? శేషియ గుస్వామికి అతిశయము కూర్చుటయే శేషవస్తువునకు-సొమ్మైనదానికిఁ-దగును. శేషి నే అతిశయించుట తగునా? (మేదృష్టిః రామమనుగతా) చిరపరిచితుఁడైన నన్ను విడిచి; రామునివెంట అభిసారికవలె ఉఱికినదేమి?(మేదృష్టిః) కైకేయీమంథరాదులదృష్టి యగునేని యట్లుచేయవు 'నద్రామిపశ్యన్నపి ద ర్శనేన' 'దవ్వులఁజూచియు మరల దగ్గఱఁజూచి యానందింతును' అని, దీనికి రామునిఁజూచుటకు నేనే దారిచూపితిని. కాఁబట్టి యిది యిట్లుచేసినది. (మేదృష్టిః) కన్నవిషయములందెల్ల చపలుఁడైననాయొ క్కదృష్టియు చాపల్యము లేకుండునా?(మేదృష్టిః) తల్లినివిడిచి కన్య పతివెంటపోయినను ఆతల్లిదానిని 'నాకూఁతురు' అని తనదిగా నే యభిమానముగొనునట్లు నాదృష్టి నన్నువిడిచి రామునివెంటఁబోయినను 'నాదృష్టి' యనియే దానియెడ అనురక్తి నెఱపుచున్నాను.(మేదృష్టిః రామమనుగతా) నాయింద్రియమై నయెడలనన్ననుసరించియుండునుగాని రామునననుసరించుటయెట్లు? అన్నచో,దృష్టితనకు విషయమైనదా నినివెంటనంటుట దోషముగాదు. కావున నాదృష్టియు తనకువిషయభూతుఁడైన రామునివెంటఁబోయి నది.'ఇంతేకానిమరలరాకపోవునా'యనఁగా, (అద్యాపిననివర్తతే)ఇంతకును మరలకున్నది'అతిక్రాన్తేపి రాఘవే'రాముఁడుచూపుమేరను దాఁటపోయినను మరలకున్నది అనుచున్నాఁడు. (దృష్టిరద్యాపి ననివ ర్తతే)మరలవచ్చినయెడల కైకమొగమున వ్రాలవలయునని జంకి యింతకునురాకున్నది.(మేదృష్టిరద్యా పిననివర్తతే)దుఃఖముకలిగినపుడు పరిజనులు తోడుపడవలయును - రామవిరహముచేతదుఃఖించుచున్న నాకు నాదృష్టివచ్చి తోడుపడకున్నది,(దృష్టిరద్యాపిననివర్తతే)పోయిన రామునిమరల్పలేకపోయినను తానైనను మరలుటకు అడ్డియేమి? (రామమనుగతాదృష్టిర్నసివర్తతే) 'నచ పునరావర్తతే' అన్నట్లు వానిని! వెంబడించినవానికి పునరావృత్తి లేదుగావున నాదృష్టియు వానివెంబడించ్చిమరలిరాకున్నది కాఁ బోలు. 'నిన్నువిడిచి యది పోయిన నేకదా మరలిరావలసియుండును. పోకయుండఁగా మరలవచ్చుట యెట్లు'? అనియడుగఁగా చెప్పుచున్నాఁడు - (నత్వాంపశ్యామి) నిన్ను చూడకున్నాను - అది పోకుం డునేని నిన్ను చూడఁజాలనా? కాఁబట్టి యదపోయియే యున్నది. చక్షురింద్రియము పైకి కనఁబడు చున్న కనుగ్రుడ్డుగాదు, ఆయింద్రియము అతీంద్రియమైనది. కార్యమునుబట్టియే దానియునికి తెలియ వలయును. నీవు ముంగల నిలుచుండియు నిన్నుఁ గానకుండుటచే అది పోయినదెయగును '(త్వాం) అని నన్ను దాపుననుండునట్లు చెప్పుచున్నావు. మఱిచూడననుటయెట్లు' అని కౌసల్యయడుగఁగా- (నత్వాం పశ్యామి) నిన్ను చూచికాదు, 'వచసాజ్ఞాతః' 'స్వరేణోక్తః' అన్నట్లు నీమాటనువిని (త్వాం)అని ముంగి ల నున్నదానిగా చెప్పితిని 'నచక్షుషా పశ్యతి' అను శ్రుతినిఁబట్టి వానిని కన్నారఁజూచుట కష్టమైనను (నత్వాంపశ్యామి)వానిని గన్న నీమొగమునైనను చూచెదమన్నచో అదియు లభింపకపోయినదసభావ ము, (రామం మేఽనుగతా దృష్టిః నత్వాంపశ్యామి) అది నాకు ప్రధానమైన పరికరము; అది రాముని వెంటఁబోవుటచే దగ్గఱ లేనిదయ్యెను. దగ్గఱ నున్న నిన్నో చూడలేనైతిని. ఏమిసేయుదున నుట. లేక; రామునియందు మగ్నమైనదృష్టి మఱొకదాని నంటునా! కాననిన్ను చూడదయ్యెనని యభి భావము. చక్షురింద్రియము నశించినను వాగింద్రియముచేతనైనను ఊఱడిల్లుదునని యామెను పేర్కొ నుచున్నాఁడు. (కౌసల్యే)'ఏష మేజీవితస్యాన్తో రామో యద్యభిషిచ్యతే' 'రామునికభిషేకముచేసిన

స్తముచేత నన్నుఁ జక్కఁగా స్పృశింపుమీ! అప్పటికి నాపరితాపము కొంత తగ్గు

---

యెడల నిదియె నా ప్రాణములతుది' అని రామునితోడియన్వయమునకు కైక చావఁజూచెదననఁగా 'కిం పునః ప్రోషితే తాత ధ్రువం మరణమేవ మే' 'నీవు అడవికిఁబోవఁగా ఇఁకఁజెప్పనేల? నాకు మరణమే కలుగుననుట నిజము' అని నీవు రామునితోడి వియోగమునకు ప్రాణములు విడిచెదనని చెప్పినదానవు.

ల్యే) 'కౌసల్యా లోకభర్తారం సుషువే యం మనస్వినీ' 'ఈకౌసల్య లోకనాథుఁ డగు రాముని గనెను' అని చిరకాలముగోరి లోకమంతయు నుజ్జీవింప సంపాదించిన సంతానము తుదకు నీకిప్పుడు నాతోపాటిగా అది దుఃఖమునకే యైనదిగదా, (కౌసల్యే త్వా నపశ్యామి) అనర్థము నేసిన కైకేయిని ఇంత సేపు చూచిన కన్నులు ఆశ్వాసము నేయు నిన్ను చూడక పోవుటేమి? రామవిరహముచే స్రుక్కుచున్న కౌసల్య, దశరథునిదుఃఖమునుజూచి భర్తృవిరహము గలుగునో యని భయపడి యతనిదగ్గఱకు రాఁగా నామెంజూచి చెప్పుచున్నాఁడు-(సాధు మా పాణినా స్పృశ) నా దుఃఖమంతయు తీఱునట్లు చేతులారఁ దడవి యూఱటఁ గలిగింపుమా. (పాణినా స్పృశ) నిన్ను చూడ నేరకుండుటచేత చక్షురింద్రియము పోయినదని నిశ్చయించితిని. నీమాట వినుటచేత శ్రోత్రేంద్రియము ఉన్నదని తెలియుచున్నది. 'కౌసల్యే' అని నీపేరు చెప్ప నేర్చుటచే వాగింద్రియ మున్నదని నిశ్చయించితిని. గంధగ్రహణముచేయ లేనందున రాముని శిరము మూర్కొనుటకు ఘ్రాణేంద్రియమును పోయినదని నిశ్చయించుచున్నాను. గొప్పవిషయములభించినపుడు తక్కినవిషయములు తుచ్ఛములుగా తోఁచునుగాన నాస్పర్శేంద్రియమును తక్కినవానినివిడిచి గొప్పవిషయమగు రాముని వెంటపోయినదో యున్నదో తెలియలేదు. అది నిశ్చయించుటకై నన్ను చేతనంటి చూడుమనుట. దొంగయొకయింటిలోనికిఁజొచ్చి కొన్నివస్తువుల నెత్తుకొనిపోయిన వెనుక యజమానుఁడు చీఁకటిలో ఏమేమిపోయినదని ఆయావస్తువులను దడవిచూచుచు భార్యమొదలగువారిని అడుగునట్లు దశరథుఁడు తనయింద్రియములను గొన్ని రాముఁడు దొంగిలికొని పోవఁగా మిగిలి యేమున్నదని విమర్శించుచు కౌసల్య నడిగినాఁ డని తెలియునది. (సాధు స్పృశ) చక్కఁగా నంటుము. నన్ను 'కైకేయితోఁ గలసి రాముని కాఱడవిపాలుచేసి యిప్పుడేమి తెలియనట్లు ఇచ్చకము లాడుచున్నాఁ' డని తలఁపక 'ప్రకృతిసంబంధముచే నట్లు కలఁతఁ బొందినాఁ డింతేకాని' యనియేవగించుకొనక అంటుము. (పాణినా స్పృశ) ముందు అగ్నిసాక్షికముగా మంగళముహూర్తమున కౌతుకముతోఁ బట్టిన యాచేతనే అప్పటితలంపుతోనే స్పృశింపుము, (పాణినా స్పృశ) వాని స్పర్శముచే పరిమళించుచున్న యాచేతితో స్పృశింపవలయును, (మా స్పృశ) రామస్పర్శము కలిగినేని యుజ్జీవించువాఁడును, కలుగనప్పుడు నశించువాఁడునై యున్న, నన్ను వానిని గన్న నీచేతితో తడవవలయును. భగవంతుని స్పర్శము లభింపక పోయినప్పుడు వాని సంబంధిసంబంధుల స్పర్శమును లభించినయైనను ఉజ్జీవింపవచ్చునుగదా. వాఁడును, సీత లేనప్పుడు 'వాహి వాత యతః కాంతా' 'వాయూ! నా ప్రియురాలుండుచోటనుండి వీవుము' 'తాం స్పృష్ట్వా మామపి స్పృశ' 'దానిని స్పృశించి పిదప నన్ను నస్పృశింపుము' అని సీతాసంబంధి యగువాయుస్పర్శముఁగోరినట్లు, రామస్పర్శము లేనపుడు తత్సంబంధియగునీస్పర్శము కలుగనిమ్ము అని భావము ఇచట 'జన్మాంతరసుకృతవశమున దశరథునికిని కౌసల్యకును శ్రీరామునియందు పరత్వజ్ఞానము కలిగియుండిన నుండుఁ గాక. వారిరువురును ఒండొరులతో రామునిపరత్వము నిష్కృష్టముగా అనుసంధించుచు మాటాడికొనుట యెట్లు చెల్లు?' నన్నయెడల నిచట ఋషి, దశరథాదులు మాటాడుకొన్నట్లుగా చెప్పి తానే మాటిమాటికి పరత్వమును అనుసంధించుచున్నాఁడు గాని వేఱు గాదని సంప్రదాయమును దెలియునది.

ను' అనియె. అంతఁ గౌసల్యాదేవి పానుపునం బడి రామునే తలఁచుకొనుచు పొగు లుచున్న యామహారాజుం జూచి యతనిదాపునఁ గూర్చుండి కంది కుందుచు నిట్టూర్పులు పుచ్చుచు కష్ట మగునట్లుగా విలపించెను. ఇది నలువదిరెండవసర్గము.

కౌసల్య దశరథునితోఁ రామునిం జెప్పి దుఃఖించుట.

అంతఁ బుత్రశోకంబునం బొగులుచున్న కౌసల్య పాన్పునం బడి దుఃఖమున స్రుక్కుచున్న యాదశరథమహారాజుంగాంచి 'కైక, పురుషసింహుఁ డగురామునికి తనకుటిలత్వ మనువిషము పెట్టినది. ఇఁక కుబుసము విడిచినపామువలె హాయిగా విహరింపఁగలదుగదా. చూపునకుమాత్ర మది పొగనే. రాముని అడవిపాలు సేసి కోరిక తీర్చుకొని నెమ్మదినొందినది. ఇఁక నింటఁ జేరినదుష్టసర్పమువలె నన్ను మఱియు నెక్కువగా భయపెట్టును. భరతునికి రాజ్య మవశ్యముగా నియ్యవలసియుండినను, అప్పుడు నాకొడుకును అడవిపాలు సేయుటకన్నను, అన్నము పెట్టక భరతునికి దాసునిగాఁ జేయఁ గోరుటయైనను మేలు.అప్పుడు రాముఁడు పట్టణమున బిచ్చమెత్తుకొని బ్రతుకునే. ఇంట నాకన్నులయెదుట వసించియుండునే. అట్లును జేయక అడవిపాలు సేయనేల? నీవు మర్యాద తప్పి నీయిచ్చవొప్పున రామునిని వానిపదవినుండి పడఁద్రోసి,ఆహితాగ్నియగువాఁడు సర్వకాలమును దేవతల కియ్యఁదగినహవిర్భాగమును మోహమున రాక్షసుల కిచ్చునట్లు, రాముని రాజ్యభాగమును కైక కిచ్చితివి. ఏనుంగుమిన్నవలె నెన్నడ తీవి గులుక, నిడుదబుజంబులుగలిగి, బలువిలుదాల్చి, పరాక్రమించునట్టిరాముఁడుగూడ, భార్యను లక్ష్మణునిఁగూడి, వనముంజొచ్చుచున్నాఁడు. నీవు కైకమాటను పాటించి, యెన్నఁడు వనవాసదుఃఖము లనుభవించి యెఱుంగని యాసీతను రామలక్ష్మణులను వనమునందు వసించునట్లు దిగవిడచితివే! అట్టిసుకుమారులకు అడవియం దేమిగతి యగును? వారు మంచియెలప్రాయమున, భోగఫలము లనుభవింపవలసినకాలమున, మేలివస్తువులఁ బాసి నీవడవికిఁ బంపఁగా దీనులై, పండ్లను వేళ్లను దిని పొట్టఁబ్రోచికొనుచు నెట్లుండఁగలరు? రాముఁడు తనభార్యను లక్ష్మణునిఁ గూడి యిచ్చటికి రాఁగా, నాదుఃఖములన్నియు మాయ, నన్ను శుభంబులొందఁ, వానిం గన్నారఁ జూచునంతటికాలము ఇప్పుడే కలుగునా! ఆవీరులు ఒక్కెడ నిదురించి లేచి వచ్చినవారివలె, అడవినుండి సుఖముగా నయోధ్యకు సమీపించి వచ్చుట దెలిసి, పొగడ్త గన్న యీపురజనులు సంతోషమున నుబ్బి ధ్వజములను వరుసలుగా చక్కఁగా నెత్తి యలంకరింపఁగా విలసిల్లుచుండునీయయోధ్యకు వా రెప్పుడు వత్తురు? అడవినుండి వచ్చినయాపురుషసింహులఁ జూచి యీపురజనులు, పున్నమనాఁడు సముద్రముపొంగునట్లు, ఎప్పుడుబ్బి చెలరేఁగుదురు? మహాబాహుఁ డగునావీరుండు రాముఁడు, ఆఁబోతు గోవుతోఁ గూడివచ్చినట్లు,సీతను మున్నిడుకొని, రథమున నీయయోధ్యాపురము నెప్పుడు ప్రవేశించును? పరుల నడంపఁ

జాలువీరులగు నాకుమారులు పురప్రవేశము సేయునపుడు రాజమార్గమున వారలపై వేలకొలఁది జను లెప్పుడు లాజలు చల్లుదురు, మేలికుండలములు చెవులం దులకింప, విల్లును కత్తియును నిలువునం దాల్చినవారై, శిఖరంబులు గలకొండలవలె గండు మీఱుచు, నయోధ్యను బ్రవేశించుచుండఁగా నే నెప్పుడు చూడఁగలను.*వారు మం గళవతులగు కన్యలకును బ్రాహ్మణులకును వరుసగా పుష్పములను ధనములను నొసఁ గుచు ముదంబునొంద నీపురమున కెప్పుడు ప్రదక్షిణము సేయుదురు? రాముఁడు,జ్ఞాన మునందు వృద్ధుఁడు; వయస్సున దేవతలవలె నిరువదియేడేండ్లవానివలె వెలుఁగువాఁ డు; అట్టిధార్మికుండు నగురాముఁడు మూఁడేండ్ల పిల్లవానివలె నాకు బుజ్జనముపుట్ట నాయొద్ది కెప్పుడు వచ్చును? వీరోత్తమా! నేనుపూర్వజన్మమున కట్టిఁడినై, బిడ్డలు పాలు ద్రావఁగోరుచుండఁగా తల్లుల స్తనములను గోసివైచియుందును. ఇందు సందియము లేదు. పురుషసింహమా! లేఁతదూడ గలయావువలె, బిడ్డయందు మిక్కిలిప్రేమ గలనన్నును, సింహము దూడను జంపి ఆవును దూడ లేనిదానినిగాఁ జేసినట్లు, కైకేయి బిడ్డ లేనిదానినిగాఁ జేసినది. నేను కానక కానక యొక్క కొడుకునుగంటిని. వాఁడు లోకమునందెన్ని కల్యాణములుగలవో యన్నియునుగలవాఁడు; మఱి సకలశాస్త్రము లందును బండితుఁడు. అట్టియొక్క కొడుకును దిగనాడి నేను బ్రతుకనొల్లను. నిడుద బుజములు గలిగి మంచిబలవంతుఁడై యున్నయట్టిగా రాముకొడుకును కన్నారఁజూచు చుండనేని నాకిందు జీవించుటకు దైవముకూడ కొంచెమైనను శక్తిగలిగింపఁజాలదు సుమా. వేసవికాలమున వేండ్రముగా వెలుఁగుచుండుభగవంతుఁ డగుసూర్యుఁడు కిర ణములచే భూమిని దపింపఁజేయునట్లు పుత్రదుఃఖమునఁ బుట్టినయీపరితాపాగ్ని వయింబయి ప్రజ్వరిల్లి నన్ను తపింపఁజేయుచున్నది' అని విలపించెను. ఇది నలువది మూఁడవసర్గము.

---

## సుమిత్ర కౌసల్య నూఱడించుట.

అట్లు విలపించుచున్న కాంతారత్నమును కౌసల్యం జూచి †సుమిత్ర ధార్మికు రాలు గనుక ధర్మయుక్తముగా 'ఆర్యా! నీపుత్రుఁడు సకలసద్గుణములు గలవాఁడు.

---

*ఇందులకు 'కదా సుమనసః కన్యాద్విజాతీనాం ఫలానిచ।ప్రదిశన్తఃపురీం హృష్టాః కరిష్యన్తి ప్రదక్షిణమ్' అని మూలము. ఇది మహేశ్వరతీర్థపాఠము. గోవిందరాజపాఠమున 'ప్రదిశన్త్యః' అని యున్నది గావున అప్పుడు 'కన్యాద్విజాతీనాం' అనుటకు 'ద్విజాతీనాంకన్యాః' అని అన్వయము చేసి కన్యలను కర్తగాగ్రహింపవలయును. 'బ్రాహ్మణకన్యలు పుష్పములను ఫలములను ఒసంగుచు ము దంబున పట్టణంబున కెపుడు ప్రదక్షిణము సేయుదురు' అని యర్థము. ఇది ఉత్తరదేశీయుల మంగళా చారమని వ్యాఖ్యాత యభిప్రాయము.

†ఇందులకు మూలము'ఇదం ధర్మే స్థితా ధర్మ్యం సుమిత్రావాక్యమబ్రవీత్'-తారవలెనుమండో దరివలెను సుమిత్రకును పరతత్త్వజ్ఞానము గలదని సంప్రదాయము గనుక నిచట సుమిత్రమూలముగా శ్రీరా

పురుషులందఱిలోను త్తముఁడు. కనుక నిట్లు పలవించుటవలన పనయేమి? ఇట్లు దీనముగా నేడ్చినప్పటికిని ప్రయోజనమేమి? పూజ్యురాలా! మహాబలుం డగు నీకుమారుఁడు

---

మునిపరత్వమును వెల్లడిసేయుచున్నాఁడు. (ధర్మేస్థితా) ధర్మమందు నెలకొన్నది, ఇట ధర్మమనఁగా సిద్ధధర్మరూపుఁ డగురాముఁడు గనుక రామునియందు లగ్నమైన మనస్సుగలదియనుట. లేక (ధర్మే) జన్మాంతరసుకృతమందు నెలకొన్నది- అట్టిసుకృతవశమున ననుట, (ధర్మ్యం) విశిష్టధర్మమును వీడని దానిని-రాముని పరత్వమును, (అబ్రవీత్) చెప్పిననుట;(తవార్యే సద్గుణైర్యుక్తః పుత్రస్స పురుషోత్తమః)-(తవపుత్రః)-నీకొడుకు (సః) ప్రసిద్ధుఁడైన-వేదాంతమునందు ప్రసిద్ధుఁడయిన, (పురుషోత్తమః) నారాయణుఁడు-ఎట్లనఁగా (సద్గుణైర్యుక్తః) అనితరసాధారణములై, అనవధికాతిశయములై, అసంఖ్యేయములై యొప్పుకల్యాణగుణములతోఁ గూడినవాఁడు-కనుక శ్రీమన్నారాయణుఁడేయనుట. ఇట, 'పురుషోత్తమః' అనుటకు, పుత్రుఁడనుబుద్ధిచే పురుషశ్రేష్ఠుఁడని యర్థము సిద్ధించుననితలఁచి, యట్లుకానను టకై 'సః' అనువిశేషణము గూర్పఁబడినది. (సః) వేదాంతమునందు ప్రతిపాద్యుఁడైనయా పురుషోత్తముఁడే కాని కేవలమైనపురుషోత్తముఁడుగాఁడు కావున పుత్రుఁడనుబుద్ధితో వానినిగూర్చి శోకింపవలదనుట. 'పురుషోత్తముఁడగు నేని కర్మప్రవణుఁడు గానేల' యనఁగా చెప్పుచున్నాఁడు 'శిష్టైరాచరితే సమ్యక్ఛశ్వత్ప్రేత్యఫలోదయే। రామోధర్మే స్థితః శ్రేష్ఠో నసశోచ్యః కదాచన' (శిష్టైః) శిష్టులచేత, (ఆచరితే) ఆచరింపఁబడునట్టియు, (ప్రేత్యఫలోదయే) పరలోకమందు ఫలమునకు కారణమైనదియునగు, (ధర్మే) ధర్మమందు, (స్థితః) నెలకొన్నవాఁడు, (శిష్టైరాచరితే) అనుటచే శిష్టులాచరించునదెల్ల లోకానుగ్రహార్థము గనుక పురుషోత్తముఁడయ్యును లోకానుగ్రహముకొఱకు శిష్టాచారములగు కర్మములందు ప్రవణుఁడైనాఁడని భావము. (ప్రేత్యఫలోదయే) అనుటచే దశరథునికి పరలోకహితమును గూర్చుటకుఁ బూనినాఁ డనియు సిద్ధము లోకానుగ్రహార్థమగుటను తెలుపుచున్నాఁడు. (శ్రేష్ఠః) 'యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరోజనః' అను గీతావచనమునుబట్టి శ్రేష్ఠులాచరించుటయెల్ల తక్కినవారి ననుగ్రహించుటకొఱకే. తన యాచారమును జూచి యితరులును అవలంబించి యుజ్జీవింపవలయుననుబుద్ధిచే కర్మప్రవణుఁడైనాఁడనిభావము. మఱియు 'కామవృత్తస్త్వయంలోకః కృత్స్నస్సముపవర్తతే। యద్వృత్తాస్సన్తిరాజాన స్తద్వృత్తాస్సన్తిహిప్రజాః' 'ఈలోకమంతయు తన యిచ్ఛచొప్పున వర్తించుచున్నది. రాజు లెట్లు, నడచుకొందురో ప్రజలు నట్లె నడతురు' అని మీఁదఁ జెప్పినట్లు, రాజుగా నవతరించి ప్రజలు తన్నుఁజూచి యాచారములు తెలియుటకై ఆచారప్రవణుఁడైనాఁడనిభావము 'తన శేషత్వస్వరూపమునకు అనుగుణమైన కైంకర్యమును గట్టిగాఁ గైకొని లక్ష్మణుఁడు పోయినాఁడు. కావున వానిని గూర్చియు దుఃఖింపరా'దనుచున్నది 'వర్తతేచోత్తమాంవృత్తిం లక్ష్మణోస్మిన్సదానఘః। దయావాన్సర్వభూతేషు లాభస్తస్యమహాత్మనః (అనఘః) పాపములేనివాఁడు - ప్రమాదములేనివాఁ డనుట, (సర్వభూతేషుదయావాన్) సకలప్రాణులందు దయగలవాఁడు - అన్నియాత్మలును జ్ఞానైకాకారము లని తెలియుటచే అన్నిటియందును సమబుద్ధిగలవాఁడు గావున మైత్రిగలవాఁ డనుట ఇట్టి లక్ష్మణుఁడు, (ఉత్తమాం) నిరతిశయపురుషార్థరూప మగుటచే ఉత్తమమైనట్టి, (వృత్తిం) కైంకర్యవృత్తి-కైంకర్యకార్యమననుట, (సదావర్తతే) ఎప్పుడు ననుష్ఠించుచున్నాఁడు. (తస్యమహాత్మనః) ఆమహానుభావునికి, (లాభః) కైంకర్యమే పురుషార్థము. ఈశ్లోకమున 'వర్తతే' అనుశబ్దము నందలి, 'వ' అను నక్షరము గాయత్రియందు ఐదవయక్షరము కావున గ్రన్థసంఖ్య నాలుగువేలు ముగిసి ఐదవగ్రంథసహస్రము ఆరంభించెనని తెలియునది.

రాముఁడు శిష్టులెల్లప్పుడు శ్రద్ధతో నాచరించుచుండునదియు పరలోకమున మహాఫలము గలిగించునదియు నగుధర్మమును బూని మహాత్ముఁ డగుతండ్రిని అసత్యదోషము కలుగకుండునట్లు సత్యసంధునిఁగాఁ జేయువాఁడై, రాజ్యమును విడిచి యడవికిఁ బోయినాఁడుగాని మఱేమి గాదు, రాముఁ డట్టిధర్మమునుబట్టి యట్టిసత్కార్యము చేయుటకై పోయియుండఁగా నట్టివానినిగుఱించి దుఃఖింపరాదు. రామునిఁగూర్చియే కాదు. పాపదూరుఁడును సకలప్రాణులయందును దయ గలవాఁడు నగులక్ష్మణుఁడు ఆరామునకు మిక్కిలియు శుశ్రూష సలుపుచున్నాఁడు. ఇది మహాత్ముఁడైన యాలక్ష్మణునికి గొప్పలాభము. కనుక వానినిగూర్చియు దుఃఖింపఁబనిలేదు. *సీతయు సుఖము లనుభవించుటకే తగినది. ఆబిడకు అరణ్యావాసమువలని దుఃఖములు తెలిసియు పతివ్రత గావున స్త్రీలకు పతియే దైవమని తలఁచి, యతని కడవిం గలుగుదుఃఖములను బోఁగొట్టుటకునుఁ బూని, ధార్మికుఁ డగునీకుమారుని వెంట నడవికిఁబోవుచున్నది. ధర్మముచొప్పునఁ బోయినసీతనుగూర్చియు దుఃఖింపరాదు. †ధ్వజమును ద్రిప్పినట్లు కీర్తిని ప్రపంచమునందెల్ల బర్వఁజేసినప్రభుఁడు రాముఁడు గనుక సకలభూతములకు నతనిపొగడ్త తెలియును. అతఁడు జితేంద్రియుఁడు; ఆశ్రితుల పరిత్యజింప నెడిసత్యవ్రతమే యతనికిధనము. ఇట్టిప్రభుఁ డగునీపుత్త్రునికి నేమేలు గలుగదు? సకలశ్రేయములును అతనికిఁ దగునుగాన నతనిఁగూర్చి దుఃఖింపరాదు. రాముని త్రికరణశుద్ధియు, సాటిలేనిమహాత్త్వమును స్పష్టముగా నెఱిఁగి, ‡సూర్యుఁ డాతనిమేనిని తనవాఁడికిరణములచే నెంతమాత్రము(a)తపింపఁజేయఁడు. (b)వాయువు సమస్తకాలములందును అప్పటప్పటికిఁ దగినట్లు చలువయు వేఁడియుఁ గూర్చుచు మిక్కిలియురవడి లేక మందముగా నుండుటచే మంగళకరమై, యడవులనుండి తావులఁ గొల్లగొనుచు

---

* ఇందు వానిసహధర్మచారిణి యగు దానిని గూర్చియు దుఃఖింపరా దనుచున్నది, వానితోడి ధర్మమాచరించుచుఁ బోయినందులకు దుఃఖపడరా దనిభావము.

† ఇందు వేదాంతప్రతిపాద్యములైనవానిలక్షణములను జెప్పఁ బూని 'తస్యనామ మహద్యశః' అనుశ్రుత్యర్థమును బ్రతిపాదించినది.

‡ ఇది మొదలుగా, దేవతలందఱును వానియాజ్ఞ నేయువారే కావున వాని కనుకూలురుగా నుందురని తెలుపుచున్నది.

(a) ఇందు 'భీషోదేతిసూర్యః' అను శ్రుత్యర్థము వ్యంజితము. (మాహాత్మ్యముత్తమం) ఉత్తమమైన మాహాత్మ్యమనఁగా తనకు సమానముగాని ఎక్కువైనదిగాని లేకున్నట్టి మాహాత్మ్యమనుట. (b) ఇందు 'భీషాస్మాద్వాతః' అను శ్రుతివ్యంజితము. ఇందులకు 'శివస్సర్వేషు కాలేషు కాననేభ్యో వినిస్సృతః' అని మూలము. (శివః) అనుటచే వేండ్రము గాక మందముగానుండుటయు, (కాననేభ్యః)

వచ్చి చల్లగా రామునికి వీచుచుండఁగలదు.(*c*)చంద్రుఁడును ఆపాపదూరుని రాత్రుల యందుఁ దండ్రి కౌఁగిలించుకొనునట్లు, చల్లనికిరణంబుల నంటుచు నతనికింపు గూర్పఁ గలఁడు.(*d*)రాముఁడు మునుపు శంబరాసురునికొడుకును జంపఁగాఁజూచి బ్రహ్మప్రీతుండై యతనికి దివ్యాస్త్రములొసఁగెనుగదా? కనుక నారాముఁడు మిక్కిలిశూరుఁడు; పురుషశ్రేష్ఠుఁడు. అతనికి రక్షణమునకై యొకరి నాశ్రయింపవలసినదిలేదు. అతనిబాహుబలమే యతనికిచాలును.అదియే అతని కాశ్రయము.అట్టిరాముఁడు అడవిలోనుండినను భయపడక యింట నుండునట్లే సుఖముగా నుండును. రామున కడవియందు సుఖము కలుగునుగాక. 'ఇచ్చట భరతుఁడు వేరూనినయెడల రామునకు రాజ్యము దక్కునా?' యందువేని, రాముని బాణములకు గురియైరేని యెట్టిపగవారును నశింతురు. అట్టిమహావీరుం డగురాముని యాజ్ఞాపరిపాలనమునకు భూమి యెట్లు లోకువ గాకుండఁ జెల్లును? అవశ్య మిది యతనికి లోఁబడును జుమీ! సర్వలక్షణసంపన్నమైన రాముని దేహకాంతిని శూరత్వమును ప్రశస్తమైనబలమును జూడఁగా నతఁ డరణ్యవాసము తీర్చుకొని శీఘ్రముగానే రాజ్యముఁబొందునని నాకుఁ దోఁచుచున్నది. దేవీ! రాముఁడు † సూర్యునకు సూర్యుఁడు,అగ్నికి అగ్ని, ప్రభువునకు ప్రభువు,సంపత్తికి

---

అనుటచే సౌరభ్యమును,(వినిస్సృతః)అనుటచే శైత్యమును వాయువునకు చెప్పంబడియె. (*c*) ఇందు 'ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గిసూర్యాచన్ద్రమసౌ విధృతౌ తిష్ఠతః' అనుశ్రుత్యర్థ మూహ్యము. (*d*) ఇందు బ్రహ్మచేయు కించిత్కారము చెప్పఁబడియె. 'వైజయంతమితిఖ్యాతం పురం యత్ర తిమిధ్వజః' అని, వైజయంతమను పురమున శంబరుఁడను రాక్షసుఁడు గలఁడనియు వానితో దశరథుఁడు యుద్ధమునకుఁబోయెననియు నీకాండమునఁ జెప్పఁబడియున్నది. ఇప్పుడు ఆరాక్షసుని రాముఁడు చంపెనని చెప్పఁబడియున్నది. కాని, ఈవిషయము పూర్వము చెప్పఁబడలేదు. కనుక ముందేల చెప్పలేదనఁగా 'యదావ్రజతి సంగ్రామం గ్రామార్థే నగరస్యవా। గత్వా సౌమిత్రిసహితో నావిజిత్య నివర్తతే' 'గ్రామస్థులకొఱకుఁ గాని నగరజనులకొఱకుఁ గాని యుద్ధము కలిగినప్పుడు లక్ష్మణునితోఁ గూడఁ బోయి జయింపక మరలి రాఁడు' అని యీకాండమున నే సామాన్యముగా చెప్పఁబడి యున్నది. అందీవిషయమును అంతర్భూతము. ఇచట ప్రసక్తిఁబట్టి యిది విశేషించి చెప్పఁబడియునని తెలియునది.

† ఇందులకు 'సూర్యస్యాపి భవేత్సూర్యో హ్యగ్నే రగ్నిః ప్రభోః ప్రభుః। శ్రియశ్శ్రీశ్చభవేదగ్ర్యాకీర్త్యాః కీర్త్యాః క్షమా క్షమా' అని మూలము. ఇట 'తమేవభాన్తమనుభాతిసర్వమ్' అనుశ్రుతియర్థము ఉపబృంహితమైనది- (సూర్యస్య) సకలలోకములను ప్రకాశింపఁజేయు సూర్యునికిఁగూడ, (సూర్యః) ప్రకాశింపఁజేయువాఁడు సూర్యమండలమునడుమ వర్తించుచు అద్దములోని దీపమువలె వానిని ప్రకాశించునట్లు చేయుచున్నాఁడనుట, (అగ్నే రగ్నిః) అగ్నికిఅగ్ని-అన్నివస్తువులను పచనము సేయుట దహించుట మొదలైనయగ్నికార్యములు వానిసంకల్పమునకులోనైనవనుట.'అహంవైశ్వానరోభూత్వా' అనిగీత. (ప్రభోఃప్రభుః) ప్రభువునకు ప్రభువు-బ్రహ్మరుద్రాదులకు సృష్టి మొదలగునవి సేయుసామర్థ్యములనొసంగి తానే నిర్వహించువాఁ డనుట. (శ్రియఃశ్రీః) శ్రీకి శ్రీ-బ్రహ్మాదులకుఁ గల ఈశ్వరత్వము ఎవ్వతికటాక్షలేశమునకు లోనైయున్నదో, నారాయణునిపరబ్రహ్మత్వము ఎవ్వతి కడగంటిచూపు మిక్కిలి కలుగక సిద్ధింపదో యట్టిశ్రీదేవికిని వాని నాశ్రయించుటవలననే శ్రీత్వము సిద్ధించుచున్నది. వాని యీశ్వరత్వము పూర్ణముగా నిష్పన్నమగుటకు నిమిత్తమైన లక్ష్మికిఁగూడ స్వరూపము వానివలననే నిర్వహింపఁబడుచున్నదనుట. (కీర్త్యాఃకీర్తిః) కీర్తికిఁగూడ కీర్తి గలిగించువాఁడు, (క్షమాక్షమా) సర్వమున

సంపత్తి, కాంతికినికాంతి, కీర్తికిని ప్రశస్తమైనకీర్తి, ఓర్పునకుఓర్పు, దేవతలకును దేవత, భూతములకును మొదటిభూతము. అట్టిమహాప్రభుండును సర్వోత్కృష్టుండు నగు రామునకు దేశమందుఁ గాని పట్టణమందుఁగాని ప్రతిబంధకము లేవి కలుగఁగూడును? ఈపట్టణమును విడిచి యెవ్వఁడు వనమునకుఁ బోవుచుండఁగాఁజూచి యిందలిజనులు దుఃఖాతిశయమునఁ దల్లడిల్లి తాళఁజాలక బాష్పములు విడుచుచున్నారో అట్టిపురుషలలాముం డగురాముఁడు శీఘ్రముగానే, సీతతోను భూదేవితోను రాజ్యలక్ష్మితోను, ఈముగ్వురితోనుం గూడి యభిషేకము నొందఁగలఁడు. రామునకు అపజయమే తెలియదు. అట్టివీరుఁడు దర్భాసనమును నారచీరలును దాల్చి యడవికిఁ బోవుచుండఁగా *సీతవలెనే రాజ్యలక్ష్మియు వెంబడించి పోయినది. అట్టిరామునకు దుర్లభ మేది గలదు? మేటివిలుకాఁ డగులక్ష్మణుఁడు బాణములను ఖడ్గములను తక్కినయాయుధములను దాల్చి రామునిముందట తానే పోవుచున్నాఁడు సుమీ! అట్టిరామునకు దుర్లభ మేది? దేవీ! రాముఁడు యథావిధి వనవాసము తీర్చి మరలరాఁగా నీవుచూడఁగలవు. ఈయజ్ఞానమును దుఃఖమును వలదు. నీకు నేను సత్యమునే చెప్పుచున్నానుగాని వేఱుగాదు. కల్యాణీ! ఎవ్వరిచేతను నింద లేక పొగడ్త నొందుదానవు. రాముఁడు వనముననుండి మరలివచ్చి సర్వలక్షణసంపన్నములైననీయీపాదములకు శిరము సోఁక వందనము గావించునప్పు డుదయించినచందురునివలెఁ గనఁబడునట్టి యతనిం జూడఁగలవు. మరల నీపురమునకు వచ్చి యభిషిక్తుఁడై మిక్కుటమైనకాంతితో వెలుఁగుచున్నరామునిఁ జూచి నీవు శీఘ్రముగానే యానందబాష్పములను విడువఁగలవు. దేవీ! రామున కశుభ మేమియైన కలుగునని నాకు తోఁపలేదు. కావున నీ విట్లు పలవించుటగాని మనస్సున కంది కుందుటగాని వలదు. రాముఁడు సీతతోడను లక్ష్మణునితోడను గూడి రాఁగా శీఘ్రముగానే చూడఁగలవు. నీవు పాపరహితురాలవు గదా! నీవు, నిన్నే కాక తక్కినవారినిగూడ నూఱడింపవలసినకాల మిది. ఇట్టిసమయమున నీవే యిట్లు మనస్సు కలఁగి వగచుచున్నా వేమి? దేవీ! మహాత్ముఁ

---

కాధారమైన భూమికి నాధారమైనవాఁడు. ఇందులకు 'యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్షమ్' అనిశ్రుతి. (దైవతానాంచదైవతమ్) దైవతములకు దైవతమైనవాఁడు. 'తం దేవతానాం పరమంచ దైవతమ్' అనియిట శ్రుతి. (భూతానాం భూతనత్తమః) భూతమనఁగా ఉనికిగలది. ఉనికి గలవానికెల్ల వానియునికిని నిర్వహించు వాఁడనుట. ఇట్లు కల్యాణగుణాకరత్వము చెప్పి యిఁక హేయగుణవిరోధిత్వము సూచించుచున్నాఁడు. (తస్యకేప్యగుణాః) వానికి అగుణము లేవియు లేవనుట, (రాష్ట్రేవాప్యథవాపురే) రాష్ట్రమందుఁగాని పట్టణమందుఁగాని-అనఁగా ఉభయవిభూతులందును వాఁడు అజహాత్స్వరూపుఁడనుట-అనఁగా తనస్వరూపమును విడువకుండువాఁ డనుట - దీనిచే వ్యంజితము. 'హి' యనుట ప్రసిద్ధిని దెలుపుచున్నది. వానిదోషవిరోధిత్వము 'అపహతపాప్మా' ఇత్యాదిశ్రుతులందు ప్రసిద్ధమనుట.

* ఇందులకు 'సీతే వానుగతాలక్ష్మీః' అని మూలము. రాజ్యలక్ష్మియు సీతవలె రామునివెంటనే పోయినదనుట. రాజ్యలక్ష్మి మఱియొక్కనిని పరిగ్రహింపదనుటయు సూచితమగుచున్నది. 'సీతారూపముగా రాజ్యలక్ష్మి వెంబడించినది' అని మహేశ్వరతీర్థులు. ఇదియు సరసముగానే యున్నది.

డగురాముని కొడుకుగాఁ గన్నట్టినినుఁబోఁటికి దుఃఖము తగదు. లోకమున రాముని కన్న మిన్న యగుసన్మార్గవర్తనుఁ డెవ్వఁడులేఁడుగదా. రాముఁడు తనచెలికాండ్రతో వచ్చి నీకు వందనము సేయుచుండఁగాఁ జూచి నీవు వర్షాకాలమున మేఘపంక్తి జలము గురియునట్లు త్వరలోనే యానందబాష్పములు విడువఁగలవు. కోరినకోర్కులెల్ల నిచ్చునీకుమారుఁడు రాముఁడు మరల నయోధ్యకు వచ్చి, మృదువులై బలువు పొలుపారుచున్న తనహస్తములచే నీపాదములను బిసుకఁగలఁడు. శూరుం డగురాముఁడు తనస్నేహితులఁగూడి నీకడకు వచ్చి తన ప్రవరఁజెప్పుచు నీకు మ్రొక్కుచుండఁగా నీవు మేఘసమూహము పర్వతమును దడుపునట్లు ఆనందబాష్పములచే నా కొడుకుం దడుపఁగలవు' అనియె. ఏకందును లేనిసుమిత్రాదేవి, మాటలచే నుపచారము సేయుటకు నిపుణురాలు గనుక, ఆరామునితల్లిని పలువిధములైనవచనములచేత నూఱడించుచు నిట్లు చెప్పి యంత నూరకుండెను. ఆలక్ష్మణునితల్లి చెప్పిన మాటలను విన్నంతనే శరత్కాలమునందు కొంచెముజలవేగము గలమేఘము వేగ నశించునట్లు రామునితల్లి యగునారాజపత్నికి దేహమునం బుట్టినదుఃఖ మంతయు తోడనే నశించినదయ్యె. ఇది నలువదినాలుగవసర్గము.



## రాముఁడు వెంబడించి వచ్చుచున్న ప్రజలకు నూఱటచెప్పుట.

రాముఁడు బీఱువ్రోనిపరాక్రమము గలవాఁడు; మఱియు మహాత్ముఁడు; కావున జనులందఱు నతనియందు మిక్కిలియనురాగము గలిగియుండుటంజేసి వారు వనవాసమునకై పోవుచున్న యారామునిని వెంబడించిరి. రామునిస్నేహితులును రాజాంతఃపురవర్గమును రాజును బలాత్కారమున మరల్పఁబడిరి. కాని, రామునిరథము వెంటఁ బడినజనులుమాత్ర మతనిని విడిచి మరలినవారు గారు. ఆరాముఁడు మహాకీర్తిమంతుఁడును సుగుణసంపన్నుఁడును గావున అయోధ్యయందు వసించుపురుషులకెల్ల పూర్ణచంద్రునివలె ప్రియుండై యుండెను. రామునిప్రజ లప్పు డతనిని పోవలదని యెంత బతిమాలుచున్నను అతండు తండ్రిని సత్యసంధునిగాఁ జేయువాఁడై వారలమాట వినక యడవికే పోయెను. రాముఁడు మిక్కిలి నెయ్యంబు దొలఁక కన్నులార పానముసేయునట్లు, ఆప్రజలను తనబిడ్డలవలెఁ జూచుచు స్నేహంబున 'అయోధ్యావాసులకు నాయందు ఏమిప్రీతియును గౌరవబుద్ధియుఁ గలవో వానినెల్ల నాయందలిప్రీతినిబట్టి భరతునియందు విశేషించి యుంపవలయును. కైకేయికి కన్నులు చల్ల సేయునాభరతుఁడు మంచినడవడి గలవాఁడు; కనుక ప్రియములను హితములను, జేయవలసిన రీతిని మీకుఁ జేయఁగలఁడు. వాఁడు వయస్సునఁ జిన్నవాఁడయ్యు జ్ఞానమున వృద్ధుఁడు, మృదువైనవాఁడు, పరాక్రమగుణసంపన్నుఁడు.కనుక వాఁడు మీభయములను బోఁగొట్టి మీకుఁ దగునట్టిభర్త కాఁగలఁడు, మఱియు రాజులకుం దగినగుణములు గలవాఁడు. రాజుచే యువరాజుగాని

యమింపఁబడినవాఁడు. మఱి మీకును నాకును తక్కిన లక్ష్మణశత్రుఘ్నాదులకును రాజునాజ్ఞ చొప్పున నడచుకొనవలయును గనుక మనము భరతుని రాజుగా నంగీకరింపవలయును. నేను వనమున వసించియుండఁగా మీరందఱును నాకుఁ బ్రియము సేయఁ గోరి యీమహారాజును సంతాపపడకుండునట్లు చూచుకొనవలయు' ననెను, రాముఁడు పితృవచనపాలనధర్మమునందే స్థిరముగా నిలిచి యయోధ్యకు మరల నని చెప్పకొలఁదిని, ఆ ప్రజలును 'నిన్నే రాజు మొదట మాకు యువరాజుగాఁ జేసినాఁడు. కాఁబట్టి యప్పటిరాజుమాటను నీవును మేమును జేయవలయు' నని, యంతంతకు రాముఁడే రాజు కావలయునని మఱిమఱి కోరసాఁగిరి. పురజనులు కన్నీళ్లు మొగంబునఁ గ్రమ్మ దీనులై, యీరామలక్ష్మణు లెంత చెప్పినను, వినక వెంటఁబోవుటచూడఁగా, ఆయిరువురు తమ గుణము లనెడిపాశములచేత వారిం గట్టి యీడ్చుకొనిపోవునట్లు చూపట్టెను. జ్ఞానమునను వయస్సునను బ్రహ్మవర్చస్సునను (తపోబలమును) ఇట్లు మూఁడువిధములను వృద్ధు లగునాబ్రాహ్మణులు, వార్ధకముచేత శిరసులు వడఁక; రామునికిదూరముననుండి, 'వేగవంతము లైయుత్తమజాతిని బుట్టి రాముని వహించి పోవుచున్నయోయశ్వములారా! మరలుఁడు, పోవలదు; మీ ప్రభుఁడగు రామునకు హితులు కండు. జంతువులలో గుఱ్ఱములకు చెవులు మిక్కిలి గలవు మేమును మాప్రార్థన తెలిపితిమి గనుక మీమిక్కిలి చెవుల కది చక్కఁగా వినవచ్చును. కాఁబట్టి మరలుఁడు; మీప్రభు వైనరాముఁడు ధార్మికుఁడుగావున పరిశుద్ధాంతరంగుఁడు; వీరుఁడు; శుభము లైనవ్రతములను దృఢముగాఁ జలుపువాఁడు. కావున మీకు పట్టణముపొంతఁ దీసికొనిపోవం దగినవాఁడే కాని పట్టణమునుండి యడవికిఁ గొనిపోవఁదగినవాఁడు కాఁ'డనిరి. ఇట్లుదుఃఖంపుమాటలను బలవించుచున్నయావృద్ధబ్రాహ్మణులను జూచి, రాముఁడు శీఘ్రముగా రథమునుండిదిగెను. అతఁడు, బ్రాహ్మణులవాక్యము వినియుఁ రథమునం బోవుటదోషమనితలఁచి నిలిచి, వారలనూఱడించుట కైమరలినచో వ్రతభంగమగునను తలంపున, సీతాలక్ష్మణులతోడ కాలినడకనే పోవుచు ఆవృద్ధబ్రాహ్మణులకు తాను సమీపమగునట్లు మెల్లమెల్లగా నడుగులిడుచుండెను. రాముఁడు దయారస మొలుకుకన్నులుగలవాఁడు; మఱియు సదాచారమునందు ప్రీతి గలవాఁడు. కనుక కాలినడకతో వచ్చుచున్నయాబ్రాహ్మణులను, దాను రథమునుండియే యూఱడించుట కాతనిమనస్సు చాలదయ్యె. ఆబ్రాహ్మణులు, రాముఁడు నిలువక పోవుచునేయుండుటఁ జూచి చిత్తంబులు తత్తఱపడ దుఃఖమున మిక్కిలియుం బొక్కుచు నతనితో ''నీవు బ్రాహ్మణులకు మంచిసేవ సేయువాఁడవు. కనుక నీబ్రాహ్మణులందఱును నిన్ను వెంబడించుచున్నారు. అరణులయందు ఆరోపితము లైనయీయగ్నిహోత్రములును వీరిమూఁపుల నెక్కి నిన్ను వెంబడించుచున్నవి చూడుము. శరత్కాలమందలి మేఘములవలె తెల్లగా నుండుమాఛత్రములును వాజపేయయాగమున మాకు ప్రాప్తించినవి. ఇవియు నీవెనుక పయనమై యిదె వచ్చుచున్నవి. నీకు గొడుగు లేదు కావున నీవెండ సోఁకి తపించునపుడు మేము వాజపే

యయాగమున వచ్చినయీమాగొడుగులనుబట్టి నీకు నీడఁగలిగించెదము. నాయనా! ఇంతవఱకు నిశ్చింతముగా నెల్లప్పుడును వేదమంత్రములందు వర్తించుచుండినమా బుద్ధి, యిప్పుడు నిన్నుఁబట్టి, వనవాసము వెంటనిగిడియున్నది, 'మాధన మగు వేదములను సహధర్మిణులను విడిచిరాఁదగునా' యందువేని, మాకు గొప్పధనములైన వేదములు మాహృదయములలోనే యున్నవి. మాభార్యలను వారిపాతివ్రత్యమే రక్షించును; మేము రక్షింప నక్కఱలేదు. కనుక వారలు గృహములందే యుందురు. 'నాప్రార్థనను బట్టి మరలుఁ'డందువా, నిన్ను మరల్చి, తోడ్కొనిపోవుటకై మేము మనస్సున గట్టిగా నిశ్చయము చేసికొనియున్నాము. నీవు వనమునకుఁ బోవలయునని మరల పట్టు పట్టుట దగదు. నీవుతండ్రిమాట పరిపాలించుటయే ధర్మమనియెంచి, దానిచొప్పున నడవికిఁబోయితివేని ఇంక మా కిచట ధర్మమును బాలించుటకు, నిమిత్తమేముండు ను? ఏమియుండదుగాన మాకు ధర్మమే విడువవలసివచ్చునే! బ్రాహ్మణులప్రార్థనము సేయుటధర్మము. ఆధర్మము ధర్మపరాయణుఁడగునీవె యపేక్షింపవేని, యిఁక గోరుట కింతకంటెను అధికధర్మమేమిగలదు? ఏదియులేదు. నీవు నిశ్చలమైనధర్మాను ష్ఠానము గలవాఁడవు. మేము హంసవలె తెల్లనైనవరలు గలిగిన మాశిరములు నేల సోఁకి ధూళి బ్రుంగునట్లు పడిమ్రొక్కి, బతిమాలుచున్నాము. అప్పటికైనను మర లుమీ. నీవెంట నిచటికి వచ్చినబ్రాహ్మణు లనేకులు యజ్ఞములు చేయుటకై సంభా రములు గూర్చికొనియున్నారు. నీవు మరలిననే యాయజ్ఞములు సమాప్తిఁబొందు ను. మరలవేని, వానికి విఘ్నము చేసినవాఁడనగుదువు.. రామా! మేముమాత్రము కాదు. జంగమములైనతిర్యగ్జంతువులును స్థావరము లగువృక్షాదులును నీయందు భక్తిగలిగియున్నవిగాన నీరాకను వేఁడుచున్నది. అట్లు యాచించుచున్నయాభక్తుల యెడ స్నేహమును జూచి వారిస్నేహమును సఫలము గావింపుము. వృక్షములు నీవు వనమునకుఁ బోవుచుండుటంజూచి తాము నను వెంబడింపఁబూనినవి. కాని, వానిపాదము లైనమూలములు కదలనందున, అవి తమవేగము మిక్కిలి కొట్టువడఁగా, వాయు వేగమున మఱింతపొడవుగా లేచినకొమ్మలతోఁ గూడి మ్రోయుచుండుటను జూడఁ గా, పొడవుగా చేతు లెత్తికొని నిన్ను వెంబడించుభాగ్యము లే దని యాక్రోశించు చున్నవో యన్నట్లు చూపట్టుచున్నవి. పక్షులుకూడ చేష్ట లుడిగి మొరలు మాని సంచారమువదలి చెట్లయందొకానొకచోట నుండి సకలప్రాణులకును దయాళుండ వగునిన్ను మరలుమని మిక్కిలి యాచించుచున్నవి' అనిరి. ఇట్లు రాముని మరలించు టకై యాక్రోశించుచున్నయాబ్రాహ్మణులనుజూచి, తానును రామునిఁ బోవనీక వారిం చుదానివలె, తమసానది రాముని కడ్డముగాఁ బొడసూపినది. అంత సుమంత్రుఁడును బడలినగుఱ్ఱములను రథమునుండి విప్పి యలపు దీఱుకొఱకు వేగ నేలం బొరలించి, నీళ్లు త్రాగించి, నీటఁ జక్కఁగా వాని దేహములు కడిగి, యాతమసానదిదాపున మే యుటకై త్రిప్పెను. ఇది నలువదియైదవసర్గము.

రాముఁడు తమసానదీతీరమున రాత్రి విశ్రమించుట. వెంటవచ్చిన పౌరుల నేమఱించిపోవుట.

అంత రాముఁడు రమణీయమగు తమసాతీరముఁ జేరి*సీతం జూచుచు లక్ష్మణునితో 'లక్ష్మణా! మనవనవాసకాలమునందు మొదటిరాత్రి యిదె, యడవియందు మనకు రానున్నది. ఇందులకై నీవు గృహాదులను దలఁచుకొనికాని సీత సుకుమారియనికాని మనస్సున తత్తఱపడరాదు. ఇదిగో యడవులనుజూడుము! రాత్రిరాఁగా నిందు మృగములును పక్షులును నలుగడలనుండి వచ్చుచు తమతమనెలవులయందు మఱుఁగుపడి యంతట నిండియున్నవి. ఇట్లవినెలవులు చేరఁగా, ఈ యడవులు శూన్యములయి ప్రభ దక్కి చూపట్టుచు, ఆమృగపక్షులశబ్దములచే, రోదనము సేయుచున్నట్టున్నది చూడుము. ఇప్పుడు† నాతండ్రి రాజధానియైనయయోధ్యానగరమందలి స్త్రీలును పురుషులును అందఱును, తమ్ము విడిచి పోయినమనలఁగూర్చి, దుఃఖించుచుందురు. ఇందులకు సందేహము లేదు. పురుషతిలకా! ప్రజలందఱు, వెక్కుగుణములంబట్టి, రాజునందును నీయందును నాయందును భరతశత్రుఘ్నులయందును మిక్కిలియనురాగము గలిగియున్నారు సుమీ! నాకు, నాతండ్రినిని మంచికీర్తిగాంచిననాతల్లినిని, దలంచుకొనఁగా దుఃఖము వచ్చుచున్నది. వారు పలుమాఱును ఏడ్చియేడ్చి గన్నులు చెడి తుదకు గ్రుడ్డివారగుదురో! అయిన నొకయూఱటగలదు. భరతుఁడు ధర్మాత్ముఁడు గదా. కనుక వాఁడు ధర్మార్థకామయుక్తము లైనవాక్యములు చెప్పి నాతండ్రికిని తల్లికిని ఊఱట గలుగఁజేయును. భరతుఁడు క్రూరుఁడు గాఁడని మాటిమాటికిఁ దలంచుకొనునప్పుడెల్ల నాకు తండ్రినిగూర్చియు తల్లినిగూర్చియు దుఃఖము కలుగకున్నది. పురుషసింహమా! నీవు నావెంట వచ్చుటవలన మంచికార్యము చేసితివి. నీవు రానియెడల సీతను రక్షించుకొఱకు సహాయమును వెదకవలసియుండునుగదా. నీవుండుటచే ఆకష్టము లేదయ్యె. లక్ష్మణా! నేఁడు వనవాస ముపక్రమించినదినము. మఱి యిది పుణ్యక్షేత్రమగుతమసాతీరము; కనుక నుపవాసముండఁదగును. కాఁబట్టి యీరాత్రి నీళ్లుమాత్రమే త్రావియుండెదను. పలువిధములయినవన్యాహారములుండినను నాయనురక్తులదుఃఖమును దలంచుకొనఁగా నవి యెల్లరుచింపవయ్యె. నాకిపుడు నీళ్లే యిష్టముగా నున్నది' అనియె. రాముఁడిట్లు లక్ష్మణునకుఁ జెప్పి పిదప సుమంత్రునితో 'సౌమ్యా! గుఱ్ఱములవలన పరాకు లేకుండుము' అనియె. ఆసుమంత్రుఁడు సూర్యుఁ డస్తమింపఁగానే గుఱ్ఱములనుగట్టి, వానికి మిక్కిలి గడ్డివేసి యనంతరకార్యము తెలుపంబడి రామునిదాపుననుండెను, సుమంత్రుఁడు శివం బగు సాయంకాలసంధ్య నుపాసించి రాత్రియగుటఁ జూచి, లక్ష్మణునితోఁ గూడిన రామునికి

---

* సీతను జూచుచు లక్ష్మణునకుఁ జెప్పెననుటచే లక్ష్మణునివలెనే సీతయును మనస్సు తొట్రుపడకుండవలయునని తెలుపుటకని తెలియునది.

† ఆయడవిస్థితిని జూడఁగా రామునికి అయోధ్యయు తలంపునకు వచ్చినదని తెలియునది.

శయ్యఁ గావించెను. రాముఁడు తమసానదీతీరమున చెట్లయాకులచే రచింపఁబడినయాశయ్యం జూచి, లక్ష్మణుని సీతనుంగూడి యందు పరుండెను. అన్నయును వదినియిల్లాలును జక్కఁగా నిద్రపోవుటంజూచి, లక్ష్మణుఁడు సుమంత్రునితో రామునికిఁ గలపలుగుణములను వర్ణించి చెప్పెను. లక్ష్మణుఁడు సుమంత్రునకు తమసానది గట్టున రామునిగుణములం జెప్పుచు నారాత్రియంతయు మేలుకొనియే యుండఁగా సూర్యుఁ డుదయించెను. రాముఁడును తన వెంట వచ్చినపురజనులతోఁగూడ గోసమూహములు నెలసి యుండుతమసానదిగట్టునకు దాపున ఆరాత్రియంతయు నుండెను. మహాతేజుం డగురాముఁడు సెజ్జ విడిచి లేచి యాప్రజలం జూచి పుణ్యలక్షణుం డగు లక్ష్మణునితో 'లక్ష్మణా! మనయందలిమిక్కిలియపేక్షవలన తమతమయిండ్లయందు సైతమపేక్ష విడిచి వచ్చియీ చెట్లక్రింద నిపుడు పరుండి నిదురించినజనులం జూడుము. ఈపురజనులు మనలను మరల్చుటకై పూనియుండుపట్టుదలను జూడఁగా ప్రాణములనైనను విడుతురు గాని తమపట్టుమాత్రము విడువ రని తోఁచుచున్నది. వీరు నిదురపోవుచుండఁగానే మనము చక్కఁగా రథము నెక్కి నిర్భయమైనదారిని పోవుదము. అట్లు సేయుదుమేని యీపురవాసులు నాయందలి రక్తివలన వెంటనంటి, ఇప్పటివలె నిఁక మీఁదను నాతోడ చెట్లక్రిందఁబడి నిదురింపకుందురు. రాజకుమారులు తమవలన పురజనులకు దుఃఖము కలుగునప్పుడు దానిని తాము పోఁగొట్టవలయునుగాని తమ దుఃఖములను పురజనులకుఁగూడ గూర్పరాదుగదా!' అనియె. లక్ష్మణుఁడు సాక్షాద్ధర్మస్వరూపుఁడైనరామునింజూచి 'ప్రాజ్ఞుండవు, నీవు చెప్పినది నాకు సమ్మతమే. శీఘ్రముగా రథము నెక్కు' మనియె. అంత శ్రీమంతుఁ డగురాముఁడు సుమంత్రునిఁజూచి 'నీవు సమర్థుండవు. తేరాయితము సేయుము. నేను దాని నెక్కి యడవికిఁ బోయెదను. ఇచటనుండి శీఘ్రముగాఁ బొమ్ము' అనెను. అంత, నాసూతుఁడు త్వరితముగా రథమునకు నుత్తమములైనయాయశ్వములను బూన్చి యంజలి గీలించి రామునితో 'రథికోత్తమా! మహాబాహూ! ఇదిగో తేరు పూన్చి తెచ్చితిని. నీవు, సీతనులక్ష్మణునింగూడి యెక్కుము. నీకు శుభంబగుఁగాత' మనియె. రాముఁడు విల్లు కవచము మున్నగు పరికరముతో నా రథము నెక్కి, వేగముగాఁ బ్రవహించునదై మిక్కిలిసుడులుగలిగి యున్నతమసానదిని దాఁటెను. మహాభుజుండా శ్రీమంతుఁ డానదిని దాఁటి రథమునుండి యవ్వలిగట్టున దిగి, మంగళకరమై ముండ్లు లేనట్టి పెనుదారిం బట్టిపోయెను. రాముఁడు తన వెంటవచ్చినపురజనులను* మోసపుచ్చుటకై సుమంత్రునిం జూచి 'సారథీ! నీవొక్కరుండవు రథము నెక్కి యుత్తరపుదిక్కుగాఁబొమ్ము. అప్పుడు పురజనులు, నే నయోధ్యకే

---

* రాముఁడు దయాసిధిగా నుండియు తన్నెడఁబాయనోపక తనయందు నిరతిశయప్రీతి నుంచియున్నవారిని వంచించుట అనుచితముగదా యనఁగా నిది వంచనముగాదు. పురజనులకు తనసంగతిచే ఆనందము ఉన్నతమైనయెడల వారికి సత్త (శనికి) లేకపోవును. వారికి సాత్మ్యానుభవము చక్కఁగా నొసంగుటకై వ్రణచికిత్సవలె వనవాసముచే విశ్లేషము సంకల్పించినాఁడు కావున నిది వారికి హితమైనవ్యాపారమే కాని వంచనము కానేరదు. రామునకు అట్టిసంకల్పము లేనియెడల జనులందఱును

పోయితి ననుకొందురు. నీవు గడియసేపు అట్లు వేగముగాఁ బోయి మరలి రథమును మరల్చుకొని వేఱుమార్గమున రమ్ము. నేను అడవికిఁ బోవుట పౌరులకుఁ దెలియకుండునట్లుగా నీ విది యెచ్చరికగలిగి గావింపవలయు'ననియె. సుమంత్రుఁడును, రామునిమాటఁ జొప్పునఁ జేసి, వేఱుదారిని మరలివచ్చి రామునికి తేరు సమర్పించెను. అంత రఘుకులవర్ధను లగునారామలక్ష్మణులును సీతయు, సుమంత్రుఁడు చక్కఁగాఁ దెచ్చిన రథము నెక్కిరి. పిదప నాసారథియును తపోవనమునకుఁ బోవుమార్గమునుబట్టి గుఱ్ఱములను దోలెను. అంత నాసారథి ప్రయాణకాలమున మంగళసూచకము లగునిమిత్తములను గాంచంగోరి తేరు నుత్తరపుదిక్కుగాఁ గొంతపోనిచ్చెను. అంత మహారథుం డగునాదశరథకుమారుఁడు సారథిం గూడి రథము నెక్కి యడవికిం బోయెను.
ఇది నలువదియాఱవసర్గము.

## రాముని వెంట వచ్చినపురజను లతఁడు తమ్ము నేమఱించిపోవుటకుఁ జింతిలి యయోధ్యకు మరలిపోవుట.

తెల్లవాఱఁగానే యాపౌరులు రామునిం గానక శోకమున స్రుక్కి చేష్టలు దక్కి సొమ్మసిల్లిరి. వారు శోకమునఁ గన్నీటిం దొఁగుచు నలుగడలం జూచుచు నంతకంతకు రామునిజాడ దెలుపురథధూళి నైనను జూడనేరక మఱియుదుఃఖితు లైరి. బుద్ధిమంతుఁ డగునారాముఁడు దిగవిడిచి పోవుటంజేసి, వారు రామునియందు మిక్కిలిమనస్సు గలవారు గావున, దుఃఖమున మొగములు వాఁడి వెలవెలఁబోవ దీను లై జాలి పుట్టించుపలుకుల నొండొరులతో "ఇసీ! పాడునిద్ర! దానిచేత మనము మనస్సు లేమఱి విశాలవక్షుండును మహాభుజుండు నగురామునిఁ జూడకున్నారము. ఆ మహాబాహుఁడు తన్ను అనుసరించువారిని వ్యర్థులను సేయువాఁడు గాఁడు. అట్టివాఁ డిప్పుడు భక్తుల మైనమనల పరిత్యజించి యడవి కెట్లు పోయినాఁడు? తండ్రి, తనయౌరసపుత్రులం గాపాడునట్లు, మమ్ము నెప్పుడును గాపాడు చుండురఘూత్తముఁ డా రాముఁడు, ఇప్పుడు మమ్ము దిగనాడి మనస్సు వచ్చి యడవి కెట్లు పోయినాఁడు? మన మిచ్చటనే ప్రాయోపవేశమున ప్రాణములు విడుతము. లేక మరణదీక్షాపూర్వకముగా నుత్తరదిశం బట్టిపోవుదము. కాని, రామునిఁ బాసి యిఁక మనకు బ్రతుకేల? ఎండినకొయ్యలు పెద్దవి కావలసినవి యున్నవి. వానితో చితి పేర్చుకొని రగిల్చి మన మందఱమును అగ్ని ప్రవేశము నైనను జేయుదము. ఇంక నయోధ్యకుఁ బోయినయెడల నడుగువారి కేమని చెప్పుదుము? 'గొప్పలగు భుజములుగలిగి, యీసుమాలి, యింపారఁ బలుకుచుండురాముని నడవికిఁ దీసికొనిపోయి విడిచివచ్చితిమి'. అని చెప్పుటయు దగదే. రాముఁడు లేక మేముమాత్రము వచ్చుటంజూచి యయోధ్యయందలిజనులు స్త్రీలును బాలురునుముదుసళ్లును అందఱును దీను లై సొంపు దూలి కుందుట నిజము.

---

నిద్ర పోవుటకలుగదు. సుమంత్రునిఁ లేపెను, లక్ష్మణుని లేపెను, వారిలో నెవఁడేని యొకండైనను మేలుకొని యుండును. అట్లు లేమి చేసినది రామునిసంకల్పమే యని తెలియునది.

రాముఁ డెప్పుడును మనస్సు నిగ్రహించి యుండువాఁడు. అట్టిమహనీయునితోఁగూడ నే అయోధ్యనుండి వెడలితిమి. ఇప్పు డట్టివానిని విడిచి మే మెట్లు మరల నాపట్టణమును జొత్తుము'అని చెప్పుకొనుచు దూడలం బాసినయావులవలె చేతులు పైకెత్తి దుఃఖంబునం గంది యిట్లు పలువిధము లగుమాటలు చెప్పుచుఁ బలవించిరి.అంత వారు తేరు పోయినజాడనుబట్టి మరల కొంతసేపు పోయి పిదప మార్గము అగపడకుండుటవలన మిక్కిలివిషాదమగ్నులయిరి. మంచిమనస్సు గలయాపురజనులు రథము పోయినదారి తెలియరాకుండుటవలన 'ఇదేమి!ఇంకేమి సేయుదుము? దైవమును పగయయ్యోనే!' అని విలపించుచు మరలినవారైరి.పిదప వారందఱును మనంబులు కందికుందఁగా తాము వచ్చినదారి నేపట్టి యయోధ్యాపురమునకుఁ బోయిరి. అందలిసత్పురుషు లెల్ల దుఃఖపీడితులై యుండిరి. వా రా పట్టణమును జూచి యందు సమ్మార్జనలేపనాదులు లేకుండుటకు మనస్సు కొందల పడ 'మడుఁగున నున్న పామును గరుడుఁడెత్తికొనిపోఁగా నది చుల్కనయైనట్లే,రాముఁడు లేమిచే ఈపట్టణమును చులుకనై మిక్కిలిసొంపు లేకున్నదిగా' యని పగలఁ బొగులుచు, కన్నీళ్లు విడిచిరి. రాముఁడు లేమింజేసి యానందము దూలి యున్న యాపురము, దుఃఖమున మనసు తప్పి యున్నయా పౌరులకు, రాత్రి చంద్రుఁడు లేనియాకసమువలెను, నీళ్లు లేనిసముద్రమువలెను, చూపట్టుచుండెను. వారు దుఃఖమున స్రుక్కి, యుబ్బెల్ల దక్కి, మిక్కిలిధనసమృద్ధి గల తమగృహములను ఎట్లో కష్టమునఁ జొచ్చుచు శోకమగ్నులు గావున తమయెదుట నుండువారిని గన్నారఁ జూచుచుండియు వారు స్వజనమో యితరజనమో యెఱుఁగరైరి. ఇది నలువదియేడవసర్గము.

———

## పౌరజనదుఃఖము.

ఆపురజనులు అట్లు రాముని వెంబడించి మరలినవారై యతనిం గాననిదుఃఖమున మిక్కిలి పీడితు లగుచు కన్నీరు దొరుఁగ వగచుచు మరణంబు గోరుచు, దిటవు తప్పి ప్రాణంబు వెడలినట్లు మూర్ఛిల్లిరి. మఱియు వారు తమతమగృహంబులకుం బోయి పుత్రులను పడఁతులనుంగూడి మొగంబునఁ గన్నీళ్లు గ్రమ్ముకొన నందఱును దుఃఖించిరి. వారు స్నేహితులు మున్నగువారిని జూచినను సంతోషింపరైరి. అపూర్వపదార్థము లభించినను అభినందింపరైరి. వర్తకులు సరకులు పఱచుకొని యంగళ్లు పెట్టరైరి. అగ్నిహోత్రాదిపుణ్యకార్యములును పొలుపుఁజూపవయ్యె. గృహస్థులును వండుకొనరైరి. వారు చిరకాలముగా దొరకకుండిన రత్నాదులు మరల నగపడినను, అధికముగా నిధులు మొదల గువానిచే ధనమువచ్చినను, సంతసింపకుండిరి.తల్లి,తొలుచూలికొడుకు దగ్గఱకు వచ్చినను సంతోషము నొందదయ్యె.ఇంటింటను స్త్రీలు దుఃఖమునఁ బీడితులై యేడ్చుచు నింటికి వచ్చినపెనిమిటులను, అంకుశములచే ఏనుఁగులను బొడుచునట్లు,వాఁడిమాటలచేత నిందించిరి. ఆ స్త్రీలు వారిం జూచి "రామునిఁ గన్నా

రం జూడలేనివారికి గృహము లేల? భార్యలెందుకు? అట్టివారికి ధనముచేతఁగాని కొడుకులచేతఁగాని ప్రయోజనమేమి? వారికి సుఖము లేటికి? అరణ్యమునందు సీతాసమేతుఁడైన కాకుత్స్థునికి రామునికిఁ బరిచర్యసేయుటకై వెంటఁ బోయినలక్ష్మణుఁ డొక్కఁడే లోకమునం దెల్ల సత్పురుషుఁడు. రాముఁడు వనమునందు ఏనదులందును ఏతామరకొలఁకులందును ఏసామాన్యము లైనకొలఁకులందును దిగి యచ్చపునీట జలకమాడునో అవన్నియును బుణ్యములు చేసినవి. ఇంపులు గులుకువృక్షములగుంపులు గలయడవులును, గొప్పనీటియూటపట్టులు గలనదులును, మంచినెత్తములు గలపర్వతములును, రామునకు నింపు గూర్పఁగలవు. రాముఁడు అడవికిఁగాని కొండకుఁగాని యెచ్చటికిఁబోయినను, అవి తమయొద్దకు ప్రియాతిథివలె వచ్చినరామునిఁ బూజింప కుండనేరవు. *వృక్షములు, తమశిఖరములందు సొమ్ములవలె నెమ్మెలు గులుకుపువ్వులు గలిగి, కొమ్మలందు పూగుత్తులం దాల్చి, తుమ్మెదలు రొదలుసేయుచుఁ గ్రమ్ముకొనియుండ, రామునకుఁ జూపట్టఁగలవు. పర్వతములు రామునియందలియాదరమువలన అకాలమునందును మేలయినపువ్వులను పండ్లను నతనికిఁజూపి సొంపు గూర్పఁగలవు. పర్వతములు వలయునపుడెల్ల రామునకు తమయందు వింతలగుపలువిధములైన సెలయేళ్లను మిక్కిలియుం జూపుచు, నచ్చము లగుజలముల నొసఁగఁగలవు. పర్వతశిఖరములందలి వృక్షములు రామునకు నింపు పెంపు గూర్పఁగలవు. రాముఁడు శూరుఁడు; మఱి మహాబాహుఁడు. శూరాగ్రేసరుఁ డగుదశరథునికుమారుఁడు గదా. అట్టిరాముఁ డుండుచోట మనకు భయము గలుగదు; అవమానముగాని యెంతయు నుండదు. జాగుచేసినయెడల రాముఁడు మఱియు దూరముగాఁ బోవును. కావున నిపుడే తరలి రామునియొద్దకుఁ బోవుదము. అట్టిమహాత్ముఁ డగుప్రభువుపాదసేవయే సుఖప్రదము. అతఁడే మనకు నాథుఁడు, గతి, పరమాధారము. మేము సీతకు పరిచర్య సేసెదము. మీరు రామునకుఁ బరిచర్యలు సేయుఁడు" అనిరి. అట్లాపౌరస్త్రీలు దుఃఖార్తలై భర్తలకు నెయ్యపుమాటలు చెప్పి మరల వారితో "అడవియందు రాముఁడు మీయోగక్షేమము లొడఁగూర్చును. రాముఁడు లేమిచే సజ్జనులకు వాసయోగ్యము గాక, యప్రశస్తమై, దుఃఖమున రామునిఁ దలఁచుకొని తహతహపడుచున్నజనులతోఁగూడి, సొంపుదూలి, మనస్సును వెంపఱఁ జేయు నీయయోధ్యయందు వసించుటకెవనికిఁ బ్రీతి యుండును? ఈరాజ్యము, అధర్మమునం జేసి యనాథయుంబోలెఁ గైకేయిదగునేని, మాకు జీవితముతోనే పని లేదు. ఇంకఁ గొడుకు లేల? మఱి ధనములెందుకు? ఐశ్వర్యముకొఱకు కొడుకును పెనిమిటినిగూడ పరిత్యజించిన కులపాంసని యగు కైక మఱియెవ్వని పరిత్యజింపకుండును? కైకరాజ్యమందు, ఆయమ బ్రతికియుండఁగా

* వృక్షములు రాముని పరమాత్మునిగాఁ దలఁచి తమయందలి తుమ్మెదలఝుంకారములనెడి మంత్రముల నుచ్చరించుచు తమకొమ్మలనెడు చేతులందు పూగుచ్ఛములనెడి పుష్పాంజలులుగొని రాముని నర్చింపఁ గలవని భావము. మహేశ్వరతీర్థులు.

మేము ప్రాణము లుండువఱకును భృత్యులవలె నొకప్పుడును వసించియుండము. ఇట్లని మాకొడుకులమీఁదను ఒట్టుపెట్టిచెప్పెదము. మనరాజలలామునికుమారుని రాముని దయ మాలి యడవికిఁ బంపుచున్నదే ! అట్టియధార్మికురాలైనయీదుష్ట చారిణియొద్దఁ జేరి యెవరు సుఖముగా బ్రతుకఁగలరు? ఈరాజ్యమంతయు నాధార ము లేక, నాయకుఁడు లేక, యుపద్రవము నొందియున్నది. ఒక్కకైకనుబట్టి, యిది యంతయు నశింపనున్నది. రాముఁ డడవికిఁ బోఁగా రాజు బ్రతుకఁడుగదా. దశరథుఁడు మృతుఁడు కాఁగా పిదప నంతటికి నాశము గలుగు ననుట తేటతెల్లమేకదా. మాకుఁ బుణ్యము క్షీణించినది. మీరు పచ్చిదరిద్రులు. ఈవిషయమును జక్కఁగా నాలోచించి విషమునైనఁ ద్రావుఁడు. లేదా రామునినైన వెంబడింపుఁడు. అదియు లేదేని మీపేరుకూడ వినరానట్టిదూరదేశము పాలైనను గండు. 'పితృవచనము చొప్పునను కైకప్రీతికొఱకు రాముఁ డడవికిఁ బోయె' నందురా? కాదు. రాజు కపటము పెట్టుకొని రాముని సీతతోను లక్ష్మణునితోను నడవికిఁ బంపినాఁడు. పశువులను కటికవాని యొద్ద నప్పగించునట్లు, మనలను భరతున కప్పగించినాఁడు. రాజీయకార్యముచేసినాఁడు. అయినను, లక్ష్మణునియన్నయగురాముఁడు నిండుచందురునివంటి మొగముగలవాఁడు; నల్లనివాఁడు; కండబలువున మఱఁగియున్న మూఁపుసంధియెమ్ములు గలవాఁడు; పగవారిని పీఁచమడఁచువాఁడు; ఆజానుబాహుఁడు; తామరరేకులవంటికన్నులు గలవాఁడు. అతఁడు ఎవరితోడనైనను తానే ముందుపడి మాటాడును. అతఁడు చక్కనివాఁడు; సత్యము నే పలుకువాఁడు; మంచి బలముగలవాఁడు. అతఁడు లోకులకందఱికిని మెత్తనై, చంద్రునివలె కన్నులపండువుగా చూపట్టుచుండును. మదపుటేనుఁగువంటిగమనంపునడక గలయీమహారథుఁడు, ఆపురుషసింహుఁడు, సంచరించుటచే నరణ్యము లన్నియు ప్రకాశించుచుండఁగలవు. ఇది నిజము'' అనిరి. ఆ పురస్త్రీలిట్లు పట్టణమందు పలవించుచు వగలం బొగులుచు మరణము వచ్చునప్పుడుం బోలె బిగ్గఱ నఱచిరి. ఇట్లా స్త్రీలు గృహములందు రామునిఁగూర్చి విలపించు చుండఁగానే సూర్యుఁ డస్తమించెను. అంత రాత్రియు వచ్చినదయ్యె. అప్పుడగ్నిహోత్రములను బ్రణయించుట లేదయ్యె. వేదాధ్యయనములు గాని పురాణపాఠములుగాని వినఁబడకయుండెను. ఆపట్టణమునంతయు చీఁకటి పూఁతపూసినట్లు క్రమ్ముకొనియుండెను. మఱియునందు వర్తకులు అంగడులను బచరింపరైరి. సంతోష మన్నమాటయే కలుగదయ్యె. దిక్కే లేకుండినది. కాఁబట్టి ఆయయోధ్యాపురము నక్షత్రములు మాసిన యాకాశమువలె నుండెను. స్త్రీలు, తమకొడుకుగాని తోఁబుట్టువుగాని యడవికిఁ బంపఁబడినయెడల నెట్లు దుఃఖింతురో, యట్లే రామునిఁగూర్చి తమకంబున దీనులై మనస్సు దిటతప్పి పనివి పనివి యేడ్చిరి. ఏలనఁగా రాముఁడు వారలకు, కొడుకులకన్నను, తోఁబుట్టువులకన్నను, ఎక్కుఁడుగా నుండెను. అప్పు డాయయోధ్యానగరమున, ఆటపాటలును ఉత్సవములును వాద్యధ్వనులును నిలిచిపోయె. సంతోషము దూరమ

య్యెను. అంగళ్లు వెంపు దక్కి మూఁతలుపడియుండెను. కాఁబట్టి యాపట్టణము నీళ్లు నురిఁగినమహాసముద్రమువలె సొంపు వెంపు మాలి దూలుచుండెను. ఇది నలువదియెనిమిదవసర్గము.

---

## రాముఁ డరణ్యమునకుఁ బోవుచు వేదశ్రుతిగోమతు లనెడునదులను దాఁటుట. సుమంత్రునితోడఁ గొంతసంభాషణము.

పురుషసింహుఁ డగురాముఁడు తండ్రియాజ్ఞను స్మరించుచు పురజనులు విడిచిపోయినరాత్రి మిగతయంతయుఁ బయనము చేసి తెల్లవాఱునంతకు చాలదూరము పోయెను. అతండట్లు పోవుచుండఁగానే రాత్రియు శుభముగా గడచినది. రాముఁడు మంగళకరమగుతొలుసంజె నుపాసించి యుత్తరకోసలదేశముదక్షిణపుసరిహద్దును జేరెను. దారిలో గ్రామములందు విత్తనము చల్లుటకై వానిచుట్టును ఎల్లకొనవఱకు నేలలు చక్కఁగా దున్నఁబడియుండెను. వనములెల్ల పుష్పించియుండినవి. రాముఁడు వానినెల్లఁజూచుచు, పెద్దయూళ్లయందును చిన్నపల్లెలయందునువసించు జనులాడుకొనుమాటలు వినుచును, గుఱ్ఱములు వేగపోవుచున్నను వానినడమెలువుచేతను అందందు విశేషములను జూచుచొక్కువలనను, మెల్లగా పోయినట్లే చాలదూరము గడచిపోయెను. పెద్దయూళ్లను చిన్నపల్లెలను వసించువారు రాముం జూచి ' ఇసీ ! దశరథమహారా జెంతటివాఁడో ! కేవలకామమునకు లోనైనాఁడు. అయ్యో! ఆక్రూరురాలు, ఆకైక, ఎంతపాపాత్మురాలు! ఎడతెగక పాపములనే చేయుచుండునదిగా! కాకేమి? రాముఁడు ధర్మాత్ముఁడు, మిక్కిలి ప్రాజ్ఞుఁడు, దయావంతుఁడు, జితేంద్రియుఁడు. అట్టికొడుకును వనవాసముకొఱకై యూరు వెడలనంపినదే! అది క్రూరురాలు; కులస్త్రీమర్యాద నతిక్రమించినది; మఱి క్రూరకార్యమునందే వర్తించుచున్నది. ఇట్లది కాదేని, మహాభాగ్యవంతురాలును ఎల్లప్పుడు సుఖములందే మరిగియుండునదియు నగుజనకరాజసుత సీత దుఃఖము లెట్లనుభవించును? అకటా ! దశరథమహారాజు నెయ్యమే లేనివాఁడు. కావుననే, ప్రజలకెల్ల ప్రియుఁడై యేపాపమును జేసి యెఱుఁగని తనకుమారుని, రాముని నిపుడు విడువఁగోరినాఁడు' అని చెప్పికొనిరి. వీరుఁడును కోసలాధీశ్వరుఁడునగురాముఁడు వారాడుకొనుమాటలను వినుచు కోసలదేశమును దాఁటిపోయెను. అంత నతఁడు మంచిజలములు గలిగియున్న వేదశ్రుతి యనునదిని దాఁటి యగస్త్యుఁ డున్నదక్షిణపుదిక్కు మొగంబై పోయెను. రాముఁడు చాలసేపు పయనమై పోయి యంత గోమతీనదిని దాఁటెను. ఆనది మంచినీరు గలది. దాని దాపటి జవుకుపట్టులందు వేలకొలఁది గోవు లుండును. అది గంగమూలముగా సముద్రగామినియై యొప్పుచుండును. రాముఁడు గుఱ్ఱములు వడిగాఁ బోవుటఁ జేసి గోమతనిగూడ నతిక్రమించి నెమిళ్లయు హంసలయు కూఁతలచే శబ్దించుచుండు స్యందికానదినిని దాఁటెను. తొల్లి మనువు ఇక్ష్వాకునకు నిచ్చినదియు విశాలమైనదియు

అవాంతరములగుజనపదములతోఁ గూడినదియు నగు*కోసలదేశమును రాముఁడు సీతకుఁ జూపె. పురుషతిలకుఁ డగునా శ్రీమంతుఁడు మత్తిల్లినహంసయొలుఁగువంటియెలుఁగున వేగముగా 'సూతా'యని యాసారథిం బిలిచి "ఇంకెపుడు నేనుమరలివచ్చి నాతల్లిని తండ్రినింగూడి పుష్పితం బగుసరయూవనంబునందు వేఁటాడుచు విహరింపఁగలను! 'వేఁట శిష్టాచారము' కాదందువా? వనమునందు వేఁటాడుట పరలోకసుఖము కలిగింపనిదయ్యును, రాజులకు ఈ లోకమునందు సొంపు గలిగించుటకై యేర్పడియున్నది గదా. మఱియు సదాచారపరు లగుమనుష్యులు శ్రాద్ధాదికాలములందు మాంసము కొఱకు వేఁట నపేక్షించుచున్నారు. విలుకాండ్రు చలించుచున్నలక్ష్యము నేసి గుఱి యలవఱుచుకొనుటకు దీనిని కాంక్షించుచున్నారు. అయినను నే నీవేఁటను మిక్కిలియుఁ గోరుట లేదు; సరయూవనమున కొంచెమే దీనిని జేయఁగోరుచున్నాను. నిరంతరము దీనిని చేసిననేకాని కొంచెమే చేసినయెడల దోషము లేదు. ఇట్లు కొంచెముగా యుక్తకాలములందు చేయునట్టివేఁట రాజర్షిగణమునకు సమ్మతమైనదే. వారికి దీనితో సాటియైన వినోదక్రీడ మఱొకటి లేదని" అని చెప్పెను. ఇట్లు రాముఁడు తియ్యనిమాటల ఆయావిషయములనుగూర్చి సూతునితో సంభాషించుచు మార్గము గడచిపోయెను. ఇది నలువదితొమ్మిదవసర్గము.

—•—

## రాముఁడు కోసలదేశమును గడచి గంగాతీరము సేరుట.

బుద్ధిసంపన్నుఁడై నయాలక్ష్మణునియన్న రాముఁడు, విశాలమును రమణీయము నగు కోసలదేశము నెల్లచినరకుఁ బోయి † అయోధ్యదిక్కు మొగంబై చేతులుమోడ్చి 'కాకుత్థ్సవంశరాజులచే పరిపాలింపఁ బడుచున్న పట్టణశ్రేష్ఠమా! నిన్ను వీడుకొనుచున్నాను. మఱి నీయం దెవ్వరు కాఁపున్నారో, నిన్నెవరు పాలించుచున్నారో, యా దేవతలనుగూడ వీడ్కొనుచున్నాను. నేను వనవాసము పదునాలుగేండ్లును గడపి, రాజగునాతండ్రిఋణముం దీర్చుకొని, నాతల్లిని తండ్రినింగూడి మరల నిన్నుఁ జూచెదను' అని ప్రార్థించెను. అంత రాముఁడు కన్నులు నెత్తురువలె నెఱ్ఱఁబాఱ, తన్నుఁ జూడవచ్చినపల్లెపట్లజనులును రథవేగమున మిక్కిలి కడచి వచ్చుటం జేసి, వారు తనకు దూరస్థులగుటచే సంబోధించుటకై కుడిచేయినెత్తి, వారికన్నీళ్లం

*'[illegible]యం భూమిః సశైలవనకాననా' అని భూమియంతయు ఇక్ష్వాకునిదే యైయుండఁగా, [illegible] దేశమును ఇక్ష్వాకునిదిగా చెప్పుట యెట్లు? అన్నచో ఇది యతనిజన్మభూమిగాఁ జెప్పఁబడినది. తక్కినదేశములు పన్నిచ్చునవిగాఁ దెలియునది.

† రాముఁడు తానారంభించినవనవాసవ్రతము నిర్విఘ్నముగా సమాప్తి నొందుటకై శిష్టాచారముచొప్పున పురదేవతకు బయలు వెడలునప్పుడు చేయవలసిననమస్కారమును అప్పటికార్యసంకటమునఁ జేయక యిప్పుడు కోసలదేశపు నెల్లం జేరినిలిచి యాపురదేవతకు నమస్కరించి యనుజ్ఞ వేఁడుచున్నాఁడని తెలియునది.

జూచి తనకు మొగంబునఁ గన్నీరు మిక్కిలి చిప్పిల్లఁగా,దీనుండై వారితో 'మీరు నా యెడల, నేను స్వామియగుటకుఁ దగినట్లుగానే, యాదరమును దయయుఁ జూపితిరి. నన్నుఁ జూచుచుండుటచే మీకు దుఃఖము హెచ్చువెరుఁగుచున్నది. చాలప్రొద్దు దుఃఖపడుచుండుట మంచిదికాదు. కావున మీగృహకార్యములు దీర్చుకొనఁబొండు. మేమును మాకార్యసిద్ధికై పనివినియెదము' అనెను. ఆజానపదులును అమ్మహాత్మునకుఁ బ్రదక్షిణముచేసి నమస్కరించి బెట్టిదముగా విలపించుచు రాముని మఱిమఱి దర్శించుకోరికిచే వేగ పోవంజాలక యచ్చటచ్చట నిలిచి నిలిచి రామునిం జూచుచుఁ బోయిరి.వారు రాముని నెంత చూచియుఁ దనివినొందక యట్లు విలపించుచుండఁగా, రాత్రి పొడసూపఁగానే సూర్యుఁడు గ్రుంకునట్లు, రాముఁడు వారలచూడ్కులకు మఱుఁగుపడున ట్లంత బహుదూరము పోయెను. కోసలదేశమునందలిగ్రామములు ధనభాగ్యసంపన్నమైనవి. అట్టిపెంపునకుఁ దగినట్లుగా నందలిజనులు దానశీలురైన వారు. అది శుభప్రదమై దేనివలనను భయము లేక సురక్షితమై రమణీయమైయుండును. అందు దేవాలయములును యాగపశువులను గట్టుయూపస్తంభములును నలుగడల చూపట్టుచుండు.మఱియు నందు నెలదోఁటలును మామిడితోఁపులుఁగలవు.కొలఁకులు మొదలగునీటిపట్టులయందు జలము సమృద్ధముగానుండును. జనులు సంతుష్టులై ధనసంపత్తియుఁ బుష్టిం గలిగి నెఱసియుందురు.ఆలమందలు దట్టముగానందు చూపట్టుచుండును. అందలియూళ్లు నగరములవలె చెలువై రాజులకును జూడందగి యుండును. అందెల్లప్పుడు వేదపారాయణధ్వని శబ్దించుచుండును. ఇట్టికోసలదేశగ్రామములను పురుషలలాముం డగురాముఁడు రథము నెక్కియే కడచిపోయెను. రాముఁడు, సంతోషమునఁ బొదలుచున్నదై, మిక్కిలి పెంపుసొంపారుచు, సుందరములైనయుద్యానములు నలుగడల వెలయ, రాజులకు ననుభవింపఁదగి వెలుఁగుచుండు కోసలరాజ్యమునడిమిమార్గమును బట్టి, రమణీయములైనయందలివిశేషములు కనుపట్టినను, ధీరులలో మేటియైనవాఁడు గావున వానియందు మనసు నుంపకయే పోయెను. ఆకోసలమున, దక్షిణప్రదేశమునందు రాముఁడు, పాఁచి లేనందున నిచ్చలమై మెచ్చులు గులుకుజలము కలిగి మనోహరముగా చూపట్టుచున్నదియు, పవిత్రమైనది గావున ఋషిజనులు మిక్కిలి సేవించునదియు, స్వర్గమర్త్యపాతాళములు మూఁటను చరించునదియు నగుగంగానదినిఁ జూచెను. ఆగంగానది[illegible]న ధర్మసంపన్నములైనయాశ్రమములు పెక్కులు వన్నెగులుకుచుండును.[illegible]చుకాలములయందు నప్సరసలు వచ్చి యందలిమడుఁగుజలములందు జల్లులాడుచుందురు. వేడుకకు క్రీడించినను అది శుభప్రదమే యగును. దేవదానవులును గంధర్వులును కిన్నరులును అందు చరించుచు సొంపు నించుచుందురు. పెక్కుతెగలు గలగంధర్వులభార్యలును ఎప్పు డందులకు వచ్చి జలక మాడుచుందురు. ఎందఱు జలకమాడినను అది జలము చెడక శుభకరమైయుండును. దేవతలకుం దగినక్రీడాపర్వత

ములు వందలకొలఁదిని అందు నెలసియుండును. దేవతలకు విహరింపఁ దగునెలదోఁట లును నూఱులవేలకొలఁదిని అందు విలసిల్లుచుండు. అది దేవతలను బూజించుటకై ఆకాశమునఁ జరించునది; మఱి జగంబులం బొగడ్త గన్నది. దేవతలకుఁ బూజార్థ మగుతామరలందుఁగలవు. అందొక్కొక్కచో రాళ్లపయిం బడుజలములచప్పుడే, దాని వెడనవ్వులవలె బెట్టిదముగా చూపట్టుచుండును. నురుఁగులో దానియచ్చపుఁదెలిన వ్వులవలె నుండును. ఒక్కొక్కయెడ మిట్టనుండి పల్లమునకు దిగుపాఱువెల్లువ, దాని జడలవలె బెడఁగుచూపుచుండును. ఒక్కయెడనది సుడులుగొని క్రమరారుచుండును. ఒక్కయెడ నిశ్చలమై గంభీరముగాఁ గనఁబడును. ఒక్కచో జలము లతివేగము నం బ్రవహించుచుండును. మఱియొక్కచో చక్కనిమద్దెలవలె గంభీరముగా శబ్దించుచుండును. ఇంకొక్కకడ పిడుగులవలె బెడిదముగా మ్రోఁగుచుండును. దేవత లందఱుజలములఁ గ్రుంకులిడుచుందురు. అందు నచ్చము లగుకలువలు మెచ్చులు గులుకుచుండును. ఒక్కయెడ నిండుకొలఁది గలయిసుకదిన్నెలుఁ వన్నె చూపుచుండును. మఱియొక్కచో సన్నంపుఁదెలియిసుక తలతల లాడుచుండును. మఱియు నయ్యెడ హంసలును సారసపక్షులును ధ్వనులు సేయుచుండును. జక్క వలు కొలకొల గూయుచుండును. మఱియు నెడనెడ మత్తిలినయితరపక్షులును చ ప్పుళ్లు సేయుచుండును. అది యొక్కచో తీరములందు, చెట్లు వగుసగా మొలచియుం డుటం జేసి, పుష్పమాలికలు వేసికొన్న దానివలె నగపడుచుండును. ఒక్కయెడ కలు వలు వికసించి దానిజలము గప్పినట్లుండును. ఒక్కయెడ తామరతంపర పొంపిరి వోవుచుండును. ఒక్కచో తెల్లకలువలును ఎఱ్ఱకలువలు మున్నగువానియరవిరి మొగ్గలును నిగ్గు చూపుచుండును. పలుదెఱఁగు లయినపుప్పొడులు పర్వుటచే నది వన్నె మాఱి యెఱుపు మీఱి మత్తిల్లినదానివలె నొక్కయెడ నగపడును. మాలిన్య మెంతయును లేకుండుటం జేసి యదివైడూర్యమణివలె నిర్మలముగాఁ బొడచూపును. దానితీరమందలినానాంతరములందు దిగ్గజములును ఘీంకారములచే చప్పుడు గొలు పుచుండును. మఱియు నది పువ్వులను పండ్లను జిగుళ్లను ఆవరింపఁబడి యుండుట వలన ప్రయత్నమున సొమ్ముల నలంకరించుకొన్నయొకపడంతివలె గనుపట్టుచుండెను. మఱియును దానిని చిఱుపొదలును పక్షులును గప్పియుండును. అందు నీరుకోఁతు లును మొసళ్లును బాములును వెలయుచుండును. అది విష్ణుపాదమునసుండి జాఱి నది కావున దివ్యస్వరూపిణియైపాపదూరయై యాశ్రితులపాపములను దూలించుచు భగీరథుని తపఃప్రభావమువలన శివునిజటాజూటమునుండి యవతరించి, క్రౌంచము మొదలగు పక్షులధ్వనులు సెలఁగ, భూమిం బ్రవహించి సముద్రునికి భార్యయై వెల యుచుండును. రాముఁడు శృంగిబేరపురమునుగూర్చి పోవుచు, దానిసమీపమున నున్నయాగంగానదిని జేరినవాఁడయ్యె. ఆమహారథుఁడు అలలతోఁ గూడినసుడు లతో నొప్పుచున్న యాగంగను జూచి, సారథి యగుసుమంత్రునితో 'మన మిపు

డిచ్చటనే వసించియుందము. ఈనదికి దాపున పువ్వులును చిగుళ్లును మెండుగాఁ గల పెద్దగారచెట్టు ఒకటి యున్నది. కావున, సారథీ' ఇచ్చటనే వసించియుందము. దేవ దానవగంధర్వులకును మనుష్యులకును మృగములకును పక్షులకును దీనియుదకము మిక్కిలి గౌరవింపం దగినది. మఱియు నిది మంగళకరమైనది. కాన యీనదీ లలామమును జూతము' అనెను. లక్ష్మణుఁడును సుమంత్రుఁడును రామునితో వల్లెయని చెప్పి గుఱ్ఱములను దోలి రథమును ఆగారచెట్టుకడకు గొనిపోయిరి. ఇక్ష్వాకుకులు లకు మకుటంబు గూర్చునా రాముఁడు, రమణీయ మయినయాప్రదేశముకడకుఁ బోవఁ గానే రథమునుండి భార్యయును లక్ష్మణుఁడును తానును దిగెను. సుమంత్రుఁడును రథమునుండి దిగి యుత్తమము లగునాయశ్వములను విడిచి చెట్టుక్రిందనున్న రాముని యొద్దకుఁ బోయి చేతులు మొగుడ్చుకొని కొలుచుచుండెను. అప్పు డాదేశమునందు గుహుఁ డనురాజుండెను. వాఁడు బోయజాతివాఁడు; నిషాదులకు ప్రభువు; బలవం తుఁడు; రామునకును బ్రాణస్నేహితుఁడు. వాఁడు, పురుషతిలకుఁ డగురాముఁడు తన దేశమునకు రాక విని, కులవృద్ధులును మంత్రులును తనజాతివారును బలసి కొలు వఁగా, రాముని కడకు వచ్చెను. అంత నానిషాదప్రభుఁడు దూరమున వచ్చుటంజూచి రాముఁడు లక్ష్మణునితోఁగూడ నాగుహుని నెదుర్కొనిపోయి *కూడిరి. ఆగుహుఁడు ను నారచీరలు గట్టియున్న యా రామునిఁ జూచి † దుఃఖితుఁడై కవుంగిలించుకొని 'రామా! అయోధ్య యెట్లో అట్లె నాపట్టణమును నీకు సొంతమే. నీకు నే నేపని చేయవలయును? చెప్పుము. మహాబాహూ! ప్రియుండైనయిట్టియతిథి యెవ్వనికిఁ గలుగును? నీ విచ్చటికి రాక నాపూర్వపుణ్యఫలముగాని వేఱు కాదు' అని చెప్పి యంత, మేలయిన పలుదెఱఁగులయన్నాదులును గొనివచ్చి త్వరితముగా నర్ఘ్యము మును దెప్పించి రామునిఁ జూచి 'మహాబాహూ! నీకు స్వాగతము. ఈనాయడవి భూమి యంతయు నీయది. మేమెల్ల నీ పరిచారకులము. నీవు మాకు ప్రభుఁడవు. ఇఁక మారాజ్యమును నీ యిచ్చ చొప్పున చక్కఁగా పాలింపుము. ఇవిగో పిండి వంటలు మున్నగు భక్ష్యములును భోజ్య మయినయన్నమును పానకాదు లైన ప్రియపదార్థములును రసాయనాదు లైన లేహ్యద్రవ్యములును సిద్ధము లై యు న్నవి. ఆరగింపుము. ఉత్తమము లైనశయనము లివిగో. మఱి నీగుఱ్ఱములకు గడ్డి మున్నగునవియు నాయితముగా నున్నవి' అనియెను. ఇట్లు గుహుఁడు చెప్పుచుం

---

* 'హీనప్రేష్యం హీనసఖ్యం హీనగేహనిషేవణమ్' అని హీనునితోడిసఖ్యము ఉపపాతకము లలో నొకటిగా నుండఁగా మహాకులప్రసూతుఁ డగురామున కది యెట్లు చెల్లెనన్న యెడల 'న శూద్రా భగవద్భక్తా విప్రా భాగవతాః స్మృతాః। సర్వవర్ణేషు తే శూద్రా యేహ్యభక్తా జనార్దనే' అన్నట్లు గు హుఁడు రామభక్తుఁడు గాన యుత్తముఁడే కాని హీనుఁడు గాఁడు-అని తెలియునది.

† దీనిచేత రామునకు వేఁట మొద లగువ్యాపారములమూలమున గుహునితోడిచెలిమి పూ ర్వమే కలిగియున్నదని తెలియుచున్నది.

డఁగా రాముఁడు వానిని జూచి "నీవు అడుగులిడి నడచివచ్చి మమ్మెదుర్కొని 'నారాజ్యంబును గైకొను' మని మాయందు నెయ్యమును జూపితివి. ఇంతమాత్రకే మాకన్నివిధములఁ బూజలు చేసిన ట్లయినది. మాకు మిక్కిలిసంతోషము గలిగినది". అని బలుపు గలిగినబుజములచే వానిని బిగియఁబట్టి కవుఁగిలించి 'గుహా! అదృష్టవశమున నీవు నీబంధువులతోడ నేమియు రోగము లేక సుఖముగానుండఁ జూడం గలిగితిని. నీరాజ్యము ఉపద్రవము లేక క్షేమముగానున్నదా? నీచెలికాండ్రకుకుశలమా? నీధనము చెఱుపునొందక నానాఁటికి పెంపు నొందుచున్నదా? నీవు నాయందలిప్రీతిచే ఏదేది నాకొఱకు సమకట్టితివో, దానినంతయు, నా కన్నియుఁ జక్కఁగా చేసితివని యొప్పుకొని, నీకే మరల నిచ్చెదను. ఏలనఁగా నే నిప్పుడు ప్రతిగ్రహము మాని వర్తించుచున్నాను. ఇందులకు కారణము వినుము. నేను పితృవాక్యమును బరిపాలించు ధర్మమునందు మనస్సు నుంచి యున్నవాఁడను గావున తండ్రియాజ్ఞచొప్పున దర్భలను నారచీరలనుగట్టి ఫలములను భక్షించుచు నడవులందు సంచరించుచు తపస్సుచేయుచుండవలసినవాఁడ నని తెలియుము. గుఱ్ఱములకు గడ్డి యొకటియే నే నిపుడుగోరుచున్నాను. మఱేదియు నాకక్కఱలేదు. ఇంతమాత్రము చేసితివేని యింతకే నీవు నన్ను మిక్కిలి పూజించినవాఁడవగుదువు. ఈగుఱ్ఱములు నాతండ్రి దశరథమహారాజునకు మిక్కిలి గూర్చునవి. వీనిని చక్కఁగాఁ బోషించితివేని అది నన్నుఁ బూజించుటయే యగును. మఱి వేయివిధముల నన్నుఁ బూజింప నక్కఱలేదు' అనెను. అంత నాగుహుఁడు అప్పుడే తనమనుష్యులనుబిలిపించి యాగుఱ్ఱములకు వేగముగా పాలునీరును త్రాగించి గడ్డి వేయునట్లు ఆజ్ఞాపించెను. పిదప రాముఁడు నారచీరనే యుత్తరీయముగా వేసికొని మాపటిసంజ నుపాసించి, లక్ష్మణుఁడు తానైపోయి తెచ్చినగంగాజలము నే,యాహారముగా లోఁగొనెను. రాముఁడు పాదప్రక్షాళనము చేసికొని యాచమించి భార్యతోఁగూడ నేలపైఁ బరుండఁగా లక్ష్మణుఁడు గుహుఁ డున్నదిక్కుపోయి యాగారచెట్టునొద్దకు వచ్చియుండెను. గుహుఁడు సూతునిఁ గూడి రామగుణములను ప్రస్తావించి లక్ష్మణునిచే వానిం జెప్పించుచు విలు దాల్చి పరాకు మాలి రామునిం గాచుకొఱకు రాత్రియంతయు మేలుకొనియుండెను. పిమ్మట కీర్తిమంతుఁడును బుద్ధిమంతుఁడును మహాత్ముండు నగురాముఁడు, ఎన్నఁడు దుఃఖముల నెఱుఁగక సుఖము లనుభవించుట కే తగినసుకుమారుఁ డై యుండుటం జేసి,యట్లు భూమిపైఁ బరుండియుండుటచే హాయిగా నిదుర పట్టనందున నతనికి రాత్రి చాలఁ గాల ముండి గడచినట్టిదయ్యె. ఇది యేఁబదియవసర్గము.

---

## గుహలక్ష్మణులసంభాషణము.

లక్ష్మణుఁడు తనయన్నను గాచుటకై మనఃపూర్వకముగా మేలుకొని యుండుటను జూచి గుహుఁడు సంతాపంబునం బొక్కుచు నతనింజూచి 'నాయనా! నీవు

రాజకుమారుఁడవు. ఇట్లు మేలుకొనరాదు. ఇదిగో సుఖముగా నీకుఁ బాన్పు సమకట్టి యున్నది. దీనిపైని హాయిగాఁ బరుండి లెస్సగా బడలిక దీర్చుకొనుము. ఈ మే మంద అము అడవిలోనివారము గావున కష్టపాటులను బడుటకుఁ దగువార మగుదుము. నీవో యట్లు కావు;సుకుమారుఁడవుగాన సుఖములకే తగుదువు. కాకుత్థ్సా! రాముని గాచుకొఱకై మేము రాత్రియంతయు మేలుకొని యుండెదము. నీవు పరుండుము. ఇట్లు నేనేల చెప్పెదనంటేని, రామునికన్నఁ బ్రియుండు నాకు భూలోకమునం దెవఁడును లేఁడు. ఇది నేను సత్యముగా చెప్పుచున్నాను. ఇట్లని నేను సత్యముతోడు చెప్పెదను. నేను రామునియనుగ్రహము నొక్కటిని గోనియే ఈలోకమున మిక్కుటమైన కీర్తియు విస్తరించిన ధర్మమును అర్థమును బడయఁ గోరుచున్నాను. నే నిట్లు రాముని ప్రసాదమును ఎదురు చూచుచుండువాఁడను గాన నాగారాము చెలికాఁడైన రాముఁడు సీతతోఁగూడ పరుండియుండఁగా నేను నాబంధువులం గూడి విలు దాల్చి యన్నిదిశలందును నతని రక్షించుచుందును. నే నెప్పుడును ఈవనమున నే తిరుగుచుండువాఁడను గావున నిందు నాకుఁ దెలియని దొకటియును లేదు. కావున నెవఁడైన విరోధి యిందువచ్చి[illegible]ది నాకు తెలియకుండఁ జాలదు. మఱి యిందలి కందువపట్లెల్ల మాకుఁ దెలిసినవే కావున, చతురంగసైన్యములును మూఁదుమిక్కిలి విస్తరించివచ్చినను వానితాఁకుడును మోర్వఁగలము' అని చెప్పెను. పిదప లక్ష్మణుఁడు గుహునింజూచి 'సాపగహితా! నీవు ధర్మమునందే కన్నుగలవాఁడవు. ఇట్టినీవు రక్షించుచుండఁగా మాయందెవ్వరికిని నిచ్చట నెంతమాత్రమును భయము లేదు. 'భయము లేదని నిదురింప వేల' యందువా? దశరథమహారాజునకు పుత్రుఁడుగా బుట్టినయితఁడు సీతతోడ నిట్లు నేలపైఁ బరుండియుండఁగా నాకెట్లు నిద్రవచ్చును? మఱి యీప్రాణము లూఱటగా నెట్లు నిలుచును? సుఖములు గాని యెట్లు గలుగును? దేవతలును రాక్షసులును అందఱువచ్చి తాఁకినను యుద్ధమునను నెవ్వని నోర్వంజాలరో యట్టిమహాపరాక్రముఁ డగురాముఁడు సీతంగూడి పచ్చికలయందు సుఖముగాఁ బరుండి యున్నాఁడు చూడుము. దశరథుఁడు మంత్రతపములు సలిపి యజ్ఞాదులైనవివిధశ్రమములుపడి యెవ్వనినిబడసినాఁడో, మఱియెవ్వఁడు దశరథునకు సాటియగులక్షణములు గలిగి ప్రియుఁడగు పుత్త్రరత్నమైయుండునో, అట్టియీరాముఁడు అడవికిఁబోఁగా, రాజు నిఁక చిరకాలము ప్రాణములతో నుండఁడు. ఇఁక నీభూమియు శీఘ్రముగానే విధవ కాఁగలదు. ఇది నిజము. రాజగృహమునందలి స్త్రీలు పెద్దచప్పుడుగా రోదనము చేసిచేసి యలసి యూరకుందురు. నాగృహమంతయు చప్పుడు వాని నిశ్శబ్దముగా నుండునని తలఁచెదను. కౌసల్యయు రాజును నాతల్లియు బ్రతికియుందురని నాకుఁ దోఁపలేదు. ఒకవేళ బ్రతుకుదురేని యీరాత్రిమాత్రమే బ్రతికియుందురు గాని పిదప బ్రతుకంజాలరు. నాతల్లి సుమిత్ర, మఱియొకకొడుకు శత్రుఘ్నుఁ డున్నాఁడు గావున, వానియందలినెయ్యమున వానిని మాటిమాటికిఁ జూచుచు జీవించినను

జీవింపవచ్చును. ఆవిషయమున నాకు దుఃఖము లేదుగాని, రామునంతటివీరుఁ డగు కుమారుం గన్న కౌసల్యామాత్రము నశింపఁగలదు. ఈదుఃఖమే నాకు సహింపరాకున్నది. అయోధ్య, రాజునందు అనురక్తులగు ప్రజలచే నిండినది; మిక్కిలి సుఖమైనది; మఱియు లోకులకెల్ల మిక్కిలియింపు గూర్చునది. అట్టియయోధ్య, రాజమరణమున విపత్తు నొంది మీఁదిసొంపు లన్నియు మాలి తూలం గలదు. మహాత్ముం డగు రాజు, మహాత్ముఁడును ప్రియుండును నగుతన పెద్దకొమారునిఁ జూడఁ గానకున్నపుడు, అతనిప్రాణములు దేహమునం దెట్లుండఁగలవు? రాజు మృతినొందఁగా కౌసల్యయు మరణము నొందుచున్నది. ఆమెకుపిదప నాతల్లియు నాశమునొందును. ఆ! మించిపోయినది మించిపోయినది. నాతండ్రి, రాజ్యమున రాముని బట్టముగట్టి తనకోర్కి యీడేర్చుకొనకయే నశింపఁగలఁడు. కనుక ప్రయోజనములన్నియు మించిపోయినవి మించిపోయినవి. వానిని దలఁచుకొని కార్యము లేదు. మాతండ్రి, రాముఁడు పుట్టి, పెరిఁగి, పెండ్లాడి, పట్టముగట్టుకొను, నని పైపయి పెరిఁగి సాఁగుచున్న యీకోరిక నొడఁగూర్చుకొనక, రాముని రాజ్యమునఁ బట్టముగట్టక, నశించును. తండ్రియగు రాజునకు మరణకాలము వచ్చినంత, సమస్తప్రేతకార్యములును జరుపవలసినపుడు, కృతార్థు లగు రాజకుమారులకే స్మృతుం డైన మాతండ్రికి సంస్కారములు సేయుట లభించును. మే మట్టికృతార్థులము గాము; మాతండ్రి రాజధానియందు మునిగిళ్లసన్నివేశము మిగుల సొంపుగా నుండును. రాజమార్గమున రెండుప్రక్కల నిండ్లు చక్కఁగా వరుసను దీరి యుండుటచే నది నడుగలేక చక్కనై విరివిగా రెండుప్రక్కలును విభజింపఁబడియుండును. ధనవంతుల మేడలును రాజుల యుప్పరిగలును అందు నొప్పుచుండును. మిన్నలు సంభోగము లన్నియు లందు సన్నెగులుకుచుండును. రథములును గుఱ్ఱములును గజములును అందుఁ గిక్కిఱిసియుండును. తూర్యధ్వను లందు బోరుకొనుచుండును. పుత్రజన్మోత్సవములు మొదలయిన సమస్తమంగళములును సంపన్నములై యుండును. జను లందఱును తుష్టియుఁ బుష్టియు జెంది యందు విలసిల్లుచుందురు. అందు ఉద్యానవనంబులును రాజులక్రీడావనములును మిక్కిలి వెలయుచుండును. జనులు గుంపులు గూడి యందు జాతరలు సేయుచుందురు. అట్టి రాజధానియందు సుఖాత్ములైనవారు హాయిగా విహరింపంగలరు. దశరథుండు బ్రతికియుండునా! అతఁడు బ్రతికియుండ మేము వనవాసము గడపి మరలి యిచ్చటికివచ్చి సువ్రతుండైన యామహాత్మునిఁ జూతుమా! ఈరాముఁడు వనవాసంబు గడపివచ్చినపిదప, ప్రతిజ్ఞ తప్పనిమాతండ్రి క్షేమముగా నుండఁగా, సతనితోడం గూడి మే మయోధ్యాం బ్రవేశింతుమా!' అనెను. మహాత్ముం డగునారాజకుమారుఁ డిట్లు దుఃఖార్తుఁడై విలపించుచు మేలుకొని యుండఁగానే యారాత్రి యిట్లు గడచిపోయినది. ప్రజలకు హితుఁ డైనయారాజకుమారుఁడు, తనకు పెద్దయగు రామునియందును, మఱి దశరథాదులందును గలనెయ్యమువలన నట్లు చెప్పినవాస్తవమును విని గుహుఁడు రా

మునియందు మిక్కిలి నెయ్యముగలవాఁడు గాన యీవిపత్తునకుఁ బీడితుండై మనస్సు కొందలపడి, జ్వరంబునఁ గ్రాఁగు చున్నయేనుఁగువలెఁ, గన్నీళ్లు విడిచెను. ఇది యేఁబదియొకఁడవసర్గము.



వేకువను రాముఁడు గుహుఁడు దెచ్చిననావ నెక్కినపుడు సుమంత్రునితోఁ దనతలిదండ్రులకు వలయుసందేశములను జెప్పి తన్నెడఁబాయనిగుహుని నూఱడించుట. జడలుదాల్చుట. గంగను దాఁటుట. మువ్వురును వత్సదేశము గడచి మృగాది మాంసము లాహరించి యొకవృక్షముక్రింద రాత్రి విశ్రమించుట.

రాత్రి తెల్లవాఱఁగానే విశాలవక్షుఁడును, మహాయశస్కుఁడు నగురాముఁడు శుభలక్షణుఁ డగుసుమిత్రాపుత్రుని లక్ష్మణునిఁ జూచి 'నాయనా! సూర్యోదయసమయ మిది. భగవతి యీరాత్రియుఁ గడచినది. ఇదిగో భరద్వాజమును కోకిలమును కూయుచున్నవి. అడవియందుఁ గేక లిడుచున్న నెమిళ్లధ్వనియు వినవచ్చుచున్నది. సౌమ్యా! ఈగంగ కేవలమ్మైనదిగాదు; సముద్రగామినియైనది గావున మిక్కిలి వేగముగాఁ బ్రవహించునది. దీని నెట్లయిన దాఁటుదము' అనెను. చెలికాండ్రకు సొంపుగూర్చులక్ష్మణుఁడు రామునిమాటకు 'ఆనది నూరక దాఁటఁదరముగాదు; మఱియేదేని సాధనము గావలయు'నని తాత్పర్యముగుట తెలిసి గుహునిని సుమంత్రునిని 'ఈతాత్పర్యము మీకుఁ దెలిసినదా' యని పిలిచి యడిగి యంతఁ దాను అన్నమ్రోల నిలుచుండెను. అంత నాగుహుఁడును రామునియనుజ్ఞ విని శిరసావహించి తనమంత్రులను వేగ పిలిపించి 'ఇతనిని సులభముగా నదిని దాఁటించునట్టి దగు గట్టియోడ నొకటిని, దానిని నడపుతెడ్డు మొదలగు పరికరములతోఁ గూర్చి, మఱికానితోడ జతపఱిచి రేవులోనికి దీసికొనిరం' డనెను. గొప్పవారగు గుహునిమంత్రు లతనిమాటచొప్పున నొప్పు గులుకు చున్నయోడ నొకటి రేవునకుం దెచ్చి యతనికిఁ దెలిపిరి. అంత నాగుహుఁడు చేతులు మొగుడ్చుకొని రామునింజూచి 'దేవా! నీయాజ్ఞచొప్పున నోడయిదె అయితమై యున్నది. మఱియు నేమిసేయుదును చెప్పుము. దేవకుమారునివలె కనఁబడు పురుషలలామా! సువ్రతా! సముద్రగామిని యగు గంగానదిని నీవు దాఁటుటకై యిదిగో యోడవచ్చినది. నీవు దీనినెక్కుము' అని చెప్పెను. అంత మహాతేజుం డగు రాముఁడు గుహునింజూచి 'నీవు నాకోర్కి తీర్చితివి. ఇఁక గుద్దలి పుటికె సీత వస్త్రాభరణాదులు మొదలయినవానిని నోడ నెక్కింపుము' అనెను. పిదప నారామలక్ష్మణులు కవచములు దాల్చి తూణీరములను ఖడ్గములను ధనువులను గైకొని సీతంగూడి గంగానదికి పోవుమార్గమును బట్టి పోయిరి. రాముఁడు భృత్యులధర్మములనెల్లఁ దెలిసినవాఁడు గనుక సుమంత్రుఁడు అతనియొద్దకుఁ బోయి వినయంబున చేతులు మొగుడ్చుకొని 'నేనేమి చేయువలయును' అని విన్నవించెను. అంత రాముఁడు నుత్తమమయిన

తనకుడిహస్తమున సుమంత్రుని నంటుచు 'సుమంత్రా! నీవు మరలి శీఘ్రముగా రాజుకడకుఁబొమ్ము. అతనియొద్ద సేమఱకుండుము. నీవు'న న్నింతదూరమును రథమునఁ దీసికొనివచ్చి విడిచిపెట్టితివిగదా. ఇఁక నేను రథమునువిడిచి కాలినడతో మహారణ్యమునకుఁ బోయెదను. కనుక నీవు పురమునకు మరలిపొమ్ము' అనెను. సారథి యగుసుమంత్రుఁడు రాజునొద్దకుఁ బోవునట్లు తన కనుజ్ఞయొసంగుటను దెలిసి తోడ్కొనిపోఁడయ్యెనని దుఃఖితుఁడై యాపురుషసింహుని రామునిఁ జూచి 'నినుబోఁటివాఁడు తమ్మునితోడను భార్యతోడనుగూడి క్షుద్రునివలె నడవియందు వాసముచేయుట యనునది లోకమునందెవ్వనికి సమ్మతముగాదు; ఇఁక నాబోఁటికిఁ జెప్పవలయునా! దైవ మిట్లు నీకుఁ గావించినయాకష్టమును గడపిపుచ్చుటకు లోకమునం దెవ్వనికి నలవి గాకున్నది. బ్రహ్మచర్యవ్రతము సలిపి వేదాధ్యయనముసేసి దయగలిగి యార్జవముతోడ నొప్పుచుండునట్టినీకును వ్యసనము వచ్చునేని యాబ్రహ్మచర్యమునఁ గాని వేదాధ్యయనమునఁగాని దయాళుత్వమునంగాని కాపట్యము లేకుండుటను గాని ఫలము సిద్ధించునని యెంతమాత్రమును దలంపను. వీరోత్తమా! నీవు సీతనును దమ్మునినిగూడి పితృవచనపరిపాలనార్థము వనంబున వాసముసేయుచు ముల్లోకంబులు మించినవిష్ణునివలె మహాకీర్తి నొందఁగలవు. ముల్లోకములను జయించియె మంచి సద్గతిని బ్రొంపింపనుం గలవు. నీయభిషేకమును జెఱిపి మమ్ము వంచించినది కైకయే కాదు; నీవెంట వచ్చినపురజనుల మగునమ్ము రాత్రినిదురపోవునపుడు చెప్పకయే విడిచివచ్చి నీవును వంచించితివి. దాపున నే అడవికిఁ దోడ్కొనిపోవున ట్లే నటించి వంచించితివి. ఇఁక దుఃఖమునుపాలై పాపాత్ములా లగుకై కవశమునఁ జిక్కి యుండఁగల వారము గావున హతులమైతిమి' అనెను. ఇట్లు సుమంత్రుఁ డప్పుడు తనకు ప్రాణతుల్యుఁ డగురాముఁ డంత బహుదూరమునకుఁ బోవనుండుట నెఱిఁగి దుఃఖంబున స్రుక్కుచుఁ జాలసేపు రోదనముసేసెను. అంతఁ గన్నీరు విడుచుటఁ జేసి సూతుఁడు జలముల నాచమించి పరిశుద్ధుఁడై యుండఁగా, వానింజూచి రాముఁడు సారెకును తియ్యనిమాటల "ఇక్ష్వాకువంశ్యులకు నిన్నుఁ బోలెడి స్నేహితుని ఎవ్వనిని నేను జూడలేదు. నీవు దశరథమహారాజు నన్నుఁ దలంచుకొని దుఃఖపడకుండునట్లు చేయుచుండుము. రాజు, శోకమున నుల్లము తల్లడిల్లుచున్నవాఁడు; వృద్ధుఁడు; మఱియు మిక్కుటమైన కామముచే స్రుక్కియున్నవాఁడు; కావున నే, నే నీమాట నీకుఁ జెప్పుచున్నాను. మహాత్ముఁడగు రాజు కైకకుఁ బ్రియముగలుగ వలయునని కోరి యండులకై యేమేమి యాజ్ఞాపించినను వాని నన్నిటిని ఎంతమాత్రము శంకింపక చేయవలయును. రాజులు, కామమువలనఁగాని క్రోధమునంగాని యేయేకార్యములందు తమమనస్సు చెల్లినను అవన్నియు తమకోర్కె కొట్టువడకుండునట్లు సిద్ధించుటకే కదా రాజ్యమును బాలించెదరు. సుమంత్రా! ఏకార్యమును ఎట్లు సేసినయెడల నామహారాజు అప్రియము నొందకుండునో, మఱి దుఃఖమునఁ దపింపకుండునో,

దాని నట్లే సేయుము. రాజింతవఱకును దుఃఖమెఱుఁగనివాఁడు, వృద్ధుఁడు, పూజ్యుఁడు, జితేంద్రియుఁడు. అట్టి రాజు ఇప్పు డిట్లు ఇంద్రియములు కలఁగి దుఃఖితుఁడై నాఁడు. కావున నీవు నాకు ప్రతిగా నతనికి నమస్కరించి 'అయోధ్యనుండి భ్రష్టులమైతిమి. ఇఁక నడవిలో నుండవలయునే యని నాకు దుఃఖములేదు; లక్ష్మణునకును సీతకును లేదు. ఈపదునాలుగేండ్లు గడచిపోవఁగా తోడనే లక్ష్మణుఁడును నేనును సీతయు వనమునుండి మఱల వచ్చి మిమ్ము నాదరంబున మాటిమాటికిఁ జూచుచుండగల' మని యీ మాటం జెప్పుము. సుమంత్రా! ఇట్లు రాజునకును నాతల్లికిని తక్కినరాజుదేవులకును గైకేయికిని మాటిమాటికి చెప్పి పిదప సీతయును నేనును బూజ్యుం డగులక్ష్మణుఁడును చెప్పినట్లు *కౌసల్యకు మాయారోగ్యమును పాదప్రణామమును జెప్పుము. మహారాజుతో 'భరతుని శీఘ్రముగాఁ దోడ్కొనిరమ్ము. భరతుఁడు రాఁగానే రాజగునీ యభిమతము నొప్పున యౌవరాజ్యపదమున నతని నుంపవలయును. భరతుని యౌవరాజ్యమునఁ బట్టముగట్టి యతనిఁ గౌఁగిలించుకొనుము. ఆసుఖముచే, మేము సంతాపపడుచున్న మనదుఃఖము నిన్ను బాధింపదు' అని చెప్పితిమనుము. భరతునితో 'నీవు రాజునెడ నెట్లు వర్తింతువో యట్లే తల్లు లందఱియెడలను భేదము లేక వర్తింపుము! నీకు కైకేయియు, శత్రుఘ్నునియందలి ప్రీతినిబట్టి సుమిత్రయు, కన్నతల్లులవలె నెట్లు విశేషముగాఁ జూడఁదగియున్నారో యట్లే, నాకు తల్లియగుటచే, కౌసల్య గూడ విశేషించి గౌరవింపఁదగినది. నీవు తండ్రికిఁ బ్రియమును గోరి యౌవరాజ్యము నంగీకరించెదవు గావున నిహపరలోకంబులను రెంటను గలుగునట్టి సుఖమును జనులకును రాజునకును గూర్పఁజాలుదువు' అని చెప్పితి ననుము" అనెను. రాముఁడు తన్నయోధ్యకు మరలం జేయఁగా సుమంత్రుఁడు దుఃఖమున నుస్సురుచు నామాటలన్నియువిని స్నేహమున రామునితో "నేనిపుడు జంకులేక యేమి చెప్పుదునో యది నెయ్యమువలననే కాని యపచారమునకుఁ గాదు. కనుక నామాటలను, మఱి నీయందలినెయ్యమువలన భయమును మాలి సేవాధర్మమును దప్పి యేమి చెప్పుదునో యామాటలనంతయు, నన్ను భక్తుఁడని తలఁచి మన్నింపవలయును. నిన్ను విడిచి నేనెట్లు పురమునకుఁ బోవుదును. నిన్ను విడిచి పోవ నేర్చెను, నిన్నెడఁబాయుటచే పుత్రునిఁ బాసి దుఃఖమున కళవళించుచున్న దానివలెఁ బొరలుచున్నయీయయోధ్యకు, నీవు లేక నొంటిగా నెట్లు పోఁగలను. ఆపురములో పశుపక్ష్యాదులన్నియును, అపుడు రామునితోఁ గూడినయీరథమును జూచినకన్నులతో, నిపుడు రాముఁడు లేనిరథముఁ

* ఇచట లక్ష్మణుఁడును కౌసల్యసుమిత్రలకు పాదప్రణామము చేసినట్లు చెప్పినాఁడు. తక్కినవారికి నిషిద్ధమగుటచే చెప్ప లేదు. 'ఆచార్యవ దాచార్యదారే వృత్తిః పాదసంవాహనవర్జమ్' 'ఆచార్యునియందువలె ఆచార్యునిభార్యయందును నడచుకొనవలయును. అయినను ఆచార్యునికివలె ఆచార్యభార్యకును పాదసంవాహనము నేయరాదు' అనువిధి సవతితల్లులయందును వర్తించుచున్నది కనుక, సవతితల్లులకు పాదప్రణామము సెప్పఁబడినది గాదని తెలియునది.

జూడఁగానే దుఃఖము పట్టఁజాలక బ్రద్దలుగా పగిలినను పగిలిపోదురే! పట్టణములోని వారు, సేనావీరుఁడు చంపఁబడుటం జేసి పాడుపడియున్న తమ సైన్యములఁ జూచి దుఃఖపడునట్లు, నీవు లేక సారథి నగు నేనుమాత్రము మిగిలి యున్న యీరథమును జూచి మిక్కిలి దుఃఖము నొందుదురు గదా. ఇపు డయోధ్యయందలి ప్రజలు నీవు దూరమునం దున్నను నిన్నే మనస్సున నెడతెగక తలంచుకొనుచుండుటచే, ఎదుట నున్న వానిగానే యెంచి తలంచుకొనుచు ఆహారమును గూడ పాటింపకుందురనుట నిజము. ఇది యబద్ధము గాదు. రామా! నీ వడవికి బయలుదేఱినపుడు నీవు పోవుచున్నావని వగపుచే మనస్సు నలంగి ప్రజలకు అప్పు డెట్టికలగుండు కలిగెనో దానినంతయు నీవే కన్నారం జూచితివిగదా. నీవు వనమునకు వెడలునప్పుడు పురజనుల దుఃఖధ్వను లెంత వినఁబడెనో, ఇప్పుడు నీవు లేకున్న రథముతోఁ గూడఁ బోయిన నన్నుఁ జూడఁగానే దానికి నూఱింతలుగా రోదనధ్వని గావింపఁబడునే. నేను మీ తల్లి కౌసల్యాదేవి కేమని చెప్పుదును? 'నీ కొడుకును మేనమామయింట విడిచివచ్చినాను; కావున దుఃఖపడకుము' అందునా? ఇట్టి యబద్ధము నైనం జెప్పుదునంటినా యది నేను జెప్పనే చెప్పను. మఱి 'యడవిలో విడిచివచ్చితి' నని సత్యము చెప్పుదునా? ఇది యప్రియమే! సత్యమని యిట్టి యప్రియము నెట్లు చెప్పుదును? ఆ దేవి ప్రాణము లే విడుచునే! నిన్నును నీ చుట్టములగు సీతను లక్ష్మణునిని వహించి, నేను తోలినట్లు తప్పక పోవుచుండు నీ మేటిగుఱ్ఱములు, నీవు లేని యీరథమును, నేను దోలినను ఎట్లు ఈడ్వఁగలవు? కాఁబట్టి, అనఘా! నేను నిన్ను విడిచి యయోధ్యకుఁ బోఁజాలను. నీవెంట నడవికి వచ్చియుండుటకు అనుజ్ఞ యిమ్ము. నే నిట్లు బతిమాలుకొనుచున్నను నీవు దోడ్కొనిపోవకయే దిగవిడుతువేని, విడిచినమాత్రముచే రథముతోఁ గూడ నే నగ్నిలోఁ బడి తీఱుదును. రామా! నీ తపస్సునకు విఘ్నము గావించు క్రూరజంతువుల నెల్ల నేను రథము నెక్కి చంపుచుండెదను. *నీవు రాజ్యాభిషిక్తుండవై రాజ్యము సేయుచుండఁగా నీకుఁగా రథము దోలుటవలని సుఖము భాగ్యహీనుండ నగు నాకు లభింపదయ్యె. అది లేకపోయినను నీతోడ వనమందు వాసము సేయునపుడు నీకు సారథినై యుండి పరిచర్య సేయుటవలని సుఖ

---

* ఇందులకు 'త్వత్కృతేన మయావాప్తం రథచర్యాకృతం సుఖమ్ । ఆశంసే త్వత్కృతే నాహం వనవాసకృతం సుఖమ్' అని మూలము. నీయనుగ్రహముచేత నేను నీకు రథము నడపు దానం గలుగు సుఖమును అనుభవించితిని. ఇంక నీ యనుగ్రహమున నీతోడ వనవాసము చేయుచు నీకు పరిచర్య సేయుటవలనం గలుగుసుఖము ననుభవింప నువ్విళ్లూరుచున్నాఁడను.' అని యర్థాంతరము. ఇందులకు 'నేను మంత్రిప్రధానుఁడనై యుండియు నీవు ఈకులమందు అవతరింతువని తెలిసియే నీకు రథము నడపు భాగ్యము నాకు కలుగునని, సారథికృత్యమును సంధ్యమయ్యును చేకొంటిని. దానిచే భాగ్యవశమున నీకు సేవసేయు సుఖము లభించినది. ఇఁక వనవాసమందు నీకు సేవసేసి సుఖ మనుభవింపఁ గోరుచున్నాను.' అని మహేశ్వరతీర్థులు.

మైనను గలుగునని యువ్విళులూరుచున్నాను. నేను అడవిలో నీసమీపమున వర్తించుచుండఁగోరెద. ఇది అనుగ్రహింపుమీ. 'నాసమీపమున నుండుము' అని ప్రీతితో నీవు చెప్పఁగా చెవులార వినఁ గోరెదను. వీరోత్తమా! ఈగుఱ్ఱములు సైతము నీవడవిలో వసించుచున్నప్పుడు నీకు సేవ సేయునేని పరమగతిని బొందును. నేను నీతోఁగూడ వనంబున వసించుచు నీశుశ్రూష శిరసా వహించి చేయుదును. అయోధ్యయే కాదు; దేవలోకమైనను సర్వవిధములను నాకక్కఱలేదు. నీసేవయే కావలయు. పాపకర్ముఁడు దేవేంద్రునిపురమునకుఁ బోవంజాలనియట్లు నేను నిన్నుఁ బాసి యయోధ్యాపురికిఁ బోఁజాలను. వనవాసము తీఱిపోవఁగా మరల నీరథము మీఁదనే నిన్నెక్కించుకొని యయోధ్యకుం గొనిపోవలయు నని నాకోరిక సుమీ. వనములోనైనను నేను నీతో నుందునేని నా కీపదునాలుగుసంవత్సరములును క్షణప్రాయములుగాఁ గడచిపోవును. నిన్ను విడిచియుండినచో అవియే నూఱింతలుగానుండును. నీవు భృత్యులయందు వాత్సల్యము గలవాఁడవు. మఱి నేను భక్తుఁడను, భృత్యుఁడను. కనుక నిట్టిభృత్యుఁ డుండవలసినమర్యాదను గొంచెమైనను దప్పక దానిచొప్పుననే నాప్రభువుకుమారుని నిన్ను వెంబడింపఁ గోరుచున్నాను. ఇం దేమితప్పు లేదు. ఇట్టినన్ను నీకువిడుచుట దగదు" అనెను. రాముఁడు భృత్యులయందు మిక్కిలిదయ గలవాఁడు గనుక నిట్లు దీనుఁడై వెక్కు విధములుగా ప్రార్థించుచున్నసుమంత్రునిం జూచి "సుమంత్రా! నీవు స్వామియందు మిక్కిలి ప్రీతిఁ గలవాఁడవు. కనుక స్వామి యగునాయందు నీకు మిక్కిలియుభక్తి గలదనియెఱుంగుదును. అయినను నిన్నిపుడు నేనయోధ్యకుఁ బంపుటకుఁ గారణము సెప్పెదను వినుము. నీవు పట్టణమునకుఁ బోవఁగాఁజూచి నాపినతల్లి కైకేయి 'రాముఁ డడవికిఁ బోయినాఁడు' అని నమ్మకమునొందును. నేను వనమునకు వసింపఁబోవఁగా నది నీమూలమునఁ దెలిసి యాదేవి మిక్కిలి సంతసిల్లినదై పిదపనే కదా ధర్మాత్ముఁ డగుదశరథునింగూర్చి కల్లాడువాఁడని సందేహపడకుండును, నాపినతల్లి, తనకొడుక గుభరతుఁడు చక్కఁగా పాలింపఁగా వర్ధిల్లినయూరాజ్యమును బొందుటయే, నాకు ముఖ్యము. ఈముఖ్య ప్రయోజనమును బట్టియే నిన్నుఁ బంపుచున్నాను. మఱికొన్ని ప్రయోజనములును గలవు. నాకును రాజునకును ప్రియముగలుగుటకుఁగాను, నీ విపుడురథముతోఁగూడ నయోధ్యకుఁబొమ్ము. నీకేయేవిషయము లెట్లెట్లు చెప్పుమంటినో, వానినెల్ల నట్లట్లే యెక్కువతక్కువ లేక వారివారికిం జెప్పు" మనెను. ధీరుఁడగు రాముఁ డిట్లు సూతునకుఁ జెప్పి వానిని మాటిమాటికి నోదార్చుచు గుహునిం జూచి యుక్తియుక్తముగా 'గుహా! నన్నిక్కడ నుండుమంటివి. ఇప్పుడు నేను జనసంచారముతోఁ గూడినయీవన ప్రదేశమునం దుండుట సరి కాదు. అవశ్యముగా నాశ్రమములయందే యుండవలయును. ఆశ్రమముల నుండుమనియే తండ్రియాజ్ఞ. ఇట్లు తండ్రియాజ్ఞ గలవాఁడను గావున నేను తపస్విజనులకు మిక్కిలి వన్నెగూర్చువ్రతమును బూని, నాతండ్రికిని, మీఁదు